# బైబులుభాష్య సంపుటావళి

ఎనిమిదవ సంపుటం

## దివ్యసత్ప్రసాదం, జ్ఞానస్నానం



# బైబులుభాష్య సంపుటావళి

## ఎనిమిదవ సంపుటం

# దివ్యసత్ప్రసాదం, జ్ఞానస్నానం

ఫాదర్ పి. జోజయ్య, S.J.
ఆంధ్ర లొయోలా కాలేజి
విజయవాడ - 520 008

Copies : 3,000
First Edition : December 25, 2003

పర్యవేక్షణ :

**Fr. THANAM MARREDY**
Parish Priest
St. Peter's Cathedral
Tarapeta
VIJAYAWADA - 520 001
A.P. INDIA

ముద్రణానుమతి :

**Rt. Rev. MALLAVARAPU PRAKASH**
Bishop of Vijayawada

ప్రచురణ :

**St. PETER'S CATHEDRAL**
Education Desk For The Children
Tarapeta
VIJAYAWADA - 520 001
A.P., INDIA

# విషయసూచిక

# మనవి మాట

బైబులు భాష్యం సంచికలను 1972లో ప్రారంభించాం. ఇప్పటికి 157 సంచికలు ముగిసాయి. వీటినే యిప్పుడు పది బైబులుభాష్యం సంపుటాలనుగా ముద్రించాం. ఈ సంచికల్లో ఓ 60 మాత్రం ఇదివరకే "బైబులు గ్రంథమాల" అనే పేరుతో పుస్తక రూపాన్ని సంతరించుకొని పలు ముద్రణలు పొందాయి.

ప్రస్తుతం ఈ 157 సంచికలను, వీటిల్లో వచ్చే అంశాలనుబట్టి, ఓ క్రమపద్ధతిలో అమర్చాం. ఈ సంపుటాల్లో వుంది ప్రధానంగా బైబులు వివరణలు, దైవశాస్త్ర విషయాలు, ప్రార్థనాంశాలు. మన క్రైస్తవ భక్తివిశ్వాసాలను బలపరచేది ముఖ్యంగా ఈ యంశాలే. ఎందరో వేదపండితుల భావాలు ఈ పుస్తకాల్లోకి వచ్చాయి. ఆ మహానుభావులందరికీ వందనాలు.

ఈ పుస్తకాలు మన క్రైస్తవమత సత్యాలను లోతుగా అర్థంచేసికోవడానికీ, ప్రార్థన జేసికోవడానికీ, ఇతరులకు బోధించడానికీ గూడ ఎంతో వుపయోగపడతాయి. కనుక మన గురువులు, మఠకన్యలు, ఉపదేశులు, గృహస్థులు మొదలైనవాళ్లు ఎవరైనాసరే వీటిని వినియోగించుకొని ఆధ్యాత్మిక లాభాన్ని పొందవచ్చు.

చాల సంవత్సరాల పొడుగున కొనసాగించిన రచనలు కనుక ఈ గ్రంథాల్లో పునరుక్తులు అనివార్యమయ్యాయి. పాఠకులు మన్నింతురుగాక. మొదటవ్రాసిన సంచికలకు తర్వాత వ్రాసిన వాటికీ శైలిలోకూడ భేదం వుంది.

మన క్యాతలిక్ సమాజంలో పఠనాభ్యాసం లేదు. ఇది మనం అవశ్యం సవరించు కోవలసిన ప్రధానలోపాల్లో వొకటి. ఇందుకే ఈ గ్రంథాలను చౌకధరకే విక్రయిస్తున్నాం. ఈ పుస్తకాలు మన సాహిత్యరాశిని పెంచి మన ప్రజల్లో పఠనాభిరుచిని ప్రోదిచేస్తాయని ఆశిస్తున్నాం. అసలు తెలుగులో మనకున్న క్యాతలిక్ సాహిత్యమే చాల తక్కువ.

ఫాదర్ టి.మర్రెడ్డిగారి ఆర్థిక సహాయంలేందే ఈ సంపుటాలు ఇప్పుడు, ఈ రూపంలో వెలుగు చూచేవి కావు. ప్రభువు ఆ మహనీయుని దీవించి ఆయన కృషిని సఫలీకృతం జేయునుగాక. విజయవాడ మేత్రాసనం తరపుననే ఈ పుస్తకాలను ప్రచురిస్తున్నాం.

ఈ సంపుటాల్లో రచయిత 31 ఏండ్ల పొడుగున కొనసాగించిన అవిరళకృషి దాగివుంది. కరుణామయుడైన ప్రభువు యెరూషలేం దేవాలయంలోని సాయంకాలపు ధాన్యబలినివలె ఈ సాహిత్యబలిని గూడ నెనరుతో స్వీకరించునుగాక.

ఈ పుస్తకాలకు పరిచయవాక్యాలు వ్రాసియిచ్చిన విజయవాడ పీఠాధిపతులు, పూజ్యులు, మహాఘనత వహించిన డాక్టరు ఎం.ప్రకాష్‌గారికి నమస్సుమాంజలులు. వీటిని సర్వాంగసుందరంగా ముద్రించిన శ్రీ పి.సాంబిరెడ్డిగారికి వారి సిబ్బందికి, ఓపికతో ప్రూఫులు దిద్దిన శ్రీ వి. గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతలు.

\- గ్రంథకర్త

# ముందుమాట

ఫా. జోజయ్య గారు తమ రచనల ద్వారా ఆంధ్ర శ్రీసభకు సుపరిచితులు. వారి అవిరళకృషి, సేవాతత్పరత, తెలుగులో చక్కని సాహిత్యాన్ని రాయాలనే తపన, దానికితగిన అంకితభావం వేనోళ్ల కొనియాడదగింది. వీరు రచించిన చిన్నచిన్న పుస్తకాలను సంకలనం చేయడం అనే ప్రక్రియ వీరి జీవితకాలంలోనే జరగకపోయినట్లైతే, ఈ గొప్ప సాహిత్యాన్ని కోల్పోయే అపాయం వుండేది. అరుదుగా పాఠకులకు తెలుగులో లభ్యమయ్యే బైబులును మరియు కతోలిక వేదాంతమునకు సంబంధించిన అంశాలను క్షుణ్ణంగా పరిశోధన జరిపి చక్కని భాషలో ఆంధ్ర కతోలిక సంఘానికి గత ముప్పది సంవత్సరాలపైగా అందించారు ఫా. జోజయ్య గారు.

తెలుగు కతోలిక శ్రీసభకు, బైబులును క్రైస్తవ సిద్ధాంతాలను అర్థం చేసుకోవాలన్న కోరిక గల క్రైస్తవేతరులకు ఫా. జోజయ్య గారు గొప్ప వరమని నేను భావిస్తున్నాను. వీరి రచనలు సత్యాన్ని అన్వేషించడం యెడల ఆయనకున్న పట్టుదలకు, అందరికి జ్ఞానోదయాన్ని కలిగించాలన్న తపనకు, మరియు ఆంధ్ర శ్రీసభ పురోభివృద్ధి యెడల ఆయనకున్న తృష్ణకు నిదర్శనాలు. సరళమైన స్వచ్ఛమైన, సామాన్య ప్రజలకు అర్థమయ్యే తెలుగుభాషలో రచింపబడిన ఈ పుస్తకాలను చదివి, ఆధ్యాత్మిక జీవిత వికాసానికి క్రైస్తవ సిద్ధాంతాలను లోతుగా అర్థం చేసికోవటానికి వీటిని వినియోగించుకోవాలని కోరుతున్నాను. ఎంతో నేర్పుతో, క్రమపద్ధతిలో విభజింపబడిన రచనలను "బైబులు భాష్య సంపుటావళి" అన్న పేరుతో పదిసంపుటాలుగా అచ్చు వేస్తున్నందుకు అభినందిస్తున్నాను. ఈ గ్రంథాల ప్రచురణ బాధ్యతను తన భుజాలపై వేసికొని, సమయాన్ని వెచ్చించి, వలసిన ఆర్థిక వనరులను చేకూర్చినందుకు, ఆంధ్ర శ్రీసభకు ఉపయోగకరమైన ఈ సాహిత్యాన్ని ప్రజలకు అందించాలనే మంచికార్యాన్ని చేపట్టి విజయంతంగా పూర్తి చేసినందుకు ఫా. మర్రెడ్డి గారిని నా హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఆణిముత్యాల్లాంటి ఈ రచనలను ఆధ్యాత్మిక సంపత్తిగా అందరూ గుర్తించాలని, కతోలిక క్రైస్తవ సమాజమంతా ముఖ్యంగా మేత్రాణులు, గురువులు, మఠవాసులు అందరు ఈ కృషిని అభినందించాలని, ఆదరించాలని నా ఆకాంక్ష. మన ప్రజల స్తోమతకు తగినట్లుగా వీటి వెల కూడ చాల తగ్గించడమైనది. కావున ప్రతి ఒక్కరు, గ్రంథాలయాలు, ఆశ్రమాలు, మఠాలు, కతోలిక కేంద్రాలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని నా మనవి.

ఫా. జోజయ్య గారు చేసిన ఈ కృషిని మరోసారి అభినందిస్తూ, వారు ఇంకా ఆంధ్ర శ్రీసభకు తమ అమూల్యమైన సేవలను రానున్న కాలంలో అందించాలని మనసారా కోరుకుంటూ, ప్రార్థిస్తూ...

ఇట్లు

మీ జ్ఞానతండ్రి

**+ మల్లవరపు ప్రకాష్**

విజయవాడ పీఠాధిపతులు

# 1. దివ్యసత్ప్రసాదం

## మనవిమాట

బైబులు భాష్యం 47–48 సంచికల్లో దివ్యసత్ప్రసాదాన్ని గూర్చి చెప్పాం. ఆ రెండిటినీ కలిపి ఇప్పుడు ఏకగ్రంథంగా ప్రచురించాం.

దివ్యసత్ప్రసాదంలో మూడంశాలున్నాయి. మొదటిది, ఆది బలి. కనుకనే దాన్ని రోజురోజు మన పీఠాలమీద దేవునికి అర్పిస్తాం. రెండవది, అది దివ్యసాన్నిధ్యం. అందుకే దానియెదుట మోకాళ్ళూని ప్రార్థిస్తాం. మూడవది, అది భోజనం. కావుననే దాన్ని ఆహారంగా పుచ్చుకొంటాం. ప్రస్తుత గ్రంథంలో ఈ మూడంశాలను గూర్చి మూడు విభాగాలున్నాయి.

క్రైస్తవ జీవితానికి ఆరాధనకూ తుదిమెట్టు దివ్యసత్ప్రసాదం. అన్ని సంస్కారాలూ దీనినుండే తమ వరప్రసాదాలను సాధిస్తాయి అంటే ఇక దీని ప్రాముఖ్యాన్ని గూర్చి వేరే చెప్పాలా?

మన ప్రజలు ఈ సంస్కారాన్ని గూర్చి క్షుణ్ణంగా తెలిసికోవాలి అన్న ఉద్దేశంతో ఈ పుస్తకాన్ని తయారుచేసాం. ఇది ప్రధానంగా దైవశాస్త్ర గ్రంథం. ఇది నాల్గవ ముద్రణం.

## విషయసూచిక

### మొదటిభాగం - దివ్యసత్ప్రసాదం బలి



### రెండవభాగం - దివ్యసత్ప్రసాదం సాన్నిధ్యం

# మొదటి భాగం - దివ్యసత్ర్రసాదం బలి

## 1. అంత్య భోజనం

"యేసు రొట్టెను తీసికొని ఆశీర్వదించి విరిచి శిష్యులకిచ్చి మీరు దీనిని తీసికొని భుజించండి. ఇది నా శరీరం అని చెప్పాడు - మత్త 26,26.

క్రీస్తు చనిపోకముందు శిష్యులతో గూడి అంతిమ భోజనాన్ని భుజించాడు. ఈ భోజనం అతని మరణోత్థానాలను సూచిస్తుంది. నేడు మనం సమర్పించే పూజబలిలో ఈ అంతిమభోజనాన్నీ, దానిద్వారా సిలువమరణాన్నీ జ్ఞప్తికి తెచ్చుకొంటాం. కనుక మనం మొదట ఈ చరమ భోజనం భావాన్ని జాగ్రత్తగా అర్థం చేసికోవాలి. ఈ యధ్యాయంలో ఐదంశాలు పరిశీలిద్దాం.

### 1. పాస్కబలి, నిబంధనబలి

పూర్వవేదంలోని పాస్క నిబంధన బలులు నూత్నవేదంలోని అంత్యభోజనానికి సంకేతాలు. కనుక మొదట ఈ రెండు బలులను పరిశీలించాలి.

1. పాస్కబలి : నిర్గమకాండం 12వ అధ్యాయం ఈ బలిని వర్ణిస్తుంది. పాస్క ఒక పండుగ గాదు, రెండు పండుగలు. అవి పాస్క పండుగ, పులియని రొట్టెల పండుగ. మొదట పాస్క పండుగను పరిశీలిద్దాం - నిర్గ 12,1-14. ఇది మోషేకు పూర్వమే ప్రచారంలో వుండేది. ఈ పండుగలో గొర్రెపిల్లను బలిగా సమర్పించేవాళ్లు. దీని ద్వారా గొర్రెల మందలు వృద్ధిలోకి వస్తాయని ప్రాచీన ప్రజలు భావించారు. కాని మోషే కాలంలో ఈ ఉత్సవం భావం పూర్తిగా మారిపోయింది. ఇది ఐగుప్తు నిర్గమనానికి చిహ్నామైంది.

ఈ పండుగను నీసాను నెల 14వ తారీఖున జరుపుకొనేవాళ్ళు. కుటుంబ సభ్యులంతా దీనిలో పాల్గొనేవాళ్ళు. యావే ప్రభువుకి ఓ గొర్రెపిల్లను బలిగా అర్పించేవాళ్ళు. దాని ఎముకలను విరగగొట్టకూడదు. దాని నెత్తుటిని యూదులు తమ తలుపుల

ద్వారబంధాలకు పూసికొనేవాళ్లు. గొర్రెపిల్ల మాంసాన్ని మాత్రం వండుకొని భుజించేవాళ్లు. "పాస్క" గ్రీకు పదం. "పేసా" దానికి మూలమైన హీబ్రూ పదం. ఈ పదానికి దాటిపోవడమని అర్థం. ఎవరు దాటిపోయారు? ప్రభువు దూత (ఈ దూత ప్రభువే) ఐగుప్తులోని యిస్రాయేలీయుల యిండ్లను దాటిపోయాడు. అనగా అతడు యిస్రాయేలీయుల గడపల మీద పూసిన గొర్రెపిల్ల నెత్తుటిని జూచి ఆ యిండ్లను దాటిపోయాడు. ఆ యిండ్లలోని ప్రజలకు ఏలాంటి హాని చేయలేదు. కాని అతడు అలాంటి నెత్తుటి పూతలేని ఐగుప్తీయుల ఇండ్లలోకి వెళ్ళి వాళ్ళ తొలిచూలు మగపిల్లలను చంపివేసాడు - 12,13.27.

ఇంతవరకు పాస్క పండుగను గూర్చిన వివరాలను చూచాం. ఇక రెండవదియైన పులియని రొట్టెల పండుగను చూద్దాం - నిర్గ 12,15-20. ఇది కూడ మోషేకు ముందటి నుండే ప్రచారంలో వున్న పండుగ. ఈ ఉత్సవ సందర్భంలో మందల్లోని తొలిచూలు పిల్లలను దేవునికి బలియిచ్చేవాళ్లు. దీన్ని నీసాను నెల 15-21 వరకు జరుపుకొనేవాళ్ళు. ఈ పండుగ కాలంలో క్రొత్తగా పండిన గోదుమలతో చేసిన పొంగని రొట్టెలను మాత్రమే తినేవాళ్ళు. ఐగుప్తు నిర్గమనం సమయంలో ఈ పండుగ కూడ పై పాస్క పండుగతో కలసిపోయింది. తర్వాత ఈ రెండిటినీ కలిపి పాస్క పండుగ అన్నారు.

యూదులు ఐగుప్తు నుండి బయలుదేరక ముందటి రాత్రి గొర్రెపిల్లనూ పొంగని రొట్టెలనూ భుజించారు. అటుతరువాత ఈ సంఘటనం సాంవత్సరిక ఉత్సవమైంది. పాలస్తీనా దేశంలో స్థిరపడిన పిదప యూదులంతా, వాళ్ళు మాత్రమే, ఏటేట ఈ పాస్క ఉత్సవాన్ని జరుపుకొనేవాళ్లు - 12,43-49.

యూదుల సంప్రదాయంలో ఈ పాస్క ఒక బలి. దానిలో గొర్రెపిల్లను నైవేద్యంగా భుజించారు. ఈ బలి యూదుల దాస్యవిముక్తికీ, ఐగుప్తు నిర్గమనానికీ చిహ్నం. అనగా అది ప్రభువు అనుగ్రహించిన రక్షణానికి చిహ్నం. ఇంకా అది భవిష్యత్తులో ఆ ప్రభువు తన ప్రతినిధియైన మెస్సియాద్వారా దయచేయబోయే రక్షణానికి గూడ సూచనం. ఈ పాస్కబలి నూత్నవేదంలోని అంతిమ భోజనాన్ని సూచిస్తుంది.

2. నిబంధన బలి : యిస్రాయేలీయులు దాస్య గృహమైన ఐగుప్తు నుండి బయలుదేరి వచ్చాక మూడు నెలలకు సీనాయి కొండను చేరుకొన్నారు. ఇక్కడ ప్రభువు వాళ్ళతో నిబంధనం చేసికొన్నాడు - నిర్గ 24,4-11. ఈ నిబంధనం బలిరూపంలో జరిగింది. మోషే కోడె నెత్తుటిని తీసికొని పీఠం మీదా ప్రజల మీదా చిలకరించాడు. "ఇది ప్రభువు మీతో చేసికొనిన నిబంధనపు రక్తం" అని చెప్పాడు - 24,8. ఈ పీఠం దేవునికి చిహ్నం. యిస్రాయేలు ప్రజలు ఆ దేవుని దాసులు, భక్తులు. ఈ బలిలో నెత్తుటి ద్వారా దేవునికీ ప్రజలకీ ఐక్యత సిద్ధించింది.

ప్రభువు యిస్రాయేలీయులతో నిబంధనం చేసికోవడానికి కారణం ఆ ప్రజల్లో ఏదో ప్రత్యేకమైన యోగ్యత వుందని కాదు. యూదుల గొప్పతనాన్ని బట్టి కాదు, తన మంచితనాన్ని బట్టే అతడు వాళ్లతో నిబంధనం చేసికొన్నాడు. తాను వాళ్లను ప్రేమించాడు కనుక వాళ్లను ఎన్నుకొన్నాడు అంతే - ద్వితీ 7,7-8.

ఇక్కడ ఓ విషయం గమనించాలి. పాస్కబలిలోను నిబంధన బలిలోను కూడ నెత్తురు ప్రధానం. యూదుల భావం ప్రకారం నెత్తురులో ప్రాణముంటుంది - లేవి 17,11. ద్వితీ 12,23. ఈ ప్రాణం దేవుని ప్రాణమే. కనుకనే యూదులు ఏదైనా జంతువును వధించినపుడు దాని నెత్తురు ముట్టుకొనేవాళ్ళుకాదు. ఇక దేవుని ప్రాణంతో గూడిన యీ నెత్తురే దేవునికీ ప్రజలకీ ఐక్యత చేకూర్చి పెట్టింది. నూత్నవేదంలోని అంతిమ భోజనం ఈ సీనాయి నిబంధన బలిని తలపిస్తుంది.

## 2. అంత్యభోజన వర్ణనలు

మత్త 26, 26-29
మార్కు 14,22-25
లూకా 22,15-20
1 కొరి 11, 23-26

యెరూషలేములో పాస్కోత్సవం జరిగేపుడే క్రీస్తు శిష్యులతో అంతిమ భోజనాన్ని భుజించాడు. అది గురువారం సాయంకాలం. అక్కడ దేవళంలో పాస్క గొర్రెపిల్లలను వధిస్తున్నారు. ఇక్కడ మీది గదిలో క్రీస్తు శిష్యులతో కడపటి భోజనం భుజిస్తున్నాడు. ఆ సంఘటనకూ ఈ సంఘటనకూ చాల దగ్గరి సంబంధం వుంది.

యూదుల సంప్రదాయం ప్రకారం పాస్కబలిని యెరూషలేములో ప్రొద్దుక్రుంకాక ప్రారంభించేవాళ్ళు. కుటుంబ సభ్యులు కనీసం పదిమందైనా కలసి ఈ విందు భుజించేవాళ్ళు. విందులో గొర్రెపిల్లనూ పొంగని రొట్టెలనూ సాపడేవాళ్ళు. ద్రాక్షాసారాయాన్ని సేవించేవాళ్ళు. విందు జరిగే పద్ధతి యిది. మొదట కుటుంబంలోని తండ్రి ద్రాక్ష సారాయపు పాత్రను ఆశీర్వదించగా సభ్యులంతా దాన్ని త్రాగేవాళ్ళు. అటుపిమ్మట స్తుతి కీర్తనలు (111-113) జపించేవాళ్ళు. తరువాత చేదు దుంపలు తినేవాళ్ళు. ఈ దుంపలు ఐగుప్తులో యూదులనుభవించిన బాధలకు చిహ్నం. తరువాత తండ్రి ద్రాక్షసారాయపు రెండవ పాత్రను ఆశీర్వదించి సభ్యులకందించేవాడు. తదనంతరం చేతులు కడుగుకొని గొర్రెపిల్ల మాంసాన్నీ పొంగని రొట్టెలనూ సాపడేవాళ్ళు. తండ్రి ఈ రొట్టెలను త్రుంచి అందరికీ అందించేవాడు. కడన అతడు ద్రాక్షసారాయపు మూడవ పాత్రను దీవించి

సభ్యులకందించేవాడు. ఈ మూడవ పాత్రను దీవించడం ముఖ్యమైన ఘట్టంగా యెంచేవాళ్ళు.

క్రీస్తు కూడ ఇంచుమించు ఇదే పద్ధతిలో అంత్యభోజనం భుజించి వుండాలి. ఈ భోజనాన్ని నూత్నవేదంలో మార్కు, మత్తయి, లూకా, పౌలు వర్ణించారు. ఈ వర్ణనల్లో కొద్దిపాటి వ్యత్యాసాలు కన్పించినా ప్రాధానాంశాల్లో మాత్రం తేడా లేదు. (మీద ఉదహరించిన నాల్గు ఆలోకనాలను చూడండి)

పై నాల్గు ఆలోకనాలు పేర్కొనే నూత్నవేద వాక్యాలు పూర్వవేదంలోని మూడు సంఘటనలను గుర్తుకి తెస్తాయి.

1. సీనాయి నిబంధనంలో మోషే పీఠం మీదా ప్రజలమీదా కోడె నెత్తురు చిలకరించి "ఇది యావే మీతో చేసికొన్న నిబంధనపు రక్తం" అని పల్కాడు - నిర్గ 24,8. క్రీస్తుకూడ అంతిమ భోజన సమయంలో "ఇది నిబంధనపు నా రక్తం" అన్నాడు - మత్త 26,28. మార్కు 14,24.

2. పూర్వవేదంలో యిర్మీయా ప్రవక్త క్రొత్త నిబంధనాన్ని గూర్చి చెప్పాడు. యూదులు పూర్వనిబంధనాన్ని పాటించడం మానివేసారు. కనుక ప్రభువు వాళ్ళతో విసిగిపోయాడు. అతడు తన ప్రజలతో క్రొత్త నిబంధనం చేసికొంటాడు. ఈ నిబంధనంలో దేవుని ఆజ్ఞలు రాతి పలకల మీద కాక, నరుల హృదయాల మీదనే వ్రాయబడతాయి - యిర్మీ 31,31-33. క్రీస్తు అంతిమ భోజనం ప్రవక్త పేర్కొన్న ఈ నూత్న నిబంధనమే - లూకా 22,20.

3. యెషయా తన ప్రవచనంలో ఒక బాధామయ సేవకుని పేర్కొన్నాడు. ఇతడు ప్రజలకోసం బాధలనుభవించాడు. తన ప్రాణాన్ని బలిగా అర్పించాడు. అతని మరణం ద్వారా మనకు పాపవిమోచనమూ జీవమూ లభించాయి - యెష 53,11-12. ఇంకా ప్రభువు ఈ సేవకుని ద్వారా ప్రజలతో నిబంధనం చేసికొన్నాడు. ఈ భక్తుణ్ణి ప్రజలకు ఓ నిబంధనంగా నియమించాడు - 42,6. అంతిమ భోజనంలో క్రీస్తు ఈ బాధామయ సేవకునిద్వారా జరిగిన నిబంధనం తన నిబంధనాన్నే సూచిస్తుందని చెప్పాడు - 22,20. 1 కొరి 11,25.

ఇక పై నల్గురు నూత్నవేద రచయితల్లో మత్తయి మార్కులు క్రీస్తు అంతిమ భోజనం సీనాయి నిబంధనాన్ని తలపిస్తుందని చెప్పారు. అక్కడ మోషే చిలకరించిన నెత్తుటికీ ఇక్కడ క్రీస్తు చిందిన నెత్తుటికీ సామ్యం వుందని చెప్పారు. కనుకనే ఈ రచయితలు "ఇది నా నిబంధనపు రక్తం" అన్న వాక్యం పేర్కొన్నారు. ఈ రచయితల భావాల ప్రకారం

ఇక్కడ క్రీస్తు సీనాయి నిబంధనంలో మోషేలాగే బలి నర్పించాడు. ఇక పౌలు లూకాలు యిర్మీయా పేర్కొన్న క్రొత్త నిబంధనాన్నీ, యెషయా పేర్కొన్న బాధామయ సేవకుణ్ణీ క్రీస్తుకి అన్వయించారు. ఈ క్రీస్తు ద్వారా తండ్రి మనతో "క్రొ నిబంధనం" చేసికొంటాడనీ, ఈ సేవకుడు మనకు పాపవిముక్తి కలిగిస్తాడనీ చెప్పారు. ఈ రచయితల భావాల ప్రకారం ఆ బాధామయ సేవకుళ్లాగ క్రీస్తు కూడ ప్రాణత్యాగం చేసికొన్నాడు.

అంత్యభోజన సమయంలో ప్రభువు రొట్టెను ఆశీర్వదించి ఇది నా శరీరం అన్నాడు. ద్రాక్షసారాయాన్ని ఆశీర్వదించి ఇది నా రక్తం అన్నాడు. ఈ వాక్యాలు ప్రవచనాత్మకమైన కార్యాలు. పూర్వం ప్రవక్తలు తమ బోధలను నటించి చూపించేవాళ్ళు. వాళ్ళు నటించి చూపించినట్లే ఆ బోధలు తర్వాత నెరవేరేవి. ఉదాహరణకు యిర్మీయా తన అంగవస్త్రం చివికిపోయినట్లే యూదాకూడ చివికి చినిగిపోతుందని చెప్పాడు. అలాగే జరిగింది - యిర్మీ 13, 1-11. క్రీస్తుకూడ ఇక్కడ ఈ ప్రవక్తల సంప్రదాయాన్ని పాటించాడు. ఈ రొట్టె అతడు సిలువమీద సమర్పించే తన దేహమై తీరుతుంది. ఈ ద్రాక్షసారాయం అతడు సిలువమీద చిందించే తన నెత్తురై తీరుతుంది.

ఇంకా హీబ్రూ సంప్రదాయం ప్రకారం శరీరమంటే వట్టి శరీరం మాత్రమే కాదు. సంపూర్ణ వ్యక్తి. అలాగే రక్తమంటే వట్టి రక్తం మాత్రమే కాదు. సంపూర్ణ వ్యక్తి. కనుక క్రీస్తు ఇది నా శరీరం, ఇది నా రక్తం అన్నపుడు తన సంపూర్ణ వ్యక్తిత్వాన్ని సూచించాడు. అనగా తన శరీరంతో, రక్తంతో, ఆత్మతో తన్ను తాను మనకు ఆహారంగా సమర్పించుకొంటున్నానని అతని భావం. పైపెచ్చు యూదులు నెత్తురులో ప్రాణముంటుందని భావించారు అని చెప్పాం. కనుక క్రీస్తు నెత్తుటిలో అతని ప్రాణముంటుంది. అందుచేత ఈ భోజన పదార్థాల ద్వారా అతడు తన జీవశక్తినే మనకు ప్రసాదించాడని అర్థం చేసికోవాలి.

ఈ యంతిమ భోజనంలో ఇంకో అంశంగూడ గమనించాలి. ఈ భోజనాన్ని శిష్యులు మాత్రమే భుజించారు, క్రీస్తు భుజించలేదు - మత్త 26,29. లూకా 22,18. ఈ కడపటి భోజనం ప్రభువు సిలువ బలిని సూచిస్తుంది. ఈ యంశం మీదట స్పష్టమౌతుంది. ఆ సిలువబలిలోను, దానికి ప్రతిబింబమైన ఈ అంతిమ భోజనంలోను బలిపశువు క్రీస్తే. కనుక శిష్యులు సిలువబలి నైవేద్యంగానే ఇక్కడ క్రీస్తుని భుజించారు - అనగా అతని శరీరాన్నీ రక్తాన్నీ సూచించే రొట్టెనూ ద్రాక్షసారాయాన్నీ పుచ్చుకొన్నారు. క్రీస్తు తన్ను తాను భుజించడం అసంభవం. కనుక కడపటి భోజనంలో అతడు స్వయంగా రొట్టెనూ ద్రాక్షసారాయాన్నీ పుచ్చుకోలేదు.

## 3. అంత్యభోజనం పాస్కబలికి నిదర్శనం

క్రీస్తు అంతిమ భోజనం ప్రముఖంగా యూదుల పాస్కబలిని తలపిస్తుంది. ఆ బలిలాగే ఈ బలి యెరూషలేములో నీసాను నెల 13-23 తారీఖుల మధ్య జరిగింది. అనగా గురువారం సాయంకాలం. రొట్టెను భుజించడమూ ద్రాక్షసారాయం త్రాగడమూ కీర్తనలు జరిపించడమూ మొదలైన తంతులన్నీ పాస్కబలిలోలాగే అంత్యభోజనంలో గూడ జరిగాయి. వాగ్దత్త భూమిలో స్థిరపడిన పిదప యూదులు యేటేట పాస్కబలిని యెరూషలేములో జరపాలి అన్న ధర్మశాస్త్ర ఆజ్ఞననుసరించే క్రీస్తు శిష్యులచేత యెరూషలేములో చరమ భోజనాన్ని భుజింపజేసాడు - నిర్గ 18,8-10.

ఇంకా యోహాను సువార్త కడపటి విందును పాస్క బలిగా భావించింది. "యేసు తాను ఈ లోకం నుండి తండ్రి వద్దకు సాగిపోవలసిన గడియ వచ్చిందని యెరిగినవాడై" - 13,1. పూర్వం యూదులు పాపపు దేశమైన ఐగుప్తునుండి వాగ్దత్త భూమికి సాగిపోయారు. అలాగే క్రీస్తుకూడ పాపంతో నిండిన ఈ లోకం నుండి తండ్రివద్దకు సాగిపోయాడు. అతడు మరణం ద్వారా పాపానికి చనిపోయాడు, ఉత్థానం ద్వారా తండ్రిని చేరుకొన్నాడు - రోమా 6,10. ఈలా తండ్రి వద్దకు సాగిపోవడమే, తండ్రిని చేరుకోవడమే అతని మరణోత్థానాలు. ఇక అంతిమ భోజనం ఈ మరణోత్థానాలకు నాందిలాంటిది. కనుక ఈ ఘట్టం అతని పాస్కబలిని సూచిస్తుంది. అనగా అంత్యభోజనం పాస్కబలి లాంటిదన్నమాట.

## 4. అంత్యభోజనమూ సిలువబలీ

అంతిమ భోజనానికి సిలువబలికీ వున్న సంబంధం ఏమిటి? ప్రభువు తన సిలువ మరణాన్ని అంతిమ భోజనంలోకి ప్రవేశ పెట్టాడు. అనగా అతడు సిలువబలిని సాంప్రదాయికమైన పాస్కబలి అనే తంతు ద్వారా ముందుగానే నెరవేర్చాడు. శిష్యులకు రొట్టెనూ ద్రాక్షసారాయాన్నీ ఈయడం ద్వారా తన శరీర రక్తాలనూ తన సంపూర్ణ వ్యక్తిత్వాన్నీ వాళ్ళకు ప్రసాదించాడు.

కడపటి విందు రాబోయే సిలువ బలిని సూచిస్తుంది. ఈ విందు కూడ ఓ బలే. ఈ బలి సిలువమీద ఆధారపడి వుంటుంది. దీని విలువ దాని విలువను బట్టి వచ్చింది. అసలు ఇవి రెండూ రెండు బలులు కావు, ఒకే బలి.

అంతిమ భోజనంతో ఏమి అవసరం వచ్చింది? క్రీస్తు తన సిలువబలిని ఆనాటితోనే ముగించదల్చుకోలేదు. అతడు తన యాజకత్వాన్ని ఆనాటితోనే ఉపసంహరించుకోదల్చుకోలేదు. అతని బలీ యాజకత్వమూ కలకాలమూ మన మధ్యలో

కొనసాగాలని అతని కోరిక. కనుకనే అతడు కడపటి విందులో "ఈ బలిని నా జ్ఞాపకార్థంగా మీ మధ్యలో కొనసాగించుకొంటూ పొండి" అన్నాడు - లూకా 22,19.

ఇక అతని సిలువబలిని మన మధ్యలో కొనసాగించే మార్గం ఏమిటి? అసలు అది రక్తపాతంతో గూడిన బలి. దాన్ని మనం ఏలా పునశ్చరణం చేయగలం? పైగా మనం ఆ బలిని ప్రస్తుతః పునశ్చరణం చేయలేం. పూర్వవేదంలో యాజకులైతే ఏటేటా ప్రాయశ్చిత్తబలులు అర్పించారు. క్రీస్తు ఈలా చాలాసారులు బలులు అర్పించలేదు. అతని బలి ఒకే వొకటి, ఒక్కసారి మాత్రమే అర్పించబడింది - హెబ్రే 9,25-27. ఈలాంటి ఏకైక బలిని మనం మళ్ళా పునశ్చరణం చేయలేంగదా!

కనుక క్రీస్తే ఆ సిలువబలిని మన మధ్యలో కొనసాగించే మార్గం వెదికాడు. ఆ బలిని సాంకేతికంగా, రొట్టె ద్రాక్షసారాయాల రూపంలో, ఒకరోజు ముందుగానే అర్పించాడు. అదే కడపటి విందు. ఈ విందుబలి ఆ సిలువ బలికి సూచనం. ఈ విందు బలిని మనం ఎన్నిసార్లయినా పునశ్చరణం చేసికోవచ్చు. అలా చేసినపుడల్లా సిలువ బలిని పునశ్చరణం చేసినట్లే అవుతుంది. కనుక క్రీస్తు అంతిమ భోజనం ద్వారా మనం సిలువ బలిని పునశ్చరణం చేసుకోవాలని కోరాడు. ఈ యంశాన్నే ట్రెంటు మహాసభ ఈలా బోధించింది. "క్రీస్తు సిలువపీఠం మీద తన్ను తాను తండ్రికి అర్పించుకొని మనలను శాశ్వతంగా రక్షించగోరాడు. ఐనా తన యాజకత్వం తన మరణంతో ముగియడం అతని కిష్టంలేదు. తనకు ప్రీతిని గలిగించే ఆధ్యాత్మిక పత్నియైన శ్రీసభ దృగ్గోచరమైన బలిని సమర్పించే మార్గం ఒకటుండాలని గూడ అతని కోరిక. దేహధారులైన నరులు అలాంటి దృగ్గోచరమైన బలిని మాత్రమే సమర్పించగలరు. ఈలాంటి బలిద్వారా ప్రభువు సిలువమీద ఒక్కసారి మాత్రమే సమర్పించిన బలిని మనం మళ్ళామళ్ళా పునశ్చరణం చేసికోవచ్చు. ఆ సిలువబలి జ్ఞాపకం లోకాంతం వరకు చెక్కుచెదరకుండా వుండిపోతుంది కూడ. కనుక అతడు తాను అప్పగింపబడిన రాత్రి తన శరీరాన్నీ రక్తాన్నీ రొట్టె ద్రాక్షరాసాయ రూపాల్లో తండ్రికి అర్పించాడు. అదే రూపాల్లో వాటిని ప్రేషితులకు భోజనంగా దయచేసాడు. ఆ ప్రేషితులనూ వాళ్ళ అనుయాయులుగా వచ్చే గురువులనూ ఈ కార్యాన్ని నా జ్ఞాపకార్థంగా మీ మధ్యలో కొనసాగించండి అని ఆదేశించాడు." ఈ వాక్యాల్లో క్రీస్తు కడపటి విందు అవసరమమిటో స్పష్టంగా వివరింపబడింది. దేహధారులమైన మనం మన స్వభావానికి తగినట్లుగా ఆనాటి సిలువబలిని ఈనాడు భౌతిక రూపంలో పునశ్చరణం చేసికోగలిగి వుండాలి. అందుకు అనువుగా వుండడం కోసమే క్రీస్తు కడపటి విందును నెలకొల్పాడు.

## 5. అంత్యభోజనము నేటి పూజబలి

అంత్యభోజనానికీ కల్వరిమీది సిల్వబలికీ గల సంబంధం చూచాం. కాని ఆ భోజనానికీ నేటి పూజబలికీ గల సంబంధం ఏమిటి? ఆ అంత్యభోజనాన్నే ఈనాడు మనం పూజగా కొనసాగించుకొంటున్నాం. అది సూచించిన కల్వరి బలినే నేడు మన పూజ కూడ సూచిస్తుంది. ఈ రెండింటి విలువ ఆ కల్వరి బలిని బట్టే వచ్చింది.

ఐనా కడపటి విందుకీ నేటి పూజకీ ఈ క్రింది వ్యత్యాసాలు వున్నాయి. 1. నాటి కడపటి భోజనం భవిష్యత్తులో జరగబోయే సిలువబలిని సూచించింది. నేటి పూజబలి భూతకాలంలో జరిగిపోయిన సిలువబలిని సూచిస్తుంది. 2. ఆ కడపటి విందులో ఆత్మార్పణం కావించుకోబోయే బలిమూర్తి ప్రత్యక్షమయ్యాడు. నేటి పూజబలిలో ఆత్మార్పణం కావించుకొని ఉత్థానుడై మహిమను పొందిన బలిమూర్తి ప్రత్యక్షమౌతాడు. 3. ఆ మొదటి విందులో క్రీస్తు తన్ను తానే తండ్రికి అర్పించుకొన్నాడు. నేటి పూజబలిలో అతడు గురువుద్వారాగాని తన్ను తాను తండ్రికి అర్పించుకోడు. ఈలాంటి అంతర్గత వ్యత్యాసాలు కొన్ని వున్నాయి. ఐనా వరప్రసాద లాభాన్ని గూర్చి చెప్పవలసి వస్తేమాత్రం ఆ కడపటి విందుకీ నేటి పూజకీ వ్యత్యాసం లేదు. అది ఎంతఫలితాన్ని యిచ్చిందో నేటి పూజ కూడ అంత ఫలితాన్ని యిస్తుంది.

### ప్రార్థనాభావాలు

1. పూర్వవేదంలోని మెల్కీసెదెక్కు క్రీస్తుకి సంకేతంగా వుంటాడు. ఇతడు రాజూ యాజకుడూనూ. ఇతడు రొట్టె ద్రాక్షసారాయాలను అర్పించాడు. ఇతనికి ప్రతిబింబమైన క్రీస్తు కూడ దేవునికి ఇవే కానుకలు అర్పించాడు. కనుక క్రీస్తు మనకు నూత్న మెల్కీ దెసెక్కు లాంటివాడు - హెబ్రె 5,10. కీర్త 110,4.

2. ఏఫ్రేము భక్తుడు ఈలా వ్రాసాడు. "పూర్వవేదం లోని యాజకుల వలనా బలుల వలనా దేవునికి సంతుష్టి కలుగదని తెలిసి క్రీస్తు యాజకుడు తానే స్వయంగా బలిపశువయ్యాడు. అలా మన యాజకుడు స్వయంగా బలిపశువై తన్ను తానే తండ్రికి ఆత్మార్పణం చేసికొన్నాడు. ఈ యర్పణం పూర్వవేదపు బల్యర్పణాలన్నిటినీ మించిపోయి తండ్రికి ప్రీతి కలిగించింది. ఈనాడు మన కందరికి ఆదరువుగా వుండేది ఈ బలిమూర్తియైన క్రీస్తే."

3. శ్రీ సభ ఆరాధనా క్రైస్తవ జీవితమూ కూడ పూజ బలిలో పరాకాష్ఠనందుకొంటాయని చెప్తుంది రెండవ వాటికన్ మహాసభ. కనుక యోగ్యంగా పూజబలిలో పాల్గొనడం

కంటె మనం చేయదగిన గొప్ప పుణ్యకార్య మేమీ లేదు. ఈపూజలో భక్తిభావంతో క్రీస్తుని తండ్రికి అర్పిస్తే, క్రీస్తుతోపాటు మనలను మనం ఆ తండ్రికి అర్పించుకొంటే, మన జీవితం ధన్యమౌతుంది.

4. రక్తపాతం ద్వారా తప్పితే పాపవిమోచనం జరగదని చెప్తుంది హెబ్రేయులు జాబు – 9,22. కనుక క్రీస్తు స్వీయరక్తాన్ని చిందించి మనకు పాపవిముక్తి కలిగించాడు. పూర్వవేదంలో పశువుల నెత్తురు పాపవిమోచనం కలిగిస్తే నూత్నవేదంలో తండ్రికి ప్రీతిపాత్రుడూ పవిత్రుడూ ఐన క్రీస్తు నెత్తురు మనకు అంతకంటె అదనంగానే పాపవిమోచనం కలిగిస్తుంది. కనుక "అనేకుల పాపక్షమాపణానికి చిందబడనున్న నా రక్తం ఇది" అన్న ప్రభువుకి మనం ఎంతైనా కృతజ్ఞులమై యుండాలి.

5. అంత్యభోజనానికి అటు పూర్వవేదంలోని పాస్కనిబంధన బలులతో సంబంధం వుంది. ఇటు నూత్నవేదంలోని సిలువ బలితోను, పూజబలితోను సంబంధం వుంది. కనుక ఈ కడపటి భోజనం భావాన్ని మనం జాగ్రత్తగా గుర్తించాలి.

# 2. జ్ఞాపకార్థం

"ఇది మీ కొరకు ఉద్దేశింపబడిన నా శరీరం. మీరు నా జ్ఞాపకార్థంగా దీనిని చేయండి" - 1కొ 11,24.

పూర్వ నూత్నవేదాల్లో "జ్ఞాపకార్థం" అనే భావం ఒకటుంది. ఈ భావం ప్రకారం పూర్వం జరిగిపోయిన ఓ సంఘటనం ఇప్పుడు మనకు మళ్ళా ప్రత్యక్షమౌతుంది. కనుక పూర్వం జరిగిన సిలువబలి ఇప్పుడు మళ్ళా మన పూజలో ప్రత్యక్షమౌతుంది. ప్రస్తుతాధ్యాయంలో ఈ జ్ఞాపకార్థం అనే భావాన్ని పరిశీలిద్దాం. ఇక్కడ నాల్గంశాలను తిలకిద్దాం.

## 1. కృతజ్ఞతా స్తుతి

దివ్యసత్ప్రసాదానికి గ్రీకుభాషలో యూకరిస్ట్ అని పేరు. ఈ పదానికి కృతజ్ఞతాస్తుతి అని అర్థం. కాని ఈ పేరు దీనికి ఏలా వచ్చింది? హీబ్రూ ప్రజలు పాస్కబలి మొదలైన ఆరాధన కార్యక్రమాల్లో ప్రభువుని స్తుతించేవాళ్ళు. ఈ స్తుతికి హీబ్రూ భాషలో "బెరకా" అని పేరు. ఈ పదం నుండే యూకరిస్ట్ అనే పదం ఉద్భవించింది. తండ్రి క్రీస్తు ద్వారా దయచేసిన రక్షణానికి స్తుతి చెల్లించడం దివ్యసత్ప్రసాదంలో ప్రధానాంశం.

హీబ్రూ బెరకాలో మూడంశాలు వుండేవి. 1. ప్రభువుని స్తుతించమని భక్త సమాజాన్ని హెచ్చరించేవాళ్ళు. 2. ఆ స్తుతికి కారణం తెలిపేవాళ్ళు. ప్రభువు తన ప్రజలను రక్షించాడు కనుక అతన్ని స్తుతించాలి. భక్తసమాజం ఆ ప్రభువు దయచేసిన రక్షణాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవాలి. ఆ రక్షణాన్ని ఇప్పుడు కూడ భక్తులు అనుభవిస్తూనే వున్నారు. 3. అంత్యస్తుతి.

కనుక హీబ్రూ ప్రజలు ప్రభువు తమకు దయచేసిన రక్షణానికి గాను కృతజ్ఞతాభావంతోను ఉత్సాహంతోను భక్తసమాజంలో అతన్ని కొనియాడి స్తుతించేవాళ్లు. ఈ సంప్రదాయాన్ని మనసులో పెట్టుకొనే కడపటి భోజనంలో రొట్టెనూ ద్రాక్షసారాయాన్నీ ఆశీర్వదించడానికి ముందు క్రీస్తు తండ్రికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించాడు - మత్త 26,26-27.

## 2. జ్ఞాపకార్థం

పై కృతజ్ఞతాస్తుతిలో ఒక అంశం దేవునికి తాను దయచేసిన రక్షణాన్ని జ్ఞాపకం చేయడం. భక్తులు ప్రభువుకి కృతజ్ఞతా స్తుతులు చెల్లించేపుడు అతడు తమకు దయచేసిన రక్షణాన్ని అతనికి జ్ఞాపకం చేసేవాళ్లు. అందుకు వందనాలు చెప్పేవాళ్ళు. తమకు కావలసిన ఇతర వరాలను కూడ అతని నుండి అడుగుకొనేవాళ్ళు. కొన్ని ఉదాహరణలు చూద్దాం.

1. ప్రభువు యిస్రాయేలీయులను ఫరో దాస్యం నుండి విడిపించాడు. ఈ సంఘటనాన్ని పురస్కరించుకొని వాళ్ళు తొలి పాస్క పండుగను ఐగుప్తులోనే జరుపుకొన్నారు. కాని తర్వాత వాళ్ళు వాగ్దత్తభూమిలో స్థిరపడిన పిదప అక్కడ కూడ ఏటేట ఈ పండుగను జరుపుకోవాలి. ఎందుకు? ప్రభువుకి కృతజ్ఞత చూపడానికి, అతడు దయచేసిన దాస్యవిముక్తి అనే వరాన్ని అతనికి జ్ఞప్తికి తేవడానికి. అలా జ్ఞప్తికి తెచ్చి ప్రభువు ఆనాడు చేసిన వాగ్దానాలను ఈనాడు కూడ నిలబెట్టుకోవాలని మనవి చేసికోవడానికి - నిర్గ 12,14. ఈలాగే యూదులు వాగత్తభూమిలో పాస్కపండుగను జరుపుకొనేపుడు పొంగని రొట్టెలను తినాలి. ఈ ఆచారం కూడ ప్రభువుకి తాను దయచేసిన రక్షణాన్ని జ్ఞప్తికి తేవడం కొరకే - నిర్గ 13,7-9. ఈ సందర్భంలో రెండంశాలు ముఖ్యం. మొదటిది, భక్తులు పూర్వరక్షణాన్ని దేవునికి జ్ఞప్తిచేసి అతనికి వందనాలు అర్పించడం. రెండవది, ప్రస్తుతం కూడ దేవుడు తమ్ము కాపాడాలని మనవిచేసుకోవడం. కనుక ఇక్కడ కృతజ్ఞతా మనవీ రెండూ వున్నాయి.

2. యూదులు దేవునికి ధాన్యబలి అర్పించేవాళ్ళు. దీనిలో గోదుమ పిండిని ఓలివు నూనెతోను సాంబ్రాణితోను కలిపి పీఠంమీద దహించేవాళ్ళు. ఈ బలికూడ దేవునికి తాను ప్రసాదించిన రక్షణాన్నీ, తాను దయచేసిన వాగ్దానాలను జ్ఞాపకం చేయడం కోసమే - లేవీ 2,2.

3. యూదులు మొదట యెడారిలోని గుడారంలోను తర్వాత యెరూషలేములోని దేవళంలోని దేవుని సన్నిధిలోను పండ్రెండు రొట్టెలు పెట్టేవాళ్ళు. వాటికి సాన్నిధ్యపు రొట్టెలు అని పేరు. ఇవి యిస్రాయేలు ప్రజల పండ్రెండు తెగలకు చిహ్నంగా వుండేవి. ఈ పండ్రెండు రొట్టెలను చూచి దేవుడు పండ్రెండు తెగల ప్రజలను జ్ఞప్తికి తెచ్చుకొంటాడని వాళ్ళ భావం - లేవీ 24,5-9.

4. "పుణ్యపురుషుడు సమర్పించే బలిని దేవుడు అంగీకరిస్తాడనీ, ఆ బలిని అతడు తప్పకుండా జ్ఞాపకం చేసికొంటాడనీ చెప్తుంది సీరా గ్రంథం - 36,6-7.

పూర్వవేదంలోని పై నాల్గు సందర్భాల్లో గూడ జ్ఞప్తికి తెచ్చేవాడు నరుడు, జ్ఞప్తియందుంచుకొనేవాడు దేవుడు. ఇక నూత్నవేదంలోని సందర్భాలు కూడ కొన్ని చూద్దాం.

1. తొలినాటి క్రైస్తవులంతా యూదులు. అన్యజాతులలో నుండి మొదటిసారిగా క్రైస్తవులలో చేరినవాడు రోమను సైన్యాధికారి కొర్నేలి. ఇతని ప్రార్థనా దానధర్మాలూ "జ్ఞాపకార్థంగా" దేవుని సన్నిధిలోకి చేరాయి - అచ 10,4. అనగా అతని ప్రార్థనం పూర్వవేదంలోని లేవీయకాండం 2,2 పేర్కొనే ధాన్యబలిలాగా దేవుని సన్నిధిలోకి చేరింది. ప్రభువు అతని ప్రార్థనను తప్పక జ్ఞాపకం చేసికొంటాడని భావం.

2. సీమోను ఇంటిలో భోజనం చేసే క్రీస్తు శిరస్సుని ఓ స్త్రీ అత్తరుతో అభిషేకించింది. సువార్త ప్రచారంలోకి వచ్చేకాడల్లా ఈ భక్తురాలి పుణ్యక్రియ కూడ ఆమె జ్ఞాపకార్థంగా ప్రచారంలోకి వస్తుంది. ఇక్కడ ఆమెను జ్ఞప్తియందుంచుకొనేది నరులు కాదు, దేవుడు. ఆమె పుణ్యక్రియ ఓ ధాన్యబలిలాగ దేవుని సన్నిధిని చేరుతుందని భావం - మార్కు 14,9.

3. పౌలు తెస్సలోనియుల విశ్వాసాన్నీ ప్రేమనీ దేవుని యెదుట జ్ఞాపకార్థంగా సమర్పించాడు. అనగా ఆ ప్రజల భక్తిని దేవుడు జ్ఞప్తిలో వుంచుకొంటాడని భావం- 1 తెస్స 1,2-3. ఈ ఉదాహరణలన్నిటిలో కూడ జ్ఞప్తియందుంచుకొనే కర్త దేవుడే.

ఈ ఉదాహరణలను చూచాక యిక అంత్యభోజన వాక్యాలను పరిశీలిద్దాం. క్రీస్తు రొట్టెనూ ద్రాక్షసారాయాన్నీ ఆశీర్వదించి శిష్యులకిచ్చిన పిమ్మట "మీరు దీన్ని నా జ్ఞాపకార్థంగా చేయండి" అన్నాడు - 1కొ 11,24. లూకా 22,19.

ఇక్కడ "దీన్ని" అంటే దేన్ని? క్రీస్తు చేసిన కార్యాన్ని. అతడు రొట్టెను తీసికొని దేవుణ్ణి స్తుతించి దాన్ని విరిచి శిష్యులకిచ్చాడు. వాళ్ళను తినమన్నాడు. అలాగే పాత్రను తీసికొని, దేవునికి వందనాలర్పించి, దాన్ని శిష్యులకిచ్చి పానం చేయమన్నాడు. ఈ క్రియలన్నిటినీ క్రీస్తు చేసినట్లుగానే తర్వాత శిష్యులు కూడన చేయాలి.

ప్రభువు "నా జ్ఞాపకార్థంగా చేయండి" అన్నాడు. పైన మనం పేర్కొన్న పూర్వ నూత్నవేద ఉదాహరణలను బట్టి ఈ మాట అర్థమేమిటో మనకు తెలుసు. దివ్యసత్ప్రసాద బలి క్రీస్తు జ్ఞాపకార్థం జరగాలి. అనగా భక్తులు క్రీస్తు మరణోత్థానాలను తండ్రికి జ్ఞాపకం చేస్తారు. ఆ తండ్రి తన కుమారుని మరణోత్థానాలను జ్ఞప్తికి తెచ్చుకొని ఆ కుమారుణ్ణి విశ్వసించే భక్తులందరినీ కనికరిస్తాడు. ప్రతి పూజలోను ఈలా తండ్రి సిలువబలినర్పించే శ్రీసభను కరుణిస్తూంటాడు.

యూదుల సంప్రదాయం ప్రకారం, భక్తులు తమ ఆరాధనంలో భగవంతుడు పూర్వం జరిగించిన ఓ సంఘటనను గుర్తుకు తెచ్చుకొనేపుడెల్లా ఆ సంఘటనం మళ్లా వాళ్ళ మధ్యలో నూత్నంగా జరుగుతుంది. కనుక పూర్వవేదంలో యూదులు ఐగుప్తు దాస్యవిముక్తిని గుర్తుకి తెచ్చుకొని పాస్క ఉత్సవాన్ని జరుపుకొనేపుడెల్లా వాళ్ళకు మళ్ళా దాస్యవిముక్తి రక్షణమూ సిద్ధించేది. పూర్వం ఆ దాస్యవిముక్తిని కలిగించిన ప్రభువు వాళ్ళకు మళ్ళా ప్రత్యక్షమై వాళ్ళను దీవించేవాడు. ఇదే "జ్ఞాపకార్థం" యొక్క ఫలితం. ఇదే నియమం నూత్నవేదానికి గూడ వర్తిస్తుంది. ఈనాడు మనం కల్వరిబలిని "జ్ఞాపకార్థంగా" మన మధ్యలో జరుపుకొనేపుడెల్లా, అనగా మనం పూజను జరుపుకొనేపుడెల్లా, పూర్వం సిలువ మరణాన్ని అనుభవించి ఉత్థానమైన క్రీస్తు నేడు మన మధ్యలో ప్రత్యక్షమౌతాడు. అలా ప్రత్యక్షమై మనకు తన రక్షణాన్ని దయచేస్తాడు. కనుక నాటి పాస్కబలి గాని నేటి సిలువ బలి గాని కేవలం పూర్వ సంఘటనాలను గుర్తుకి తెచ్చుకొనేవి మాత్రమే కావు. ఆ సంఘటనాలను మళ్ళా మన మధ్యలో ప్రత్యక్షం చేసేవి. ఆ సంఘటనాలకు కారకుడూ రక్షణమూర్తీ ఐన దేవుణ్ణి మళ్ళా మన మధ్య సాక్షాత్కారం చేసేవి. కనుక పాఠకులు "ఈ జ్ఞాపకార్థం" అన్న భావాన్ని జాగ్రత్తగా గుర్తించాలి.

పూజలో మనం క్రీస్తు మరణోత్థానాలను తండ్రికి జ్ఞాపకం చేసేపుడు రెండు పనులు చేస్తాం. మొదటిది, ఆ క్రీస్తు ద్వారా మనలను రక్షించినందులకు తండ్రికి వందనాలర్పిస్తాం. రెండవది, ఆ క్రీస్తుని చూచి ఇప్పుడు కూడ మనలను కాచి కాపాడాలని తండ్రికి మనవి చేస్తాం.

## 3. క్రీస్తు మరణాన్ని ప్రకటించడం

భక్తులు ఆ రొట్టెను తిని ఆ పాత్రను పుచ్చుకొనేపుడెల్లా, ప్రభువు మళ్ళా రెండవసారి విజయం చేసిందాకా గూడ అతని మరణాన్ని ప్రకటిస్తారు అన్నాడు పౌలు 1కొరి 11,26. మనం చేసే "జ్ఞాపకార్థం" ఫలితంగా క్రీస్తు మరణాన్ని ప్రకటిస్తాం. ఇక్కడ "ప్రకటించడం" అంటే లోకానికి క్రీస్తుని బోధించడమని భావం కాదు. మరి ఉత్థాన క్రీస్తుని మన మధ్యలో,

మన పీఠాలమీద ప్రత్యక్షం చేసికోవడమని భావం. గురువు క్రీస్తు స్థానంలో నిల్చి యిది నా శరీరం, ఇది నా రక్తం అని చెప్పగానే అప్పమూ రసమూ ఆ ప్రభువు శరీర రక్తాలుగా మారిపోతాయి. రొట్టె రసాల స్థానంలో ప్రభువు సాక్షాత్కరిస్తాడు. ఈ సాక్షాత్కారమే ప్రకటనం.

ఇక్కడ ఇంకో విషయం గూడ గమనించాలి. క్రీస్తు మనలను రక్షించింది కేవలం మరణం ద్వారా మాత్రమే కాదు, ఉత్థానం ద్వారా కూడ. ఈ ప్రభువు మరణం ద్వారా మనకు పాపపరిహారమూ, ఉత్థానం ద్వారా వరప్రసాద ప్రాప్తీ లభిస్తాయి. కనుక ఎప్పుడు గూడ క్రీస్తు మరణోత్థానాలు కలసిపోతూండాలి. మన పూజలో ప్రకటనమయ్యేది, అనగా ప్రత్యక్షమయ్యేది మృత క్రీస్తు కాదు. మృతుడై ఉత్థానుడైన క్రీస్తు. సిలువ మరణాన్నీ ఆ మరణ ఫలితాన్నీ తనలో నిల్పుకొన్న ఉత్థాన క్రీస్తు మన సత్ప్రసాదంలో ప్రత్యక్షమౌతాడు.

## 4. దేవుని రాజ్యం వచ్చేదాక గూడ

ప్రభువు ద్రాక్ష సారాయాన్ని ఆశీర్వదించి దాన్ని తన రక్తంగా మార్చి శిష్యులకిచ్చాడు. తాను మాత్రం దాన్ని త్రాగలేదు. "దేవుని రాజ్యం వచ్చేదాకా గూడ నేను ఈ ద్రాక్షసారాయాన్ని త్రాగను" అన్నాడు - లూకా 22,19. మార్కు 14,25. దీని భావం ఏమిటి?

యూదులు ఏదైనా పనికి పూనుకొనేపుడు వ్రతాన్ని పట్టడం అలవాటు. ఉదాహరణకు యెరూషలేములోని యూదులు పౌలుని చంపిందాకా అన్నపానాలు ముట్టకోమని వ్రతం పట్టారు - అచ 23,12. అలాగే ప్రభువు కూడ ఇక్కడ ఓ వ్రతం పట్టి వుండవచ్చు. అదే జరిగివుంటే ఆ కార్యం భావం యిది. అతడు మనకోసం చనిపోవడానికి సిద్ధమయ్యాడు ఆ ఘడియ సమీపించింది కూడ. ఆ మరణం నెరవేరిందాకా తాను అన్నపానీయాలు ముట్టుకోడు. తండ్రి ఆజ్ఞను నెరవేర్చడానికై దీక్ష పూనుతాడు. ఆ దీక్ష భోజన పానీయాలు విసర్జించిన స్నాపక యోహాను దీక్ష లాంటిది - లూకా 7,33.

ఇక క్రీస్తు మరణంతో పాపపరిహారం జరిగి దైవరాజ్యం సిద్ధిస్తుంది. ఆ దైవరాజ్యంలో ప్రభువు మళ్ళా శిష్యులతో ద్రాక్షసారాయం సేవిస్తాడు. అనగా మరల వారలతో విందారగిస్తాడు. ఎందుకంటే దైవరాజ్యం సంతోషపూరితమైంది. యూదుల భావం ప్రకారం విందూ ద్రాక్షసారాయమూ సంతోష చిహ్నాలు. బైబుల మోక్షాన్ని కూడ విందుగా భావిస్తుంది.

"దైవరాజ్యం వచ్చేదాకా" అన్న లూకా పదాలనే పౌలు "ప్రభువు మళ్ళా వచ్చేదాక" అని పేర్కొన్నాడు - 1కొరి 11,26. అనగా ప్రభువు రెండవ రాకడ అన్నా దైవరాజ్యం రాకడ అన్నా ఒకటే. కాని దైవరాజ్యం రావడం లేక రెండవరాకడ ఎప్పుడు జరుగుతుంది? ఇక్కడ

వేదశాస్త్రుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. కొందరు వేదశాస్త్రుల భావం ప్రకారం ఇది లోకాంతంలో జరుగుతుంది. ఈ భావాన్నే గనుక తీసికొంటే క్రీస్తు మోక్షంలో మళ్ళా తన శిష్యులతో విందారగిస్తాడు, ద్రాక్షాసవం సేవిస్తాడు అని చెప్పాలి. కాని కొందరు వేదశాస్త్రులు శ్రీసభ ప్రారంభం కావడమే దైవరాజ్యం రావడమని చెప్పారు. బహుశ ఇది పైదానికంటె మెరుగైన అర్థం. క్రీస్తు చనిపోయి పరిశుద్ధాత్మ శిష్యులమీదికి దిగిరాగానే శ్రీసభ ప్రారంభమైంది. కనుక ఇప్పుడు శ్రీసభలో ప్రభువు ద్రాక్షాసవం సేవిస్తాడు. అనగా నేడు గురువులు క్రీస్తుతో ఐక్యమై పూజను అర్పిస్తాడు. కనుక అతడూ గురువులతో ఐక్యమై ద్రాక్షాసవం సేవిస్తాడు. నేటి శ్రీ సభలో ప్రతిదినము సత్ప్రసాద విందులో పాల్గొంటున్నాడు.

ఈ యధ్యాయంలో మనం పేర్కొన్న భావాలన్నీ ఇప్పుడు క్రొత్త పూజలోకూడ కన్పిస్తాయి. పూజలో "కావున తండ్రి! మా రక్షణ స్మృతిని కొనియాడుతూన్నాం. క్రీస్తు మరణాన్నీ అతడు పాతాళానికి దిగడాన్నీ జ్ఞాపకం చేసికొంటున్నాం. అతడు ఉత్థానుడై నీ కుడిప్రక్కన కూర్చోవడాన్ని ప్రకటిస్తున్నాం" అంటాం. ఇంకా "తండ్రీ! అతని మరణాన్నీ ఉత్థానాన్నీ స్మరిస్తూ జీవాన్నొసగే ఈ యప్పాన్నీ రక్షణ పాత్రనీ నీకు సమర్పిస్తున్నాం" అని చెప్తాం. ఈ విధంగా మనం నమ్మే దైవశాస్త్రాంశాలనే మన ఆరాధనలో కూడ వ్యక్తం చేస్తాం.

## ప్రార్థనాభావాలు

1. మాప్సువెస్తియా తియొడోరెట్ అనే వేదశాస్త్రి "దివ్యసత్ప్రసాదం దేవుని రక్షణకార్యాల మీద వ్యాఖ్య చెప్తుంది" అన్నాడు. అనగా ఈ ప్రసాదం దేవుని రక్షణ కార్యాలను వివరిస్తుంది. దేవుడు క్రీస్తుద్వారా మనకు దయచేసిన పాపవిముక్తికీ వరప్రసాద ప్రాప్తికీ నిదర్శనంగా వుంటుంది. కనుక మనం భక్తిభావంతో దివ్యసత్ప్రసాదబలిని అర్పించాలి.

2. క్రిసోస్తం అనే భక్తుడు ఈలా వ్రాసాడు. "మనం రోజూ పూజబలులు అర్పించినా అవి చాలా బలులు కాదు, ఒకే బలి. ఈ బలులన్నీ ఒకే ఒక్క బలిని అర్పించిన క్రీస్తు సిలువ బలికి జ్ఞాపకార్థాలు. కనుక దానితో కలుపుకొని ఇవన్నీ ఒకే బలి ఔతాయి. ఈ బలులన్నిటిలోను బలిపశువు ఒక్కటే - క్రీస్తు. కనుక ఇవన్ని ఒకే బలి కాని చాలా బలులు కావు. పూర్వవేదం లోని యాజకుల్లాగ మనం ప్రతిసారీ క్రొత్తబలి నర్పించం. దీన్ని నా జ్ఞాపకార్థం చేయండి అని పల్కిన క్రీస్తు ఏకైక

సిలువ బలినే మనం మళ్ళామళ్ళా పునశ్చరణం చేస్తాం. కనుక మన బలి ఒక్కటే ఒక్కటి". ఈ "జ్ఞాపకార్థం" వల్ల నాటి సిలువబలి నేటి మన పూజబలిలో ప్రత్యక్షమౌతుంది. ఈ సత్యాన్ని మనం కృతజ్ఞతాభావంతో ధ్యానించుకోవాలి.

2. పూర్వవేదంలో ప్రభువు పండ్రెండు సాన్నిధ్యపు రొట్టెలను జూచి పండ్రెండు గోత్రాల యిస్రాయేలీయులను గుర్తుకి తెచ్చుకొనేవాడు. వాళ్ళమీద కరుణ చూపేవాడు - లేవీ 24,8. నూత్నవేదంలో ప్రభువు క్రీస్తు మరణోత్థానాలను గుర్తుకి తెచ్చుకొని మనలను కరుణిస్తాడు. ఆ కుమారుడు ఆ తండ్రికి ఎంతో ప్రీతిపాత్రుడు. అతడు మనకోసం మరణించి మనకోసం ఉత్థానమయ్యాడు. అతని ద్వారా మనం తండ్రి కరుణకు పాత్రులమవుతాం. కనుక ఈ మరణోత్థానాలను తండ్రికి గుర్తుతెచ్చే పూజను మనం పరమ భక్తిభావంతో నిర్వహించాలి.

4. మన తరపున మనం క్రీస్తు మరణోత్థానాలను తండ్రికి జ్ఞాపకం చేస్తాం. కాని ఉత్థాన క్రీస్తు కూడ తన మరణాన్నీ, ఉత్థానాన్నీ తండ్రికి గుర్తు చేస్తూంటాడు. క్రీస్తు మోక్షంలో నిరంతరమూ తండ్రి సమక్షంలో వసిస్తూ తన ద్వారా తండ్రిని చేరే మనందరి తరపునా ఆ తండ్రికి విజ్ఞాపనం చేస్తుంటాడు - హెబ్రే, 7,25. అతడు ఇప్పుడు మన కోసం దేవుని యెదుట కన్పిస్తూంటాడు - 9,24. ఈ క్రీస్తుని చూచి తండ్రి మనమీద దయజూపుతాడు. ఇతడు మనలను శిక్షించవద్దని తండ్రికి మనవి చేస్తాడు. అంత్యదినాన న్యాయనిర్ణయ సమయంలో పిశాచం దేవుని యెదుట నిలచి మనమీద నేరం మోపుతుంది. మనలను శిక్షించమని అడుగుతుంది. కాని క్రీస్తు కూడ దేవుని యెదుట నిలచి మన కోపు తీసికొని మనలను సమర్థిస్తూ మాట్లాడతాడు. మనలను రక్షించమని తండ్రిని అడుగుతాడు. పిశాచం మనకు వ్యతిరేకవాది ఐతే క్రీస్తు మనకు ఉత్తరవాది ఔతాడు - 1యో 2,1.

5. పూజలో మనం బ్రతికివున్న వాళ్ళనీ చనిపోయిన వాళ్ళనీ గూడ తండ్రికి గుర్తుచేస్తాం. క్రీస్తు మరణోత్థానాలను జూచి తండ్రి సజీవులనూ మృతులనూ గూడ కరుణిస్తాడు. కనుక మనం ప్రతి పూజలోను బంధువులనూ ఆప్తులనూ ఇష్టులనూ భక్తిభావంతో ఆ తండ్రికి గుర్తు చేస్తూండాలి.

# 3. పూర్వవేద బలులు

"ప్రతి తావులోను నా నామానికి బలి నర్పిస్తారు. అది నిర్మలమైన బలి" - మలాకి 1,11.

పూర్వవేదంలో యూదులు దేవునికి ఎన్నోరకాల బలులు అర్పించారు. కాని ఆ బలులన్నీ కూడ సిలువబలి ద్వారానే ఫలితాన్ని పొందాయి. కనుక ఆ సిలువబలి విలువను మనం సరిగా అర్థం చేసికోవాలి. ఈ యధ్యాయంలో పూర్వవేద బలులనూ వాటి స్వభావాన్నీ పరిశీలిద్దాం. ఇక్కడ నాల్గంశాలను చూద్దాం.

## 1. పూర్వవేద బలులు

హీబ్రూ ప్రజలు ఆరాధనంలో బలి ప్రధానమైంది. ప్రతి కార్యానికీ దేవునికి బలినర్పించడం వాళ్ళ సంప్రదాయం. తొలిరోజుల్లో ఈ బలులు కనానీయులు ఐగుప్తీయులు మొదలైన అన్యప్రజల బలుల్లాగే వుండేవి. కాని కాలక్రమేణ అవి నిర్మలత్వాన్నీ పావిత్ర్యాన్నీ పొందాయి. యూదుల బలులు రక్తరహితాలు, రక్తసహితాలు అని రెండు రకాలు.

రక్తరహిత బలులు ప్రధానంగా ధాన్యబలులు. ప్రజలు దేవునికి పొలంలో పండిన మొదటిపంట, మొదటి పండ్లు, ద్రాక్షసారాయం, పశువులు ఈనిన తొలిచూలు పిల్లలు మొదలైన వాటిని కానుక పెట్టేవాళ్ళు. కాని యూదుల సంప్రదాయంలో ఈ బలులు అంత ముఖ్యమైనవి కావు. రక్తసహిత బలులు వీటికంటె విలువైనవి.

రుధిర సహిత బలుల్లో పశువును చంపి దాని నెత్తుటిని పీఠం మీద చిలకరించేవాళ్ళు. దాని మాంసాన్ని వండుకొని తినేవాళ్ళు. లేదా కాల్చివేసేవాళ్ళు. ఈ బలులు మూడు రకాలుగా వుండేవి.

1. దహన బలులు : వీటిల్లో పశువు నెత్తుటిని పీఠం మీద పోసేవాళ్ళు. దాని మాంసాన్ని గూడ పీఠంమీదనే పూర్తిగా కాల్చివేసేవాళ్ళు. దీనిద్వారా ఈ బలినర్పించే భక్తుడు సంపూర్తిగా దేవునికే చెందుతాడని భావం. కోడెలనూ గొర్రెపిల్లలనూ మేకపిల్లలనూ ఈలా దహనబలిగా అర్పించే వాళ్ళు. బలులన్నిటిలోను ఇది శ్రేష్ఠమైంది. లేవీయకాండం మొదటి అధ్యాయం ఈ బలిని వర్ణిస్తుంది.

2. సమాధాన బలులు : వీటికే దేవునితో ఐక్యమయ్యే బలులని కూడ పేరు. పశువు నెత్తుటిని పీఠం మీద చిలకరించే వాళ్ళు. క్రొవ్వును పీఠం మీద వేల్చేవాళ్ళు. మాంసాన్ని మాత్రం యాజకులూ బలినర్పించేవాళ్ళూ వండుకొని తినేవాళ్ళు. అది పవిత్రమైన నైవేద్యం. ఆ మాంసాన్ని భుజించేవాళ్ళను దేవుని అతిథులుగానూ దేవుణ్ణి

ఆతిథ్యకారుణ్ణి గానూ భావించేవాళ్ళు. ఆ బలిద్వారా ఆ భోజనం ద్వారా భక్తులు తాము దేవునితో ఐక్యమయ్యామని యెంచేవాళ్ళు. మొదటి అధ్యాయంలో మనం పేర్కొన్న నిబంధన బలీ పాస్కబలీ కూడ ఈ కోవకు చెందినవే. సుప్రసిద్ధమైన 23వ కీర్తన గూడ ఈ బలినే పేర్కొంటుంది. లేవీయకాండం 3వ అధ్యాయం దీనిని వర్ణిస్తుంది.

3. ప్రాయశ్చిత్తబలులు : ఇవి మళ్ళా పాపపరిహార బలులునీ నిష్కృతి బలులనీ రెండు రకాలు. కర్మకాండంలో జరిగిన లోపాలను సవరించడానికీ, అజ్ఞానం వల్లగానీ బలహీనత వల్లగానీ కట్టుకొనిన పాపాలకు పరిహారం చేయడానికి పాపపరిహార బలులను అర్పించేవాళ్ళు - లేవీయ కాండం 5.

4. దేవునికి సంబంధించిన ఆజ్ఞలను గానీ తోడి నరులకు సంబంధించిన ఆజ్ఞలను గానీ మీరినపుడు పరిహారం చేసికోవడానికి నిష్కృతి బలులను అర్పించేవాళ్ళు - లేవీ 5,14-26. ఈ బలుల్లో పశువు నెత్తురు పీఠంమీద చల్లేవాళ్లు. పీఠంనాల్గు కొమ్ములకూ నెత్తురు పూసేవాళ్ళు. క్రొవ్వు పీఠంమీద వేల్చేవాళ్ళు. మాంసం యాజకులైనా వండుకొని తినేవాళ్ళు లేదా పీఠానికి దూరంగా కాల్చివేయనైనా వేసేవాళ్ళు.

మామూలుగా అన్నిటికంటె శ్రేష్ఠమైంది దహన బలి. కాని బాబిలోనియా ప్రవాసానంతరం ఒకరకమైన ప్రాయశ్చిత్త బలి అన్నింటికంటె శ్రేష్ఠబలిగా గణింపబడింది. అదే కిప్పూర్ అనే ప్రాయశ్చిత్తదినాన సమర్పించే బలి. లేవీయకాండం 16 దీన్ని వర్ణిస్తుంది. ఈ బలిని ఏడాదికి ఒకసారి మాత్రమే అర్పించేవాళ్ళు. ఆ దినం మాత్రమే ప్రధాన యాజకుడు దేవళంలోని గర్భాగారంలోకి వెళ్ళి మందసం మీద నెత్తురు చిలకరించేవాడు. నూత్నవేదంలో హెబ్రేయుల జాబు క్రీస్తు సిలువబలిని ఈ కిప్పూర్ ప్రాయశ్చిత్తబలితో పోలుస్తుంది. ఆ విషయం మీదట చూద్దాం.

పై బలులన్నీ క్రీస్తు బలిని సూచిస్తాయి. భవిష్యత్తులో రాబోయే క్రీస్తు బలిని బట్టే ఇవన్నీ తమ ఫలితాన్ని సాధించాయి. ఐనా క్రీస్తుబలి వీటిల్లో దేనిలాంటిదీ కాదు. అది విలక్షణమైన ఏకైక బలి.

## 2. బలుల భావం

పూర్వవేదంలోని వివిధ బలులను పరిశీలించాం. ఇక వీటి భావమేమిటో విచారిద్దాం. భక్తుడు ఓ జంతువును గాని వస్తువును గాని దేవునికి అర్పిస్తాడు. ఆ యర్పణం ద్వారా తాను దేవునితో ఐక్యం కారోగుతాడు. బలిలో రెండు భావాలుంటాయి. మొదటిది,

అర్పణం. ఇది బాహ్య చిహ్నం. రెండవది, దేవునితో ఐక్యమై అతని దీవెనలు పొందాలి అనే భక్తుని అంతర్గతమైన కోర్కె. మొదటిదానికంటె ఈ రెండవ అంశం ముఖ్యమైంది.

రక్తంద్వారా పాపపరిహారం జరుగుతుందని యూదుల భావం. కనుకనే లేవీయకాండం "ప్రతి జంతువు ప్రాణామూ దాని నెత్తురులో వుంటుంది. ఈ ప్రాణం ద్వారా నెత్తురు పాపపరిహారం చేస్తుంది" అని చెప్తుంది - 17,11. కాని నెత్తురు ఎలా పాపపరిహారం చేస్తుంది? నెత్తురులోని ప్రాణం దేవుడిచ్చింది. భక్తుడు బలిపశువు నెత్తుటిని దేవుని పీఠంమీద పోసినపుడు దాని ప్రాణాన్ని దేవునికే అర్పించి నట్లవుతుంది. ఆ పశువు ప్రాణం ఒక విధంగా తన ప్రాణానికి చిహ్నంగా వుంటుంది. అనగా భక్తుడు బలిపశువు ప్రాణం ద్వారా తన ప్రాణాన్నీ జీవాన్నీ దేవునికి అర్పించుకొని అతనితో ఐక్యమౌతాడు అని చెప్పాలి. పూర్వవేదంలోని మూడు రకాల రక్తసహిత బలుల్లోను పశువు నెత్తుటిని పీఠం మీద పోస్తారు. ఆ నెత్తురు ద్వారా బలినర్పించే భక్తుడు పీఠానికి చిహ్నమైన దేవునితో ఐక్యమౌతాడు.

భక్తుడు బలనర్పిస్తేనే సరిపోదు. దేవుడు ఆ బలిని అంగీకరించాలి. ఈ దైవాంగీకారాన్ని తెలియజేయడం కోసమే కొన్ని రకాల బలుల్లో జంతువులను పీఠం మీద పూర్తిగా దహించేవాళ్ళు. అలా కాలిపోయిన బలిపశువు సుగంధాన్ని విరజిమ్ముతూ దేవుని సన్నిధిని చేరుతుంది అనుకొన్నారు. దేవుడు అగ్నిద్వారా ఆ బలిని స్వీకరిస్తాడు అన్నారు. అందుకే పూర్వవేదం దేవుణ్ణి "దహించే అగ్ని" అని పిలుస్తుంది - ద్వితీ 4,24. బలిగా అర్పింపబడిన జంతువు పవిత్రమవుతుంది. అది బలినర్పించే భక్తునికి గూడ తన పావిత్ర్యాన్ని అందిస్తుంది.

ఈ భావాలను బట్టి బలిలో మూడంశాలు వున్నాయనుకోవాలి. మొదటిది, పశువుని వధించడం. రెండవది దాన్ని దేవునికి బలిగా అర్పించడం. మూడవది, దేవుడు దాన్ని అంగీకరించి భక్తుణ్ణి తనతో ఐక్యంజేసికోవడం.

దేవుడు భక్తుని బలిని అంగీకరించినపుడే అతడు దేవునితో ఐక్యమయ్యేది. బలి ముఖ్యోద్దేశం భగవంతునితో ఐక్యంగావడమేనని చెప్పాం. కాని భక్తుని అంతరంగం పవిత్రంగా వుంటేనే దేవుడు అతని బలిని అంగీకరించి అతన్ని తనతో ఐక్యంజేసుకొనేది. కనుక బలిలో ఏమి అర్పించామన్నది గాదు, ఏలాంటి హృదయంతో ఆ బలి నర్పించామన్నది ముఖ్యం.

## 3. కిప్పూర్ ప్రాయశ్చిత్త బలీ - క్రీస్తు బలీ

లేవీయకాండం 16వ అధ్యాయం కిప్పూరు అనే దినాన అర్పించే ప్రాయశ్చిత్తబలిని వర్ణించింది. హెబ్రేయులు లేఖాకారుడు క్రీస్తుబలిని ఈ ప్రాయశ్చిత్తబలితో పోల్చాడు. కనుక ఈ రెండు బలులకూ గల సామ్యాన్ని పరిశీలిద్దాం.

1) కిప్పూర్ అనే ప్రాయశ్చిత్త దినాన మాత్రమే ప్రధాన యాజకుడు మందసం వున్న దేవాలయ గర్భాగారంలోకి వెళ్తాడు. ఆనాడు అతడు మొదట కోడెను వధించి తన పాపాలకూ తోడి యాజకుల పాపాలకూ పరిహారంగా బలి నర్పిస్తాడు. దాని నెత్తుటినీ సాంబ్రాణిని తీసికొని గర్భాగారంలోని మందసం వద్దకు వెళ్తాడు. మందసం మీది కరుణా ఫలకానికి సాంబ్రాణి పొగవేస్తాడు. కోడె నెత్తుటిని దాని ముందట ఏడుసార్లు చిలకరిస్తాడు - లేవీ 16,11-14. ఈ చిలకరింపు ద్వారా ప్రజల పాపాలు పరిహారమయ్యేవి.

2) తర్వాత ప్రధాన యాజకుడు ఒక మేకను తీసికొనివచ్చి దానిమీద చేతులు చాస్తాడు. ఇస్రాయేలీయుల పాపాలన్నీ ఆ మేక తలమీద మోపి దాన్ని అరణ్యంలోకి తోలతారు. అది వాళ్ళ పాపాలన్నీ మోసికొని పోతుంది. కనుక దానికి "పాపాలను మోసే మేక" అని పేరు - లేవీ 16,20-22.

3) బలిగా సమర్పించిన కోడె దేహాన్ని శిబిరం వెలుపలికి తీసికొనిపోయి అక్కడ కాల్చివేస్తారు - 16,27.

ఇకపై మూడంశాలు క్రీస్తు సిలువబలిలో ఎలా నెరవేరాయో పరిశీలిద్దాం.

1) యాజకుడు ఏడాదికి ఒకతూరి దేవాలయం గర్భాగారంలోకి వెళ్ళేవాడన్నాం. కాని క్రీస్తు యాజకుడు యెరూషలేము దేవాలయంలోకి వెళ్ళలేదు. అతడు తన దేహంలోకే తాను ప్రవేశించాడు. అతడు తన దేహంలోనే శ్రమలనుభవించి అటుపిమ్మట ఉత్థానమయ్యాడు. యెరూషలేం దేవాలయం తెర రెండుగా చినిగిపోయినప్పటి నుండి అతని దేహమే మన దేవాలయమవుతుంది. అనగా ఉత్థాన క్రీస్తే మన దేవాలయమౌతాడు. యెరూషలేం దేవళంలోని గర్భాగారంలోకి యాజకుడొక్కడే ప్రవేశిస్తే, ఈ ఉత్థాన క్రీస్తు దేహంలోకి భక్తులమైన మనమందరమూ ప్రవేశించవచ్చు - హెబ్రే 10,19-20. ఇంకా ఆ దేవళంలోని మూలస్థానంలోకి యాజకుడు ఏడాదికి ఒక్కసారి మాత్రమే వెళ్లేవాడు. కాని క్రీస్తు దేవళంలోకి మనం ఎప్పుడుబడితే అప్పుడే వెళ్ళవచ్చు. యెరూషలేం దేవళంలోని యాజకుడు కొడె నెత్తుటిని తీసికొని వెళ్ళేవాడు. క్రీస్తు ఈలా జంతువుల నెత్తుటిని గాదు. తన సొంత నెత్తుటినే తీసికొని వెళ్ళాడు. అనగా అతడు సిలువమీద తన సొంత నెత్తుటినే చిందించాడు.

యెరూషలేంలో యాజకులు ఏటేట కిప్పూర్ దినాన జంతువును బలిగా సమర్పించేవాళ్ళు. కాని క్రీస్తు ఈలా చాలాసార్లు తన్ను బలిగా అర్పించుకోడు. అతడు ఒక్కసారి మాత్రమే తన్ను తాను బలిగావించుకొన్నాడు. ఈ యేకైక బలి మనలను శాశ్వతంగా రక్షించింది - 10,10.

2) యిస్రాయేలీయుల పాపాలను ఒక మేక మోసికొని పోయింది అని చెప్పాం. అలాగే క్రీస్తు మన పాపాలను తన భుజాలమీద మోసికొనిపోయాడు. అతడు లోకం పాపాలను భరించేవాడు.

3) ప్రాయశ్చిత్త దినాన బలిగా అర్పించిన కోడె దేహాన్ని శిబిరం వెలుపల కాల్చివేసేవాళ్ళు అన్నాం. క్రీస్తుని కూడ నగరద్వారం వెలుపల వధించారు 13,12.

ఇవి కిప్పూర్ దినపు ప్రాయశ్చిత్తబలికీ క్రీస్తు సిలువ బలికీ గల పోలికలు.

## 4. మలాకీ ప్రవచనం

మలాకీ ప్రవక్త క్రీస్తు పూర్వం 450 ప్రాంతంలో ఓ ప్రవచనం చెప్పాడు. ఆనాటి లేవీయ యాజకులూ భక్తులూ ప్రభునికి అంగీకార యోగ్యంకాని బలులు అర్పిస్తున్నారు. అనగా కుంటివీ, గ్రుడ్డివీ, వ్యాధితోగూడినవీ ఐన పశువులను దేవునికి అర్పిస్తున్నారు. ఇవి హృదయశుద్ధిలేని అపవిత్ర బలులు కనుక ప్రభువు వీటిని అంగీకరించడు అన్నాడు ప్రవక్త. వాటి స్థానే నిర్మలమూ పవిత్రమూ ఐన మరో బలిని దేవునికి అర్పిస్తారు అన్నాడు. ఇదే మలాకీ ప్రవచనం. "నాకు మీరంటే ఇష్టంలేదు. మీ రర్పించే బలులును నేనంగీకరించను. సూర్యుడు ఉదయించే తావునుంబడి అతడు అస్తమించే తావుదాకాగూడ వివిధ జాతులమధ్య నా నామం ఘనత కెక్కుతుంది. ఎల్ల తావుల్లోను నా నామానికి బలి నర్పిస్తారు. అది పవిత్రమైన బలి ఔతుంది" - మలాకీ 1, 10-11.

ప్రవక్త ఆనాటి యూదుల బలులను నిరసించాడు. దేవునికి పవిత్రమైన యింకో బలి నర్పిస్తారని పేర్కొన్నాడు. ఈ బలి యేమిటి? ఇది మెస్సియా కాలానికి సంబంధించిన బలి. దీనికి మలాకీ రెండు లక్షణాలు చెప్పాడు. అవి పవిత్రతా, విశ్వవ్యాప్తతా. ఆనాటి యూదుల బలులు అపవిత్రమైనవైతే, ఇది పవిత్రమైంది. ఆ నాటి యూదుల బలిని యెరూషలేములో మాత్రమే అర్పించాలి. కాని ఈ బలిని ఎల్లతావుల్లోను అర్పిస్తారు. ఇంకా పూర్వవేద బలుల్లో యూదులు కాని అన్యజాతివాళ్ళు పాల్గొనరాదు. కాని ఈ బలి వివిధ జాతుల మధ్య అర్పింపబడుతుంది. అందరూ దీనిలో పాల్గొనవచ్చు. ప్రవక్త చెప్పిన ఈ బలి ఏదై యుండాలి? ఇది పూర్వవేద బలి కాదు, నూత్నవేద బలి. క్రీస్తు అర్పించిన సిలువబలీ, నేటి మన పూజబలీ యిదే. యూదుల బలితో పోలిస్తే పవిత్రతా, విశ్వవ్యాప్తతా దీని లక్షణాలు.

పై మలాకీ ప్రవచనంలాగే నూత్నవేద బలిని సూచించే సందర్భం పూర్వవేదంలో మరొకటుంది. అది మెల్కీసెదెక్కు ఉదంతం. ఇతడు సాలెంరాజూ యాజకుడూనూ. అబ్రాహాము శత్రువులను జయించి తిరిగి వస్తూండగా ఈ రాజు రొట్టె ద్రాక్షసారాయాలను

తీసికొనివెళ్ళి అతనికి భోజనంగా అర్పించాడు. ఈ కానుకలకుగాను అబ్రాహాము తాను తెచ్చిన కొల్లసొమ్ములో మెల్కీసెడెక్కుకు పాలు పంచియిచ్చాడు - అది 14, 18-20. మెస్సీయా పూర్వవేదపు లేవీ యాజకత్వంలో పాలు పొందదనీ, మెల్కీసెడెక్కు యాజకత్వంలో పాలు పొందుతాడనీ చెప్తుంది కీర్తన 110,4. కనుక క్రీస్తుకీ మెల్కీసెడక్కుకీ సంబంధం వుంది. ఈ యంశాన్ని ఆధారంగా తీసికొని హెబ్రేయుల లేఖాకారుడు మెల్కీసెడెక్కు బింబమనీ, క్రీస్తు అతనికి ప్రతిబింబమనీ వ్యాఖ్య చెప్పాడు - హెబ్రే 7,1-6. కాని యిక్కడ ఓ చిక్కు వుంది. క్రీస్తు మెల్కీసెడెక్కులకు యాజకత్వంలో సామ్యం వుంది. కాని బల్యర్పణంలో వీళిద్దరికీ పోలిక లేదు. క్రీస్తు కడపటి విందులో రొట్టె రసాలను దేవునికి బలిగా అర్పించాడు. మెల్కీ సెడెక్కు ఈలా బలియేమీ అర్పించలేదు. అతడు దేవునికి కాక అబ్రాహామున కిచ్చిన రొట్టె ద్రాక్షసారాయాలు కేవలం భోజన పదార్థాలు కాని బలి కాదు. ఐనా తొలి శతాబ్దాలనుండి, అనగా భక్తుడు సిప్రియన్ కాలంనుండిగూడ, పితృపాదులు పూజబలినిగూర్చి మాట్లాడేపుడెల్లా ఈ మెల్కీసెడెక్కు ఉదంతాన్ని పేర్కొంటూనే వచ్చారు.

## ప్రార్థనా భావాలు

1. రెండవ శతాబ్దపు భక్తుడు ఇరెనేయస్ బలినిగూర్చి ఈలా చెప్పాడు. "దేవునికి మన బలితో అవసరంలేదు. కాని బలి మనకు అవసరం. దాని ద్వారా దేవునికి మన ఆరాధనా కృతజ్ఞతా, ప్రేమా వ్యక్తం జేసికొంటాం. బలియొక్క విలువ బలి వస్తువునుబట్టి వుండదు. బలినర్పించేవాని హృదయాన్ని బట్టి వుంటుంది. అసలు మన బలి మన హృదయంలోని భక్తికి నిదర్శనం అంతే. కనుక నిజం చెప్పాలంటే బలి మనలను పవిత్రం చేయదు. మన హృదయంలోని భక్తే మన బలిని పవిత్రం చేస్తుంది. పూర్వవేదంలో ప్రభువు హేబెలు బలిని అంగీకరించి కయీను బలిని నిరాకరించాడని వింటున్నాం. ఎందుకు? మొదటివాని అంతరంగం పవిత్రంగాను రెండవ వాని అంతరంగం అపవిత్రంగాను వుంది కనుకనే. అందుచేత చిత్తశుద్ధిలేని బలి ఫలితమీయదు". ఈ వాక్యాలనుబట్టి కేవలం బలినర్పించడంద్వారానే దేవుని దీవెనలు పొందలేం. మరి పవిత్రమైన హృదయంతో బలినర్పిస్తే ఆ దీవెనలు పొందుతాం.

2. ఈ సందర్భంలో బలులనుగూర్చిన ప్రవక్తల బోధలను జ్ఞప్తికి తెచ్చుకోవడం గూడ మంచిది. చాలా బలులు అర్పించినంతమాత్రాన్నే దేవుడు సంతుష్టి చెందడు. మంచి అంతరంగంతో జీవిస్తూ, మంచి కార్యాలు చేస్తూ, తోడి నరులకు అన్యాయం

చేయకుండా వాళ్ళను ప్రేమభావంతో ఆదరిస్తూ అర్పించే బలిని దేవుడు స్వీకరిస్తాడు - యెష 1,11-17. ప్రభువు కోరేది తోడి నరులపట్ల కరుణా, భగవంతునిపట్ల విధేయతా. అంతేకాని వట్టి బలులుకాదు - హోషే 6,6. బలులకు బదులుగా నీతి న్యాయాలు ఓ నదిలా ప్రవహిస్తే దేవుడు సంతోషిస్తాడు - ఆమోసు 5,24. దేవుడు బలులవల్లనే సంతుష్టి చెందడు. తోడి నరులపట్ల న్యాయంతోను ప్రేమభావంతోను ప్రవర్తిస్తే, దేవునిపట్ల వినయవిధేయతలు ప్రదర్శిస్తే అప్పుడు అతడు ప్రమోదం జెందుతాడు - మికా 6, 6-8. దహన బలివల్లనే దేవుడు సంతోషించడు. అతనికి ప్రీతి కలిగించేది పశ్చాత్తాపతప్తమైన హృదయం. పశ్చాత్తాప పూరితమైన హృదయాన్ని ప్రభువు అనాదరం చేయడు - కీర్త 51, 16-17. ఈ బోధలనుబట్టి మన బల్యర్పణం వట్టి కర్మకాండా, ఆచార విడంబనమూ కాకూడదు. యోగ్యంగా బలిని అర్పించాలంటే దైవభక్తీ, సోదరప్రేమా రెండూ వుండాలి. హృదయంలో ఈ రెండు గుణాలు లేందే బలి యేమీ సాధించి పెట్టలేదు.

# 4. దివ్యసత్ప్రసాదబలి యథార్థ బలి

"మీరెల్లరు ఆదివారం ప్రోగుగండి. మీ పాపాలను ఒప్పుకొని రొట్టె విరచి భుజించండి. దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించండి. అప్పుడు మీ బలి పవిత్రమైన సమర్పణ మవుతుంది."
- డిడాకె గ్రంథం

దివ్యసత్ప్రసాదబలి యథార్థమైన బలి. అది సిలువ బలినీ అంత్యభోజన బలినీ పునశ్చరణం చేసేది. ప్రతిదినం మన పీఠాలమీద అర్పించే ఈ బలి స్వభావాన్ని మనం చక్కగా అర్థంజేసికోవాలి. ఇక్కడ ఐదంశాలను పరిశీలిద్దాం.

## 1. నూత్నవేద బోధ

క్రీస్తు సిలువబలి యథార్థమైన బలి. దాన్నే అంత్య భోజన రూపంలో నేడు పూజబలిలో పునశ్చరణం చేస్తున్నాం. ఈ బలిలో క్రీస్తు మరణమూ ఉత్థానమూ ఇమిడివున్నాయి. క్రీస్తు మనపట్లా తండ్రిపట్లా గల ప్రేమతో చనిపోయాడు. అతనికి మనపట్ల ప్రేమ వుంది. కనుకనే పౌలు "నా కొరకు తన్ను తాను అర్పించుకొన్న దేవుని కుమారుడు" అన్నాడు - గల 2,20. క్రీస్తుకి తండ్రిపట్ల గూడ ప్రేమవుంది. కనుకనే ఆ తండ్రి ఆజ్ఞకు బద్ధుడై ప్రాణాలొడ్డాడు - ఫిలి 2,5-11. ఈలాంటి క్రీస్తు మరణం మనలను రక్షించింది. కాని కేవలం మరణం వల్లనే గాక ఉత్థానం వల్లగూడ ప్రభువు మనలను రక్షించాడు. అతని బలిలో మరణోత్థానాలు రెండూ ప్రధానమే. కనుకనే పౌలు "మృతులలో నుండి లేచినవాడు, తండ్రి కుడిప్రక్కన

కూర్చుండి వున్నవాడు, మనకొరకు విజ్ఞాపనం చేసేవాడూ మన రక్షకుడు" అని చెప్పాడు - రోమా 8,34. అనగా అతని మరణోత్థానాలు రెండూ మనలను రక్షిస్తాయి. క్రీస్తు ఉత్థానం తండ్రి అతని బలిని అంగీకరించాడు అనడానికి నిదర్శనం. అతని బలి సువాసనలొలుకుతూ తండ్రికి ప్రీతి కలిగించింది - ఎఫే 5,2.

ఈ మరణోత్థానాలు అంత్యభోజన బలిలో కూడ స్పష్టంగా కన్పిస్తాయి. క్రీస్తు రొట్టెను తీసికొని "ఇది మీ కొరకు ఈయబడనున్న నా శరీరం" అన్నాడు - లూకా 22,19. ఇక్కడ "ఈయబడనున్న" అనే పదం బలిసంబంధమైంది. అలాగే అతడు పాత్రను తీసికొని "ఇది మీ కొరకు చిందించబడనున్న నూత్న నిబంధనపు నా రక్తం" అన్నాడు - 22,20. ఇక్కడ "చిందించబడనున్న" అనే పదం కూడ బలి సంబంధమైందే. అనగా క్రీస్తు శరీర రక్తాలు మనకోసం బలిగా అర్పింపబడతాయి.

ఇంకా పౌలు కొరింతీయులకు వ్రాస్తూ "మనం దీవించే పాత్రను పుచ్చుకొనేపుడెల్లా క్రీస్తు రక్తంలో పాలు పుచ్చుకొంటున్నాం గదా! మనం విరిచే ఈ రొట్టెను తినేపుడెల్లా క్రీస్తు శరీరంలో పాలు పుచ్చుకొంటున్నాం గదా?" అన్నాడు 1కొ 10,16. బలి నైవేద్యాన్ని భుజించే భక్తులు దేవునితో ఐక్యమవుతున్నారు. ఇక్కడ రొట్టెరసాలు అలాంటి నైవేద్యాలు. కనుక వీటి ద్వారా మనం దేవునితో ఐక్యమవుతాం. కనుక ఈ పదార్థాలు యథార్థ బలినే సూచిస్తాయి.

## 2. క్రీస్తు మోక్షారాధనం

ఉత్థానక్రీస్తు తండ్రిని చేరుకొని అతని కుడిపార్శ్వాన ఆసీనుడయ్యాడు. మరణోత్థానాల రూపంలో తాను సమర్పించిన బలిని తండ్రి అంగీకరించడం ద్వారా క్రీస్తు మనకు నిత్యరక్షణ కారకుడయ్యాడు - హెబ్రే 5,9. ఈలా అతడు మన నిత్యరక్షణకు కారకుడు కావడం మాత్రమే కాదు, తాను నిత్యమూ దేవుని సన్నిధిలో వసిస్తూ తన ద్వారా ఆ దేవుని చేరే విశ్వాసులందరి తరపునా దేవునికి మనవి చేస్తూంటాడు గూడ - హెబ్రే 7,25. ఈ మనవే మోక్షక్రీస్తు ఆరాధనం. ఈ యారాధనంలో క్రీస్తు తన్ను తాను తండ్రికి అర్పించుకొంటాడు. అతని యాజకత్వం మోక్షంలో గూడ కొనసాగుతుంది. అతడు మోక్షంలో మళ్ళా ఇంకో బలినర్పించడు. కాని తను ఈ లోకంలో సిలువ మీద అర్పించిన బలే మోక్షంలో కూడ ఒక విధంగా కొనసాగుతుంది. ఉత్థాన క్రీస్తు నిరంతరమూ తండ్రిని ఆరాధిస్తూ నిరంతరమూ తండ్రి సమక్షంలో తన బలిని కొనసాగిస్తూనే వుంటాడు. ఈ మోక్షారాధనం భూలోకంలో నేడు మనం అర్పించే ఆరాధనంలో ప్రత్యక్షమవుతుంది.

మనపూజ ఆ మోక్షారాధనంతో జోడింపబడుతుంది. క్రీస్తు ఈ లోకంలో శ్రీసభ అర్పించే పూజారాధనను స్వీకరించి దాన్ని తన మోక్షారాధనంతో ఐక్యం జేసికొంటాడు. కనుక మన యీ యిహలోకారాధనం అతి పవిత్రమైంది.

## 3. పూజబలి సిలువబలికి అవమానకరమా?

ప్రోటస్టెంటు సంస్కరణ నాయకులైన లూతరు, స్వింగ్లీ, మెలంక్తోను మొదలైనవాళ్ళు పూజబలి యథార్థమైన బలి కాదన్నారు. అది కేవలం సిలువబలిని జ్ఞప్తికి తెచ్చే తంతు మాత్రమే నన్నారు. దానివల్ల పాపపరిహారం జరగదని వాదించారు. అది కేవలం మనుష్యులు తలపెట్టిందే గాని దేవుడు కోరింది కాదని వాకొన్నారు. వాళ్ళు ఈ పూజను నిరాకరించడానికి ముఖ్య కారణం ఇది. హెబ్రేయులు జాబు మాటిమాటికీ క్రీస్తు ఒకే ఒక్కసారి ఏకైక బలిని అర్పించాడని నుడువుతుంది - 7,27. అలాంటప్పుడు మనం మళ్ళా పూజబలులు అర్పించడం దేనికి? మనం ఈలా మళ్ళామళ్ళా పూజబలులు అర్పిస్తున్నామంటే ఆ క్రీస్తు బలి నిష్ప్రయోజన మైనట్లే గదా? కనుక మన బలులు ఆ సిలువ బలికి అవమానకరం. అసలు మన పూజబలి బలే కాదు.

ట్రెంటు మహాసభ ప్రోటస్టెంటు నాయకుల వాదనను ఖండించి పూజబలి యథార్థమైన బలేనని బోధించింది. హెబ్రేయుల లేఖ నుడివినట్లు క్రీస్తు ఒకే ఒక్కసారి బలినర్పించిన మాట నిజమే. కాని ఆ యేకైక బలిని మనం పూజలో మళ్ళామళ్ళా నూత్నీకరించుకోవడంలో బాధ యేమీ లేదు. దీన్ని నా జ్ఞాపకార్థం చేయమన్న ప్రభువు కూడ మనం ఆ కల్వరి బలిని తేపతేపకు నూత్నీకరించుకోవాలనే కోరాడు. పైగా మన పూజబలి ఆ కల్వరి బలికంటె భిన్నమైంది కాదు. మనం పూజబలిలో ఏదో క్రొత్తబలి నర్పిస్తే అప్పుడు కల్వరిబలికి అవమానం కలిగించినట్లు. మరి ఆ కల్వరి బలినే నూత్నీకరించుకొంటే ఈలాంటి చిక్కేమీ లేదు. పూజబలిలోనూ కల్వరి బలిలోనూ యాజకుడూ బలిపశువూ ఒక్కడే - క్రీస్తు. కనుక ఆ బలీ ఈ బలీ ఒక్కటే. పూజలో కల్వరి బలిని మళ్ళా జ్ఞప్తికి తెచ్చుకొంటాం. ఆ బలి ఈ బలిలో ప్రత్యక్షమవుతుంది. ఆ బలి ఫలితాలను ఈ బలిలో పొందుతాం. కనుక పూజబలి బలి కాదు, దాన్నసలు సమర్పించనేకూడదు అన్న ప్రోటస్టెంటు వాదం చెల్లదు.

## 4. పూజబలి సిలువబలిమీద ఆధారపడుతుంది

16వ శతాబ్దంలో ప్రోటస్టెంటు నాయకులు పూజబలి అసలు పనికిరాదు అని వాదిస్తుంటే, క్యాతలిక్ నాయకులు పూజబలి దానంతట అదే సరిపోతుంది అన్నట్లుగా

మాట్లాడారు. ఇప్పుడు కూడ కొందరు క్యాతలిక్కులు పూజబలిని సిలువబలితో జోడించరు. దాన్ని ఓ స్వతంత్ర బలిగా ఎంచుతారు. దానంతట అది సరిపోతుంది అనుకొంటారు. కాని ఇది పొరపాటు. పూజబలి దానంతట అది నిలవదు. అది సిలువబలిని మన మధ్యలో సాక్షాత్కారం చేసేది కనుక దాని విలువ సిలువను బట్టే వచ్చింది. కనుక పూజబలి కల్వరి బలిమీద ఆధారపడేది.

కల్వరిబలి ఏకైక బలి. ఐనా దాన్ని నేడు సంస్కార (దేవ ద్రవ్యానుమాన) రూపంలో మన మధ్య నూత్నీకరించుకోవచ్చు. కల్వరిబలి నేడు రెండు రూపాల్లో కొనసాగుతూంటుంది. మోక్షంలో క్రీస్తు తండ్రి యెదుట చేసే మనవి రూపంలో కొనసాగుతుంది - హెబ్రే 7,25. భూలోకంలో పూజరూపంలో కొనసాగుతుంది.

ఈలా చూస్తే పూజకు విలువుంది. కాని ఆ విలువ స్వయంసిద్ధమైంది కాదు. కల్వరిబలి నుండి వచ్చింది. సిలువ బలి నదీజన్మస్థలం లాంటిది. పూజబలి నది లాంటిది. జన్మస్థలంలో నుండి నీరు ఊరి నదిలోకి ప్రవహిస్తుంది. అలాగే కల్వరి బలిలోనుండి క్రీస్తు ఆర్జించిన వర ప్రసాదాలు పూజలోకి ప్రవహిస్తాయి. నది జన్మస్థలంమీద ఆధారపడినట్లే పూజ సిలువబలిమీద ఆధారపడుతుంది. కాని నదే జన్మస్థలం అని చెప్పకూడదు.

## 5. పూజ - ఆత్మార్పణం

బలిలో ముఖ్యమైన భావం ఆత్మార్పణం. దేవుడికి కావలసింది మన బలిదానంకాదు. మనమే. ఎప్పుడుకూడ మన మర్పించే కానుక మనకు చిహ్నం. కనుక మన మర్పించే కానుకతోపాటు మనలను మనమే దేవునికి అర్పించుకోవాలి. ఆ బాహ్యార్పణంతోపాటు ఈ యాంతరంగిక అర్పణంకూడ వుండాలి. లేకపోతే బలికి విలువలేదు. కనుక పూజలో క్రైస్తవ భక్తుడు తన్ను తాను దేవునికి కానుక చేసికోవాలి. క్రీస్తు అలా ఆత్మార్పణం చేసికొన్నాడు. పుట్టువునుండి కూడ అతని జీవితమంతా దేవునికి అర్పణమే. ఆ యర్పణంలో తుదిమెట్టు సిలువబలి. పుట్టినదాదిగా అతడు "దేవా! నీ చిత్తం నెరవేర్చడానికే నేను వచ్చాను" అని చెప్తూవచ్చాడు - హెబ్రే 10,9. ఈ క్రీస్తు మన ఆత్మార్పణకు ఆదర్శం.

మన శరీరాలను సజీవయాగంగా దేవునికి అర్పించుకోవాలి అన్నాడు పౌలు - రోమా 12,1. యెరూషలేములో పశువులను యాగంగా సమర్పించారు. కాని అలా సమర్పించినపుడు ఆ పశువులు చనిపోయేవి. నూత్నవేదంలో మనలను మనం యాగంగా అర్పించుకొంటాం. కాని ఈ యాగంలో మనం చనిపోం, బ్రతికే వుంటాం. కనుక మనది సజీవయాగం. ప్రతిదిన పూజలో క్రీస్తుతో ఐక్యమై మనలను మనం తండ్రికి అర్పించుకొన్నపుడు ఈ సజీవయాగం నెరవేరుతుంది.

"మన జీవితం క్రీస్తుద్వారా దేవునియందు ఇమిడి వుంది" అన్నాడు పౌలు - కొలో 3,3. నరుని కేంద్రం అతనిలో లేదు, దేవునిలో వుంది. దేవునిలో నెలకొనివుండడం అతనికి పరమావధి. పూజలో ఆత్మార్పణం చేసికోవడం ద్వారా క్రీస్తులోను అతని తండ్రిలోను నెలకొంది.

## ప్రార్థనాంశాలు

1. క్రీస్తు ఒకే ఒక్కసారి ఏకైక బలిని అర్పించాడు. ఈ భావాన్నే హెబ్రేయుల జాబు మూడుసార్లు పునరుద్ఘాటించింది - 7,27. 9,12. 10,10. కనుక అతడు మళ్లామళ్లా క్రొత్తబలిని అర్పించడు. అతని యేకైకబలి నరులందరినీ శాశ్వతంగా రక్షించింది. అలాంటప్పుడు మన పూజబలి యెందుకా అని అనుమానం కలుగుతుంది. కాని పూజబలికూడ అవసరమే. ఏకైక బలియైన కల్వరిబలి ఫలితాన్ని మనం పొందాలి అంటే ఈ పూజబలి అత్యవసరం. దాని వరప్రసాద జలాలు దీనిద్వారాగాని మన హృదయాల్లోకి ప్రవహించవు. అందువల్ల మనం ప్రోటస్టెంటు నాయకుల్లాగ పూజబలి అనవసరం అని చెప్పకూడదు. అత్యవసరం అని చెప్పాలి. పూజబలి కల్వరిబలిని అవమానిస్తుంది అనకూడదు. దాన్ని సంస్కార రూపంలో మనమధ్య కొనసాగిస్తుంది అనాలి.

2. "పూజబలిలో క్రీస్తుని భుజిస్తాం. మన హృదయం వరప్రసాదంతో నిండిపోతుంది. ఈ దివ్యసత్ప్రసాద స్వీకారం భవిష్యత్తులో మనం పొందబోయే మోక్షభాగ్యానికి సంచకరువుగా గూడ వుంటుంది" అని చెప్తుంది ఓ ప్రాచీన క్రైస్తవ గీతం. పూజబలిలో యోగ్యంగా పాల్గొన్నందువల్ల పై మూడు లాభాలు సిద్ధిస్తాయి.

3. పూజఫలితం మన రోజువారి జీవితంలో కన్పించాలి. పూజలో పాల్గొన్న భక్తుడు రోజువారి జీవితంలో క్రీస్తుకి సాక్ష్యంగా వుండాలి. అతడు మంచి జీవితం జీవించాలి. అనగా క్రీస్తు బోధలను తన జీవితంలో పాటించాలి. ఈ నిష్ఠద్వారా అతడు ఇతరులకుగూడ ప్రేరణగా వుండాలి. అతడు కొండమీది నగరంలాగ, దీపస్తంభం మీది దీపంలాగ, భోజనంలోని ఉప్పులాగ వుండాలి - మత్త 5,13-16. ఈలా క్రీస్తుకి సాక్ష్యంగావుండే శక్తిని ప్రభువు ఆత్మే మనకు ప్రసాదిస్తుంది.

# 5. శ్రీసభ సమర్పణం

"శిరసైన క్రీస్తు దేహం శ్రీసభ. కనుక క్రీస్తుద్వారా శ్రీసభకూడ తన్ను తాను అర్పించుకొంటుంది". - అగస్టీను భక్తుడు

క్రీస్తు సిలువబలి నేడు శ్రీసభలో సాక్షాత్కరిస్తుంది. ఈ బలిలో శ్రీసభ క్రీస్తుతోపాటు తన్నుతాను తండ్రికి అర్పించుకొంటుంది. కనుక మనం పూజబలిలో శ్రీసభపాత్ర యేమిటో చక్కగా అర్థంచేసికోవాలి. ఇక్కడ ఆరంశాలు విచారిద్దాం.

## 1. సామూహిక ఆరాధనం

పూర్వవేదంలో మొదట గృహస్థులే బలినర్పించేవాళ్లు. పాస్క బలిని కుటుంబంలోని తండ్రి సమర్పించేవాడు. యిస్రాయేలీయులంతా ఈ బలినర్పించాలి - నిర్గ 12, 47. కనుక ఈ బలిలో సామూహిక గుణముండేది. యూదులు దేవుని సన్నిధిలో పండ్రెండు రొట్టెలు పెట్టేవాళ్ళు. ఈ పండ్రెండు రొట్టెలు పండ్రెండు తెగల యిస్రాయేలీయులను సూచించేవి. ఈ రొట్టెలనుచూచి దేవుడు పండ్రెండు గోత్రాలను స్మరించుకొనేవాడు. కనుక ఇక్కడకూడ సామూహిక లక్షణం వుంది.

కాలక్రమేణ యూదమతంలో యాజకుల ప్రాబల్యం పెరిగిపోయింది. గృహస్థులకు మారుగా యాజకులు బలినర్పించడం మొదలెట్టారు. కాని ఈ దశలోకూడ బలిపశువును వధించేది గృహస్థులే. యాజకులు దాని నెత్తుటిని మాత్రం పీఠంమీద చిలకరించేవాళ్ళు. ప్రజలు స్వయంగా బలినర్పించక పోయినా యాజకులు తామర్పించే బలిని ప్రజలకోసం అర్పించేవాళ్ళు.

బాబిలోను ప్రవాసానంతరం ప్రాయశ్చిత్తబలి బాగా ప్రచారంలోకి వచ్చింది. ప్రజలు పాపులు అనే భావం బాగా బలపడిపోయింది. ప్రజల పాపం దేవుణ్ణి మాత్రమే గాక సమాజాన్నికూడ బాధిస్తుంది అనుకొన్నారు. కనుక సమాజం పాపాల పరిహారంకోసం ప్రాయశ్చిత్త బలిని అర్పించాలనుకొన్నారు.

ఈ విధంగా యిస్రాయేలు ఆరాధనం ప్రతి దశలోను వ్యక్తిగతమైందిగాగాక సామూహికమైందిగా ప్రచారంలోకి వచ్చింది. ఆ ప్రజలు మొదటినుండీ ఒక సమాజంగా ఉద్భవించారు. దేవుడు ఆ జాతినంతటినీ ఎన్నుకొన్నాడు. కనుక వాళ్ల బలీ ఆరాధనమూగూడ మొదటినుండీ సామాజికమైందే.

ఇక నూత్నవేద ఆరాధనం గూడ సామాజికమైందే క్రీస్తు యాజకుడు. ఆ క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందిన క్రైస్తవ ప్రజలంతా అతని యాజకత్వంలో పాలు

పొందుతారు. "శ్రేష్ఠులైన యాజకులు, పరిశుద్ధజనం, దేవుని సొత్తయిన ప్రజలు" ఔతారు – 1పేత్రు 2,9. అలా యాజకులై బలినర్పిస్తారు. కనుక నూత్నవేద ఆరాధనం కూడ వ్యక్తిగతమైంది కాదు. శ్రీసభ అంతా కలసి అర్పించేది.

## 2. సొంతపూజ చెల్లుతుందా ?

ప్రోటస్టెంటు సంస్కరణ నాయకులు క్రీస్తు యాజకత్వం ఒక్కటే యాజకత్వం అన్నారు. క్రైస్తవులు క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినపుడు ఆ ప్రధానగురువు యాజకత్వంలో పాలుపొంది తామూ యాజకులౌతారు. ప్రత్యేకంగా గురువుల యాజకత్వమంటూ లేదు. కనుక గురువుల యాజకత్వానికీ, గృహస్థుల యాజకత్వానికీ తేడా లేదు. అసలు నూత్నవేదం గురువుల యాజకత్వాన్ని ఎక్కడా పేర్కొనదు. అది పేర్కొనేది జ్ఞానస్నానం పొందిన ప్రజలందరి సామాన్య యాజకత్వం మాత్రమే. అందుచేత గురువూ గృహస్థులూ అంతా కలసి ఒకే బలిని సమర్పించాలి. కనుక గృహస్థులు లేకుండా గురువు సొంతంగా చేసుకొనే పూజ చెల్లదు.

ట్రెంటు మహాసభ ఈ వాదాన్ని ఖండించి ఈలా బోధించింది. నూత్నవేదం ప్రత్యేకంగా చెప్పకపోయినా గురువు విశిష్ట యాజకత్వమనేది వుంది. అది ప్రజల సామాన్య యాజకత్వంకంటె భిన్నమైనది. కనుక గృహస్థులు లేకుండా గురువు చేసిన పూజ చెల్లుతుంది. అసలు గురువు సొంతపూజ అనేది లేనేలేదు. ప్రతిపూజ – గృహస్థులు హాజరైన కాకపోయినా – సామూహికమైందే. ఇందుకు రెండు కారణాలున్నాయి. మొదటిది, గురువు శ్రీసభ అంతటి తరపున పూజనర్పిస్తాడు. అతని ఆరాధనం క్రైస్తవ సమాజానికి కంతటికీ ఫలితమిస్తుంది. రెండవది, అతడు వ్యక్తిగతమైన హోదాలో కాక శ్రీసభ ప్రతినిధిగా బలినర్పిస్తాడు. కనుక అతడు ప్రజల ప్రతినిధియై ప్రజల తరపున బలినర్పిస్తాడు. కనుక గురువు సొంతపూజ అనేది లేనేలేదు. ఆ పూజకు ప్రజలు హాజరైతే మరీ మంచిదే. కాని వాళ్ళు అలా హాజరు కాకపోయినా పూజేమో చెల్లుతుంది.

## 3. గృహస్థుల సమర్పణం

పూజలో క్రీస్తు తన్నుతాను పరలోకపిత కర్పించుకొంటాడు. తనతోపాటు తన ఆధ్యాత్మిక పత్నియైన శ్రీసభను కూడ తండ్రి కర్పిస్తాడు. మరోలా చెప్పాలంటే పూజలో శ్రీసభ క్రీస్తుతో పాటు తన్నుతాను పితకు అర్పించుకొంటుంది. ఇక యీ శ్రీసభలో గురువు గృహస్థులు అని రెండు వర్గాలవాళ్ళున్నారు. పూజలో గురువు క్రీస్తు ప్రతినిధిగా నిల్చి బలినర్పిస్తాడు. మరి గృహస్థుల సంగతి యేమిటి? వాళ్ళు కూడ పూజ బలినర్పిస్తారా? అప్పుడు వాళ్ళ అర్పణానికీ గురువు అర్పణానికీ వ్యత్యాస మేమిటి?

ట్రెంటు మహాసభ బోధించినట్లు మనకు రెండు రకాల యాజకత్వముంది. మొదటిది క్రీస్తు యాజకునిలోనికి జ్ఞానస్నానం పొందినవాళ్ళంతా అతని యాజకత్వంలో పాలు పొందుతారు. ఇది సామాన్య యాజకత్వం. జ్ఞానస్నానం అనే సంస్కారం ద్వారా సిద్ధించేది. ఇదికాక గురువులు పొందే విశిష్ట యాజకత్వం కూడ వుంది. ఇది గురుపట్టం అనే సంస్కారం ద్వారా సిద్ధిస్తుంది. జ్ఞానస్నానపు యాజకత్వం వల్ల గృహస్థులు కూడ పూజబలినర్పిస్తారు. కాని వాళ్ళ అర్పణకీ గురువు అర్పణకీ తేడా వుంది. ఆ తేడా యిది.

నడిపూజలో అప్పరసాలను ఆశీర్వదించి వాటిని క్రీస్తు శరీరరక్తాలనుగా మారుస్తాం. ఈ కార్యం గృహస్థులు చేయరు. విశిష్ట యాజకత్వం గల గురువులు మాత్రమే చేస్తారు. ఇది గురువుల అర్పణం.

మరి గృహస్థులు సమర్పణం ఏమిటి? గురువు శ్రీసభ సభ్యులందరి తరపునా పూజనర్పిస్తాడు. గృహస్థులు కూడ అతనితో ఐక్యమై తండ్రికి పూజనర్పిస్తారు. ఇంకా వాళ్ళు తమ హృదయంలోని భక్తిభావాల ద్వారా కూడ పూజబలి నర్పిస్తారు. అనగా వాళ్ళు తమ హృదయంలోని స్తుతి ఆరాధన, కృతజ్ఞత, పశ్చాత్తాపం మొదలైన భక్తిభావాలను గురువు భక్తిభావాలతో ఐక్యం జేసి అతనితోపాటు తామూ పూజనర్పిస్తారు. వాళ్ళ జ్ఞానస్నానపు యాజకత్వమే ఈ సమర్పణకు పునాది. గృహస్థులు లేకపోయినా గురువు సమర్పణం చెల్లుతుంది. అతనితో ఐక్యమై, అతనితో పాటు అర్పించినపుడు మాత్రమే గృహస్థుల సమర్పణం చెల్లుతుంది.

## 4. స్థానిక శ్రీసభ ఆరాధనం

స్థానిక శ్రీసభ అంటే ఓ ప్రత్యేక మేత్రాసనమూ దాని పీఠాధిపతీ దానిలోని గురువులూ విశ్వాసులూనూ. పూజబలి శ్రీసభ కంతటికీ సంబంధించినది మాత్రమే కాదు. స్థానిక శ్రీసభకు సంబంధించింది కూడ. ఇటీవల ఈ స్థానిక శ్రీసభ పూజబలి ప్రాముఖ్యం బాగా ప్రచారంలోకి వచ్చింది. ఈ స్థానిక శ్రీసభలో పీఠాధిపతి ప్రధానమైన ఆరాధనా నిర్వహణుడు. అనగా అతడు స్థానికంగా ప్రధానయాజకుడు. స్థానిక పీఠంలోని విశ్వాసుల ఆధ్యాత్మిక జీవితం ఒక విధంగా అతనిమీద ఆధారపడి వుంటుంది. ఈ పీఠాధిపతి తన గురువులతో కలసి పూజబలి సమర్పించడం ద్వారా, స్థానిక విశ్వాసులు ఆ బలిలో పాల్గొనడం ద్వారా, స్థానిక శ్రీసభ వృద్ధిలోకి వస్తుంది. మేత్రాసనంలోని విచారణలన్నీ మేత్రాసన కేంద్రంతో ముడిపడి వుంటాయి. కనుక ఆయా విచారణల్లో గురువులర్పించే పూజలు పీఠాధిపతి తన గురువులందరితో కలసి చేసే సంయుక్త పూజతో సంబంధం కలిగి వుంటాయి. ఒక్కో మేత్రాసనంలోని పలువిచారణల్లో వసించే క్రైస్తవులు అవకాశం

కలిగినపుడెల్లా తమ పీఠాధిపతి తమ గురువులందరితో కలసి సమర్పించే సంయుక్తపూజలో పాల్గొని విశేష లాభం పొందుతూండాలి.

## 5. స్థానిక శ్రీసభ, విశ్వశ్రీసభ

మనం స్థానిక శ్రీసభలో పూజను సమర్పించినా ఆ పూజ ఓ విధంగా విశ్వశ్రీసభకు చెందిందవుతుంది. ప్రతిపూజనీ శ్రీసభ అంతా సమర్పించినట్లవుతుంది. ఎందుకంటే పూర్తి శ్రీసభ స్థానిక శ్రీసభలో ఇమిడివుంటుంది. కనుక స్థానికపూజ విశ్వశ్రీసభ పూజ అవుతుంది. ఇంకా గురువు శ్రీసభ కంతటికీ ప్రతినిధిగా వుంటాడు. కనుక అతని పూజ శ్రీసభ కంతటికీ సంబంధించింది అవుతుంది. అంటే మనం చేసే ప్రతి పూజలోను పరోక్షంగా శ్రీసభ అంతా పాల్గొంటుంది అని చెప్పాలి.

కాని శ్రీసభకు చెందని క్రైస్తవేతరుల సంగతి యేమిటి? వాళ్ళకు జ్ఞానస్నానం లేదు. కనుక వాళ్లు క్రీస్తులోకి ఐక్యంగారు. అందుచేత వాళ్లు పూజబలిని అర్పించలేరు. కాని మనం వాళ్ళకొరకు పూజబలి నర్పించవచ్చు. పౌలు మనం మనుష్యలందరికొరకు ప్రార్థన లర్పించాలి అన్నాడు - 1తి మొ 2,1. ప్రార్థనలర్పించిన వాళ్ళకొరకు బలులుకూడ అర్పించవచ్చు. కావున క్రైస్తవేతరుల కొరకు పూజనర్పించవచ్చు.

ఇక ప్రోటస్టెంటుల సంగతేమిటి? మన గురువులు వాళ్ళ గురువులతో కలసి బలినర్పించవచ్చా? ప్రోటస్టెంటు శాఖీయుల్లో అపోస్తలుల నుండి వరుసక్రమంలో యాజకత్వం పొందుతూ వచ్చినవాళ్ళున్నారు. అలా పొందనివాళ్ళు కూడ వున్నారు. మన గురువులు మొదటివర్గం వాళ్ళతో కలసి పూజబలి నర్పించవచ్చు.

## 6. సంయుక్త పూజ

చాలమంది గురువులు కలసి చేసే పూజబలి సంయుక్త పూజబలి. వీళ్ళల్లో ఒక్క గురువు ముఖ్య గురువుగా వుంటాడు. అతనికి పూజలో ప్రముఖస్థానం వుంటుంది. రెండవశతాబ్దం నుండే ఈలాంటి బలి శ్రీసభలో వాడుకలోవున్నట్లు తెలుస్తుంది. కాని తొలిరోజుల్లో ముఖ్య గురువు ఒక్కడు మాత్రమే నడిపూజలో అప్పరసాలను ఆశీర్వదించే వాక్యాలను పెద్దగా ఉచ్చరించేవాడు. తతిమ్మా గురువులు మౌనంగా వుండేవాళ్ళు. 7వ శతాబ్దం నుండి సంయుక్త పూజను చేసే గురువులందరూ ఈ వాక్యాలను పెద్దగా ఉచ్చరించడం ప్రారంభించారు. నేడు గురువులందరూ ఈ వాక్యాలను పెద్దగా ఉచ్చరించటం విధి.

ఈ పూజవల్ల మూడు లాభాలున్నాయి. 1. గురువులెందరైనా పూజ ఒక్కటేననే భావం కలుగుతుంది. 2. గురుత్వం ఒక్కటేనని ఆవొక్క సంస్కారంలో చాలమంది గురువులు

పాల్గొంటారనీ విదితమవుతుంది. 3. పీఠాధిపతి తన గురువులతోను, విశ్వాసులతోను కలసి పూజచేస్తే స్థానిక శ్రీసభ ఐక్యతకూడ వెల్లడి ఔతుంది. కనుక ఐక్యతాభావం ఈ సంయుక్తపూజ ప్రధాన ఫలితం.

సంయుక్తపూజ ఒకేపూజా లేక ఎందరు గురువులు పాల్గొంటే అన్ని పూజలౌతుందా? పూర్వం ఎందరు గురువులు పాల్గొన్నారో అన్ని పూజలనుకొన్నారు. కాని ఎందరు గురువులు పాల్గొన్నా అది ఒకేపూజ అనే భావం నేడు ప్రచారంలో వుంది. ఐనా ఈ ప్రశ్నకు ఇంతవరకు తృప్తికరమైన జవాబులేదు. వేదశాస్త్రులలో గూడ ఏకాభిప్రాయం లేదు. సంయుక్తపూజ ఒక్కటే ఐతే ఆ పూజలో పాల్గొనే గురువులందరూ పూజరుసుం తీసుకోవచ్చా అన్నది సమాధానం దొరకని మరో ప్రశ్న. ఈలాంటి సందేహాలు కొన్ని వున్నా ఈ సంయుక్తపూజ జరుపదగిందే. చాలమంది గురువులు కలసి చేసే పూజలో ఎక్కువ భక్తిభావం వుంటుంది. విశ్వాసులు కూడ దీనివల్ల విశేష లాభం పొందవచ్చు.

## ప్రార్థనాభావాలు

1. గురువులతో కలసి పూజబలి నర్పించడం గృహస్థుల హక్కు. ఈ హక్కు వాళ్ళకు జ్ఞానస్నానం ద్వారానే లభిస్తుంది. యాజకుడైన క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినపుడు వాళ్ళు "ఎన్నుకోబడిన జనమూ పరిశుద్ధ ప్రజలూ శ్రేష్ఠులైన యాజకులూ" ఔతారు - 1పేత్రు 2,9. ఈ హక్కుతోనే వాళ్లు పూజబలిలో పాల్గొంటారు, గురువుతో పాటు పూజబలి నర్పిస్తారు.

2. అగస్టీను భక్తుడు ఈలా చెప్పాడు. "మన యాజకుడైన క్రీస్తు పీఠం మీద తన్ను తాను ఆత్మార్పణం చేసికొంటాడు. అతడు శిరస్సు. మనం అవయవాలం. కనుక ఆ శిరస్సుతో పాటు అవయవాలమై మనం కూడ తండ్రికి ఆత్మార్పణం చేసికోవాలి". కనుక ఆ ప్రధాన యాజకునితో పాటు అతని ఆధ్యాత్మిక శరీరమైన మనంకూడ దేవునికి నివేదితులం కావాలి.

3. సమర్పణ సమయంలో గురువు "సోదరులారా! మనం అర్పించే యీ బలి సర్వశక్తి గల సర్వేశ్వరునికి ప్రియపడేలాగ ప్రార్థించండి" అంటాడు. కనుక పూజ గురువు సమర్పించేది మాత్రమే కాదు. విశ్వాసులు సమర్పించేది కూడ. గృహస్థులకు ఇది మన పూజ అన్న భావం కలగాలి. ఆ పూజలో వాళ్ళు తమ కోరికలనూ అవసరాలనూ ఆందోళనలనూ శ్రమలనూ క్రీస్తుద్వారా తండ్రికి అర్పించుకోవాలి. వేదనలతో కూడిన ప్రతిదిన జీవితాన్ని పునీతం జేసికొనే మార్గం ఇది.

4. జ్ఞానస్నానం పొందిన ప్రజలను "దేవునికి అంగీకార యోగ్యమూ ఆధ్యాత్మికమూ ఐన బలులర్పించే పరిశుద్ధ యాజకులు" అని పేర్కొంటుంది మొదటి పేత్రు జాబు 2,5. పూర్వం యెరూషలేం దేవళంలో పశుబలులర్పించారు. అవి భౌతికమైనవి. వాటితో బోలిస్తే నూత్నవేదబలి ఆధ్యాత్మికమైంది. పూర్వవేదబలులు దేవునికి ఎంతవరకు ప్రియవడ్డాయో మనకు తెలియదు. కాని ఈ నూత్నవేద బలిలో క్రీస్తునే అర్పిస్తాం గనుక ఇది తండ్రికి అంగీకార యోగ్యమైన బలి. ఈలాంటి పూజబలిలో గృహస్థులు ఉత్సాహంతోను భక్తిభావంతోను పాల్గొనాలి.

5. నూత్న దేవాలయాన్ని ఆశీర్వదించేపుడు దానిలోని పీఠానికి ప్రతిష్ఠ చేసే ప్రార్థనం ఒకటుంది. "ఈ పీఠం మీద నిర్మలత్వం పెంపుజెందుగాక. గర్వం బలి యీయబడును గాక. కోపం సంహరింపబడును గాక. కామమూ దురాశా మట్టుపెట్టబడును గాక. దీనిమీద పావురాళ్ళు గాక పవిత్రతా బ్రహ్మచర్యమూ బలిగావింపబడును గాక". మనం పూజబలి నర్పించే పీఠానికి ఇంత పావిత్ర్యమూ వుంది. క్రీస్తు బలిని బట్టే దానికి ఈ పావిత్ర్యం సిద్ధించింది.

# 6. పూజబలి ఫలితాలు

"మన పాపాలకోసం చనిపోయిన క్రీస్తునే మనం పూజబలిలో అర్పిస్తాం. అలా అర్పింపబడిన క్రీస్తుని చూచి దేవుడు మన పాపాలను క్షమిస్తాడు".

– సిరిల్ భక్తుడు

పూజబలి ఉద్దేశాలు నాల్గున్నాయి. అనగా పూజను అర్పించడం వల్ల మనం నాల్గు ఫలితాలను సాధిస్తాం. మన తరపున మనం భక్తిభావంతో పూజను అర్పించి ఈ ఫలితాలన్నిటినీ పొందుతూండాలి. ఈ యధ్యాయంలో మూడంశాలు విచారిద్దాం.

## 1. నాల్గు ఫలితాలు

పూజను నాల్గు ఉద్దేశాలకోసం అర్పిస్తాం. మొదటిది దేవుణ్ణి ఆరాధించి స్తుతించటం కోసం. పూర్వం యూదులు ప్రభువు తమ్ము ఐగుప్తు దాస్యంనుండి విడిపించినందుకు అతన్ని కొండాడారు. పాస్కోత్సవం చేసికొన్నారు. ఆ వుత్సవంలో అతన్ని స్తుతించి కీర్తించారు. అలాగే నూత్నవేదంలో మనం మరో దాస్యవిముక్తిని స్మరించుకొని క్రీస్తుని స్తుతిస్తాం. ఈ ప్రభువు పిశాచ దాస్యం నుండి మనలను విడిపించాడు. కనుక పూజబలిలో అతన్ని ఆరాధించి కీర్తిస్తాం.

రెండవది కృతజ్ఞత తెల్పుకోవడం. పూర్వవేదంలో యావే చేకూర్చిపెట్టిన దాస్యవిముక్తికి యిస్రాయేలీయులు అతనికి వందనాలర్పించారు. నూత్నవేదంలో పాపవిముక్తికి మనం క్రీస్తుకి నమస్కారాలు చెప్తాం. ఆరాధనకీ కృతజ్ఞతకీ తేడా వుంది. ఆరాధనంలో ఆ ప్రభువు కోసమే అతన్ని స్తుతిస్తాం. పాస్క పండుగ సమయంలో హీబ్రూ ప్రజలు బెరకా అనే స్తుతి ప్రార్ధనం చేసేవాళ్ళని చెప్పాం. ఆ ప్రార్ధనంలో ఆరాధనమూ కృతజ్ఞతా ప్రధానాంశాలు. నూత్నవేదంలో దివ్యసత్ప్రసాదానికి ప్రత్యేకంగా “కృతజ్ఞతాస్తుతి” అనే పేరుందని గుర్తుంచుకోవాలి.

మూడవ ఉద్దేశం పాపపరిహారం పొందడం. పూర్వవేదంలో యూదులు కిప్పూర్ అనే ప్రాయశ్చిత్త దినాన పాపపరిహారబలిని సమర్పించేవాళ్ళని చెప్పాం. దాని ఫలితంగా ప్రభువు ఆ ప్రజల పాపాలను క్షమించాడు. నూత్నవేదంలో మనం కూడ పూజబలి మూలంగా క్రీస్తునుండి పాపపరిహారం పొందుతాం. మరోలా చెప్పాలంటే మనమర్పించే క్రీస్తుని చూచి తండ్రి మన పాపాలను క్షమిస్తాడు. నూత్నవేదం చాల తావుల్లో ఆ క్రీస్తు మనకు పాపపరిహారమని చెప్తుంది.

పూర్వవేదంలో మందసంమీది బంగారు పలకకు కరుణాఫలకం అని పేరు. ఈ ఫలకం మీద రెండు దేవదూతల బొమ్మలుండేవి. ఈ బొమ్మల మధ్యగల ఖాళీస్థలంలో దేవుని సాన్నిధ్యముండేది. దీన్నే యూదులు షెకీనా అని పిల్చారు. ఇక కిప్పూరు ప్రాయశ్చిత్త దినాన ప్రధాన యాజకుడు గర్భాగారంలోకి వెళ్ళి ఈ కరుణా ఫలకం మీద పశువుల నెత్తురు చిలకరించేవాడు. దానివల్ల పాపపరిహారం జరిగింది – లేవీ 16,14. నూత్నవేదం రెండుతావుల్లో క్రీస్తు మన కరుణాఫలకం అని చెప్తుంది – 1యోహా 4,10. రోమా 3,27. అనగా అతడు మన పాపాలను తొలగించేవాడని భావం.

నాల్గవ ఉద్దేశం మనకు కావలసిన పరప్రసాదాలను అడుగుకోవడం. పూర్వవేదంలో ప్రజలు పాపపరిహారబలి నర్పించినందున ప్రభువు ప్రసన్నుడయ్యేవాడు. అప్పుడు వాళ్లు ఆ ప్రభువు నుండి తమకు కావలసిన వరాలను అడుగుకొనేవాళ్లు. ఆ ప్రభువు పూర్వం పితరులకు చేసిన వాగ్దానాలను అతని గుర్తుకి తెచ్చేవాళ్ళు. అతడు అబ్రాహాము ఈసాకు మొదలైన పితరులకు మాట యిచ్చినట్లే తమ్ము కాచికాపాడాలని మనవి చేసికొనేవాళ్లు. ఈలాగే మనంకూడ నూత్నవేదపు పూజబలిలో క్రీస్తునుండి వరాలు అడుగుకొంటాం. అతడు మన అక్కరలను తీర్చాలని వేడుకొంటాం.

## 2. పూజవల్ల పాపపరిహారం పొందుతామా?

ప్రోటస్టెంటు సంస్కరణ నాయకులు ఆరాధన, కృతజ్ఞత, మనవి అనే వుద్దేశాలతో పూజబలి నర్పించవచ్చునని అంగీకరించారు. కాని పూజద్వారా పాపపరిహారాన్ని

పొందుతాం అనే అంశాన్ని మాత్రం నిరాకరించారు. లూతరు భావాల ప్రకారం మనకు పాపపరిహారం చేసిపెట్టింది కల్వరి బలి. మరి పూజవల్ల పాపపరిహారం జరిగితే కల్వరిబలి నిరర్థకమైపోయినట్లే. కనుక పూజ పాపపరిహారం చేయలేదు. క్రీస్తుని విశ్వసించడం ద్వారా మనకు పాపక్షమాపణం కలుగుతుంది. పూజ ప్రధానంగా కృతజ్ఞతాబలి అంతే. అందుచేత మృతుల పాపపరిహారం కొరకు పూజలు అర్పించడం నిష్ప్రయోజనం.

ట్రెంటు మహాసభ ఈ వాదాన్ని ఖండించి పూజ వలన పాపపరిహారాన్ని పొందవచ్చునని బోధించింది. పూజను అర్పించడం వల్ల మనం పాపాలకు పశ్చాత్తాప పడతాం. ఆ పాపాలను దేవుని యెదుట ఒప్పుకొని పాపసంకీర్తనం చేస్తాం. ఈలా పూజద్వారా చావైన పాపాలకుకూడ పశ్చాత్తాపపడి పరిహారం పొందవచ్చు. పూజలో మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసిన క్రీస్తునే అర్పిస్తాం. ఆ ప్రాయశ్చిత్తమూర్తి మన హృదయంలో పశ్చాత్తాపం పుట్టించి మనకు పరిహారం సంపాదించి పెడతాడు. పూజ కల్వరిబలికంటె భిన్నమైంది కాదు కనుక, ఆ బలిని మన మధ్యలో కొనసాగించేది కనుక, దాని ద్వారా కూడ పాపపరిహారం పొందవచ్చు. ఇక మృతుల కొరకు అర్పించిన పూజ ఆ మృతుల పాపాలకు పరిహారం చేస్తుంది. ప్రాచీనకాలం నుండీ శ్రీసభ వీళ్ళ కొరకు పూజలు అర్పించడం అనే ఆచారాన్ని పాటిస్తూ వచ్చింది. కనుక దీనిలో దోషమేమీ లేదు.

## 3. పూజనుండి పూర్తి ఫలితాన్ని పొందుతామా?

పైన పూజద్వారా నాల్గు ఫలితాలను పొందుతామని చెప్పాం. కాని వాటిని ప్రస్తుతం ఎంతవరకు పొందుతాం? అది మన భక్తిభావాన్ని బట్టి వుంటుంది. పూజలో రెండంశాలున్నాయి. మొదటిది, క్రీస్తుని బలిగా అర్పిస్తాం. రెండవది, శ్రీసభ, అనగా మనం పూజను అర్పిస్తాం. క్రీస్తుని బలిగా అర్పించడాన్ని బట్టి చూస్తే, పై ఫలితాలు సిద్ధించి తీరాలి. తండ్రికి క్రీస్తు అత్యంత ప్రీతిపాత్రుడు కనుక ఇక్కడ లోటు ఏమీ వుండదు. కాని శ్రీసభ బలిని అర్పించడాన్ని బట్టిచూస్తే పై ఫలితాలు పూర్తిగా సిద్ధించకపోవచ్చు. మనం భక్తితో పూజను అర్పిస్తే ఫలితం కలుగుతుంది, లేకపోతే లేదు. తరచుగా మన భక్తిలో లోటు వుంటుంది. మన పాపపు నరులం. మన హృదయంలో వుండవలసినంత దేవప్రేమా సోదరప్రేమా వుండవు. ఈలాంటి అపవిత్ర హృదయంతో, బలినర్పిస్తే అది భగంతునికి అట్టే ప్రియపడదు కదా! కనుక అపవిత్ర నరులు అర్పించే పూజబలి పై ఫలితాలను సమృద్ధిగా సాధించి పెట్టలేకపోవచ్చు. అందుచేత సమర్పింపబడే క్రీస్తుని బట్టి కాదు గాని, సమర్పించే శ్రీసభను బట్టి పూజఫలితాల్లో కొరత వుంటుంది.

శ్రీసభలో లోటువల్ల పూజ ఫలితాలు వ్యర్థమై పోతాయని చెప్పాం. ఇక్కడ శ్రీసభ అంటే విశేషంగా పూజను సమర్పించే గురువులు. పవిత్రుడైన గురువు పూజబలినర్పిస్తే ఎంతో ఫలితం పొందుతాం. అపవిత్రుడైన గురువు పూజను సమర్పిస్తే ఆ ఫలితం కొంతవరకు కుంటుపడిపోతుంది. పూజలో విశ్వాసుల భక్తికంటె గూడ గురువుభక్తి ప్రధానంగా గణనీయం. క్రీస్తు ఈ ప్రతినిధి ద్వారా తన్ను తాను తండ్రికి అర్పించుకొంటాడు. ఈ ప్రతినిధి అంతరంగం పవిత్రంగా వుండకపోతే పూజఫలితం తగ్గిపోతుంది.

## ప్రార్థనాభావాలు

1. పండ్రెండవ భక్తినాథ పాపుగారు "మేదియాతోర్‌దేయి" అనే శ్రీముఖంలో ఈలా వ్రాసారు. "క్రీస్తు కల్వరి కొండమీద చిందించిన రక్తం ఓ నెత్తురు తొట్టిలాంటిది. అది మనకు పాపపరిహారం చేసి మనకు రక్షణాన్ని ఈయడానికి ఉద్దేశింపబడింది. విశ్వాసులు పూజలో పాల్గొనడం ద్వారా ఈ తొట్టిలో స్నానం చేస్తారు. అప్పుడు వాళ్ళకు పాపపరిహారమూ రక్షణము సిద్ధిస్తుంది." అనగా పూజబలిద్వారా కల్వరి బలి రక్షణం మనకు సంక్రమిస్తుందని భావం. ప్రోటస్టెంటు నాయకులు కల్వరిబలి వేరు పూజబలి వేరు అన్నట్లుగా భావిస్తారు. ఇది పొరపాటు. అవి రెండూ ఒకటే. కల్వరిబలిని నేడు మన మధ్యలో కొనసాగించే సాధనమే పూజబలి.

2. అగస్టీను భక్తుడు కల్వరి బలిని గూర్చి వ్రాస్తూ ఈలా చెప్పాడు. "క్రీస్తు సిలువమీద వ్రేలాడి మనకొరకు తన ప్రాణాలనే అర్పించాడు. అతడు తన నెత్తురు చిందించి మనలను కొన్నాడు. దేవుని ఏకైక కుమారుడు పరిశుద్ధమైన గొర్రెపిల్ల ఐన క్రీస్తు నెత్తురు ద్వారా మనకు విమోచనం కలిగింది. మనలను కొన్నవాడు క్రీస్తు. అలా కొనడానికి అతడు వెచ్చించిన ధనం అతని సొంత నెత్తురే. అతడు కొన్నది ఈ విశ్వ ప్రపంచాన్నంతటినీ". ఈలాంటి అమూల్యమైన కల్వరిబలిని నేటి మన పూజబలిలో పునశ్చరణం చేస్తాం.

3. క్రీసోస్తం భక్తుడు "గురువు తన కరాలనూ నోటినీ క్రీస్తుకి బదులు ఇస్తాడు" అని పల్కాడు. ఇది చాలా గొప్ప వాక్యం. పూజలో గురువు క్రీస్తుకి ప్రతినిధిగా వుంటాడు. మానవమాత్రుడైన యీ ప్రతినిధిద్వారా క్రీస్తు తన్ను తాను తండ్రికి ఆత్మార్పణం చేసికొంటాడు. గురువు క్రీస్తు ప్రతినిధిగా నిల్చి "ఇది నా శరీరం" అని పల్కినప్పుడు తన నోటిని క్రీస్తుకి బదులు ఇస్తాడు. అలాగే దివ్యసత్ప్రసాదాన్ని ఎత్తి చూపించినపుడూ దాన్ని భక్తులకు పంచి యిచ్చినపుడూ అతడు తన చేతులను

క్రీస్తుకి బదులు ఇస్తాడు. గురువు అంతస్తు అంత వున్నతమైంది. కనుక ఈ యంతస్తుకి తగినట్లుగా గురువు భక్తిమంతమైన జీవితం జీవించాలి, యోగ్యంగా బలినర్పించాలి. గురువు అపవిత్రత వలన పూజబలి ఫలితాలు కుంటువడి పోతాయని ముందే చెప్పాం.

# రెండవభాగం - దివ్యసత్ప్రసాద సాన్నిధ్యం

## 7. దివ్యసత్ప్రసాదంలో క్రీస్తు సాన్నిధ్యం

మనం విరిచే రొట్టెను భుజించేవాళ్ళంతా క్రీస్తు శరీరంలో పాలుపొందడం లేదా? - 1కొరి 10,16.

మొదటి భాగంలో దివ్యసత్ప్రసాదంలో క్రీస్తుని బలిగా అర్పిస్తామన్న అంశం చూచాం. ఇక్కడ దివ్యసత్ప్రసాదంలో క్రీస్తు ప్రత్యక్షమై యుంటాడు అన్న విషయం చూడాలి. నడిపూజలో రొట్టెరసాలు క్రీస్తు శరీర రక్తాలుగా మారిపోతాయి అన్న సత్యాన్ని బాగా అర్థంచేసికోవాలి. ప్రస్తుతం నాల్గంశాలు పరిశీలిద్దాం.

### 1. సత్ప్రసాద సాన్నిధ్యం

పూర్వవేదంలో ప్రభువు యిస్రాయేలు ప్రజలమధ్య నెలకొని వుండేవాడు. ఈ దైవసాన్నిధ్యం విశేషంగా కొన్ని పరికరాల్లో వుండేది.

1. సాన్నిధ్యపు గుడారం. ఎడారికాలంలో యూదులు గుడారంలో ప్రభువుని సేవించుకొన్నారు. ఆ ప్రభువు ఈ గుడారంలోనుండి ప్రజలతో మాటలాడేవాడు - నిర్గ 29,42. దీనిలోనుండే అతడు మోషేతో, నేరుగా స్నేహితుడు స్నేహితునితో మాటలాడినట్లుగా, మాటలాడేవాడు - 33,11.

2. మేఘం. ప్రభువు మేఘంలోగూడ ప్రత్యక్షమవుతుండేవాడు. ఈ మేఘం పై గుడారాన్ని కప్పుతుండేది. దానిలో ప్రభువు తేజస్సు ఉండేది - నిర్గ 33, 9-10. 40, 34-35. యూదులు ఎడారిలో నలభైయేండ్లు ప్రయాణం చేసారు. ఈ నలభైయేండ్ల కాలమూ పై మేఘం వారికి దారి జూపుతూ వచ్చింది. అది పగటిపూట పొగస్తంభం లాగాను, రాత్రిపూట నిప్పుస్తంభంలాగాను కన్పించేది.

3. మందసం. యిస్రాయేలీయులు పది ఆజ్ఞలు వ్రాసిన రాతిపలకలను ఓ పెట్టెలో పెట్టుకొని ఆ పెట్టెను తమవెంట మోసికొని పోతుండేవాళ్ళు. ఇదే మందసం. దీని మీద బంగారు రేకును పొదిగారు. ఈ రేకునకు కరుణాఫలకం అని పేరు. దీనిమీద

రెండు దేవదూతల బొమ్మలుండేవి. ఈ బొమ్మల మధ్యవున్న ఖాళీస్థలంలో దేవుడు ప్రత్యక్షమై ఉండేవాడు. ఈ సాన్నిధ్యాన్నే హీబ్రూ భాషలో "షెకీనా" అన్నారు. ఈ మందసం మీదినుండి ప్రభువు యిస్రాయేలు ప్రజలకు తన చిత్తాన్నీ ఆజ్ఞలను తెలియజేసేవాడు – నిర్గ 25,22. యూదులు గుడారపు సాన్నిధ్యంకంటె ఈ మందసపు సాన్నిధ్యాన్ని ఘనంగా యెంచారు.

4. దేవళం. ప్రజలు ఎడారి ప్రయాణం ముగించుకొని యెరూషలేములో స్థిరపడిన పిదప సొలోమోను రాతిగుడిని కట్టించాడు. మందసాన్ని ఈ గుడిలో పదిలపరచాడు. అప్పుడు దైవసాన్నిధ్యం దేవళంలోని పీఠంమీద నెలకొంది. ఆ సాన్నిధ్యం మిలమిలా మెరిసేది. ఆ వెలుగును భరించలేక యాజకులు పీఠం దగ్గరికి వచ్చేవాళ్ళు కాదు – 1 రాజు 8, 10–11.

ఈలా దేవుడు పూర్వవేదంలో రకరకాల పరికరాల ద్వారా ప్రజలకు దర్శనమిచ్చేవాడు. ప్రజలు అతని సాన్నిధ్యాన్ని గుర్తించారు. అతడు తమతో వసించే దేవుడు – ఇమ్మానువేలు – అనుకొన్నారు. ఈ దేవుడు నూత్నవేద ప్రజలకుగూడ తన సాన్నిధ్యాన్ని ప్రసాదించాడు. నూత్నవేదంలో కూడ అతడు రకరకాల రూపాల్లో ప్రత్యక్షమౌతాడు. కాని ఈ సాక్షాత్కారాలన్నిటిలోను దివ్యసత్ప్రసాద సాక్షాత్కారం శ్రేష్ఠమైంది.

నూత్నవేదంలోని ఏ వాక్యంగూడ ప్రభువు దివ్య సత్ప్రసాదంలో ప్రత్యక్షమై యున్నాడని నేరుగా నిరూపించదు. కాని పైన మనం పేర్కొన్న పూర్వవేద సాన్నిధ్యాన్ని బట్టీ, నూత్నవేదం దివ్యసత్ప్రసాదంపట్ల ప్రదర్శించే భక్తి భావాన్నిబట్టీ దానిలో ప్రభువు సాన్నిధ్యం వుందని అర్థం చేసికోవచ్చు. ఇక్కడ నూత్నవేదం దివ్యసత్ప్రసాదాన్ని గౌరవపూర్వకంగా పేర్కొనే సందర్భాలను మూడింటిని మాత్రం పరిశీలిద్దాం.

1. పౌలు కొరింతీయులను మందలించిన ఘట్టం. 1కొ 11, 20–34. తొలిరోజుల్లో క్రైస్తవులు ఆదివారం రాత్రి ఆరాధనకు హాజరయ్యేవాళ్ళు. ఈ సందర్భంలో మొదట మామూలు భోజనం భుజించేవాళ్లు. అటుపిమ్మట దివ్యసత్ప్రసాదాన్ని కూడ పుచ్చుకొనేవాళ్లు. ఈ తంతుకంతటికీ కలిపి "ప్రేమవిందు" లేక "అగపె" అని పేరు. ఇక ఈ మామూలు భోజనం భుజించేపుడు ఓ వైపు ధనవంతులు బాగా తిని త్రాగేవాళ్లు. మరోవైపు పేదలు ఆకలితో నకనకలాడుతుండేవాళ్లు. ఈలా సంపన్నులు తోడి పేదలను పట్టించుకోకుండా తమకు తాము హాయిగా తిని త్రాగడం సోదర ప్రేమకు విరుద్ధమైన పాపం అన్నాడు పౌలు. ఈలాంటి పాపపు హృదయంతోనే ఈ ధనవంతులు దివ్యసత్ప్రసాదాన్ని గూడ పుచ్చుకొనేవాళ్లు. ఫలితంగా వాళ్లల్లో కొందరు జబ్బు పడ్డారు, కొందరు చనిపోయారుకూడ –11, 30. పౌలు భావాల ప్రకారం ఈ యనర్థం ఓ శిక్ష.

ఇక ఇక్కడ దివ్యసత్ప్రసాదం సోదర ప్రేమను పాటించని ఈ సంపన్నులను ఈలా శిక్షించిందంటె దానిలో ఏదో శక్తి వుందనే అనుకోవాలిగదా! పౌలు దానిలో దైవసాన్నిధ్యముందనే భావించాడు అనుకోవాలి కదా!

2. ఇంకో సందర్భంలోగూడ పౌలు దివ్యసత్ప్రసాదంలో అద్భుతశక్తి వుందని చెప్పాడు. తొలిరోజుల్లో పూజలో ఒకే పెద్ద రొట్టెను ఆశీర్వదించేవాళ్లు. దాన్నే ముక్క ముక్కలుగా త్రుంచి పూజలో అందరికీ దివ్యసత్ప్రసాదంగా పంచిపెట్టేవాళ్లు. ఈ యాచారాన్ని మనసులో పెట్టుకొనే పౌలు "మనం విరిచే రొట్టెలో పాలుపొందేవాళ్లంతా క్రీస్తు శరీరంలో పాలు పొందుతారు" అన్నాడు. ఇంకా అతడు "ఒక్క రొట్టెలో పాలు పొందేవాళ్ళంతా ఒక్క శరీరంగా ఏర్పడతారు" అన్నాడు - 1కొ 10,16-17. ఇక్కడ రొట్టె అంటే దివ్య సత్ప్రసాదమే. ఈ దివ్య సత్ప్రసాదంలో పాలుపొందే వాళ్ళంతా క్రీస్తు శరీరమవుతారు. అనగా అతనితో ఐక్యమౌతారు. ఇంకా ఈ యొకే రొట్టెరూపంలోవున్న దివ్యసత్ప్రసాదంలో పాలుపొందే వాళ్ళంతా తమలో తాము ఐక్యమౌతారు. అనగా వాళ్ళు శ్రీసభ ఔతారు. ఈ వాక్యాలను బట్టి మనలను క్రీస్తుతోను తోడి ప్రజలతోను ఐక్యపరచేశక్తి దివ్యసత్ప్రసాదానికి వుందనుకోవాలి. ఆ శక్తి దానికేలా వచ్చింది? దైవసాన్నిధ్యం వల్లనే గదా?

3. యోహాను సువార్తలో క్రీస్తు "నా శరీరాన్ని భుజించి నా రక్తాన్ని పానంజేసేవాడు నిత్యజీవం పొందుతాడు. నేనతన్ని అంత్యదినాన లేపుతాను" అన్నాడు - 6, 54. మనకు జీవమిచ్చే అద్భుతశక్తి ఈ భోజనానికుంది. ఈ సామర్థ్యం దానికేలా వచ్చింది? దైవసాన్నిధ్యంవల్లనేగదా?

ఈలా దివ్యసత్ప్రసాదంలో దైవ సాన్నిధ్యముందని ప్రత్యక్షంగా గాకపోయినా పరోక్షంగానైనా నిరూపించే వాక్యాలు నూత్నవేదంలో చాలా వున్నాయి.

## 2. రొట్టె రసాలు ఏమవుతాయి?

మీద దివ్యసత్ప్రసాదంలో దైవసాన్నిధ్యముంటుందని చెప్పాం. ఈ సాన్నిధ్యం దానిలోకి ఏలా వచ్చింది? మొదట వున్న రొట్టెరసాలు ఏమయ్యాయి? నడిపూజలో గురువు రొట్టెరసాలను ఆశీర్వదించి ఇది నా శరీరం, ఇది నా రక్తం అని చెప్పగానే ఆ వస్తువులు రెండు మారిపోతాయి. వాటిస్థానే క్రీస్తు శరీరరక్తాలు నెలకొంటాయి. అనగా రొట్టె రసాల స్వభావం మారిపోయి వాటిలో ఉత్థాన క్రీస్తు నెలకొంటాడు. బయటికి మాత్రం రొట్టె రసాల రుచి రూపం మొదలైన గుణాలు కన్పిస్తూనే వుంటాయి. కాని ఆ వస్తువుల స్వభావం మారిపోయి వాటిల్లో క్రీస్తు శరీరరక్తాలు నెలకొన్నాయని నమ్ముతాం. ఈ యంశాన్నే భక్తుడు ఆంబ్రోసు ఈలా వివరించాడు : "పూర్వం ఏలీయా ప్రవక్త వాక్కుద్వారా ఆకాశం నుండి

అగ్ని దిగివచ్చిందని వింటున్నాం. క్రీస్తు వాక్కులో మాత్రం అలాంటి శక్తి లేదా? ఆ వాక్కు భౌతిక వస్తువులను మార్చలేదా? సృష్టి వస్తువులను గూర్చి "దేవుడు ఒక మాట పలుకగా అవి ఉద్భవించాయి, అతడు ఆజ్ఞాపించగా అవి పుట్టాయి" అని చదువుతూన్నాం. ఉనికిలో లేని వస్తువులను సృజించగల దైవవాక్కు ఈవరకే వున్న వస్తువులను ఇతర వస్తువులనగా మార్చలేదా? లేని దానిని సృజించడం కంటె ఉన్నదానిని మార్చడం సులభం కాదా? ప్రభువు ఇది నా శరీరం అని వాక్రుచ్చాడు. ఆ మాటలు పలకకముందు అది కేవలం భౌతిక వస్తువైన రొట్టె. కాని ఆ మాటలు పలికాక అది క్రీస్తు శరీర మవుతుంది."

మొదట దైవవార్త మన మంటిమీదికి దిగివచ్చి మన మానవాకృతిని చేకొంది. క్రీస్తు దేవుడై కూడ నరరూపంలో ప్రత్యక్షమయ్యాడు. మళ్ళా ఆ దైవవార్త మన పీఠాల మీదికి దిగివచ్చి రొట్టెరసాల ఆకృతిని చేకొంటుంది. ఆనాడు నరుడుగా సాక్షాత్కరించిన వార్త ఈనాడు మళ్ళా రొట్టెరసాలుగా గూడ సాక్షాత్కరిస్తుంది. ఆ నరావతారంలోని శరీరరక్తాల్లో వున్న దేవుడే ఈ రొట్టెరసాల్లో గూడ వుంటాడు. దేవుడు ఓ మారు మన భౌతిక వస్తువుల్లోకి ప్రవేశించడం మొదలెట్టాక అది నరావతారమైనా ఒకటే రొట్టెరసాల రూపమైనా ఒకటే.

లూతరు మొదలైన ప్రోటస్టెంటు నాయకులు ఆరాధనం జరిగేప్పుడు దివ్యసత్ప్రసాదంలో దైవసాన్నిధ్యం వుంటుందని వొప్పుకొన్నారు. కాని రొట్టెరసాల స్వభావం మాత్రం మారదన్నారు. రొట్టె రొట్టెగానే వుంటుంది, రసం రసంగానే వుంటుంది అన్నారు. ట్రెంటు మహాసభ ఈ వాదాన్ని ఖండించింది. నడిపూజ ముగిసాక రొట్టెరసాలు ఇక వుండవనీ, వాటిస్థానే ఉత్థాన క్రీస్తు నెలకొంటాడనీ ఆ సభ బోధించింది.

ఉత్థాన క్రీస్తు చిత్తం వల్లనే నడిపూజలో రొట్టె రసాలు అతని శరీర రక్తాలుగా మారుతున్నాయి. ఈలా మారడంలో పరిశుద్ధాత్మ ప్రమేయం కూడ వుంది. క్రీస్తు ఉత్థానమైంది ఆత్మ శక్తిద్వారా - రోమా 8,11. క్రీస్తుని ఉత్థానం చేసిన ఆ పరిశుద్ధాత్మే అతని ఉత్థాన శరీరమైన దివ్యసత్ప్రసాదంలో కూడ పనిచేస్తుంది. కనుక ఆత్మశక్తి వల్ల కూడ రొట్టెరసాలు ప్రభువు శరీర రక్తాలుగా మారతాయి.

ఆత్మ చేసే పని రొట్టె రసాలను మార్చడం మాత్రమే కాదు, క్రైస్తవ ప్రజలను ఆరాధనకు ప్రోగు జేయడం గూడ. ఆ యాత్మ శక్తి వల్లనే మనమందరమూ ప్రభువు పీఠం చుట్టూ సమావేశమవుతాం. ప్రభువు శరీరరక్తాలను ఆరాధించి ఆరగిస్తాం. ఆత్మ లేందే ఆరాధనం లేదు. ఈలా రొట్టెరసాలను మార్చడంలోను, అలా మారిన దివ్యపదార్థాలను మనం స్వీకరించేలా చేయడంలోను ఆత్మ సహాయం కూడ వుంటుంది. అందుకే మనం పూజలో ఈ యాత్మ అప్పరసాల మీదికి దిగివచ్చి వాటిని మార్చాలని ప్రార్థిస్తాం. "కనుక మీ పవిత్రాత్మ ద్వారా ఈ కానుకలను పవిత్రపరచ మని

ప్రతిమాలుకొనుచున్నాము" అని చెప్తాం. ఈ ప్రార్థనకు ఆత్మ ఆవాహనం అని పేరు. ఈ యావాహనం ద్వారా పీఠం మీదికి దిగివచ్చే ఆత్మా, ఇది నా శరీరం ఇది నా రక్తం అనే క్రీస్తు వాక్కూ రెండూ కలసి రొట్టెరసాలను మారుస్తాయి.

## 3. సాన్నిధ్యం ఎంతకాలముంటుంది?

దివ్యసత్ప్రసాదంలో దైవసాన్నిధ్యముందని చెప్పాం. కాని ఈ సాన్నిధ్యం ఎంతకాలముంటుంది? ప్రోటస్టెంటు సంస్కరణ నాయకులు మనం ఆరాధనంలో దివ్యసత్ప్రసాదమూ దివ్యభోజనమూ పుచ్చుకొనేపుడు మాత్రమే వాటిల్లో దైవసాన్నిధ్యం వుంటుందన్నారు. ఆరాధనం ముగిసాక ఇక ఆ సాన్నిధ్యం అంతరిస్తుందన్నారు. కనుక ఆరాధనం లేక పూజ ముగిసాక దివ్యసత్ప్రసాదాన్ని పదిల పరచకూడదన్నారు. అలా పదిలపరచిన సత్ప్రసాదాన్ని ఆరాధించగూడదు, దాన్ని ప్రదక్షిణల్లో తీసికొని పోకూడదు, అని నుడివారు. అలా చేస్తే విగ్రహారాధనం చేసినట్లే నన్నారు. ఇంకా, దాన్ని రోగులకు ఆహారంగా ఈయకూడదని కూడ వాదించారు.

ట్రెంటు మహాసభ ఈ వాదనలన్నిటినీ ఖండించి ఈలా బోధించింది. పూజ ముగిసాక గూడ దివ్య శరీర రక్తాలలో క్రీస్తు సాన్నిధ్యం వుంటుంది. ఆ రెండిటిల్లోను, వాటిల్లోని ప్రతి కణంలోను గూడ ప్రభువు శరీరమూ ఆత్మా దివ్యత్వమూ - అనగా పూర్ణక్రీస్తు నెలకొని వుంటాడు. కనుక దాన్ని ఆరాధించవచ్చు, ఆరాధించాలి కూడ. అగస్టీను భక్తుడు నుడివినట్లు "మొదట ఆరాధించకుండా ఎవడూ ఈ దివ్యసత్ప్రసాదాన్ని భుజించడు. దాన్ని ఆరాధించడం వల్ల గాదు, ఆరాధించక పోవడం వల్ల పాపం కట్టుకొంటాం." ఇక దీన్ని రోగులకు ఆహారంగా కూడ పంచిపెట్టవచ్చు. ఇది శ్రీసభ సనాతన సంప్రదాయం.

## 4. సాన్నిధ్య స్వభావం

దివ్యసత్ప్రసాదంలో క్రీస్తు సాన్నిధ్యముంటుందని చెప్పాం. ఈ సాన్నిధ్యం ఏలా వుంటుంది? సాన్నిధ్యం పలు విధాలుగా వుంటుంది. మొదట స్థానికమైన సాన్నిధ్యముంది. రెండు కుర్చీలు ఒక తావులో ఒకదాని ప్రక్కన ఒకటి వున్నాయి. ఈ వస్తువులు ఒకదానితో ఒకటి కలవవు, ఒకదాన్నొకటి అర్థం చేసికోవు. ఇది స్థానికమైన సాన్నిధ్యం లేదా వస్తు సాన్నిధ్యం. ఒకోమారు నరులు కూడ ఈలాగే వుంటారు. ఉదాహరణకు, ఇద్దరు వ్యక్తులు బస్సులో ఒకరి ప్రక్కన ఒకరు కూర్చున్నారు. ఐనా వాళ్ళు ఒకరితో ఒకరు కలియరు. ఇది కేవలం వస్తు సాన్నిధ్యం. జడాత్మకమైంది కనుక దీనికి ఏ విలువా లేదు.

ఇది కాక వ్యక్తిగతమైన సాన్నిధ్యం కూడ వుంది. ఇక్కడ ఇద్దరు వ్యక్తులు ఒకరినొకరు అర్థం చేసికొంటూ అంగీకరిస్తూ వుంటారు. ప్రేమతో ఒకరినొకరు

హృదయాలర్పించుకొంటూ వుంటారు. మాటల ద్వారా సంజ్ఞల ద్వారా పరస్పరం సంబంధం కలిగించుకొంటూ వుంటారు. చైతన్యవంతమైనది కనుక ఇది విలువైన సాన్నిధ్యం. దీనిలో పరస్పరాంగీకారం వుంటుంది. ఇచ్చి పుచ్చుకోవడాలు వుంటాయి. ఈ సాన్నిధ్యం రోజురోజుకీ బలపడుతుంది, పెంపుజెందుతుంది. వ్యక్తులిద్దరూ ఒకరి హృదయంలో ఒకరు నివాసమేర్పరచుకొంటారు. ఈ సాన్నిధ్యం కేవలం భౌతికమైనదే కానక్కరలేదు, కేవలం సమీపంలో వున్నదే కానక్కరలేదు. మనకిష్టమైన వ్యక్తి దూరంగా వున్నా మన దగ్గరలో, మన మనసులో వున్నట్లుగా భావిస్తాం.

ఇక దివ్యసత్ర్పసాదంలో క్రీస్తు సాన్నిధ్యం స్థానికమైంది కాదు. వ్యక్తిగతమైంది. ఇక్కడ ప్రభువు మనలను ప్రేమిస్తూ తన్ను తాను మనకు ఆత్మార్పణం చేసికొంటూ వుంటాడు. ప్రభువు శ్రీసభలో నానారూపాల్లో సాక్షాత్కారమై వుంటాడు. కాని ఆ సాక్షాత్కారాలన్నిటిలోను ఈ దివ్య సత్ర్పసాద సాక్షాత్కారం విలువైంది. ఇతర సాక్షాత్కారాల్లో ఆ ప్రభువు వరప్రసాద ముంటుంది కాని యిక్కడ అతడే స్వయంగా నెలకొని వుంటాడు.

సాన్నిధ్యానికి ఆత్మార్పణం ముఖ్యం. క్రీస్తు పూజను నెరవేర్చే భక్త సమాజంలో సత్ర్పసాద రూపంలో ప్రత్యక్షమై వుంటాడు. అతడు తన్ను తాను ఆ సమాజానికి అర్పించుకోగోరుతూంటాడు. ఆ భక్తసమాజం గూడ అతన్ని అంగీకరించడానికి స్వీకరించడానికీ సిద్ధంగా వుండాలి. ఎప్పుడు కూడ ప్రభువు తన్ను తాను అర్పించుకొనేవాడు. భక్తులమైన మనం అతన్ని స్వీకరించేవాళ్ళం. అతనికి హృదయాలు అర్పించుకొనేవాళ్ళం. అతడు మన దగ్గరికి రావడానికి ఇష్టపడతాడు. మనం కూడ అతని చెంతకు పోవడానికి ఇష్టపడాలి. అతన్ని పొందడానికి ఉవ్విళ్ళూరాలి.

సత్ర్పసాదంలో క్రీస్తు వట్టినే జడాత్మకంగా వుండిపోడు. మరి చైతన్యవంతంగా, తన్ను తాను మన కర్పించుకొంటూ వుంటాడు. మన తరపున మనంకూడ ఆ ప్రభువు నెదుట జడాత్మకంగా వుండిపోగూడదు. చైతన్యవంతంగా అనగా అతన్ని స్వీకరిస్తూ వుండాలి. భక్తిభావంతో అతనికి హృదయాలు అర్పించుకొంటూ వుండాలి.

## ప్రార్థనాభావాలు

1. శ్రీసభలో క్రీస్తు సాక్షాత్కారాలు నానారూపాల్లో వుంటాయని చెప్పాం. ఏమిటివి ఈ నానారూపాలు? ఆరాధన సందర్భానికి చెందిన సాన్నిధ్యాలు నాల్గున్నాయి. 1. ప్రభువు తన్ను ఆరాధించడానికి ప్రోగైన భక్తసమాజంలో నెలకొని వుంటాడు. ఎక్కడెక్కడ నా పేరు మీదిగా ఇద్దరు ముగ్గురు సమావేశమౌతారో వారి మధ్యలో నేనూ నెలకొని వుంటాను అన్న వేదవాక్యం గూడ వుంది - మత్త 18,20.

2.వేదవాక్కులో గూడ ప్రభువు వుంటాడు. పూజలో ఆ వేదవాక్కును చదివి విన్పించేపుడు అతని వాక్కే విన్పిస్తుంది. 3. పూజనర్పించే గురువులో అతడు వుంటాడు. పూర్వం సిలువమీద తన్ను తాను అర్పించుకొన్న క్రీస్తు ఇప్పుడు పూజలో గురువుద్వారా మళ్ళా ఆత్మార్పణం చేసికొంటాడు. 4. కడన దివ్యసత్ప్రసాదంలో ప్రభువు వుంటాడు. పైమూడు సాన్నిధ్యాల కంటె గూడ ఇది విలువైంది. ఇక్కడ వున్నంత పరిపూర్ణ సాన్నిధ్యం మరెక్కడా వుండదు. పూజలో పాల్గొనే భక్తులు ఈ నాల్గురకాల సాన్నిధ్యాలను, విశేషంగా కడపటిదాన్ని, భక్తిభావంతో గుర్తించాలి.

2. దివ్యసత్ప్రసాదం కంటికి రొట్టెలాగే ద్రాక్ష సారాయంలాగే కన్పిస్తుంది. వాటిని క్రీస్తు శరీరరక్తాలనుగా అంగీకరించాలంటే విశ్వాసం వుండాలి. ఈ విశ్వాసాన్ని గూర్చి నాల్గవ శతాబ్ద భక్తుడు సిరిల్ ఈలా వ్రాసాడు. "ఆ పదార్థాలు రొట్టెరసాలు కాదు. ప్రభువు వాక్యాన్ని బట్టి అవి అతని శరీరరక్తాలే అనుకోవాలి. కండ్లు నాలుక మొదలైన యింద్రియాలు అవి రొట్టెరసాలేనని చెప్పినా నీ విశ్వాసం మాత్రం అలా కాదని చెప్పాలి. రుచినీ రూపాన్నీ బట్టి వాటిని నిర్ణయించకూడదు. విశ్వాసంతో అవి క్రీస్తు శరీరరక్తాలేనని ఏ యనుమానమూ లేకుండా అంగీకరించాలి." ఈ విశ్వాసాన్ని మనం ప్రభువు నుండే అడుగుకోవాలి.

3. పై సిరిల్ భక్తుడే ఇంకా యిలా వ్రాసాడు. "క్రీస్తు శరీరరక్తాలను రొట్టెరసాల రూపంలో భుజిస్తాం. అలా భుజించినపుడు మన శరీరరక్తాలు ప్రభువు శరీరరక్తాలతో మిళితమై పోతాయి. అతని దేహరుధిరాలు మన శరీరంలోకి ప్రవేశిస్తాయి. కనుక మనం క్రీస్తుధరులమైతాం." క్రీస్తుని భుజించి క్రీస్తుధరులయ్యే భక్తులు ఆ క్రీస్తుకి యోగ్యంగా నడుచుకోవాలి.

4. నాల్గవ శతాబ్ద భక్తుడైన అగస్టీను ఈలా చెప్పాడు. "క్రీస్తు తన శరీరరక్తాలతో మనకు హితకరమైన భోజనం పెడతాడు. కనుక అతని శరీరాన్ని భుజించేవాళ్ళు జీవాన్నే భుజిస్తారు. అతని రక్తాన్ని త్రాగేవాళ్ళు కూడ జీవాన్నే త్రాగుతారు. ఈ దివ్య భోజనాన్ని భుజించడం ద్వారా మనం జీవాన్ని పొందుతాం, ఆ జీవాన్ని కూడ సమృద్ధిగా పొందుతాం." అగస్టీను నుడివినట్లుగా ఈ దివ్యభోజనం ద్వారా మనం పరిపూర్ణ జీవాన్ని పొందాలి.

## 8. సత్ప్రసాద ఆరాధనా, సందర్శనాలూ

"ప్రభువు దివ్యసత్ప్రసాదాన్ని భోజనంగా వుండడానికే నెలకొల్పాడు. కనుక మనం దాన్ని ఆరాధించ నక్కరలేదు అని అనుకోకూడదు." – త్రెంతు మహాసభ

తొలిరోజుల్లో క్రైస్తవులు దివ్యసత్ప్రసాదాన్ని బలిగాను భోజనంగాను మాత్రమే యెంచేవాళ్ళు. వాళ్ళు దాన్ని ఆరాధించాలి అనుకోలేదు. 11వ శతాబ్దం తర్వాత ఆరాధనం గూడ ప్రచారంలోకి వచ్చింది. నేడు ప్రోటస్టెంటు శాఖలకు చెందిన క్రైస్తవులు ఈ యారాధనాన్ని అంగీకరించరు. కనుక మనం దివ్యసత్ప్రసాదాన్ని ఎందుకు ఆరాధిస్తున్నామో క్షుణ్ణంగా అర్థం చేసికొని వుండాలి. ఈ యధ్యాయంలో రెండంశాలు పరిశీలిద్దాం.

## 1. దివ్యసత్ప్రసాద ఆరాధనం

### 1) చారిత్రకాంశాలు

తొలిరోజుల్లో క్రైస్తవులు జ్ఞానస్నానాన్ని ప్రధాన సంస్కారంగా ఎంచారు. జ్ఞానస్నానంతో ప్రారంభమైన క్రైస్తవ జీవితాన్ని సత్ప్రసాదం పెంపుకి తెస్తుంది అని మాత్రం భావించారు. కనుక వాళ్ళ దృష్టిలో సత్ప్రసాదం జ్ఞానస్నానమంత ముఖ్యమైంది కాదు. ఇక, క్రీస్తు దివ్యసత్ప్రసాదాన్ని స్థాపించిన సందర్భాన్ని పరిశీలిస్తే అతడు దాన్ని భుజించమన్నాడు కాని ఆరాధించమనలేదు. కనుక తొలినాటి క్రైస్తవులు దాన్ని భోజనంగా ఎంచారు గాని ఆరాధ్య వస్తువుగా ఎంచలేదు. తొలిరోజుల్లో ఓ సంప్రదాయముండేది. పూజకు హాజరైన క్రైస్తవులు సత్ప్రసాదాన్ని ప్రసాదంగా యిండ్లకు తీసికొని వెళ్ళేవాళ్ళు. దాన్ని తమ యిండ్లలో పదిలపరచుకొని భుజించేవాళ్ళు. ఈ సంప్రదాయం 8వ శతాబ్దం వరకూ కొనసాగుతూ వచ్చింది. అదేకాలంలో దాన్ని గుళ్ళల్లో గూడ పదిలపరచి పూజ జరగని సమయాల్లో పంచిపెట్టేవాళ్ళు. వ్యాధిగ్రస్తులకు కూడ భోజనంగా ఇచ్చేవాళ్ళు. ఈ సందర్భాలన్నిటిల్లోను దాన్ని భోజనంగానే యెంచారు. విశ్వాసులు దాన్ని బహిరంగంగా ఆరాధించలేదు.

11వ శతాబ్దంలో బెరింగారియస్ అనే అతని మూలంగా ఓ పెద్ద మార్పు వచ్చింది. అతడు దివ్యసత్ప్రసాదంలో దైవసాన్నిధ్యం లేదనీ అసలు రొట్టెరసాలు క్రీస్తు శరీరరక్తాలుగా మారనే మారవని వాదించాడు. అందుచేత శ్రీసభ దివ్యసత్ప్రసాదంలో దైవసాన్నిధ్యముందని ప్రచురంగా బోధించడం మొదలుపెట్టింది. ప్రజలకు గూడ ఈ సాన్నిధ్యం పట్ల భక్తిభావం పెరిగింది. క్రమేణ ప్రజల్లో అది భోజనమన్న విషయం మరుగున పడిపోయింది. ఆరాధ్యవస్తువన్న విషయం పెచ్చు పెరిగింది. కనుక విశ్వాసులు దాన్ని పుచ్చుకోవడం మానివేసి ఆరాధించడం మొదలుపెట్టారు. సాన్నిధ్యం నడిపూజలో నెలకొంటుంది. కనుక ఆ విషయాన్ని. విశ్వాసులకు విదితం చేయడం కోసం గురువులు నడిపూజలో సత్ప్రసాదాన్ని పైకెత్తి చూపించేవాళ్ళు. అలా పైకెత్తబడిన దివ్యభోజనాన్ని కంటితో చూడ్డం మహాభాగ్యమనుకొన్నారు విశ్వాసులు.

క్రమేణ ఈ సాన్నిధ్యం పట్ల భక్తి యింకా పెరిగింది. 13వ శతాబ్దంలో దివ్యసత్ప్రసాదపు పండుగను నెలకొల్పారు. సత్ప్రసాద ఆశీర్వాదమూ ప్రదక్షిణలు నలభై గంటల ఆరాధనలూ మొదలైనవన్నీ ప్రారంభమయ్యాయి. ఈ విధంగా ఆరాధనం ప్రచారంలోకి వచ్చింది. కాని సత్ప్రసాదాన్ని ఆరాధించడం ఎంతగా ప్రచారంలోకి వచ్చిందో దాన్ని భోజనంగా స్వీకరించడం అంతగా తక్కువైపోయింది. విశ్వాసులు తాము పాపులమనీ ఆ దివ్యభోజనాన్ని భుజించడానికి యోగ్యులంకామనీ యెంచేవాళ్ళు. పూజకు వెళ్లేవాళ్ళు కాని సత్ప్రసాదాన్ని తీసికొనేవాళ్ళు కాదు.

ఈ వుద్యమంలో కొంత మంచీ కొంత చెడ్డాగూడ లేకపోలేదు. మంచి యేమిటంటే, తొలి వెయ్యేండ్లల్లో లేని ఆరాధనాంశం 11వ శతాబ్దం తర్వాత ప్రచారంలోకి రావడం. ఇది మెచ్చుకోదగిన అంశం. చెడ్డ యేమిటంటే దివ్యసత్ప్రసాదం భోజనం అన్న విషయం మరచిపోవడం. ఎప్పుడు గూడ ప్రభువు దివ్యసత్ప్రసాదంలో తన్ను తాను మనకు భోజనంగా అర్పించుకోగోరుతుంటాడు. ఇది అతని చైతన్యవంతమైన సాన్నిధ్యం. ఈ చైతన్యవంతమైన సాన్నిధ్యాన్ని విశ్వాసులు కేవలం జడాత్మకమైన సాన్నిధ్యంగా మార్చారు. అనగా ప్రభువు సత్ప్రసాదంలో వట్టినే వుండిపోతాడు అనుకొన్నారు. మనం అతన్ని భుజించనక్కరలేదు, ఆరాధిస్తే చాలు అనుకొన్నారు. ఇది నిక్కంగా పొరపాటు.

## 2) సమైక్యతా సమస్య

ఆదిమ క్రైస్తవ సమాజం నుండి చీలిపోయిన వాళ్ళంతా నేడు దివ్యసత్ప్రసాద సాన్నిధ్యాన్ని నిరాకరిస్తారు. ఈలా చీలిపోయినవాళ్ళు రెండు తెగలు. మొదటి తెగవాళ్ళు 8వ శతాబ్దంలోనే చీలిపోయారు. వీళ్ళకూ మనకూ ఒక్క పాపుగారి ఆధిపత్యం విషయంలో తప్పితే వ్యత్యాసాలు అంతగా లేవు. వీళ్ళకు ప్రాచ్య శ్రీసభ క్రైస్తవులు లేక ఓర్తొడోక్స్ క్రైస్తవులు అని పేరు. వీళ్ళు తమ ఆరాధనంలో గ్రీకు భాషను వాడతారు. వీళ్ళు దివ్యసత్ప్రసాదంలో పూజ ముగిసాక గూడ దైవసాన్నిధ్యముంటుందని నమ్ముతారు. దాన్ని పదిలపరుస్తారు. ఐనా అలా పదిలపరచిన దివ్యసత్ప్రసాదాన్ని భోజనంగా వాడుకొంటారే గాని ఆరాధించరు. మన ల్యాటిన్ శ్రీసభలో లాగ గ్రీకు శ్రీసభలో ఆరాధన పద్ధతి ప్రచారంలోకి రాలేదు.

ఇక రెండో తెగవాళ్ళు 16వ శతాబ్దంలో లూతరు కాల్విను మలంక్తోను మొదలైనవాళ్ళ నాయకత్వం క్రింద చీలిపోయినవాళ్ళు. వీళ్ళనే మనం ప్రోటస్టెంటులు అంటాం. ఈ శాఖల వాళ్ళ భావాల ప్రకారం పూజ ముగిసాక సత్ప్రసాదంలో అసలు దైవసాన్నిధ్యమే వుండదు. అది మళ్ళా మామూలు రొట్టె ఐపోతుంది. కనుక దాన్ని పదిలపరచడం గాని ఆరాధించడం గాని ఎంతమాత్రం పనికిరాదు.

ఈ యిరుతెగల క్రైస్తవులూ సత్ప్రసాద ఆరాధనాన్ని నిరాకరిస్తారని చెప్పాం. వీళ్ళ వాదం యిది. సత్ప్రసాద స్థాపన సందర్భంలో క్రీస్తు తన శరీరాన్ని భుజించమన్నాడే గాని ఆరాధించమనలేదు. మరి నేడు క్యాతలిక్ శ్రీసభ దాన్ని ఆరాధిస్తూందంటే సువిశేష బోధకు వ్యతిరేకంగా పోయినట్లే. దివ్యశరీరాన్ని బలిగా అర్పించాలి, భోజనంగా స్వీకరించాలి. అంతేగాని ఆరాధించనక్కరలేదు. ఈలాంటి భిన్నాభిప్రాయాలు వున్నపుడు వాళ్ళకూ మనకూ సమైక్యత ఏలా కుదురుతుంది?

### 3) మనవాదం

ఆర్తొడోక్స్, ప్రోటస్టెంటులు, క్యాతలిక్కులు అనే మూడు తెగల క్రైస్తవుల్లో క్యాతలిక్కులు మాత్రమే దివ్య సత్ప్రసాదాన్ని ఆరాధిస్తున్నారు. తతిమ్మా రెండు తెగల వాళ్లు అలా చేయడం లేదు. మనమొక్కరమే ఈలా ఆరాధించడంలో ఔచిత్యమేమిటి? ఈ యారాధనం అనౌచిత్యమైందేమీ కాదు. సబబైందే. కారణాలివి :

1. సిలువబలి నర్పించిన క్రీస్తు బలిమూర్తి. బలిమూర్తిగా అతని సాన్నిధ్యం నేడు కూడ మోక్షంలో కొనసాగుతుందని చెప్తూంది హెబ్రేయుల జాబు 7,25. ఈ సాన్నిధ్యం కల్వరి బలికి చెందింది. ఇక నేడు మోక్షంలోని ఉత్థాన క్రీస్తులో ఆ బలిమూర్తి సాన్నిధ్యం అలా కొనసాగుతుందంటే, భూలోకంలో దివ్యసత్ప్రసాదంలో మాత్రం ఆ బలిమూర్తి సాన్నిధ్యం ఎందుకు కొనసాగకూడదు? ఈ దివ్య సత్ప్రసాదం గూడ కల్వరిబలికి సంబంధించినదేగదా? కనుక దీనిలో గూడ దైవసాన్నిధ్యం వుండవచ్చు, వుంటుంది.

2. ప్రోటస్టెంటు క్రైస్తవులు బైబులు గ్రంథాన్ని ఎంతగానో అభిమానిస్తారు. నేటికి దానిలో దైవసాన్నిధ్యముందని యెంచుతారు. ఈ దైవవాక్కులో కొనసాగుతూన్న సాన్నిధ్యం దైవశరీరంలో మాత్రం కొనసాగదా? మనుష్య వాక్కులోనికి ప్రవేశించిన దేవుడు మనుష్య శరీరంలోకి ప్రవేశించడా? ప్రాచీన పితృపాదులు దివ్యసత్ప్రసాదాన్ని రెండవ మనుష్యావతారంగా ఎంచారు. ఆ దైవవార్త మన మనుష్యరూపం చేకొంది. మన మానవవాక్కునే చేకొంది. మన మానవ శరీరాన్ని చేకొంది. కనుక క్రీస్తు మనుష్యావతారంలోను, దివ్యగ్రంథంలోను, దివ్యసత్ప్రసాదంలోను ఒకేరీతిగా దైవసాన్నిధ్య ముండాలి కదా?

3. క్రీస్తు శరీరం ప్రధానంగా భుజించదగిందే, ఒప్పుకొన్నాం. భుజించడానికే దాన్ని పదిలపరుస్తాం. కాని ఓమారు దాన్ని పదిలపరచాం గనుక ఆరాధించాలి. దాన్ని ఆరాధించడం కోసం పదిలపరచడం లేదు, పదిలపరుస్తున్నాం గనుక ఆరాధించాలి.

4. యోహాను 14,23 ప్రకారం ఉత్థాన క్రీస్తు మన హృదయాల్లో వసిస్తూంటాడు. ఇది ఆధ్యాత్మికమైన సాన్నిధ్యం. ఇది చాలు కదా మళ్ళా దివ్యసత్ప్రసాద సాన్నిధ్యమెందుకు

అంటారు ప్రోటస్టెంటులు. నిజమే. కాని ఈ యాధ్యాత్మిక సాన్నిధ్యం కంటికి కన్పించదు. దేహధారులమైన మనం కంటితో చూస్తేనే గాని తృప్తి చెందం. కనుక మనకు సంజ్ఞలూ సంకేతాలూ అవసరం. అందుకే క్రీస్తు దివ్యసత్ప్రసాదమనే సంజ్ఞారూపంలో మన మధ్యలో వసిస్తూంటాడు. ఈ సాన్నిధ్యాన్ని మనం కంటితో జూచి తృప్తి చెందుతాం. పూర్వం యావే ప్రభువు మందసంలో వుండి యిస్రాయేలీయులను ఎడారిగుండా వాగ్దత్తభూమికి నడిపించాడు. నేడు క్రీస్తు సత్ప్రసాదంలో వుండి మనలను ఈ లోకం గుండా మోక్షానికి నడిపిస్తాడు. యాత్రికులమైన మనకు గమ్యాన్ని చేరుకొనేదాకా ఈ సాన్నిధ్యం అవసరం. సత్ప్రసాద సన్నిధిలోకి వెళ్ళినపుడు మనకు ఊరట ఆదరవూ కలుగుతుంది. అది మనకు అండదండగా వుంటుంది. మనకు ఇన్ని వుపకారాలు చేసిన ఆ ప్రభువుకి సత్ప్రసాద సన్నిధిలో వందనాలు అర్పించుకోవచ్చు.

శ్రీసభలో తొలి వెయ్యేండ్లకాలంలో దివ్యసత్ప్రసాద ఆరాధనం లేనిమాట నిజమే. క్రీస్తు వాక్యాల్లో కూడ ఈ యారాధనా భావం ప్రత్యక్షంగా లేనిమాట యథార్థమే. కాని క్రీస్తు ఆత్మ క్రైస్తవ సమాజంలో క్రొత్త భావాలను వ్యాప్తిలోనికి తీసికొని రాగలదు. అసలు క్రీస్తు తన శరీరాన్ని మనం భుజించాలి అని చెప్పినపుడు దాన్ని మనం గౌరవంతో చూడాలి అనే ఉద్దేశించాడు కదా? ఆ గౌరవమే ఆరాధనం. ఇక్కడ పరోక్షంగా వున్న భావాన్ని ఆత్మ తర్వాత శ్రీసభలో ప్రత్యక్షం చేసింది. నేటి మన మతాంశాలన్నిటికీ బైబులు ఒక్కటే ఆధారం కాదు. పారంపర్య బోధనం కూడాను. క్యాతలిక్ శ్రీసభలో 11వ శతాబ్దం నుండి, అనగా వెయ్యేండ్ల నుండి, ఈ యారాధనా సంప్రదాయం ప్రచారంలో వుంది. వెయ్యేండ్ల ఈ సంప్రదాయం - అవి తొలి వెయ్యేండ్లు కాకపోయినా సరే - మాన్యమైందే. కనుక సమైక్యరీత్యా ఇతర క్రైస్తవ శాఖలకు కష్టమనిపించినా క్యాతలిక్ శాఖమాత్రం ఈ యారాధనాన్ని కొనసాగించుకొని పోతూనే వుంటుంది. సమైక్యతలో ఒక్క సోదరప్రేమను మాత్రమేకాక సత్యాన్ని గూడ పాటించాలి - ఎఫె 4,15.

## 2. సత్ప్రసాద సందర్శనాలు

పూర్వాంశలో సత్ప్రసాదాన్ని ఎందుకు ఆరాధించాలో పరిశీలించాం. ఈ యారాధనలో సత్ప్రసాద సందర్శనాలు కూడ ఒక భాగం. కనుక ఆ ప్రభువుని ఏలా సందర్శించాలో, ఆ సమయంలో ఏలాంటి భక్తిభావాలు ప్రదర్శించాలో తెలిసికొందాం.

### 1. దేవుడే మనలను సందర్శించాడు

పూర్వవేదమంతటా గూడ ప్రభువు తన ప్రజలను సందర్శించాడు అనే భావం ప్రచురంగా కన్పిస్తుంది. అతడు ఐగుప్త బానిసంలో మ్రగ్గిపోయే తన భక్తులను సందర్శించాడు

– నిర్గ 3,9. అబ్రాహాములాంటి పుణ్యపురుషులను సందర్శించి వాళ్ళను తన నాయకులను జేసికొన్నాడు – ఆది 17,1. ఇంకా ఆ ప్రభువు గుడారం, మందసం, దేవళం మొదలైన వాటిద్వారా తన ప్రజలను సందర్శించాడు. రెండవ ప్రవాసమైన బాబిలోనులో కూడ భక్తులు అతని సందర్శనం కోసం వేచివుండేవాళ్ళు – కీర్త 106,4. ఇక నూత్నవేదంలో ప్రభువు తన ప్రజలను శాశ్వతంగా సందర్శించాడు. క్రీస్తు మనమధ్య నివాసమేర్పరచుకొన్నాడు – యోహా 1.14. అతడు ఉత్థానమై తండ్రి చెంతకు వెళ్ళిపోయిన తరువాత సంస్కారాల ద్వారా, విశేషంగా దివ్యసత్ప్రసాదం ద్వారా, మనలను సందర్శిస్తాడు. ఈలా నిత్యం మన మధ్యలో వుండి మనలను సందర్శించే ప్రభువుని మనం మాత్రం సందర్శించవద్దా? అతడు మన దగ్గరికి వస్తూంటే మనం మాత్రం అతని దగ్గరికి వెళ్ళవద్దా? ఈలా వెళ్ళడమే దివ్యసత్ప్రసాద సందర్శన మవుతుంది.

## 2. పాస్కబలీ నిబంధనబలీ

పాస్కబలీ నిబంధనబలీ దివ్యసత్ప్రసాదానికి పూర్వ రూపాలని చెప్పాం. పాలస్తీనా దేశంలో యూదులు ఏటేటా పాస్కబలి జరుపుకొనేవాళ్ళు. వాళ్ళు ఆ బలిలో గొర్రెపిల్లలను భుజించడం ద్వారా పూర్వపు ఐగుప్తు దాస్య విమోచనాన్ని స్మరించుకొన్నారు. ఆ స్మరణం ద్వారా దాస్య విమోచకుడైన ప్రభువు వాళ్ళకు ప్రత్యక్షమయ్యాడు. మన దివ్యసత్ప్రసాదంలో గూడ స్మరణం అనేది వుంది. ఈ దివ్యసత్ప్రసాద సన్నిధిలో జపం జేసికొంటూ క్రీస్తు మరణోత్థానాలనూ, అతడు మనకు పాపదాస్యం నుండి విమోచనం కలిగించడాన్నీ తండ్రికి జ్ఞాపకం చేస్తాం. ఆ జ్ఞాపకం ద్వారా తండ్రి మనలను కరుణిస్తాడు. దాస్య విమోచకుడైన క్రీస్తు మనలను దీవిస్తాడు.

సీనాయికొండ చెంత జరిగిన నిబంధన బలిలో యావే యిస్రాయేలీయులకు మరింత సన్నిహితుడయ్యాడు. అతడు వాళ్ళ దేవుడయ్యాడు, వాళ్లు అతన్ని కొలిచే భక్తులయ్యారు. మన దివ్యసత్ప్రసాదం గూడ క్రీస్తు మనతో జేసికొన్న నిబంధనను జ్ఞప్తికి తెస్తుంది. ఈ సత్ప్రసాదం ఎదుట మనం ప్రార్థనం జేసికొనేపుడు ఈ ప్రభువు గూడ మనకు మరింత సన్నిహితుడౌతాడు. కనుక మనం వీలైనప్పుడెల్ల ఈ సాన్నిధ్యంలోకి వెళ్ళాలి. అక్కడ అతన్ని ఆరాధించాలి. అతని ప్రజలమూ అతని భక్తులమూ కావాలి.

## 3. సత్ప్రసాద స్వీకరణానికి సిద్ధం కావడం

దివ్యసత్ప్రసాద సందర్శనం ఎప్పుడు కూడ సత్ప్రసాదం భోజనమనే అంశాన్ని జ్ఞప్తికి తెచ్చేలా వుండాలి. గుళ్ళో మనం ఆరాధించే సత్ప్రసాదం ఎప్పుడు కూడ జరిగిపోయిన

పూజనూ జరుగనున్న పూజనూ జ్ఞప్తికి తెస్తుంది. పూర్వపు పూజలో ఆ సత్ప్రసాదం తయారయ్యింది. వచ్చే పూజలో దాన్ని మళ్ళా స్వీకరిస్తాం. అది ప్రధానంగా బలి, భోజనం. అది బలీ భోజనమూ కనుక, దానిలో దైవసాన్నిధ్యముంది కనుక, దాన్ని ఆరాధిస్తాం. అంతేగాని ఆరాధనమే ప్రధానాంశం గాదు. ముందే చెప్పినట్లు, దాన్ని భుజిస్తాం గనుక పదిలపరుస్తాం. పదిలపరచాం గనుక ఆరాధిస్తాం. కాని దాన్ని ఆరాధించడం కోసం పదిలపరచం.

అసలు మనం సత్ప్రసాదాన్ని సందర్శించేది ప్రధానంగా ఆరాధనం కొరకు గాదు. మన పీఠాలమీద నెరవేరే పాస్కబలితో ఐక్యంగావడం కోసం. పూజబలి పాస్కబలిని తలపిస్తుంది. పాస్కబలి సిలువబలిలో నెరవేరింది. ఆ సిలువబలి నేటి పూజబలిలో కొనసాగుతుంది. కనుక మనం సత్ప్రసాదాన్ని సందర్శించేది పాస్క సిలువ బలులను స్మరించుకోవడం కోసం. సత్ప్రసాద సందర్శనం ఇంతకు ముందే ముగిసిన పూర్వపు పూజను కొనసాగిస్తుంది. తర్వాత జరుగబోయే క్రొత్తపూజకు మనలను సిద్ధం జేస్తుంది. ఆ జరుగబోయే పూజలో దివ్యసత్ప్రసాదాన్ని స్వీకరించడానికి మనలను తయారు చేస్తుంది.

సత్ప్రసాద సందర్శనం మనలను సత్ప్రసాదం స్వీకరించడానికి సిద్ధం చేసేలా వుండాలి. ఈ సందర్భంలో ఆధ్యాత్మిక విధంగా సత్ప్రసాదం తీసికోవడం అనే పద్ధతి ఎంతో ప్రయోజనకరమైంది. ఈ పద్ధతిలో సత్ప్రసాదాన్ని యథార్థంగా భుజించం. భుజించాలని కోరుకొంటాం. ఈ కోరిక తరువాత పూజలో యథార్థంగా సత్ప్రసాదం తీసికోడానికి మనలను సిద్ధం చేస్తుంది. సత్ప్రసాద సందర్శనం ప్రయోజనం కూడ యిదే. కనుక మనం సత్ప్రసాదాన్ని సందర్శించినపుడెల్ల ఆధ్యాత్మికంగా ఆ భోజనాన్ని స్వీకరించడం ఉత్తమం.

సత్ప్రసాద సన్నిధిలో ఆరాధనం, కృతజ్ఞత, మనవి, పాపపరిహారం కొరకు వేడుకోవడం మొదలైన భక్తిభావాలను కూడ ప్రదర్శించవచ్చు.

కాని క్రీస్తు సత్ప్రసాద మందసంలో బంధింపబడి వున్నాడనీ, అతన్ని ఓదార్చడానికి మనం అతని సన్నిధిలోనికి వెళ్తున్నామనీ అనుకోవడం వట్టి పిచ్చి భావం. ఉత్థాన క్రీస్తు నేడు మహిమతో విరాజిల్లేవాడు కాని బాధలకు గురయ్యేవాడు కాదు. కనుక మనం అతన్ని ఓదార్చం, అతడే మనలను ఓదారుస్తాడు.

# మూడవభాగం - దివ్యసత్రసాదం భోజనం

## 9. దివ్యసత్రసాదం మనలను ఉత్థాన క్రీస్తుతో ఐక్యపరుస్తుంది

"నన్ను భుజించేవాడు నా మూలంగా జీవిస్తాడు" - యోహా 6,57.

మొదటి రెండు భాగాల్లో దివ్యసత్రసాదం బలి, సాన్నిధ్యం అనే అంశాలు చూచాం. ఈ మూడవ భాగంలో అది భోజనం అన్న విషయం చూడాలి. ప్రస్తుతం సత్రసాదం మనలను ఉత్థాన క్రీస్తుతో ఏలా ఐక్యపరుస్తుందో విచారిద్దాం. ఈ యధ్యాయంలో ఐదంశాలు ప్రస్తావిద్దాం.

### 1. బలి నైవేద్యం

యూదులు బలినర్పించినపుడు ఆ బలి నైవేద్యాన్ని గూడ భుజించేవాళ్లు. మన పూజబలికి పూర్వరూపాలైన పాస్కబలిలోను నిబంధన బలిలోను ఈ నైవేద్యాలు భుజించడమనేది వుంది. మొదటి పాస్కబలిలో గొర్రెపిల్లను భుజించారు. తరువాత ఆ బలిని యేటేట యెరూషలేములో కొనసాగించేపుడు కూడ గొర్రెపిల్లను భుజించేవాళ్ళు - ద్వితీ 12,7. అలాగే నిబంధన బలి ముగిసాక గూడ మోషే, అహరోను, నాదాబు, ఆబీహు, డెబ్బదిమంది పెద్దలు కొండమీదికి వెళ్ళి దేవుని సన్నిధిలో అన్నపానీయాలు సేవించారు - నిర్గ 24,9-11.

యూదులు పాలస్తీనా దేశంలో స్థిరపడిన పిదప అర్పించిన బలుల్లో సమాధాన బలి ముఖ్యమైంది. దానిలో కోడెను గాని పొట్టేలునుగాని వధించి దాని నెత్తుటిని పీఠం మీద చిలకరించేవాళ్ళు. దాని మాంసాన్ని యాజకులూ బలినర్పించే భక్తులూ వండుకొని తినేవాళ్ళు. ఇది పవిత్రమైన నైవేద్యం. కనుక దీన్ని దేవళంలో ఓ నియమిత స్థలంలోనే తినాలి. ఎవరు పడితే వాళ్ళు దాన్ని ముట్టుకోగూడదు - లేవీ 7,15. ఈ బలి నైవేద్యాలన్నీ నూత్నవేద సత్రసాదాన్ని సూచిస్తాయి.

దివ్యసత్రసాదం భోజనం అనే సంగతి నూత్నవేదంలో యోహాను సువార్త 6వ అధ్యాయం వివరంగా వర్ణిస్తుంది. ఇక్కడ మొదట సందర్భాన్ని గుర్తించాలి. క్రీస్తు ఐదు రొట్టెలతో ఐదువేల మందికి ఆహారం పెట్టాడు. ఈ యద్భుతం భక్తులకు పూర్వవేదం లోని మన్నా భోజనాన్ని గుర్తుకి తెచ్చింది - 6,1-14. మెస్సీయా వచ్చినపుడు మన్నా మళ్ళా కురుస్తుందని కూడ యూదులు నమ్మేవాళ్లు. "ఆ రోజుల్లో మళ్ళా ఆకాశం నుండి

మన్నా కురుస్తుంది" అని చెప్తుంది బరూకు దర్శన గ్రంథం - 29,8. ఇంకా ఇది పాస్కపండుగ సందర్భం కూడ - యోహా 6,4. కనుక ఈ భోజనం పాస్క భోజనాన్ని జ్ఞప్తికి తెస్తుంది.

ఇక దివ్యభోజనాన్ని గూర్చిన యోహాను బోధను తిలకిద్దాం. క్రీస్తు తానే జీవాహారాన్నని చెప్పాడు. ఈ యాహారం మన్నా కంటె మెరుగైంది. మన్నా తిన్న పితరులు చనిపోయారు. కాని ఈ జీవాహారాన్ని తిన్నవాడు చనిపోడు - 6,49-50. క్రీస్తు శరీరాన్ని భుజించి అతని రక్తాన్ని పానం జేసేవాడు నిత్యజీవం పొందుతాడు - 53. ఈ భోజనాన్ని తినేవాడు క్రీస్తులో నెలకొంటాడు. ప్రభువూ అతనిలో నెలకొంటాడు-56. ఇది ఉత్థానాన్ని గూడ ప్రసాదిస్తుంది-54. కాని అన్నిటికంటె ముఖ్యమైన వాక్యం 57వది. తండ్రి పంపగా వచ్చిన క్రీస్తు ఆ తండ్రినుండి జీవం పొందినట్లే, క్రీస్తుని భుజించిన భక్తుడు కూడ ఆ క్రీస్తునుండే జీవం పొందుతాడు. అదే జీవవాహిని తండ్రినుండి క్రీస్తునీ, ఉత్థాన క్రీస్తునుండి భక్తుణ్ణీ చేరుతుంది. ఈ జీవవాహిని పరిశుద్ధాత్మే.

పై వాక్యాల్లో యోహాను దివ్యసత్ప్రసాదాన్ని ఓ విందుగా భావించాడు. అది మనకు జీవమిచ్చే విందు. దాని ద్వారా మనం ఉత్థాన క్రీస్తు జీవం పొంది అతనితో ఐక్యమౌతాం.

## 2. జీవమయమైన ఆహారం

మూడవ శతాబ్దానికి చెందిన అలెగ్జాండ్రియా సిరిల్ అనే భక్తుడు దివ్యసత్ప్రసాదాన్ని గూర్చి ఈలా వ్రాసాడు. "ద్రాక్షసారాయంలో ముంచిన రొట్టెను ఆ పానీయం రుచిమంతం చేస్తుంది. తేనెలో ముంచిన వస్తువును ఆ తేనె మధురం చేస్తుంది. అగ్నిలో పెట్టిన ఇనుమును ఆ యగ్ని గనగన మండిస్తుంది. అలాగే దైవవార్త మన మానుష శరీరాన్ని చేకొన్నపుడు ఆ శరీరాన్ని జీవమయం చేసింది. దివ్యసత్ప్రసాదంలో మనం భుజించేది ఈ శరీరాన్నే. నేను తండ్రి నుండి జీవం పొందినట్లే నన్ను భుజించేవాడు కూడ నానుండి జీవం పొందుతాడు అన్నాడు ప్రభువు. ఏలాగ? మైనపు ముక్కను మరో మైనపు ముక్కకు అంటిస్తే అవి రెండూ ఒకటిగా అంటుకొనిపోతాయి. అలాగే క్రీస్తు శరీరాన్ని భుజించి అతని రక్తాన్ని పానం జేసేవాడు అతనితో అతుకుకొనిపోతాడు. ఇక అభక్తుడు ప్రభువులోను, ప్రభువు అతనిలోను వసిస్తారు". ఈ వాక్యం ప్రకారం దైవవార్త మొదట క్రీస్తు శరీరాన్ని జీవమయం చేస్తుంది. దివ్యసత్ప్రసాదంలో మనం ఈ జీవమయ శరీరాన్ని భుజించినపుడు అది మనలను గూడ జీవమయులను చేస్తుంది.

మన ఉత్థానాన్ని గూర్చి చెప్తూ సిరిల్ భక్తుడే ఈలా వ్రాసాడు. "ప్రభువు తన్ను భుజించినవాణ్ణి అంత్యదినాన లేపుతానన్నాడు. జీవనమూర్తియైన ప్రభువు మన మృత్యువుని తప్పక నాశం చేస్తాడు. ప్రభువు జీవన శరీరం మనలో వుంది. మరి అది మనకు జీవమీయకుండా వుంటుందా? మనం నిప్పుకణిక చుట్టూ ఊకను పేరుస్తాం. ఆ యగ్నిబీజం ఆ వూకను మండిస్తుంది. అలాగే క్రీస్తు కూడ తన జీవన శరీరాన్ని ఓ బీజం లాగ మన శరీరంలోకి ప్రవేశపెడతాడు. ఈ యమృత బీజం మన మృత్యువుని నాశం చేసి మనకు ఉత్థానాన్ని దయచేస్తుంది". ఇవి ఉదాత్తమైన భావాలు కదా!

దివ్యసత్ప్రసాదం ఉత్థాన క్రీస్తు శరీరం. దానిలో పరిశుద్ధాత్మ కూడ వుంటుంది. ఆత్మశక్తితోనే గదా క్రీస్తు ఉత్థానమైంది? మనం దివ్యసత్ప్రసాదాన్ని స్వీకరించినపుడు దానిలోని ఆత్మ మనకు గూడ ఉత్థానాన్ని దయచేస్తుంది. ఈ భావాన్ని మాప్సువెస్తియా తియోడోరెట్ అనే వేదాంతి ఈలా వివరించాడు. "గురువు రొట్టెరసాలను ఆశీర్వదించి అవి క్రీస్తు శరీరరక్తాలు అన్నపుడు ఆత్మ వాటిమీదికి దిగివచ్చి వాటిని అభిషేకించి అమృతమయం చేస్తుంది. పూర్వం క్రీస్తు మృతదేహాన్ని అభిషేకించి దానికి ప్రాణమిచ్చిన ఆత్మే యిపుడు ఈ భౌతిక పదార్థాలను గూడ ప్రాణమయం చేస్తుంది. కనుక ఆత్మ అభిషేకం ద్వారా ఇవి కూడ ఆ క్రీస్తు ఉత్థాన దేహంలాగే అనశ్వరాలూ అబాధితాలూ అమృతమయాలు ఔతాయి. ఇక, మనం ఈ శరీరరక్తాలను భుజించినపుడు అవి తమలో వున్న ఆత్మశక్తిద్వారా మనకు గూడ అమరత్వం దయచేస్తాయి. వాటిలో వున్న ఆత్మ వరప్రసాదం మనలోనికి ప్రవహించి మనలను చావులేని వాళ్ళనుగా చేస్తుంది."

## 3. మన కానుకలే మనకాహారం

మనం భుజించే దివ్యసత్ప్రసాదం పూర్వం మనమర్పించిన కానుకలే. మనం భౌతిక పదార్థాలైన రొట్టెరసాలను దేవునికి కానుకగా అర్పిస్తాం. పూజలో సమర్పణ భాగంలో ఈ కార్యం జరుగుతుంది. మనమర్పించిన కానుకలను దేవుడు అంగీకరిస్తాడు. వాటిని ఆశీర్వదిస్తాడు, తన సాన్నిధ్యంతో నింపుతాడు. ఈ కార్యం నడిపూజలో జరుగుతుంది. ఆ ప్రభువు మనమిచ్చిన కానుకలను తిరిగి మనకే భోజనంగా అందిస్తాడు. వీటిని మనం భుజిస్తాం. భుజించి ప్రభువు జీవంతో, అతని ఆత్మతో నిండిపోతాం. ఈ కార్యం దివ్యసత్ప్రసాద స్వీకార సమయంలో జరుగుతుంది. కానుకలు అర్పించడం బలి. వాటిని భుజించడం సత్ప్రసాదం. బలినర్పించడమూ, సత్ప్రసాదాన్ని భుజించడమూ రెండూ ముఖ్యమే. అసలు అవి రెండూ కలసి ఒకే ఆరాధన. ఈ యారాధనం మన కానుకలను దేవునికి అర్పించడం, అతడు వాటిని మళ్ళా మనకందీయడం అనే రెండు క్రియలతో - ఇచ్చి పుచ్చుకోవడంతో - కూడి వుంటుంది.

ఈలా కానుకలను ఇచ్చిపుచ్చుకోవడం పవిత్రమైన కార్యం. నరుడు సృష్టివస్తువుల రూపంలో దేవుడు తనకిచ్చిన కానుకలనే దేవుని కర్పిస్తాడు. దేవుడు ఆ కానుకలను తీసికొని వాటిని తన సాన్నిధ్యంతో నింపుతాడు. వాటిని వాటిద్వారా తన్నూ, భక్తునికి దయచేస్తాడు. ఈలా తాను పొందిన కానుకలను దేవునికిచ్చిన భక్తుడు, మళ్ళా ఆ కానుకల ద్వారానే దేవుణ్ణి పొందుతాడు.

పూర్వం మోషేద్వారా దేవుడు ఓ ప్రజను ఏర్పరచుకొన్నాడు. సీనాయి నిబంధనతో మోషే నాయకత్వాన యిస్రాయేలీయులు యావే ప్రజలయ్యారు. అతన్ని కొలచే భక్తులయ్యారు. ఈనాడు క్రీస్తుద్వారా తండ్రి మరో ప్రజను ఏర్పరచుకొంటాడు. క్రీస్తు సిలువబలిలో పాల్గొని అతన్ని ఆహారంగా పుచ్చుకొనే వాళ్ళంతా తండ్రి ప్రజలౌతారు.

నేడు గురువు ప్రజలవైపు మళ్ళి ప్రజలకు అభిముఖంగా వున్న పీఠంమీద, పూజచేస్తాడు. ఈపీఠం భోజనపు బల్ల. కనుక పూజలో విశ్వాసులందరినీ ఈ బల్ల దగ్గరికి భోజనానికి ఆహ్వానించినట్లవుతుంది. ఇంకా ఈ పీఠం క్రీస్తుని సూచిస్తుంది కూడ. ఈ పీఠంమీద, ఇది సూచించే క్రీస్తుద్వారా, తండ్రికి బలినర్పిస్తాం. పూర్వవేదంలో గూడ పీఠం దేవునికి గుర్తు. యూదులు పీఠంమీద, అది సూచించే దేవునికి బలినర్పించారు. కాని నూత్నవేదంలో మనం మన పీఠం సూచించే క్రీస్తుకి బలినర్పించం. ఆ క్రీస్తుద్వారా తండ్రికి బలినర్పిస్తాం. ఆ క్రీస్తునే తండ్రికి బలిగా, కానుకగా అర్పిస్తాం. అలా మనం అర్పించిన క్రీస్తునే తండ్రి మళ్ళా మనకు భోజనంగా అందిస్తాడు.

## 4. పాపపరిహారమూ, కృతజ్ఞతా

పాపోచ్చారణం ద్వారా పాపపరిహారం పొందుతామని మనకు తెలుసు. కాని దివ్యసత్ప్రసాదం ద్వార గూడ చావైన పాపాలకు పరిహారం లభిస్తుంది. మనం చావైన పాపం కట్టుకొనినపుడు అంతకు పూర్వమే భుజించిన దివ్యసత్ప్రసాదం ఫలితంగా పశ్చాత్తాపం కలుగుతుంది. ఆ పశ్చాత్తాపంతోనే పాపసంకీర్తనం చేసి పాపపరిహారం పొందుతాం. నాడు క్రీస్తు సిలువబలి ద్వారా సాధించిన పాపపరిహారాన్ని నేడు ఈ దివ్యభోజనం మనకు వర్తింపజేస్తుంది. ఫలితంగా మనం చావైన పాపాలను గూడ తొలగించుకొంటాం. ఇది మన చావైన పాపాలనే పరిహరిస్తే స్వల్ప పాపాలను తప్పక పరిహరిస్తుంది. కనుక పాపోచ్చారణం ద్వారా మాత్రమే పాపాలు పరిహారమౌతాయి అని చెప్పకూడదు. సత్ప్రసాదం ద్వారా గూడ ఆ కార్యం జరుగుతుంది.

పూజబలీ దివ్యసత్ప్రసాద స్వీకారమూ, ముగిసాక కొంచెం కాలంపాటు గుడిలోనే వుండి దేవునికి వందనాలు అర్పించాలి. ఈ రక్షణ కార్యంలో పాల్గొనే భాగ్యం

దయచేసినందుకు దేవునికి కృతజ్ఞత చెల్లించాలి. ఈ కృతజ్ఞత ప్రధానంగా దేవుణ్ణి ఆరాధించడానికి ఉద్దేశించింది కాదు. మరి దివ్యబలితోను దివ్యభోజనం తోను మనకుండే సంబంధాన్ని పొడిగించుకొనేది.

కొందరు దివ్యసత్ప్రసాదబలే కృతజ్ఞతాబలికదా, పూజముగిసాక మళ్ళా ప్రత్యేకంగా కృతజ్ఞత సమర్పించు కోవడమెందుకు అంటారు. ఇది కుతర్కం. కొందరు ఈలా వాదించకపోయినా పూజ ముగియగానే గబాలున గుడిలో నుండి వెళ్ళిపోతారు. ఇది చెడ్డ పద్ధతి. పూజబలి కృతజ్ఞతాబలి అన్నమాట నిజమే. కాని ఈ కృతజ్ఞత క్రైస్తవ ప్రజా సమూహమంతా కలసి సమర్పించుకొనేది. దానితోపాటు మన వ్యక్తిగతమైన కృతజ్ఞత కూడ వుండాలి. దీన్ని పూజ ముగిసాక వ్యక్తిగతంగా సమర్పించుకోవాలి.

పూజల్లోవాడే ఓ ప్రార్థనం "ఓ ప్రభూ! మేము నీకు సదా కృతజ్ఞతాస్తుతులు చెల్లించే భాగ్యం దయచేయి. ఏనాడూ నీ స్తుతిని మరచిపోకుండా వుండేలా అనుగ్రహించు" అని చెప్తుంది. కనుక పూజ ముగిసాక కొన్ని నిమిషాల పాటు గుళ్ళోనే వుండి ప్రభువుకి వందనాలర్పించడం మంచి పద్ధతి.

## 5. రెండు రూపాల్లో సత్ప్రసాదం

నేడు మన విశ్వాసులు మామూలుగా రొట్టెరూపంలోనే సత్ప్రసాదాన్ని స్వీకరిస్తారు. చారిత్రకంగా జూస్తే తొలిరోజుల్లో రొట్టెరసాలనే రెండురూపాల్లోను ఈ ప్రసాదాన్ని పుచ్చుకొనేవాళ్లు. క్రీస్తు దీన్ని స్థాపించినపుడు ఈ రెండు రూపాల్లో స్థాపించాడు. నా శరీరం ఆహారం, నా రక్తం పానం అన్నాడు - యోహా 6,55. పౌలు ఈ రెండు రూపాలనూ పేర్కొన్నాడు - 1కొ 11,28. 12వ శతాబ్దం వరకు ఈ భోజనాన్ని సామాన్యంగా రెండు రూపాల్లోను అందించారు. కాని ఇదే కాలంలో దీన్ని అరుదుగా ఏకరూపంలో కూడ ఇచ్చేవాళ్ళు. విశ్వాసులు రొట్టెరూపంలో వున్న దివ్యసత్ప్రసాదాన్ని మాత్రమే ఇండ్లకు తీసుకువెళ్ళి అక్కడ దాన్ని భుజించేవాళ్ళు. గుళ్ళల్లో కూడ దివ్యసత్ప్రసాదాన్ని మాత్రమే పదిలపరచి వ్యాధిగ్రస్తులు మొదలైన వాళ్ళకు ఇచ్చేవాళ్ళు. ఈ రొట్టెను భుజించలేని రోగులకు దివ్యరక్తాన్ని మాత్రమే ఇచ్చేవాళ్ళు.

13-15 శతాబ్దాల్లో ఈ విందుని ద్విరూపంలో గాక ఏకరూపంలోనే భుజించారు. విశ్వాసుల సంఖ్య పెరిగిపోయే కొద్దీ దివ్యరక్తాన్ని పంచి యీయడం కష్టమనుకొని దాన్ని ఆపివేసారు. అరుదుగా మాత్రం ఈ భోజనాన్ని ద్విరూపాల్లో ఇస్తుండేవాళ్ళు.

ఇక 16-20 శతాబ్దాల్లో చరిత్ర వేరు. 16వ శతాబ్దంలో ఆదిమశాఖ నుండి చీలిపోయిన ప్రోటస్టెంటు సంస్కరణ నాయకులు దివ్యసత్ప్రసాదాన్ని రెండు రూపాల్లోను ఈయాలన్నారు. అలా ఈయడం దైవశాసనమని వాదించారు. క్రీస్తు దీన్ని రెండు రూపాల్లో స్థాపించాడని ప్రమాణం చూపించారు. ట్రెంటు మహాసభ ఈ వాదాన్ని ఖండించి ఈలా

బోధించింది. రెండురూపాల్లో దివ్యసత్ప్రసాదాన్ని ఈయాలన్నది దైవశాసనం కాదు. ఈ భోజనాన్ని ఏవిధంగా పంచిపెట్టవలసింది నిర్ణయించే అధికారం శ్రీసభ కుంది. దాన్ని రొట్టెరూపంలో స్వీకరించినా రక్తరూపంలో స్వీకరించినా పూర్తి క్రీస్తుని స్వీకరించవచ్చు. కనుక దాన్ని ద్విరూపంలో స్వీకరించినా ఏక రూపంలో స్వీకరించినా ఫలితమేమో సమానమే.

ఇటీవల జరిగిన వాటికన్ మహాసభపై ట్రెంటు బోధలను పునరుద్ఘాటించింది. కొన్ని ముఖ్యమైన సందర్భాల్లో మాత్రం విశ్వాసులకు ఈ భోజనాన్ని ద్విరూపాల్లో ఈయడం ఉచితమని చెప్పింది. ఆ సందర్భాలు గురుపట్టం, జ్ఞానవివాహం, జ్ఞానస్నానం, అవస్థాభ్యంగనం మొదలైన సంస్కారాలు, స్థానిక ఉత్సవాలూ, సభలూ సమావేశాలూ, జూబిలీ ఉత్సవాలు మొదలైనవి. నేడు చాల తావుల్లో ఈలాంటి సందర్భాల్లో దివ్యరక్తాన్ని గూడ ఇస్తున్నారు.

ట్రెంటు మహాసభ ఈ భోజనాన్ని ఏకరూపంలో భుజించినా ద్విరూపంలో భుజించినా ఫలితం సమానమేనని చెప్పిందన్నాం. ఈ ఫలితం విషయం ఏలా వున్నా, దీన్ని ద్విరూపంలో భుజించినపుడు ఎక్కువ అర్థయుక్తంగా వుంటుంది. కారణాలివి : 1. ప్రభువు దీన్ని అన్నపానీయాలుగా స్థాపించాడు. నా శరీరం మీకాహారం, నా రక్తం మీకు పానం అన్నాడు. కనుక అన్నపానీయాలనే రెండు రూపాల్లో పుచ్చుకొన్నపుడే దీన్ని పూర్ణభోజనంగా స్వీకరించినట్లవుతుంది. 2. ఈ విందు సీనాయి నిబంధనాన్ని సూచిస్తుంది. ఆ నిబంధనంలో రక్తం వుంది. 3. ఈ విందు రానున్న మోక్షపు విందును సూచిస్తుంది. కాని ఆ మోక్షపు విందులో ద్రాక్షసారాయం కూడ వుంటుంది - మత్త 26,27-29. (యూదులు మోక్షాన్ని ద్రాక్షసారాయంతో కూడిన విందుగా భావించారు.) 4. రెండు రూపాల్లో పుచ్చుకొన్నప్పుడు సమైక్యత రీత్యా ప్రోటస్టెంటు సమాజాలతో ఏకీభావం కుదురుతుంది.

నేడు మన క్యాతలిక్ సమాజంలో మామూలుగా దివ్యరక్తాన్ని విశ్వాసులకీయక పోవడానికి కారణం దాన్ని ఈయకూడదన్న భావం కాదు. మరి అలా ఈయడంలో వున్న చిక్కులు. వాటికన్ సభ బోధించినట్లూ, నేడు మనవాళ్ళు చాల తావుల్లో చేస్తున్నట్లూ, కొన్ని ముఖ్య సందర్భాల్లో దీన్ని విశ్వాసులకిస్తే సమస్య తీరిపోతుంది.

## ప్రార్థనాభావాలు

1. మన పూజకు సూచనాలైన పూర్వవేదపు పాస్కబలీ నిబంధనబలీ రెండిటిలోను నైవేద్యాన్ని భుజించడమనేది వుంది. నూత్నవేదం పూజబలిని పేర్కొనేపుడెల్ల దివ్యసత్ప్రసాదాన్ని గూడ పేర్కొంటుంది. (యోహా 6. అ.చ. 2,42-46.

1కొ 10. 1కొ 11. సువిశేషాల్లో దివ్య సత్ప్రసాదాన్ని గూర్చిన వాక్యాలు.) ఇంకా క్రీసభ తొలిరోజుల్లో పూజలో పాల్గొనే వాళ్ళంతా దివ్యసత్ప్రసాదాన్ని పుచ్చుకొనేవాళ్ళు. ఈ కారణాల వల్ల నేడు భక్తులు కేవలం పూజలో పాల్గొంటేనే చాలదు. దివ్యసత్ప్రసాదాన్ని గూడ స్వీకరించాలి. ఆ భోజనాన్ని స్వీకరించడానికి అవకాశం లేని పరిస్థితుల్లో ఆధ్యాత్మిక విధంగానైన దాన్ని స్వీకరించాలి.

2. నూత్నవేదం ఉత్థాన క్రీస్తుని వర్ణించేపుడు అతడు తేజస్సు కలవాడని చెప్తుంది - 2కొ 4,18. అతడు ఆత్మ కలవాడని చెప్తుంది - 1కొ 15,45. అతడు శక్తి కలవాడని చెప్తుంది - రోమ 1,4. కనుక తేజస్సు, ఆత్మ, శక్తి ఉత్థాన క్రీస్తులో కన్పిస్తాయి. ఈ మూడు భావాలు ఒకటే. ఆత్మ తన సాన్నిధ్యంతో, శక్తితో, తేజస్సుతో ఉత్థానక్రీస్తు దేహంలో నెలకొంటుంది. ఇక, ఈ మూడు గుణాలు దివ్య సత్ప్రసాదానికి గూడ వుంటాయి. అది ఉత్థాన క్రీస్తు దేహమే.

3. ప్రభువు మన భౌతిక వస్తువులైన రొట్టెరసాలనే తన శరీరరక్తాలను చేసికొంటాడు. వాటిని తయారుచేయడానికి మనం చేసిన కృషిని దీవిస్తాడు. తాను వాటిలోనికి ప్రవేశించి వాటిని తన సాన్నిధ్యంతో నింపుతాడు. ఈలా దేవుడు భౌతిక వస్తువుల్లోకి ప్రవేశించడమనేది మనుష్యావతార సమయంలోనే జరిగింది. ఆ సమయం నుండి దేవుడు సృష్టి వస్తువులన్నిటిలోను నెలకొని వున్నాడు. కనుక ఈ సృష్టీ, ఈ భౌతిక ప్రపంచం చెడ్డది కాదు, మంచిది. ఇక్కడ ప్రతి వస్తువులోను అతని సాన్నిధ్యాన్ని దర్శించవచ్చు. అలాగే ఈ మంటిమీద మన కృషికూడ నిరర్థకమైపోదు. దేవుడు దాన్ని తన సాన్నిధ్యంతో నింపుతాడు. బహూకరిస్తాడు.

4. మన ఈ దేహం ఉత్థానం కోసం ఉద్దేశింపబడింది. నేడు ప్రభువుని భుజించే ఈ శరీరం ఓ దినం దేవుని ఎదుట నిలుస్తుంది. భక్తుడు ఇరెనేయుసు ఈలా వ్రాసాడు. "ద్రాక్ష కొమ్మను నరికి నేలలో నాటితే అది మళ్ళా చిగురు వేసి పెరుగుతుంది. గోదుమ గింజను భూమిలో నాటితే అది మళ్ళా మొలకెత్తుతుంది. వీటిల్లో జీవశక్తి వుంది. కనుకనే యివి పెరుగుతున్నాయి. ఈలాగే మనం స్వీకరించిన దివ్య సత్ప్రసదం గూడ మనకు జీవశక్తిని ఇస్తుంది. ఈ జీవశక్తి తోనే భూమిలో నాటబడిన మన దేహం కూడ మళ్ళా అంత్యదినాన లేస్తుంది." పదునెన్మిదవ శతాబ్ద బోధకుడు బోసువే "దివ్యసత్ప్రసాదాన్ని స్వీకరించడమంటె మోక్షాన్ని ఈ లోకంలో వుండగానే పొందడమే" అని నుడివాడు. కనుక ఈ దేహంపట్ల- అది పురుష దేహమైనా సరే, స్త్రీ దేహమైనా సరే - మనకు పూజ్య భావాలుండాలి. దాన్ని కామ దృష్టితో జూచి అపవిత్రం చేయకూడదు.

5. అగస్టీను భావాల ప్రకారం, అన్ని భోజనాలు మనలోనికి మారతాయి. కాని దివ్యభోజనం మనలోనికి మారదు కదా, మనలను తనలోనికి మార్చుకొంటుంది. అనగా దీనిద్వారా మనం క్రీస్తులోనికి మారతాం, అతనితో ఐక్యమౌతాం. ఇది మనలను దివ్యలను చేస్తుంది.

6. మనం దైవస్వభావంలో పాలు పొందుతామని చెప్తుంది రెండవ పేత్రు జాబు 1,4. ఈ క్రియ ప్రధానంగా జ్ఞానస్నానం ద్వారా జరుగుతుంది. కాని దివ్యసత్ర్పసాదం ద్వారా కూడ మనం దైవస్వభావంలో పాలు పొందుతాం. దానిద్వారా అతడు మనలోను మనం ప్రభువులోను వసిస్తాం - యోహా 6,56. దేవుని స్వభావం పొంది దేవునితో ఐక్యం అవడమంటే యిదే. ఇది సామాన్య భాగ్యమేమీ కాదు.

# 10. దివ్యసత్ర్పసాదం మనలను తోడి నరులతో ఐక్యపరుస్తుంది

"రొట్టె ఒక్కటే. ఆ వొకే రొట్టెలో పాలుపొందే మనం అనేకులమైనా ఒకే శరీరమౌతాం" - 1కొ 10,17.

దివ్యసత్ర్పసాదం మనలను ఉత్థాన క్రీస్తుతో ఐక్యం చేసినట్లే తోడి ప్రజలతో గూడ ఐక్యం జేస్తుంది. ఈ చివరి అధ్యాయంలో ఆ దివ్యభోజనం కలిగించే సామాజిక స్ఫురణను పరిశీలించి చూద్దాం. ఇక్కడ ఐదంశాలు విలోకిద్దాం.

## 1. సంఘీభావం

నూత్నవేదం చాలాతావుల్లో దివ్యభోజనం సంఘీభావం కలిగిస్తుందని చెప్తుంది. ఇక్కడ మూడంశాలు మాత్రం పరిశీలిద్దాం.

1. యోహాను 15-17 అధ్యాయాలు యాజకుడుగా క్రీస్తు చేసిన ప్రార్థనం. అతని సువార్తలో ఈ యధ్యాయాలు దివ్యసత్ర్పసాద స్థాపనకు సంబంధించినవి. ఈ యధ్యాయాల్లో క్రీస్తు తన శిష్యులకు ఐక్యతాభావం సిద్ధించాలని తండ్రిని ప్రార్థించాడు. ప్రస్తుతం మనం ఈ భాగం నుండి రెండు ఘట్టాలను మాత్రం పరిశీలిద్దాం.

1) 15,12-14. నేను మిమ్ము ప్రేమించినట్లే మీరూ ఒకరినొకరు ప్రేమించాలి అన్నాడు ప్రభువు. మన పరస్పర ప్రేమకు క్రీస్తు మనపట్ల చూపిన ప్రేమే ఆదర్శం కావాలి. కాని అతడు మనపట్ల చూపిన ప్రేమ ఏలాంటిది? మనలను అంతందాకా, అనగా గాఢంగా

ప్రేమించేది - 13,1. మనకోసం ప్రాణాలు కూడ వొడ్డేది - 5,13. తోడిజనం పట్ల మన ప్రేమ కూడ ఈలాంటిదై యుండాలి. ఈలాంటి సోదరప్రేమ మనకు దివ్యసత్ప్రసాదం ద్వారా సిద్ధిస్తుంది.

2) 17,20-23. తండ్రీ కుమారులు ఏకమైయున్నట్లే శిష్యులు కూడ పరస్పరం ఏకమై యుండాలి. లోకంలో ఈలాంటి ఐక్యభావముండదు కనుక శిష్యుల ఐక్యభావం లోకానికి ఆశ్చర్యం కలిగిస్తుంది. ఆ శిష్యులను చూచి వాళ్ల గురువైన క్రీస్తు దేవుడని లోకం విశ్వసించింది. ఇక శిష్యులకు ఈ ఐక్యభావాన్ని ప్రసాదించేది ఉత్థానక్రీస్తు, అతని దివ్యదేహం.

2. 1కొ 10,17. పూర్వం పూజలో ఒక్కటే పెద్ద రొట్టెను ఆశీర్వదించి అందరికీ సత్ప్రసాదంగా పంచిపెట్టేవాళ్ళు. ఆ రొట్టె క్రీస్తు శరీరం. ఆ వొకే రొట్టెలో పాలుపొందే వాళ్లంతా ఒక్క శరీరం - అనగా ఒక్క శ్రీసభ, ఒక్క క్రైస్తవ సమాజం ఔతారు. ఈలా సత్ప్రసాదం మనకు ఐక్యతను ప్రసాదిస్తుంది. జ్ఞానస్నానంతోనే ఈ యైక్యత ప్రారంభమౌతుంది. అతనిలోకి జ్ఞానస్నానం పొందినవాళ్ళల్లో జాతి విభేదం లేదు. స్త్రీ పురుష భేదం లేదు. ధనిక దరిద్ర భేదం లేదు. అందరూ ఒక్కటే - గల 3,28. ఈలా జ్ఞానస్నానంతోనే ప్రారంభమైన ఐక్యభావం సత్ప్రసాదంతో పరిపూర్ణత నొందుతుంది.

3. అ.చ. 2,42-47. తొలినాటి యెరూషలేములోని క్రైస్తవులు ప్రేమభావంతో ఉమ్మడి జీవితం జీవించారు. 42వ వచనం ప్రకారం వీళ్లు నాలుగు కార్యాలు చేసారు. 1) అపోస్తలులు ఉత్థాన క్రీస్తుని గూర్చి బోధిస్తుంటే శ్రద్ధగా విని అతన్ని విశ్వసించారు. 2) అందరు కలసి ఉమ్మడి జీవితం జీవించారు. 3) అందరూ కలసి ప్రేమవిందులో పాల్గొన్నారు. ఈ విందులో మామూలు భోజనమూ దివ్యసత్ప్రసాదమూ రెండూ భుజించేవాళ్ళు. 4) అపోస్తలుల ఆధిపత్యం క్రింద ప్రార్థనం జేసికొన్నారు. ఈ నాల్గు కార్యాల్లోను దివ్యసత్ప్రసాద స్వీకరణం ముఖ్యమైంది. వాళ్ళు ఉత్థాన క్రీస్తు పేరుమీదిగానే ఆలా కలసిమెలసి ఉమ్మడి జీవితం జీవించారు. ఆ ఉత్థాన క్రీస్తునే దివ్యభోజనంగా గూడ పుచ్చుకొన్నారు. ఈ భోజనం శక్తి వల్లనే ఏక మనస్కులు కాగలిగారు, ఒకరి ఆస్తిని ఒకరికి పంచి యీయగలిగారు. సత్ప్రసాదం సాధించిపెట్టే ప్రేమ జీవితానికి ఈ ఘట్టం చక్కని తార్కాణం.

## 2. ఆత్మ దివ్యసత్ప్రసాదాల ద్వారా ఐక్యత

దివ్యసత్ప్రసాదమూ ఆత్మా రెండూ గూడ క్రైస్తవ ప్రజలను ఐక్యపరుస్తాయి. ఆత్మద్వారానే గదా క్రీస్తు ఉత్థానమైంది? - రోమా 8,11. కనుక ఉత్థాన క్రీస్తు దేహమైన

దివ్యసత్ప్రసాదంలో గూడ ఆత్మ సమృద్ధిగా వుంటుంది. ఈ యాత్మా పరమప్రసాదమూ మనలను ఐక్యపరచే తీరును గూర్చి మూడవ శతాబ్ద భక్తుడు అలెగ్జాండ్రియా సిరిల్ ఈలా చెప్పాడు. "మనమందరము ఒకే ఆత్మను స్వీకరిస్తాం. ఆ యొకే ఆత్మ ద్వారా మనలో మనం ఐక్యమౌతాం. దేవునితోను ఐక్యమౌతాం. మనం చాలమందిమి. క్రీస్తు మనలో ఒక్కొక్కరిలోనికి తన ఆత్మను ప్రవేశపెడతాడు. కాని ఈ యాత్ముడు ఒక్కడే. అతడు మనలనందరినీ ఏకం చేస్తాడు. అతనియందు మనమందరం ఒక్కటిగా ఒనగూడేలా చేస్తాడు. ఏలాగంటే, క్రీస్తుని దివ్యభోజనంగా స్వీకరించిన వాళ్ళంతా అతనియందు ఒక్కటిగా ఐక్యమౌతారు కదా! ఈలాగే అందరిలోను వసించే ఆ వొకే ఆత్మ అందరినీ తనయందు ఒక్కటిగా ఐక్యపరుస్తుంది." ఈ వాక్యాలను బట్టి ఆత్మా దివ్యసత్ప్రసాదమూ మనలను ఐక్యపరుస్తాయని అర్థం చేసికోవాలి.

రెండవ శతాబ్దపు ఆరాధన గ్రంథం "డిడాకే". ఆ గ్రంథం ఈలా చెప్తుంది. "ఓ ప్రభూ! ఈ పూజలో మేము విరిచే రొట్టె మొదట కొండల్లో పండిన గోదుమ గింజలు. వాటినన్నిటినీ ఏకంచేసి ఇక్కడ ఒక్క రొట్టెగా తయారుచేసాం. ఇక్కడ మేము పానంజేసే ద్రాక్షసారాయం గూడ చాల పండ్ల నుండి తీసిన రసం. ఈ పదార్థాలను లాగే శ్రీసభలోని నీ ప్రజలను గూడ లోకం నాల్గు చెరగుల నుండి చేరదీసి ఇక్కడ ఒక్క సమాజంగా ఏకంజేయి." ఇది చాల అర్థవంతమైన ప్రార్థనం. చాల గోదుమగింజలు కూడి ఒక్క అప్పమూ, చాల ద్రాక్షపండ్లు కలసి చేరెడు రసమూ ఔతాయి. అలాగే చాలమంది ప్రజలు కలసి ఒక్క శ్రీసభ ఔతారు. దివ్యసత్ప్రసాదమే మనకు ఈ ఐక్యతాభాగ్యాన్ని దయచేస్తుంది.

## 3. దివ్యసత్ప్రసాదం సూచించే ఐక్యతాభావాలు

దివ్యభోజనం చాలా ఐక్యతాభావాలను సూచిస్తుంది. ప్రస్తుతం కొన్నిటిని పరిశీలిద్దాం.

1. క్రీస్తు ఏడు సంస్కారాల్లో సత్ప్రసాదాన్ని మాత్రమే భోజనంగా నెలకొల్పాడు. పాస్కపండుగ సందర్భంలో క్రీస్తు కడపటి భోజనాన్ని భుజించాడు. కనుక ఆ పాస్కభోజనాన్ని గుర్తుకుతెచ్చేలా దీన్నిగూడ భోజన రూపంలో నెలకొల్పడం జరిగింది. ఇక, యూదుల సంప్రదాయం ప్రకారం భోజనం ఎప్పుడు కూడ ఓ మందిని సూచిస్తుంది. ఇక్కడ పదిమందీ తిని త్రాగుతారు. వాళ్ళందరికీ పరస్పర సోదరభావం వుంటుంది. ఈ సంప్రదాయం ప్రకారం దివ్యసత్ప్రసాదం గూడ సోదరభావాన్ని కలిగించాలి. ఈ విందులో పాల్గొనేవాళ్ళంతా అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళలాంటి వాళ్ళు కావాలి.

2. ప్రభువు సత్ప్రసాద స్థాపన సమయంలో ఇది మీ కొరకు ఈయబడనున్న నా శరీరం అన్నాడు. ఇది మీ కొరకు చిందించబడనున్న నా రక్తం అన్నాడు. ఇవి బలి సంబంధమైన పదాలు. తర్వాత క్రీస్తు శరీరరక్తాలు సిలువ మీద అర్పింపబడతాయి. కనుక ఈ భోజనం సిలువను సూచిస్తుంది. ఈ సిలువబలి నరజాతి నంతటినీ దేవుని కుటుంబంగా ఐక్యపరచేది. అందుచేత సిలువబలిని సూచించే ఈ సత్ప్రసాద బలి కూడ నరుల నందరినీ ఐక్యం చేయాలి.

3. పూర్వం సీనాయి నిబంధనం ద్వారా యూదులు ఏకసమాజమయ్యారు. యావేను సేవించే భక్త సమాజమయ్యారు. ఆ సీనాయి నిబంధనం నేటి మన పూజనూ మన సత్ప్రసాదాన్నీ తలపిస్తుంది. కనుక ఈ ప్రసాదం ద్వారా గూడ మనం ఏకసమాజమౌతాం. క్రీస్తుని సేవించే భక్తబృంద మౌతాం.

4. పూజబలీ దివ్యసత్ప్రసాదమూ పూర్వవేదంలోని బాధామయ సేవకుణ్ణి గూడ జ్ఞప్తికి తెస్తాయని చెప్పాం. ఈ సేవకుని ద్వారా పూర్వవేద ప్రజలు ఒక్కసమాజ మయ్యారు - యెష 42,6. ఇక నూత్నవేదంలో క్రీస్తు ఈ బాధామయ సేవకుడు. నేడు దివ్యసత్ప్రసాదంలో వుండే ఉత్థాన సేవకుడు అతన్ని భుజించేవాళ్ళందరినీ ఒక్క సేవాసమాజంగా ఏకం జేస్తాడు. ఆ సేవకునియందు మనమందరమూ సేవకులమై పరస్పర సంబంధంతో లోకానికి సేవలు చేయాలి.

ఈలా సత్ప్రసాదం పలువిధాలుగా సామాజిక భావాలను సూచిస్తుంది. ఈ సామాజిక స్పృహ నేడు అత్యవసరం. దేశంలో మూడువంతులు పేదలు ఒక్కవంతు ధనికులు. ఈ రెండువర్గాల వాళ్ళకీ పొత్తు కుదరక స్పర్ధలూ కలహాలు చెలరేగుతున్నాయి. ప్రజలు ఒకరినుండి ఒకరు విడిపోతున్నారు. ఒకరి యెడల ఒకరు తోడేలులా ప్రవర్తిస్తున్నారు. ఈలాంటి పరిస్థితుల్లో దివ్యసత్ప్రసాదం విభజనను గాక ఐక్యతను సాధించి పెట్టాలి. విశ్వాసులకు కలహాలను గాదు ప్రేమను చేకూర్చి పెట్టాలి. విశేషంగా తోడి పేదజనం పట్ల జాలినీ కరుణనూ పుట్టించాలి. మనకున్నది తులమో ఫలమో తోడిపేదలతో పంచుకొనేలా చేయాలి. మనం దివ్యభోజనం ద్వారా ఈ సామాజిక స్పృహను పెంపొందించు కోలేకపోతే దానినుండి పొందవలసిన ఫలితాన్ని పొందలేదనే చెప్పాలి. దివ్యసత్ప్రసాదం ద్వారా క్రీస్తుతో ఐక్యంగావడం సులభ మనిపిస్తుంది. తోడిజనంతో, విశేషంగా పేదసాదలతో, ఐక్యంగావడం కష్టమనిపిస్తుంది. ఐనా ఈ రెండింటినీ సాధిస్తేనే గాని యథార్థ క్రైస్తవులం గాలేం.

## 4. శిరస్సుతో ఐక్యమైనవాళ్లు అవయవాలతో గూడ

పూర్వవేద ప్రజకు ఆదాము శిరస్సు. నూత్నవేద ప్రజకు రెండవ ఆదామైన క్రీస్తు శిరస్సు. జ్ఞానస్నాన సత్రసాదాల ద్వారా మనం అతనితో ఐక్యమౌతాం. అతడు మనలనందరినీ తన అవయవాలుగా తనలో యిముడ్చుకొంటాడు. కాని దేహంలోని అవయవాలన్నిటికీ పరస్పర సంబంధం వున్నట్లే క్రీస్తులోనికి ఐక్యమైన వాళ్ళందరికీ పరస్పర సంబంధం వుంటుంది. అతని అవయవాలమైన మనమూ తోడి ప్రజలూ అందరమూ కలసి పరస్పర ప్రేమభావంతో జీవించాలి. ఈ సందర్భంలో సిరిల్ భక్తుని వాక్యాలను గుర్తుకి తెచ్చుకోవాలి. "మనం భిన్న వ్యక్తులంగా వుంటాం. కాని క్రీస్తుద్వారా ఒక్క శరీరం, ఒక్క సమాజం ఔతాం. అతని శరీరాన్ని భుజించి అతని ఆత్మను పొందినపుడు ఈ ఐక్యత ప్రాప్తిస్తుంది. క్రీస్తు ఒక్కడే. చాల మందిమైన మనం అతనియందు ఒక్కటిగా ఒనగూడుతాం. కనుకనే అతడు పిత నుద్దేశించి తండ్రీ! మనం ఒక్కటియైనట్లుగా వీళ్ళూ ఒక్కటి కావాలని ప్రార్థించాడు." ఇంకా క్రిసోస్తం భక్తుడు కూడ ఈలా నుడివాడు. "శిరస్సుతో ఐక్యమైన అవయవాలన్నీ దానితో కలసి ఒక్క దేహమౌతాయి. అలాగే క్రీస్తుతో కలసిపోయిన మనంకూడ ఒక్క దేహమూ ఒక్క సమాజమూ ఔతాం."

ఈలా క్రీస్తుని భుజించడం ద్వారా మనకు తోడి ప్రజలతో ఐక్యత చేకూరుతుంది. ఈ సందర్భంలో "దివ్యసత్రసాదం శ్రీసభను నిర్మిస్తుంది" అనే ప్రాచీన సూత్రాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవాలి. దివ్యభోజనం శ్రీసభను నిర్మిస్తుంది, దాన్ని పెంపుకు తెస్తుంది. ఏలా? శ్రీసభకు ఐకత్యనూ ప్రేమభావాన్నీ ప్రసాదించడం ద్వారా. క్రైస్తవులు పరస్పర ప్రేమభావంతో జీవించినపుడు తప్పక అభివృద్ధి చెందుతారు గదా! ఓ వైపు శ్రీసభ సత్రసాదాన్ని తయారుచేస్తుంది. మరోవైపు ఆ భోజనం శ్రీసభను పెంపొందిస్తుంది. కనుకనే అగస్టీను భక్తుడు కూడ "సంస్కారరూపమైన శరీరాన్ని భుజించేవాళ్ళు శ్రీసభ రూపమైన శరీరమౌతారు" అన్నాడు. అనగా దివ్యసత్రసాదాన్ని భుజించేవాళ్ళు శ్రీసభ సభ్యులై దాన్ని వృద్ధిలోకి తీసికొని వస్తారని భావం.

క్రీస్తుతో ఐక్యంగావడం ద్వారా మనం శ్రీసభతో ఐక్యమౌతాం. కాని శ్రీసభతో ఐక్యంగావడం ద్వారా క్రీస్తుతో ఐక్యం గావడం గూడ జరుగుతుంది. మనం జ్ఞానస్నానం ద్వారా, దివ్యసత్రసాదం ద్వారా శ్రీసభలో సభ్యులమైనపుడు ఆ ప్రభువు మన హృదయాలను తన సాన్నిధ్యంతో నింపుతాడు. మనలను తనతో సన్నిహితంగా ఐక్యపరచుకొంటాడు. ఒకవిధంగా చెప్పాలంటే ఈ భోజనం మనలను క్రీస్తుతో కంటె గూడ తోడిజనంతో ఎక్కువగా ఐక్యపరుస్తుంది. అందుకే తోమాసు అక్వినాసు భక్తుడు ఈ సంస్కారం ద్వారా

క్రీస్తుతో కంటె గూడ అతని ఆధ్యాత్మిక శరీరమైన శ్రీసభతో ఎక్కువగా ఐక్యమౌతామని నుడివాడు. అతని భావాల ప్రకారం ఈ సంస్కారం ప్రధాన ఫలితం సోదర ప్రేమ.

## 5. ఉపసంహారం, దివ్యసత్ప్రసాదం ప్రాముఖ్యం

మీదటి అధ్యాయాల్లో దివ్యసత్ప్రసాదాన్ని గూర్చిన పలు విషయాలను చర్చించాం. ఈ భోజనం మామూలు సంస్కారం కాదు. ఇది అన్ని సంస్కారాల కంటె మిన్నయైంది. తతిమ్మా ఆరు సంస్కారాలూ తామిచ్చే ప్రత్యేక వరప్రసాదాలను దీనినుండే పొందుతాయి. అవి దీనిమీద ఆధారపడి పనిచేస్తాయి. కారణం ఇది. తతిమ్మా ఆరు సంస్కారాల్లో క్రీస్తు వరప్రసాదం వుంటుంది. కాని ఈ సంస్కారంలో మాత్రం ఆ వరప్రసాద కారకుడైన ఉత్థాన క్రీస్తే ఉంటాడు. వరప్రసాదమంతా ఉత్థాన క్రీస్తు నుండే. కనుక అన్ని సంస్కారాలు ఈ దివ్యసత్ప్రసాదం మీద ఆధారపడి పనిచేస్తాయి.

ఈ సంస్కారం వరాల నిధి. వరప్రసాద జలధార. దీనిద్వారా ఆత్మను నీటిని త్రాగినట్లుగా త్రాగుతాం - 1కొ 12,13. జ్ఞానస్నానం ఈ సంస్కారం ద్వారా పరిపూర్ణమవుతుంది. దీనినుండే వరప్రసాదం పొందుతుంది. అసలు దివ్యసత్ప్రసాదమే పాపోచ్చారణం ద్వారా మన పాపాలను పరిహరిస్తుంది. ఈలాగే అన్ని సంస్కారాలు ఈ పరమ భోజనం ద్వారానే వరాలార్జించిపెడతాయి.

తోమాసు అక్వినాసు భక్తుడు ఈ సంస్కారం లేందే రక్షణం లేదని వాకొన్నాడు. అనగా ఈ సంస్కారాన్ని మనం వస్తుతః స్వీకరించి వుండకపోయినా దాని ప్రధాన ఫలితమైన సోదరప్రేమను స్వీకరించి వుండాలి. ఇది లేందే మోక్షప్రాప్తి లేదు.

ఈలాంటి దివ్యభోజనాన్ని యోగ్యంగా స్వీకరించాలంటే మన తరపున మనకు ఎంతో భక్తి వుండాలి. ఆ భోజనం ఎంత శక్తికలదైనా మన సహకారమూ భక్తీ లేనిదే పనిచేయదు. ఇక మన భక్తిలో రెండంశాలు ముఖ్యం - దైవప్రేమ, సోదరప్రేమ. ఈ ద్వివిధమైన ప్రేమతో ఈ పరమాన్నాన్ని భుజించేవాడు మృత్యువును జయించి అమరత్వాన్ని పొందుతాడు - యోహా 6,54.

దివ్యసత్ప్రసాదం త్రికాలాలకు సంబంధించిన మన రక్షణ చరిత్ర నంతటినీ జ్ఞప్తికి తెచ్చేది. అది పూర్వం జరిగిన క్రీస్తు సిలువ బలిని గుర్తుకు తెస్తుంది. అతని మరణోత్థానాలను జ్ఞాపకం చేస్తుంది. అంతమాత్రమే గాక అది ప్రస్తుతం శ్రీసభలో క్రీస్తు సాన్నిధ్యముందని గూడ తెలియజేస్తుంది. ఇంకా అది రాబోయే మోక్షమహిమను గూడ సూచిస్తుంది. ఉత్థాన క్రీస్తు మనకు గూడ ఉత్థానం దయచేస్తాడని తెలియజేస్తుంది. ఈ విధంగా దివ్యసత్ప్రసాదబలి మూడు కాలాలకు సంబంధించిన రక్షణ చరిత్రనంతటినీ తనలో ఇముడ్చుకొంటుంది.

# ప్రార్థనాభావాలు

1. దివ్యసత్ప్రసాదం క్రైస్తవులను ఐక్యపరచే సంస్కారమని చెప్పాం. కాని దురదృష్టవశాత్తు నేడు క్రైస్తవ శాఖలు విడిపోయి వున్నాయి. క్రైస్తవులందరికీ ప్రభువు ఆశించిన ఐక్యత సిద్ధించాలని ఈ దివ్యసత్ప్రసాద సాన్నిధ్యంలో అందరమూ ప్రార్థించాలి. చారిత్రకంగా జూస్తే ఓ అంశం బోధపడుతుంది. 13-16 శతాబ్దాల మధ్య విశ్వాసులు సత్ప్రసాదాన్ని అట్టే భుజించలేదు. దాని బలం సన్నగిల్లి పోయింది కనుకనే 18వ శతాబ్దంలో పదియవ భక్తినాథ పోపుగారు విశ్వాసులు దినదినమూ ఈ విందులో పాల్గొనాలని శ్రీముఖం వ్రాసారు. ఇదే శతాబ్దంలో ప్రోటస్టెంటు క్యాతలిక్కు క్రైస్తవుల మధ్య సమైక్యతా ఉద్యమం గూడ ప్రారంభమైంది. కనుక దివ్యసత్ప్రసాదానికీ సమైక్యతకీ దగ్గరి సంబంధం వుందని అర్థం చేసికోవాలి. అసలు నాల్గవ శతాబ్దంలోనే అగస్టీను భక్తుడు దీన్ని సమైక్యతా సాధనమని పేర్కొన్నాడు. కనుక మనం ఈ విందును భక్తిపూరితంగా భుజిస్తే సమైక్యత గూడ సులభమౌతుంది.

2. ఇతర క్రైస్తవ శాఖలతో మనకు ఐక్యత లేకపోవడం పెద్ద దురదృష్టం. కాని మన శాఖీయులతోనే మనకు ఐక్యత లేకపోవడం అంతకంటె పెద్ద దౌర్భాగ్యమనాలి. ఒక్క మన క్యాతలిక్ శాఖలోనే వున్న అంతఃకలహాలూ కులతత్వాలు మురాతత్వాలూ అన్నీ యిన్నీ కాదు. మరి యింతవరకు మనం వర్ణిస్తూ వచ్చిన సత్ప్రసాదమూ, దాని శక్తీ ఏ గాలికి పోయినట్లు? పౌలు క్రీస్తుతో ఐక్యమైనవాళ్ళల్లో జాతి భేదమూ లింగ భేదమూ వర్గభేదమూ వుండకూడదన్నాడు - గల 3,28. కాని మనం నిత్యజీవితంలో ఇన్ని విభేదాలకు గురౌతూన్నామంటే ఆ సత్ప్రసాదం మనలో పనిచేయడం లేదనే చెప్పాలి కదా! మనం బయటికి క్రైస్తవులంగా కన్పించినా ఉత్థాన క్రీస్తూ అతని ఆత్మ లోలోపల మన హృదయాలను ఇంకా మార్చలేదనే చెప్పాలి కదా? ప్రస్తుతానికి ప్రభువు కనీసం ఈ దౌర్భాగ్యాన్ని గుర్తించే భాగ్యమైనా మనకు దయచేయాలని అడుగుకొందాం.

3. అగస్టీను భక్తులు ఈలా చెప్పాడు. "దివ్య సత్ప్రసాదం ప్రేమ సంస్కారం. ఐక్యతాచిహ్నం. సోదరప్రేమ సాధనం. పాస్క విందు. దాని ద్వారా క్రీస్తుని భుజిస్తాం. మన హృదయం వరప్రసాదంతో నిండుతుంది. భవిష్యత్తులో మనకు ఉత్థానమూ మోక్ష మహిమా కూడా సిద్ధిస్తాయి." అగస్టీను పేర్కొన్న ఈ భాగ్యాలన్నిటినీ పొందాలని ప్రార్థిద్దాం.

4. శ్రీసభ ఆరాధనంలో తుదిమెట్టు సత్ర్పసాదబలి, ఇంతకంటె శ్రేష్ఠమైన ఆరాధనను దేన్నీ శ్రీసభ సమర్పించలేదు. ఈబలి వరప్రసాదాలన్నిటికీ జీవధార లాంటిది. విశ్వాసులు ఏ వరప్రసాదాన్ని పొందినా దీనినుండి పొందవలసిందే. ఈ బలినర్పించడం ద్వారా విశ్వాసులు క్రీస్తుని పూర్ణంగా సాక్షాత్కారం చేసికొంటారు, అతన్ని లోకానికి ప్రకటిస్తారు గూడ. నేడు శ్రీసభ సభ్యులంగా సత్ర్పసాదబలి నర్పించడం కంటె మనం చేయదగిన ఉత్తమ పుణ్యకార్యమేమీ లేదు. కనుకనే 12వ భక్తినాథ పాపుగారు "క్రైస్తవుడంటే ప్రధానంగా పూజబలి నర్పించేవాడు" అని నుడివారు.

# ప్రశ్నలు

## అధ్యాయం - 1

1. పాస్క నిబంధన బలులను వివరించండి.
2. అంత్యభోజన వర్ణన విషయంలో మత్తయి మార్కులకూ, లూకా పౌలులకూ వ్యత్యాసం ఏమిటి?
3. "యేసు ఈ లోకం నుండి తండ్రి వద్దకు సాగిపోవలసిన గడియ వచ్చిందని యెరిగిన వాడై" (యోహా 13,1) అనడంలో యోహాను భావం ఏమిటి?
4. అంతిమ భోజనానికీ సిలువ బలికీ వున్న సంబంధం ఏమిటి?
5. అసలు అంతిమ భోజనంతో అవసరం ఏమిటి?
6. అంత్య భోజనానికీ నేటి పూజబలికీ ఉన్న సంబంధం ఏమిటి?

## అధ్యాయం - 2

1. మనపూజలో "దీన్ని నా జ్ఞాపకార్థం చేయండి" అన్న మాటలు వస్తాయి. పూజలో ఎవరు, ఎవరికి ఏమి జ్ఞాపకం చేయాలి?
2. "జ్ఞాపకార్థం అంటే పూర్వం జరిగిన ఓ రక్షణ సంఘటనాన్ని ఇప్పుడు గుర్తుకి తెచ్చుకోవడం మాత్రమే కాదు, దాన్ని మళ్ళా మన మధ్యలో ప్రత్యక్షం చేసికోవడం" - ఈ సూత్రం పూజబలి కేలా వర్తిస్తుందో వివరించండి.
3. భక్తులు క్రీస్తు మరణాన్ని "ప్రకటిస్తారు" (1కొ 11,26) అనడంలో పౌలు భావం ఏమిటి?

## అధ్యాయం - 3

1. రక్తరహితాలు, రక్తసహితాలు ఐన పూర్వవేద బలులను వివరించండి.
2. "బలి ముఖ్యోద్దేశం భగవంతునితో ఐక్యంగావడమే" - వివరించండి.

3. కిప్పూర్ ప్రాయశ్చిత్త బలికీ క్రీస్తు సిలువబలికీ గల మూడు పోలికలను తెలియజేయండి.
4. మలాకీ ప్రవచనం నూత్న వేదబలికి ఏలా వర్తిస్తుంది?
5. "బలి మనలను పవిత్రం చేయదు. మన హృదయం లోని భక్తే ఆ బలిని పవిత్రం చేస్తుంది" అన్న ఇరెనేయుస్ వాక్యం భావం ఏమిటి?

## అధ్యాయం - 4

1. అంత్యభోజనమూ పూజబలీ యథార్థమైన బలి అని నూత్నవేదం నుండి నిరూపించడం ఏలా?
2. మోక్ష క్రీస్తు ఆరాధనం ఏ రూపంలో వుంటుంది?
3. ప్రోటస్టెంటు నాయకులు పూజబలి కల్వరిబలికి అవమానకరం అని ఎందుకు భావించారు? వాళ్ళకు జవాబు చెప్పడం ఏలా?
4. "నది జన్మస్థలం మీద ఆధారపడినట్లే పూజబలి సిలువబలి మీద ఆధారపడుతుంది' – వివరించండి.
5. "మన శరీరాలను సజీవయాగంగా దేవునికి అర్పించుకోవాలి" (రోమా 12,1) అనడంలో పౌలు భావం ఏమిటి?

## అధ్యాయం - 5

1. పూర్వ నూత్నవేదాల ఆరాధనం సామాజికమైంది అని బైబులు నుండి ఏలా నిరూపించగలం?
2. "గృహస్థులు లేకుండా గురువు సొంతంగా చేసికొనే పూజ చెల్లదు" అనే ప్రోటస్టెంటు వాదానికి జవాబు చెప్పడం ఏలా?
3. గురువు పూజార్పణానికీ గృహస్థుల పూజార్పణానికీ తేడా ఏమిటి?
4. "స్థానిక శ్రీసభ పూజ విశ్వశ్రీసభ పూజకూడ" వివరించండి.
5. సామాన్య పూజకంటె సంయుక్తపూజ ఎందుకు మెరుగు?

## అధ్యాయం - 6

1. పూజ ఫలితాలను నాల్గింటిని వివరించండి.
2. పూజ వలన పాపపరిహారం పొందం అని వాదించేవాళ్ళకు జవాబు చెప్పడం ఏలా?
3. పూజ నుండి మనం పూర్తి ఫలితాన్ని పొందుతామా? ఎందుకు?

## అధ్యాయం - 7

1. పూర్వవేదంలోని సాన్నిధ్యాన్ని గూర్చి తెలియజేయండి.
2. దివ్యసత్ప్రసాదంలో దైవసాన్నిధ్యముందని పరోక్షంగా నైనా నిరూపించే నూత్నవేద సందర్భాన్ని ఒకదాన్ని వివరించండి.
3. రొట్టెరసాల్లో దైవసాన్నిధ్యం నెలకొనడాన్ని గూర్చి మన నమ్మకానికీ ప్రోటస్టెంటుల నమ్మకానికీ వున్న తేడా యేమిటి?
4. సత్ప్రసాదంలో దైవసాన్నిధ్యం ఎంతకాలముంటుంది అన్న ప్రశ్నకు ప్రోటస్టెంటుల జవాబేమిటి? మన జవాబేమిటి?
5. "సత్ప్రసాదంలోని క్రీస్తు సాన్నిధ్యం స్థానికమైంది కాదు వ్యక్తిగతమైంది" - వివరించండి.
6. ఆరాధన సందర్భానికి చెందిన దైవసాన్నిధ్యాలు నాల్గూ ఏవేవి?

## అధ్యాయం - 8

1. సత్ప్రసాద విషయంలో మొదటిలో లేని ఆరాధన పద్ధతి 11వ శతాబ్దం తర్వాత ఏలా ప్రచారంలోకి వచ్చింది?
2. ప్రోటస్టెంటు క్రైస్తవులు సత్ప్రసాద సాన్నిధ్యాన్ని ఎందుకు నిరాకరిస్తారు?
3. ఆ సాన్నిధ్యాన్ని సమర్థించడం ఏలా?
4. సత్ప్రసాదాన్ని సందర్శించేపుడు మనకు ఏలాంటి భక్తిభావాలుండాలి?

## అధ్యాయం - 9

1. దివ్యభోజనాన్ని గూర్చి యోహాను సువిశేషం తెలియజేసే భావాలను పేర్కొనండి.
2. సిరిల్ భక్తుని భావాల ప్రకారం క్రీస్తు జీవమయ శరీరం మనలను గూడ జీవమయులను చేస్తుంది. ఏలాగ?
3. "పూజారాధనం ఇచ్చి పుచ్చుకోవడంతో కూడి వుంటుంది" ... ఏలాగ?
4. దివ్యసత్ప్రసాదాన్ని ద్విరూపంలో భుజించడం అవసరమా?
5. ఇరెనేయుస్ భావం ప్రకారం సత్ప్రసాదం మనకేలా ఉత్థాన భాగ్యాన్ని దయచేస్తుంది? ఇదే ఉత్థాన భావాన్ని సిరిల్ ఏలా వర్ణించాడు?

## అధ్యాయం - 10

1. నూత్నవేదం ప్రకారం దివ్యసత్ప్రసాదం ఏలా సంఘీభావం కలిగిస్తుంది?
2. డిడాకే గ్రంథం ప్రకారం సత్ప్రసాదం మనకు ఏలా ఐక్యతాభావం కలిగిస్తుంది?

3. ఈ సంస్కారం సూచించే ఐక్యతాభావాలను కొన్నిటిని వివరించండి.
4. సత్ప్రసాదం ద్వారా సామాజిక స్ఫురణను పెంపొందించుకోవడం ఏలా?
5. నేడు సత్ప్రసాదం మనలో మనకే ఐక్యతను సంపాదించి పెట్టలేక పోతుందంటే లోపం ఎక్కడుంది?
6. "దివ్యసత్ప్రసాదం శ్రీసభను నిర్మిస్తుంది" - ఏలా?
7. "అన్ని సంస్కారాలూ దివ్యసత్ప్రసాదం మీద ఆధారపడి పనిచేస్తాయి" - వివరించండి.

# దివ్యసత్ప్రసాదమూ బైబులు అలోకనాలూ

## 1. దివ్యసత్ప్రసాదం బలి

1. మెల్కిసెదెక్కు రొట్టెరసాలు అర్పించడం - ఆది 14,17-20
2. పాస్కబలి - నిర్గ 12,3-13
3. సీనాయి నిబంధనం - నిర్గ 24,3-8
4. మెస్సియా ద్వారా నూత్న నిబంధనం - యిర్మీ 31,31-33
5. నూత్న నిబంధన కర్త - యెష 42,5-7
6. మలాకీ ప్రవచనం - 1,6-12
7. కిప్పూర్ ప్రాయశ్చిత్త బలి - లేవీ 16,11-14. 20-22. 27
8. దివ్యసత్ప్రసాద స్థాపనం - మత్త 26,26-29,
మార్కు 14,22-25.
లూకా 22,15-20,
1కొరి 11,23-26

(ఈ వాక్యాలు దివ్యసత్ప్రసాదం బలీ, భోజనమూ అని కూడ నిరూపిస్తాయి)

9. క్రీస్తు యాజకుడు - హెబ్రే 7,23-28. 8,1-6. 9,11-14. 10,3-10.
10. మన జీవితాన్నే బలిగా అర్పించుకోవాలి - రోమా 12,1-2

## 2. దివ్య సత్ప్రసాదం సాన్నిధ్యం

1. మందసంలో ప్రభువు సాన్నిధ్యం - నిర్గ 25,16-22
2. గుడారంలో ప్రభువు సాన్నిధ్యం - నిర్గ 33,7-11
3. దేవుని సన్నిధిలో పండ్రెండు రొట్టెలు - లేవీ 24,5-9

4. సొలోమోను దేవళంలో దైవసాన్నిధ్యం -1రాజు 8,10-11

5. ఒకే రొట్టెను భుజించేవాళ్ళు - 1కొరి 10,14-17

## 3. దివ్యసత్ప్రసాదం భోజనం

1. మన్నా భోజనం - నిర్గ 16,9-16

2. రాతిబండ నుండి నీళ్ళు - నిర్గ 17,1-7

3. దేవదూతల భోజనం - కీర్త 78, 17-29

4. స్వర్గభోజనం - కీర్త 105, 39-42

5. పర్వతం మీద విందు - యెష 25,6-8

6. విజ్ఞానం అర్పించే రొట్టెరసాలు - సామె 9,1-6

7. అందరి రుచులకూ సరిపడే ఆహారం - సొలోమోను జ్ఞాన 16,20-21

8. కాకులు యేలీయాను రొట్టెతో పోషించుట - 1రాజు 17,1-7

9. రొట్టెలతో మొదటిసారి భోజనం మార్కు 6, 34-44
మత్త 14,13-21
లూకా 9,10-17
యోహా 6,1-14

10. రొట్టెలతో రెండవసారి భోజనం - మార్కు 8,1-9,
మత్త 15,32-38

11. రొట్టెను విరవడంలో క్రీస్తుని గుర్తుపట్టారు - లూకా 24,28-31

12. క్రీస్తు నుండి పారే జీవజల ప్రవాహం - యోహా 7,37-39

13. నేనే జీవాహారం - యోహా 6,32-40

14. క్రీస్తు శరీర రక్తాలు మనకు ఆహారం - యోహా 6,48-59

15. ఉత్థానాన్ని దయచేసే భోజనం - యోహా 6,54

16. తిబేరియా సరస్సు తీరాన భోజనం - యోహా 21,1-13

17. యెరూషలేము క్రైస్తవ సమాజం - అచ 2,42-47

18. అయోగ్యమైన దివ్యసత్ప్రసాద స్వీకరణం - 1కొ 11,27-32

19. సోదరప్రేమను దయచేసే భోజనం - 1కొ 10,14-17

# 2. దివ్యసత్ప్రసాదమూ నూత్నసమాజమూ

**బైబులు భాష్యం - 147**

## విషయసూచిక



బైబులు భగవంతుడు ప్రేమమయుడు. అతనిలోని ముగ్గురు వ్యక్తులు పరస్పర ప్రేమతో ఐక్యమై యుంటారు. అతడు మానవజాతిని సృజించినపుడు తనలాగే వాళ్ళుకూడ పరస్పర ప్రేమతో జీవించాలని కోరుకొన్నాడు. కాని సృష్ట్యాదిలో కయీను హేబెలును చంపినపుడే నరులు ప్రేమతో జీవించలేరని తేలిపోయింది. వాళ్ళ జీవానికి మారుగా మరణాన్నే కోరుకొంటారని రుజువైంది.

క్రీస్తు దేవుని ప్రేమను మనకు తెలియజేయడానికి ఈ లోకంలోకి వచ్చాడు. అతని బోధలు, అద్భుతాలు, విశేషంగా అతని మరణోత్థానాలు ఈ ప్రేమనే విశదం చేస్తాయి. అతడు స్థాపించిన క్రైస్తవ సమాజం ప్రధానంగా ప్రేమతో జీవించాలి. అతడు మీ పరస్పర ప్రేమను జూచి లోకం మిమ్ములను నా శిష్యులనుగా గుర్తిస్తుంది అన్నాడు - యోహా 13,35. క్రీస్తు శిష్యులకు నిజమైన గుర్తు సోదర ప్రేమ ఒక్కటే.

దివ్యసత్ప్రసాదం ప్రేమతో గూడిన క్రీస్తు మరణోత్థానాలను మనకు జ్ఞప్తికి తెస్తుంది. అది అతని రక్షణ కార్యాన్ని మన మధ్యలో కొనసాగిస్తూ మనలో సోదరప్రేమను పెంచుతుంది. తొలినాటి క్రైస్తవులు దివ్యసత్ప్రసాద బలంతో సోదర ప్రేమతో జీవించారు. వారి ప్రేమ భావానికి ముగ్ధులై రోమను మతస్థులు చాలమంది ఆదిమ క్రైస్తవ సమాజంలో చేరారు. సత్ప్రసాదం దేవుణ్ణి ఆరాధించే సాధనం. కాని అంతకంటె ముఖ్యంగా అది

నరులు పరస్పర ప్రేమతో జీవించేలా చేసే సాధనం. నేడు నరులు నూత్న సమాజంగా రూపొందాలంటే ఈ దివ్యభోజనమే ప్రధాన మార్గం.

## 1. నూత్న సమాజం కోరికలు

నేటి సమాజం శాస్త్ర సాంకేతిక రంగాల్లో ఎంతో పురోగతి సాధించింది. కాని ఎంత అభివృద్ధిని సాధించినా నేటి నరులకు శాంతి సంతోషాలు లేవు. ఈనాటి మానవులు ప్రధానంగా వాంఛించే సౌభాగ్యాలు ఇవి.

1. శాంతి, సంతోషం, స్వేచ్ఛ సమానత్వం నరుల్లో వర్ధిల్లాలి.

2. సమాజంలో అన్యాయాలు అంతరించి న్యాయం నెలకొనాలి.

3. నరులు పరస్పర ప్రేమ భావంతో కలసి మెలసి జీవించాలి. ఈ గుణాలన్నీ కలదే ప్రేమ సమాజం.

క్రీస్తు వచ్చింది విశేషంగా ఈ ప్రేమ సమాజాన్ని నెలకొల్పడానికే. కాని అతడు కేవలం సాంఘికసేవ ద్వారా ఈలాంటి ప్రేమ సమాజాన్ని నెలకొల్పడానికి పూనుకోలేదు. తన మరణోత్థానాల ద్వారా, క్రియాపూర్వక మైన ప్రేమ ద్వారా ఈ సమాజాన్ని స్థాపించాడు. అదే తిరుసభ. ఈ తిరుసభకు తన జ్ఞాపకార్థం, అనగా భక్తులు తన ప్రేమను జ్ఞాపకం చేసికోవడానికి, దివ్యసత్ప్రసాదాన్ని ఇచ్చాడు. కనుకనే క్రైస్తవులు భక్తిభావంతో ఈ సత్ప్రసాద బలిని రోజురోజు కొనసాగించుకొని పోతున్నారు. లోకాంతం వరకు, నరుల్లో ప్రేమశక్తి బలంగా వేరుపాతుకొనేంతవరకూ, ఈ బలి మనమధ్య కొనసాగుతూనే వుంటుంది.

## 2. ఆదిమ క్రైస్తవ సమాజంలో సత్ప్రసాదం

తొలినాటి క్రైస్తవులు కొందరి గృహాల్లో సమావేశమై అపోస్తలుల బోధలు విన్నారు. ప్రార్థనలు చేసారు. యూదమతంతో తమకు ఎదురయ్యే సమస్యలను చర్చించి చూచుకొన్నారు. ఉమ్మడి భోజనం చేసారు. కడన సత్ప్రసాద బలిని సమర్పించి దివ్యభోజనం స్వీకరించారు. దాని ఫలితంగా వాళ్లు ప్రేమభావంతో జీవించారు. ఉన్నవాళ్ళు తమ సొత్తును లేనివాళ్ళతో పంచుకొన్నారు. వారిలో ధనిక, దరిద్ర తారతమ్యాలు లేవు. తమ ఆస్తులను అపోస్తలులకు అప్పగించి ఉమ్మడి జీవితం గడిపారు. అప్పటి క్రైస్తవులకు ప్రత్యేకమైన గుర్తు ఏదీలేదు. సత్ప్రసాద విందూ పరస్పర సహాయమే వారి గుర్తులు. సత్ప్రసాదం లోని ప్రేమాజ్ఞ వాళ్ళను బలంగా ప్రేరేపించింది. లేకపోతే వాళ్ళు తమ సొమ్మును పేదలతో పంచుకొనేవాళ్ళు కాదు - అ.చ. 2,42-47, 4,32-35.

ఆదిమ క్రైస్తవుల్లోని ఐక్యభావం, సమానత్వం, తమ సొమ్మును **ఇతరులతో** పంచుకోవడం అనే గుణాలు పేద వర్గాలవారిని బాగా ప్రభావితం చేసాయి. పేదప్రజలు వాళ్ళంతట వాళ్ళే వచ్చి ఈ క్రైస్తవ సమాజంలో చేరారు. ఈ క్రైస్తవులు ఒకరినొకరు ఎంతగా ప్రేమించుకొంటున్నారో చూడండి అని ఆనాటి గ్రీకు రోమను పౌరులు ఆశ్చర్యపోయేవాళ్ళు. ఆనాటి క్రైస్తవుల్లో మనమందరం సరిసమానం అనే భావం ప్రబలంగా వుండేది. తొలినాటి వేదబోధకులు కూడ క్రైస్తవుల్లో సమానత్వం వుండాలనే భావాన్ని బాగా విశదీకరించి చెప్పారు. క్రీస్తు శరీరాన్ని భుజించేవాళ్ళు క్రీస్తు శరీరమే ఐన తిరుసభ సభ్యులను, విశేషంగా పేద సభ్యులను, పట్టించుకోవాలని నొక్కి చెప్పారు. ఈలా దివ్యభోజనం ఆదిమ సమాజంలో సోదరప్రేమను పెంచింది.

## 3. మధ్య యుగాల్లో వచ్చిన మార్పు

తొలి క్రైస్తవుల్లో సత్ప్రసాదం సోదర ప్రేమకు కారణంగాను, ధనికులు తమ సొత్తును పేదలతో పంచుకోవడానికి ప్రేరణం గాను ఉండేదని చెప్పాం. కాని మధ్య యుగాల్లో సత్ప్రసాదం కేవలం ఆరాధ్య వస్తువుగా మారిపోయింది. అది సమసమజాన్ని స్థాపిస్తుందనే భావం పోయి కేవలం దేవుణ్ణి ఆరాధించే వస్తువుగా తయారైంది. గురువులు దానిచుట్టూ కర్మకాండలూ, తంతులూ, ఆరాధనలూ పెంచారు. గృహస్థులు ఈ యారాధనలో పాల్గొని పవిత్రులు కావడమే ముఖ్యం అనుకొన్నారు. అది నరులను పరలోకానికి చేర్చే సాధనంగా మారిపోయింది. ఈ లోకంలో భక్తసమాజాన్ని తయారుచేసే సాధనమన్న భావం మరుగున పడింది. ప్రజలు అది మనలను క్రీస్తుతో ఐక్యంజేసే సాధనమనుకొన్నారు. సోదరీ సోదరులైన తోడి నరులతో ఐక్యంజేసే సాధనమన్న సంగతి విస్మరించారు. ఈలా సత్ప్రసాదాన్ని దైవప్రేమతో ముడిపెట్టి సోదర ప్రేమను అశ్రద్ధ చేసారు. భక్తులు దేవునివైపు తిరిగి తోడి నరులవైపు చూడ్డం మానివేసారు.

## 4. సత్ప్రసాదమూ భారతీయ సమాజమూ

మనదేశంలో కన్పించే సత్ప్రసాద భక్తి యూరపులోని మధ్యయుగాల భక్తి లాంటిదే. అది దేవుణ్ణి కలసికొనే సాధనమే గాని నరులను కలసికొనే సాధనం కాదు. ఎప్పుడు కూడ దేవుణ్ణి పూజించడం సులభం. ఆ దేవుణ్ణే తోడినరుల్లో గుర్తించి వారిని అంగీకరించి ఆదరించడం కష్టం. దైవప్రేమ సులువు, సోదరప్రేమ భారం. కాని దేవుని రూపంగల తోడి నరులను పట్టించుకోని దైవారాధనం నిజమైన ఆరాధనం ఎలా ఔతుంది? మన సత్ప్రసాద భక్తి మనకే ఆశ్చర్యం కలిగిస్తుంది. మన దేవాలయాల్లో దివ్యభోజనాన్ని

స్వీకరించేపుడు పెద్ద కులాలవాళ్ళు ఒక బృందంగా వస్తారు. దళితులు ఇంకొక బృందంగా వస్తారు. అసలు వాళ్ళు వీళ్ళు దేవాలయంలో వేరువేరు తావుల్లో కూర్చుంటారు. ఈలాచేస్తే మనం ఆదిమ క్రైస్తవ సమాజంలో వున్న సమానత్వాన్ని పూర్తిగా మర్చిపోయినట్లే గదా? ఈలా కులభావం మన ఆరాధనను కలుషితం చేస్తుంది. ఇంకా, సత్ర్పసాద స్వీకరణకు వచ్చే ధనికవర్గం పేద వర్గాన్ని ఏమాత్రం పట్టించుకోదు. మీరు వేరు మేము వేరు అన్నట్లుగా వుంటుంది వారి మనస్తత్వం. సత్ర్పసాదం మనలను దేవునితోను తోడినరులతోను ఐక్యం జేసినపుడే దాని ప్రయోజనం నెరవేరేది.

## 5. రెండవ వాటికన్ మహాసభ తర్వాత

రెండవ వాటికన్ సభ సత్ర్పసాదాన్ని అర్థంజేసికొనే విధానంలో చాల మార్పులు తెచ్చింది. ఈ సభ బోధలు ఇవి. 1. సత్ర్పసాదం క్రైస్తవ సమాజమంతా కలసి దేవుని ఆరాధించే సాధనం. కనుక గురువుతో పాటు గృహస్థులు కూడ ఆ యారాధనలో పాల్గొనాలి.

2. ఈ దివ్య భోజనాన్ని ఆరాధించి భుజించే వారిలో పరస్పర ప్రేమ, పరస్పరం సహాయం చేసికోవడం అనే గుణాలు కన్పించాలి.

ఈ మార్పులతోపాటు వాటికన్ సభ సత్ర్పసాద ఆరాధనకు చెందిన తంతులో కూడ కొన్ని మార్పులు చేసింది. కాని ఈ సభ ముగిసాక క్రైస్తవులు పై తంతుకు చెందిన మార్పులను మాత్రం స్వీకరించారు. సత్ర్పసాద అర్థానికి చెందిన మార్పులను స్వీకరించనే లేదు. కనుక సోదరప్రేమ పరస్పర సహాయం అనే విషయాల్లో మనం పూర్వం ఎక్కడున్నామో ఇప్పుడూ అక్కడే వున్నాం. ఇప్పటి మన సమాజంలో కులతత్వాలు, ఆర్థిక అసమానతలు, దురాశ, పరపీడనం, పేదరికం మొదలైన అవలక్షణాలు రాజ్యమేలుతున్నాయి. ఈ దుర్గుణాలన్నీ మనలను విభజిస్తున్నాయే గాని ఐక్యం జేయడం లేదు. సత్ర్పసాదం ఈ యవలక్షణాలను అణచి వేయలేకపోతూంది.

ఇప్పుడు భారతదేశానికి కావలసింది ఏవేవో నియమాలతో, తంతులతో కూడిన నూత్న మతం గాదు, సోదరప్రేమ, పరస్పర సహాయాలతో గూడిన క్రొత్త సమాజం. సత్ర్పసాదం మాత్రమే ఈలాంటి సమాజాన్ని సృజించగలదు. ఇక దివ్య భోజనం ద్వారా నూత్న సమాజ స్థాపనం ఏలా జరగాలో కొంచెం విపులంగా పరిశీలిద్దాం.

## 6. సత్ర్పసాద భావంలో మార్పు

దివ్య సత్ర్పసాదాన్ని ఆరాధించాలంటే మొదట జ్ఞానస్నానం పొందిన క్రైస్తవ సమాజం వుండాలి. ఈ సమాజంలో "దీన్ని నా జ్ఞాపకార్థం చేయండి" అన్న క్రీస్తు ఆజ్ఞననుసరించి సత్ర్పసాదాన్ని ఆరాధించాలి, భుజించాలి. ఈ సమాజం క్రీస్తు

ప్రేమననుసరించి సోదరప్రేమ, పరస్పర సహాయం అనే సూత్రాలను పాటించాలి. ఈ నియమాలను పాటించనివారిని ఆ తొలిరోజుల్లో పౌలు భక్తుడే నిందించాడు - 1కొరి 11.21. ఆ రోజుల్లో సోదరప్రేమకు గురుతుగా శనివారం రాత్రి భక్తులందరూ కలసి మొదట మామూలు భోజనాన్ని ఉమ్మడిగా భుజించేవాళ్ళు. దీన్ని "అగపే" అన్నారు. అనగా ప్రేమ భోజనం అని భావం. ఆ పిమ్మట దివ్య భోజనాన్ని భుజించారు. ఈ భోజనాలు రెండు ఆనాటి క్రైస్తవులను ఐక్యపరిచాయి. వాళ్ళు తమ సొమ్మును ఒకరితో ఒకరు పంచుకొనేలా చేసాయి.

క్రమేణ మధ్యయుగాల్లో ఈ భావం మరుగుపడి పోయింది. క్రైస్తవులు సత్ప్రసాదంలో సోదర ప్రేమను విస్మరించి దైవప్రేమను మాత్రం నిల్పుకొన్నారు. అది సమసమాజాన్ని స్థాపిస్తుందన్న విషయాన్ని మరచిపోయి దేవుణ్ణి ఆరాధించి పూజించడానికే ఉపయోగపడుతుందని భావించారు.

పౌలు భక్తుడు మనం క్రీస్తు విచ్చేసిందాకా ఈ దివ్యసత్ప్రసాదం ద్వారా అతని మరణోత్థాలను ప్రకటిస్తామన్నాడు - 1కొ 11,26. తొలినాటి క్రైస్తవులు ఈ రెండవ రాకడ తమ జీవిత కాలంలోనే జరుగుతుందనుకొన్నారు. ఉత్థాన క్రీస్తు ఆనాటి క్రైస్తవ సమాజంలోనికి విచ్చేసి దాన్ని బలపరచి పరిపూర్ణం చేస్తాడనుకొన్నారు. వాళ్ళు కోరుకొన్నట్లుగానే ప్రభువు ఆనాటి క్రైస్తవులను ఉత్తేజపరచాడు. వాళ్ళు పరస్పర ప్రేమతో సహాయభావంతో జీవించేలా చేసాడు. కాని మధ్యయుగాల్లోని క్రైస్తవులు ఈ పౌలు భావాన్ని మరోలా అర్థంజేసికొన్నారు. క్రీస్తు రెండవ రాకడ ఎప్పుడో లోకాంతంలో జరుగుతుంది అనుకొన్నారు. సత్ప్రసాదానికీ సోదర ప్రేమకూ వున్న సంబంధాన్ని విస్మరించారు.

ఇందుకే రెండవ వాటికన్ మహాసభ ఈ దివ్యభోజనం ద్వారా మన సోదర ప్రేమ పెరగాలనీ, సమసమాజ స్థాపన జరగాలనీ నొక్కి చెప్పింది. స్వార్థం పెరిగిపోయి ధనికవర్గం పేదలను అణగద్రొక్కే ఈ కాలంలో సత్ప్రసాద స్వీకరణం సోదర ప్రేమను పెంచాలి. ఉన్నవాళ్ళు లేనివాళ్ళను అదుకొనేలా చేయాలి. క్రీస్తు తన మరణోత్థానాల ద్వారా తన ప్రేమను మనకు నిరూపించాడు. ఈనాడు ఈ విందు ద్వారా మనం మన ప్రేమను తోడి జనానికి చూపించగలిగి వుండాలి. అప్పుడే తండ్రిప్రేమా క్రీస్తుప్రేమా మనలో వేరు పాతుకొనేది.

## 7. సత్ప్రసాదమూ నూత్న సమాజ స్థాపనం

క్రైస్తవులు కొలిచే దేవుడు నరులను ప్రేమించి నరలోకంలోకి దిగివచ్చాడు. నరుల మధ్య వసించాడు. నరుల కోసం చనిపోయి మళ్ళా ఉత్థితుడయ్యాడు. తాను

మనలను ప్రేమించినట్లే మనమూ ఒకరినొకరం ప్రేమించాలని ఆదేశించాడు. దీని ద్వారా ప్రేమ సమాజం ఏర్పడుతుందని చెప్పాడు. ఆదిమ క్రైస్తవులు ఈ సూత్రం ప్రకారం జీవించారు. క్రీస్తు మన మధ్య వదలిపోయిన ప్రేమ కానుక దివ్యసత్ప్రసాదం. అది నేడు క్రీస్తు కోరిన ప్రేమ సమాజాన్ని నిర్మింప గలిగివుండాలి. ఇక సత్ప్రసాద రహస్యాలను కొన్నిటిని పరిశీలిద్దాం.

## 1. సమసమాజ స్థాపనం

క్రీస్తు సిలువ మీద చేతులు చాచి చనిపోయాడు. ఈ చర్య ద్వారా అతడు నరులందరినీ ఆలింగనం చేసికొని అందరినీ తన చెంతకు ఆహ్వానించాడు. సత్ప్రసాదం క్రీస్తు చూపిన ఈ విశ్వమానవ ప్రేమకు గురుతుగా వుంటుంది. ఈ సంస్కారం ద్వారా నేడు మనం నరులందరినీ ప్రేమతో అంగీకరించాలి. మనకున్నది లేనివారితో పంచుకోవాలి. సంపదలు కూడబెట్టుకోవడం, వాటిని స్వయంగా అనుభవించడం ముఖ్యం కాదు. తోడి నరులను, విశేషంగా పేదసాదలను స్నేహభావంతో అంగీకరించడం ముఖ్యం. మనం సంపాదించింది అథోజగత్సహోదరులతో పంచుకోవడం గొప్ప. పవిత్ర త్రీత్వంలోని పరస్పర ప్రేమనే మనం కూడ ఈ లోకంలో ప్రదర్శించాలి. దేవునికి నిజమైన సంతానానిమనుకోవాలి. దివ్యవిందు మనకు ఈ ప్రేరణను పుట్టిస్తుంది.

## 2. బలి - భోజనం

నరులు ప్రాచీన కాలంనుండి దేవునికి బలులర్పించి అతనితో ఐక్యమయ్యారు. క్రీస్తు స్వీయ బలిద్వారానే దేవునితో ఐక్యమయ్యాడు. అతడు తన ఆత్మార్పణకు చిహ్నంగా దివ్యసత్ప్రసాదాన్ని స్థాపించిపోయాడు. దీన్ని నా జ్ఞాపకార్థం చేయండి అన్నాడు. ఈ పరమ భోజనం అతనికి మన పట్లగల ప్రేమకు గురుతు. "అతడు ఈ లోకంలో వున్న తన వారిని ప్రేమించాడు. అంతం వరకు వారిని ప్రేమించాడు" - యోహా 13,1. క్రీస్తు మన పట్ల చూపిన ప్రేమనే మనమూ ఒకరిపట్ల ఒకరం చూపాలి. మనం ఇప్పుడు ఈ దివ్యబలిని కొనసాగించి ఈ ప్రేమ భోజనాన్ని భుజిస్తున్నాం. ఈ పవిత్ర కార్యాల్లో పాల్గొనే వాళ్ళంతా ఏక కుటుంబమౌతారు. అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళూ ఔతారు. వీళ్ళంతా పరస్పర ప్రేమభావంతో, సేవాభావంతో, దానభావంతో జీవించాలి.

## 3. తోడి నరుల ద్వారానే దేవుణ్ణి చేరాలి

క్రీస్తు నరులకొరకు ఈ లోకంలోనికి వచ్చాడు- ఇప్పుడు మనం తోడి నరుల ద్వారాగాని దేవుణ్ణి చేరలేం. మనకు క్రీస్తుతో సంబంధం జ్ఞానస్నానంలో ప్రారంభమౌతుంది. దివ్యసత్ప్రసాదం ద్వారా పరిపూర్ణమౌతుంది. ఈ సంస్కారం ద్వారానే మనలోని తారతమ్యాలు

పోవాలి. ప్రభువు శిష్యుల్లో యూదుడు అన్యజాతివాడు, బానిస స్వతంత్రుడు, పురుషుడు స్త్రీ అనే అంతరాలు గతించాలి - గల 3,28. సోదరప్రేమ పెరగాలి. సత్ప్రసాదం మనలను ఏక ప్రజను చేస్తుంది. "ఒకే రొట్టెలో పాలు పంచుకొన్న మనమందరం ఏక శరీరమౌతాం" - 1 కొరి 10,17. అనగా ఈ దివ్యభోజనం మనలను ఏక సమాజంగా ఐక్యం జేస్తుంది. తోడి నరులను అంగీకరించడం ద్వారా మనం దేవుణ్ణి చేరుకొంటాం. కనుక ఇప్పుడు నేరుగా దేవుణ్ణి పూజించడం, నేరుగా దేవుణ్ణి చేరడం అనేవి కుదరవు. క్రీస్తు మనుష్యావతారమూ, అతడు మానవులకోసం చనిపోవడం, ప్రేమ పూర్వకమైన సత్ప్రసాదాన్ని స్థాపించడం మొదలైన దైవరహస్యాలన్నీ మనం సంఘీభావంతో, సహకారభావంతో జీవించాలని హెచ్చరిస్తాయి.

# 8. సత్ప్రసాద ఫలితాలు

సత్ప్రసాదాన్ని యోగ్యంగా స్వీకరిస్తే ఈ క్రింది ఫలితాలు కలుగుతాయి.

1. మొదట ప్రజలను దివ్యసత్ప్రసాద స్వీకరణకు సిద్ధం చేయాలి. గురువు ఇచ్చే ప్రసంగాలు ప్రజలు ఈ సంస్కార భావాన్ని చక్కగా అర్థం జేసికోవడానికి ఉపయోగపడేలా వుండాలి. ఇంకా, భక్తులు మంచి పాపసంకీర్తనం ద్వారా ఈ భోజనాన్ని యోగ్యంగా స్వీకరించడానికి తయారు కావాలి. ఈ పాపసంకీర్తనం ఓ తంతు, కర్మకాండ కాకూడదు. ఎప్పుడు గూడ ప్రభుని పవిత్ర హృదయంతో స్వీకరించాలి. పూజ భక్తిమంతంగా వుంటే విశ్వాసులు దానిలో శ్రద్ధతో పాల్గొంటారు. మనం పాడే సత్ప్రసాద గీతాలు కూడ ప్రజలకు ఆ దివ్యభోజనం పట్ల భక్తిని పుట్టించేలా వుండాలి.

2. ప్రజలు కేవలం ఆదివారం అప్పు తీర్చుకోవడానికి మాత్రమే గుడికి రాకూడదు. విచారణలోని ప్రజలంతా ఓ ప్రేమ సమాజంగా ఆదివారం గుడిలో ప్రోగుగావాలి. వాళ్ళు ఒకరి నొకరు కలసికోవాలి, అంగీకరించాలి. ఆరాధనకు ప్రోగైనవాళ్ళు ఈ గుంపులో నేనూ వొకణ్ణి అన్నట్లుగా వుండిపోగూడదు. ఒకరితో ఒకరు సఖ్యసంబంధాలు పెంపొందించుకోవాలి. క్రీస్తు మన మధ్యలోకి వచ్చి ప్రేమతో మనతో కలసిపోయాడు. అతని ప్రేమకు ఇప్పుడు మనం సాక్షులం. కాని నేడు మనం ఒకరిపట్ల ఒకరం చూపుకొనే ప్రేమద్వారానే ఈ సాక్ష్యం వెల్లడికావాలి. దివ్యసత్ప్రసాద బలి భక్త సమాజమంతా కలసి ప్రేమ భావంతో సమర్పించేది.

3. ఆదిమ క్రైస్తవ సమాజంలో భక్తులు పూజకు తమ కానుకలను తీసికొని వచ్చేవాళ్ళు. రొట్టె రసాలు కూడ ఈ కానుకల్లో భాగమే. అర్పణ సమయంలో వీటిని దేవునికి అర్పించేవాళ్ళు. పూజానంతరం ఈ కానుకలను పేదలకు మంచిపెట్టేవాళ్ళు. ఈ విధంగా ఉన్నవాళ్ళు లేనివాళ్ళతో తమ సొత్తును పంచుకొనేవాళ్ళు.

నేడు మనం కూడ ఈ యాచారాన్ని పాటించాలి. దేవుడు మనకిచ్చిన సొత్తును పేదలతో పంచుకోవడానికి పూజ అనువైన సమయం. క్రీస్తు విశేషంగా పేదల్లో శ్రమలు అనుభవిస్తుంటాడు. కనుక పేదల అక్కరలు తీర్చేవాళ్ళు క్రీస్తుని ఆదుకొన్నట్లే. ఆదివార పూజల్లో భక్తులు చందా రూపంలో తమ వంతు దానం తప్పకచేయాలి.

4. మన మర్పించిన అప్పరసాలు నడిపూజలో క్రీస్తు శరీరరక్తాలుగా మారిపోతాయి. పవిత్రాత్మ ఈ కార్యాన్ని నిర్వహిస్తుంది. కాని మన మర్పించే అప్పరసాలు మన జీవితాలనూ మనలనూ సూచిస్తాయి. ఈ కానుకలు క్రీస్తు శరీర రక్తాలుగా మారినపుడు మనం కూడ వాటితోపాటు మారిపోతాం. క్రీస్తు ఆత్మార్పణం మన కానుకలనూ, మన ఆత్మార్పణనూ తనలోనికి స్వీకరింస్తుంది. మనం ఆధ్యాత్మిక నరులంగా తయారౌతాం. దీని ద్వారా నూత్న సమాజం ఏర్పడుతుంది. క్రీస్తు మన కొరకు ప్రాణాలు అర్పించినట్లే మనం కూడ తోడివారి కొరకు మన జీవితాలు అర్పించడానికి సిద్ధమౌతాం. ఈ విధంగా పూజలో అప్పరసాలు క్రీస్తు శరీర రక్తాలుగా మారే ఘట్టం మన జీవితాలను ప్రేమపూరితమూ దానమయమూ చేస్తుంది.

5. నడిపూజ తర్వాత సత్ప్రసాద స్వీకరణం వస్తుంది. సృష్ట్యాదిలో దేవుని ఆత్మ ఆదిమ జలాలమీద గుండ్రంగా తిరిగింది. ఫలితంగా లోకసృష్టి జరిగింది. క్రీస్తు మరణోత్థానాల కాలంలో ఆత్మ మళ్ళా లోకంమీదికి దిగి వచ్చింది. ఈ క్రియవల్ల తిరుసభ జన్మించింది. ఈ తిరుసభ క్రైస్తవ సమాజం. ఆత్మకు నిలయం. పూజలో దివ్యసత్ప్రసాద స్వీకరణ సమయంలో ఆత్మ మళ్ళా భక్త సమాజం మీదికి దిగివస్తుంది. ఈ దివ్యభోజనంలో మనం ఉత్థాన క్రీస్తుని స్వీకరిస్తాం. ఈ ప్రభువు ప్రభావం ద్వారా ఆత్మ మనలను ప్రేమ సమాజంగా, మన సొమ్మును ఇతరులలో పంచుకొనేవారినిగా మార్చి వేస్తుంది.

6. కడన పూజను ముగించుకొని వెళ్ళిపోతాం. కాని పూజ ముగియడంతో మన ఆరాధనం ముగియదు. పూజ ముగింపుతో అది ప్రారంభమౌతుంది. మనం గూడ బయటికి పోయి సత్ప్రసాద జీవితాన్ని గడపాలి. అనగా మనం ఆ దివ్యభోజన భావాలను అర్థవంతంగా జీవించాలి. పూజలో మనం విన్న దేవుని వాక్కు, దేవుని ఆత్మా, ఉత్థాన క్రీస్తు మనలను లోకాన్ని మార్చివేయమని ఆదేశిస్తారు. లోకంలో ప్రేమ, కరుణ, పంచుకోవడం మొదలైన దివ్యగుణాలను పెంపొందించమని ఆజ్ఞాపిస్తారు. ఈ యాజ్ఞను మనం భక్తిభావంతో నెరవేర్చాలి.

క్రీస్తు వచ్చిందాకా మనం అతని మరణాన్ని లోకానికి ప్రకటిస్తాం - 1 కొరి 11,26. అనగా మనం ఈ లోకంలో క్రీస్తు రాజ్యాన్ని స్థాపిస్తాం. దైవ ప్రేమను సోదర ప్రేమను పెంపొందిస్తాం. నూత్న భువినీ నూత్న దివిని సృజిస్తాం. ఈ నూత్న లోకంలో అందరూ తోబుట్టువుల్లా కలసిమెలసి జీవిస్తారు. సత్ప్రసాదం ఈ మార్పులన్నీ తీసుకొని వస్తుంది.

# 9. సత్ప్రసాదం విసిరే సవాళ్ళు

దివ్యభోజనం మనకు చాల సవాళ్ళను విసురుతుంది. ప్రస్తుతానికి కొన్నిటిని పరిశీలిద్దాం.

1. సంఘభావం. ఓవైపు శాస్త్రాన్వేషణలు, సమాచార సాధనాలు ప్రపంచాన్నంతటినీ ఏకగ్రామంగా మార్చివేస్తున్నాయి. ప్రపంచంలో ఒక మూలన జరిగే విషయాలను మరో మూలన త్వరితగతిలో తెలిసికోగల్గుతున్నాం. ఐనా మనకు వ్యక్తిభావం పోలేదు. ఇతరులతో కలియకుండ మనకు మనంగా వంటరిగా వుండిపోతున్నాం. ఆదివార సత్ప్రసాదబలి మనం కేవలం వ్యక్తులంగాదు, సంఘానిమి అనేభావాన్ని కలిగించాలి. ఈ దివ్యబలి భక్తసమాజాలను సృజించగలిగి వుండాలి. పూర్వం యిస్రాయేలు ప్రజల్లాగే ఇప్పుడు క్రైస్తవ ప్రజకూడ వ్యక్తిగతంగా గాక సమాజంగానే రక్షణాన్ని పొందాలి.

2. వ్యక్తి శ్రేయస్సు – సంఘశ్రేయస్సు. స్వార్థపరులకు వ్యక్తి శ్రేయస్సే ముఖ్యం. వాళ్ళు ఇతరులతో పోటీకి దిగి ధనార్జనం చేస్తుంటారు. జీవితంలో ఎన్ని వస్తువులను వాడుకొంటే అంత గొప్ప అనుకొంటారు. పేదలు ఎప్పటికి పేదలుగానే వుండిపోవాలని కోరుకొంటారు. అన్యాయాలకూ అక్రమాలకూ వొడిగడుతుంటారు. దుర్బలులను అణగద్రొక్కుతుంటారు. ఈలాంటి పరిస్థితుల్లో దివ్యసత్ప్రసాదం మనకు సంఘశ్రేయస్సు ముఖ్యమనే భావాన్ని కలిగించాలి. నరునికి ఆత్మదానం అనే విలువను నేర్పాలి. స్వార్థలాభాన్ని వదలుకొని మన సొమ్మును ఇతరులతో పంచుకోవడం అవసరమనే భావాన్ని కలిగించాలి. "నా చిన్ని బొజ్జకు శ్రీరామరక్ష" అనే భావాన్ని రూపుమాపాలి.

3. మనదేశంలో కులాలు, వర్గాలు, భాషలు, ప్రాంతాలు, మతాలు మొదలైనవి ప్రజలను విభజిస్తున్నాయి. ఈ విభజనలు పోయి మనమందరం ఏక సమాజంగా, ఏక కుటుంబంగా ఐక్యం గావాలి. క్రీస్తు మనకు పరలోకంలో ఒకే తండ్రి వున్నాడనీ, అతని సంతానానిమైన మన మందరమూ ఏకకుటుంబమనీ బోధించాడు. సత్ప్రసాదం మనం ఈ సూత్రాన్ని బాగా జీర్ణం జేసికొనేలా చేయాలి. అసలు క్రైస్తవుల్లోనే కులాలు వర్గాలు వున్నాయి. ఒక కులంవాళ్ళు మరో కులంవారిని అంగీకరించరు. మన గుళ్ళల్లో అగ్రకులాలకు ఒక తావూ, నిమ్నకులాలకు వేరొక తావూ కేటాయిస్తున్నారు. సమాధుల దొడ్డిలో గూడ చిన్న కులాలవారికి మారుమూలతావు కేటాయిస్తున్నారు. నరులు చనిపోయాక గూడ కులాన్ని వెంటదీసికొని పోతారా? క్రైస్తవుల్లో గూడ కొందరిని అంటరాని వారినిగా భావిస్తున్నారు. వారికొక క్రీస్తు, ఇతరులకు ఇంకొక క్రీస్తు వున్నాడా? దివ్యవిందు ఈ యంతరాలన్నిటినీ తొలగించి మనలను ఏక సమాజంగా ఐక్యం జేయాలి.

4. ఇంకా మనం స్త్రీలపట్ల వివక్ష చూపుతున్నాం. మన తిరుసభలో పురుషులకున్న గౌరవం స్త్రీలకు లేదు. తిరుసభలో వాళ్ళు పెద్ద పదవులను పొందలేరు. పెద్ద నిర్ణయాలన్ని

పురుషులే చేస్తారు. స్త్రీల మాట చెల్లదు. ఇది అన్యాయం. క్రీస్తు స్త్రీ పురుషులకు సమానమైన విలువనిచ్చాడు. అతని శిష్యవర్గంలో స్త్రీలు కూడా వున్నారు. ప్రభువు వుత్థానాన్ని మొదట మగశిష్యులకు తెలియజేసింది స్త్రీలే. ఈ విషయాలన్నీ మరచిపోయి తిరుసభ క్రమేణ స్త్రీలను అణగద్రొక్కింది. నేడు క్రైస్తవ సమాజంలో స్త్రీలకు ఉచితస్థానం ఈయమని సత్రసాదం మనలను హెచ్చరిస్తుంది.

5. దివ్యవిందు మన విచారణను దైవరాజ్యంగా మార్చాలి. మనం మన విచారణ ప్రజల అగచాట్లను తొలగించగలిగి వుండాలి. అన్యాయాలనూ, పక్షపాతాలనూ నిర్మూలించాలి. ఆదిమ క్రైస్తవులు గృహాన్నే దేవాలయంగా భావించేవాళ్ళు. విచారణనే దైవరాజ్యంగా ఎంచేవాళ్ళు. దైవరాజ్యం తెచ్చిపెట్టే సౌభాగ్యాలను విచారణ అంతా కలసి అనుభవించాలని కోరుకొనేవాళ్ళు. నేడు సత్రసాదం ఈ యాశయాలన్నిటినే నెరవేర్చాలి.

6. తరచుగా మనం విచారణ అంటే క్రైస్తవ కుటుంబాలు మాత్రమే అనుకొంటాం. కాని ఇది పొరపాటు. మనం ఇతరులనుండి విడిపోయి ఏకాంతంగా జీవించేవాళ్ళం కాదు. మన చుట్టూ వున్న హిందువులు మహ్మదీయులు మొదలైనవాళ్లు కూడ మన విచారణ క్రిందికే వస్తారు. వారికి కూడ మనం క్రీస్తుబోధలను తెలియజేయాలి. అతని ప్రేమను వారు కూడ గ్రహించేలా చేయాలి. మన తరపున మనం ప్రేమతోను, మన సొత్తును ఇతరులతో పంచుకొనే మనస్తత్వంతోను జీవిస్తూ క్రైస్తవేతరులకు ఆదర్శంగా వుండాలి. సత్రసాదం మనలను కూడ క్రీస్తులాగే ఆత్మదానానికి పురికొల్పాలి.

## పర్యవసానం

దివ్యసత్రసాద శక్తి అనంతమైంది. క్రీస్తు తన మరణోత్థానాల శక్తిని దానిలోకిని ప్రవేశపెట్టాడు. దాని ద్వారానే దైవరాజ్యాన్ని నెలకొల్పాడు. ఆదిమ క్రైస్తవులకు ఈ సూత్రం బాగా తెలుసు. వాళ్ళు సత్రసాద బలంతోనే మహాబల సమన్వితమైన రోమను సామ్రాజ్యాన్ని జయించారు. ఆ దివ్యభోజన బలంతోనే వేదసాక్షులుగా మరణించారు. ఆ దివ్యశక్తితోనే అన్యమతాలవాళ్ళను క్రీస్తు శిష్యులనుగా జేసారు. భారతదేశంలో ఈ సత్రసాద శక్తి ఇంకా కన్పించడంలేదు. దురదృష్టవశాత్తు మనం దాన్ని కొన్ని తంతులతో గూడిన కర్మకాండగా మార్చివేసాం. దానిలోని ఆత్మశక్తి పూర్తిగా మరుగుపడిపోయింది. నేడు మన విచారణల్లో, మౌలిక సంఘాల్లో, ఈ దివ్యభోజనశక్తి మళ్ళ ప్రస్ఫుటంగా కన్పించాలి. మనం ఆదివార సత్రసాదబలిలో యోగ్యంగా పాల్గొంటే నూత్న సమాజాన్ని సృజించవచ్చు. నేడు మన దేశానికి కావలసింది శాస్త్రజ్ఞానంతో నిండిన సమాజాలూ పరిశ్రమలతో గూడిన సమాజాలూ మాత్రమే కాదు. పరస్పరం ప్రేమించడం, పరస్పరం పంచుకోవడం అనే దొడ్డ గుణాలతో నిండిన సమాజాలు కూడ అవసరమే. కాని వారంవారం క్రీస్తు ప్రేమనూ ఆత్మదానాన్ని సత్రసాదంలో చవిజూచిన వాళ్ళేగాని ఈ నూత్న సమాజాలను స్థాపించలేరు. సత్రసాదంవల్ల మార్పుచెందిన విచారణలు ఈ దేశాన్ని క్రమంగా మార్చివేస్తాయి.

# 3. పాస్క, సత్ప్రసాదము, హింసలు

బైబులు భాష్యం - 149

## విషయసూచిక

1. యూదుల పాస్క
2. క్రీస్తు పాస్క
3. తొలినాటి క్రైస్తవుల పాస్క
4. 21వ శతాబ్దపు పాస్క

భారతదేశ తిరుసభ 2001 సంవత్సరాలు ముగించుకొని మూడవ వేయి సంవత్సరంలోనికి అడుగిడింది. ప్రస్తుతం భారత తిరుసభ వేదహింసలను ఎదుర్కొంటోంది. మతతత్వవాదులు తిరుసభను అణగద్రొక్కి క్రైస్తవులను నాశం చేయాలని చూస్తున్నారు. ఈ దేశంలో నూత్నంగా యెవ్వరూ క్రైస్తవ మతాన్ని స్వీకరించ గూడదని శాసిస్తున్నారు.

పోయిన పదేండ్లల్లోనే భారతదేశ తిరుసభ ఎన్నో హింసలకు గురై విలవిల్లాడిపోయింది. గుజరాతులో గిరిజన క్రైస్తవులను ముప్పుతిప్పులు పెట్టారు. 1999లో ఒరిస్సాలో గ్రహాం స్టెయిన్సునీ అతని ఇద్దరు కుమారులనూ సజీవదహనం చేసారు. అదే యేడు అదే రాష్ట్రంలో అరుల్ దాస్ అనే గురువుని బాణాలు రువ్వి చంపారు. అదేయేడు బీహారులో ఒక మఠకన్యను వివస్త్రనుచేసి అవమానించారు. రాంచీలో తోమసు అనే గురువుని హతమార్చారు. రెండవవేయి సంవత్సరంలో ఆంధ్ర, కర్నాటక, గోవా రాష్ట్రాలలో క్రైస్తవ దేవాలయాలను ధ్వంసం చేసారు. కొన్ని తావుల్లో బైబుళ్ళు తగలబెట్టారు. ఇవీ యింకా యితర సంఘటనలూ క్రైస్తవులు వేదహింసలకు గురౌతున్నారని ఎలుగెత్తి చాటుతున్నాయి. ఈ హింసలకు కారణాలు సాంఘిక, ఆర్థిక, రాజకీయ మతపరమైనవి.

ఈ సందర్భంలో క్రైస్తవులమైన మనం ఆత్మ పరిశీలనం చేసికోవాలి. మనమట్టుకు మనం భక్తిగా, క్రీస్తు శిష్యులంగా జీవిస్తున్నామా! మన గురువే మనకు హింసలు తప్పవని చెప్పలేదా? పూర్వం యూదులు, అటు తర్వాత క్రీస్తు పాస్క శ్రమలు అనుభవించలేదా? క్రీస్తు పాస్క అంటే అతని మరణోత్థానాలు కాదా? క్రీస్తుపాస్క ఈనాడు మన దివ్యసత్ప్రసాద బలిలో కొనసాగడంలేదా? మన గురువుతోపాటు మనం కూడ కొన్ని శ్రమలు అనుభవించి ఉత్థానం కావద్దా?

ప్రస్తుతం మనం నాల్గంశాలు పరిశీలించాలి. 1.యూదులు పాస్క 2. క్రీస్తుపాస్క 3. తొలినాటి క్రైస్తవుల పాస్క 4. 21వ శతాబ్దంలో భారత క్రైస్తవుల పాస్క

## 1. యూదుల పాస్క

పాస్క అనే గ్రీకుమాట పేసా అనే హీబ్రూమాటకు అనువాదం. దాటిపోవడం అని ఈ పదాలకు అర్థం. యిస్రాయేలు ప్రజలు తమ యిండ్ల గడపలకు గొర్రెపిల్ల నెత్తురు పూసారు. ఆ నెత్తురును చూచి దేవదూత వారిండ్లు దాటిపోయాడు. వారి బిడ్డలకు హానిచేయలేదు. అతడు ఆ నెత్తురు పూతలేని ఈజిప్టు ప్రజల యిండ్లలోనికిపోయి వారి తొలిచూలు పిల్లలను చంపివేసాడు - నిర్గ 12, 13. కనుక పాస్క అనేమాటకు క్రమేణ వదలివేయడం, రక్షించడం, కాపాడ్డం అనే అర్థాలు వచ్చాయి.

అబ్రాహాము, ఈసాకు యాకోబులనాడే యావే ప్రభువు యిస్రాయేలీయులతో ఒడంబడిక చేసికొన్నాడు. వారిని కాచికాపాడతానని శపథం చేసాడు. వాళ్లు ఫరోచక్రవర్తికి బానిసలై మ్రగ్గిపోవడం అతడు సహించలేక పోయాడు. కనుక వారిని ఈజిప్టు నుండి విడిపించుకొని రావడానికి కంకణం కట్టుకొన్నాడు. ఈజిప్టు నిర్గమనం యిస్రాయేలు రక్షణ చరిత్రలో కొండశిఖరం లాంటిది.

యిస్రాయేలీయులు ఈజిప్టు బానిసంలో చిక్కి ఆక్రందనం చేయగా ఆ యేడ్పు యావే చెవిని పడింది - నిర్గ 2, 23. వారిని ఫరోచక్రవర్తి ఇనుపపిడికిళ్ళ నుండి విడిపించాలని దేవుడు నిశ్చయించుకొన్నాడు 3,7. ప్రభువు ఈజిప్టులో ఆ ప్రజల కొరకు పది అద్భుతాలు చేసాడు. శత్రువుల మీదికీ మిడతలు, కప్పలు, దోమలు, రోగాలు, వడగండ్లు, చీకట్లు మొదలైన వాటిని పంపాడు. చిట్టచివరి కార్యం తొలిచూలి మగబిడ్డలను చంపివేయడం. దేవుని ఆజ్ఞపై ప్రజలు తమగడపలకు గొర్రెపిల్ల నెత్తురు పూసికొన్నారు. అర్థరాత్రిలో దేవుని దూత దిగివచ్చాడు. అతడు గడపలకు నెత్తురు పూసివున్న యిండ్లకు ఏ హాని చేయకుండా దాటిపోయాడు. నెత్తురు పూతలేని యాజిప్టీయుల ఇండ్లలోకి వెళ్లి తొలిచూలు బిడ్డలను హతమార్చాడు 12,13,27. కనుక గొర్రెపిల్ల నెత్తురు యూదులకు రక్షణమూ, వారి శత్రువులకు శిక్షణమూ తెచ్చిపెట్టింది.

దేవదూత యూదుల యిండ్లను దాటిపోయాక ఆ ప్రజలు మోషే నాయకత్వాన రెల్లు సముద్రాన్ని దాటిపోయారు. ఇదికూడ రక్షణమే. మోషే తర్వాత యోషువా వారిని యోర్దాను దాటించి కనాను దేశంలో చేర్చాడు. ప్రజలు ఆ దేశాన్ని చేరుకోగానే గిల్గాలువద్ద మొదటి పాస్క జరుపుకొన్నారు- యోషు 5,10.

పాస్క పండుగ యూదుల పండుగ లన్నింటిలోను శ్రేష్ఠమైంది. ఈ పాస్క సంఘటనం ద్వారా దేవుడు ఆ ప్రజలను 400 యేండ్లు బానిసం నుండి విడిపించాడు. వారిచే సముద్రాలు, ఎడారులు దాటించాడు. మేఘస్తంభంగా, అగ్నిస్తంభంగా తానుకూడా

వారితో 40 ఏండ్లపాటు ప్రయాణం చేసాడు. కనుక ఈ సంఘటనం వాళ్ల మనసులమీద చెరగని ముద్రవేసింది. వాళ్ళు దాన్ని పాలస్తీనా దేశంలో ఏటేట వుత్సవంగా జరుపుకొన్నారు. ఈ పండుగ 50 రోజులు కొనసాగేది. ఈ పండుగలో ప్రజలు గొర్రెపిల్ల నెత్తురు తమకేలాగ స్వేచ్ఛను ప్రసాదించిందో, తమ్మేలాగ రక్షించిందో గుర్తుతెచ్చుకొన్నారు. ఆ నెత్తురు తమకు జీవమిచ్చిందని అర్థం చేసుకొన్నారు. తాము పాస్క సంఘటన స్మృతిని మర్చిపోకూడదని నిశ్చయించుకొన్నారు.

ఈ పాస్క గొర్రెపిల్ల స్మృతిలో పూర్వ సంఘటనలను జ్ఞప్తికి తెచ్చుకోవడం, భవిష్యత్తుకు సిద్ధంగావడం అనే రెండంశాలు వున్నాయి. పాస్క తిరునాళ్ళలో యిస్రాయేలు సమాజంమంతా పూర్వ సంఘటనను జ్ఞప్తికి తెచ్చుకొన్నారు. తమ బానిసమూ, ప్రభువు ఆదుకోలూ గొర్రెపిల్ల నెత్తురు తమ్ము రక్షించినతీరూ మొదలైన సంఘటనలన్నీ గుర్తుతెచ్చుకొన్నారు. ఇంకా వాళ్ళు భవిష్యత్తుకుకూడ సిద్ధమయ్యారు. భావికాలంలో దేవుడు తమ్ము కాచికాపాడతాడనీ, తమ తరపున తాము దేవునికి విధేయులైయుండాలనీ ఎంచారు. ఈలా పాస్క ఉదంతం వారి జీవితాల్లో మరపురాని సంఘటనమైంది.

యూదులకు పాస్క కేవలం మనసునకు చెందిన సంఘటనం మాత్రమే కాదు. పాస్క చరిత్ర వారి కన్నులకు కట్టినట్లుగా కన్పించేది. వాళ్లు ఏటేట పాస్క విందును భుజించేపుడు చేదు దుంపలు తినేవాళ్ళు. అవి వాళ్లు పడిన శ్రమలకు గుర్తు. పొంగని రొట్టెలను గొర్రెపిల్లను ఆరగించేవాళ్ళు. కుటుంబ యజమానుడు రొట్టెరసాలపై ఆశీర్వచనాలు పలికేవాడు. ఈ కార్యాలన్నిటివల్ల తొలి దాస్యవిముక్తి యూదులకు బాగా అనుభవానికి వచ్చేది. వాళ్ళు భగవంతుని కరుణను ప్రేమను బాగా అర్థంచేసికొనేవాళ్ళు. ఈ పాస్క చరిత్రలో గొర్రెపిల్ల నెత్తుటిని గడపలకు పూయడమూ తర్వాత ఆ జంతువుని భుజించడమూ ప్రముఖాంశాలు అయ్యాయి.

## 2. క్రీస్తు పాస్క

క్రీస్తు నజరేతులో సంప్రదాయ కుటుంబంలో పుట్టిపెరిగాడు. ప్రవక్తల గ్రంథాలు బాగానే జీర్ణంచేసికొన్నాడు. విశ్రాంతి దినాన్ని పాటించాడు. ధర్మశాస్త్రాన్ని అభిమానించాడు. యిస్రాయేలు భక్తికి పునాదులైన ఈజిప్టు పాస్క, సీనాయి నిబంధనం మొదలైన ఘట్టాలను భక్తితో మననం జేసికొన్నాడు.

ఆ రోజుల్లో యూద ప్రజలు గంపెడాశతో మెస్సీయా కొరకు ఎదురు చూస్తున్నారు. ఆ మెస్సీయా రాజకీయనాయకుడుగాను రణవీరుడుగాను వచ్చి రోమను ప్రభువులతో యుద్ధం చేస్తాడు అనుకొన్నారు. అతనికి సైనిక బలం, ధనరాసులు, దాబు దర్పం

వుంటాయనుకొన్నారు. కాని క్రీస్తు ఈ భావాలను ఎంతమాత్రం అంగీకరించలేదు. అతని దృష్టిలో మెస్సీయా దీనుడు. శ్రమలు అనుభవించేవాడు. దైవరాజ్యాన్ని స్థాపించడం అతని ప్రధాన పూచీ. పేదలు, పాపులు, అట్టడుగువర్గం ప్రజలు ఈ దైవరాజ్యంలో చేరారు. ప్రభువు కుష్ఠరోగులు, బెస్తలు, వ్యభిచారిణులు మొదలైన భ్రష్టవర్గాలతో కలసిపోయాడు. దీనులు హీనులు ఐన ప్రజలతో ఐక్యమయ్యాడు.

యేసు ఆకలిదప్పులు శ్రమలు అనుభవించాడు. తన ప్రజల శ్రమలను జూచి కన్నీరు కార్చాడు. పరిసయులు ధర్మశాస్త్రానికి సంకుచిత భావంతో అర్థం చెప్పడం అతనికి నచ్చలేదు. అతని దృష్టిలో పరలోకపు తండ్రి కరుణగలవాడు. జంతుబలులూ ఆచారాలూ కోరుకొనేవాడు కాదు. ఆ తండ్రి పరమ పవిత్రుడు. కనుక క్రీస్తు యూదులందరినీ తమ పాపాలకు పశ్చాత్తాపపడమని హెచ్చరించాడు. అతడు యెషయా ప్రవక్త పేర్కొన్న బాధామయ సేవకుడు తానేనని నమ్మాడు.

యూద నాయకులకు క్రీస్తు గిట్టలేదు. వాళ్ళు అతని చావుని కోరారు. ప్రభువు తాను యెరూషలేములో చనిపోతానని ముందుగానే ఊహించాడు. తండ్రి చిత్తానికి లొంగాడు. దేవాలయాన్ని శుద్ధిచేసినపుడు, విశ్రాంతిదినం నరులకోసం వుందిగాని నరులు విశ్రాంతి దినం కొరకు లేరని చెప్పినపుడు యూద నాయకులు ఆగ్రహం చెంది అతన్ని హత్యచేయాలని సంకల్పించుకొన్నారు.

పైగా అతడు దేవుడు నాకు తండ్రి అని చెప్పుకొన్నాడు. శిష్యులను కూడ అతన్ని తండ్రి అని పిలువమన్నాడు. అతడు పరిసయులను విషసర్పాలనుగా చిత్రించాడు. హేరోదుని గుంటనక్క అని పిల్చాడు. ఈ క్రియలన్నీ అగ్రవర్గంవారి కోపావేశాలను రెచ్చగొట్టాయి. పూర్వ ప్రవక్తల్లాగే, స్నాపక యోహానులాగే క్రీస్తుకూడ హింసకు మృత్యువుకు గురయ్యాడు.

ఒక నరుడు జాతి అంతటి కొరకు చనిపోవడం అనే సూత్రం యూదులకు బాగా తెలుసు. ప్రభువు తన మరణంద్వారా ప్రజల పాపాలకు పరిహారం జరుగుతుంది అనుకొన్నాడు. కనుక తాను అనేకుల రక్షణార్థం తన ప్రాణాలు ధారపోయాలని సంకల్పించుకొన్నాడు - మార్కు 10,45. అతని మరణం పాపపరిహార బలి ఐంది. సువిశేషాలు అతన్ని బాధలు అనుభవించే మెస్సీయానుగా వర్ణిస్తాయి. ప్రజల కొరకు చనిపోయే వ్యక్తినిగా చిత్రిస్తాయి. సమానాంతర సువిశేషాల్లో క్రీస్తు మూడు పర్యాయాలు తన మరణోత్థానాలను పేర్కొన్నాడు. ఐనా శిష్యులు అతని మరణావసరాన్ని గ్రహించలేదు. పైగా పేత్రు నీకు సిలువ మరణం ఎంతమాత్రం తగదని అతన్ని వారించాడు- మత్త 16,23.

మొదటి భాగంలో పాస్క గొర్రెపిల్ల ఉదంతాన్ని చూచాం. దాని నెత్తురు యిస్రాయేలు ప్రజలను రక్షించింది. దాని మాంసం వారికి ఆహారమైంది. యోహాను సువిశేషం క్రీస్తుని పాస్క గొర్రెపిల్లనుగా చిత్రిస్తుంది. స్నాపక యోహాను క్రీస్తుని చూచి యిదిగో! లోకం పాపాలను పరిహరించే గొర్రెపిల్ల అంటాడు - 1,29. పాస్క గొర్రెపిల్ల ఎముకలు విరగగొట్టకూడదు - నిర్గ 12,46. సిలువమీద క్రీస్తు కాళ్ళు విరగగొట్టలేదు. కనుక ఈ ప్రవచనం అతని యందు నెరవేరిందని యోహాను పేర్కొన్నాడు - 19,36. ఇంకా ఆ రచయిత దర్శన గ్రంథంలో "వధింపబడిన గొర్రె పిల్లను సింహాసనం మధ్యలో చూచాను" అని వ్రాసాడు - 5,6. ఈ యాలోకాలన్నీ పాస్క గొర్రెపిల్ల క్రీస్తుకి చిహ్నంగా వుంటుందని తెలియజేస్తాయి.

క్రీస్తు పాస్క పండుగ జరిగేప్పుడు యెరూషలేము వచ్చాడు. అతడూ శిష్యులూ కలసి అక్కడ పాస్క విందును భుజించారు. అతడు శిష్యులతో "నేను శ్రమలు అనుభవించడానికి ముందు మీతో కలసి ఈ పాస్కను భుజించాలని ఎంతో ఆశించాను" అన్నాడు - లూకా 22,15. పూర్వం పాస్క గొర్రెపిల్ల వధద్వారా యూదుల దాస్యం తీరిపోయింది. ఇప్పుడు క్రీస్తు అనే పాస్క గొర్రెపిల్ల వధద్వారా మన పాపదాస్యం తొలగిపోయింది. యెరూషలేములోని పాస్క విందు చారిత్రకంగా జరిగిపోయిన అతని మరణ సంఘటనను జ్ఞప్తికి తెస్తుంది. ఈ విందే భావికాల ప్రజలకు పూజబలి ఐంది. ఈ సందర్భంలో ప్రభువు రొట్టె రసాలను ఉద్దేశించి ఇది నా శరీరం, ఇది నా రక్తం అన్నాడు. దీన్ని నా జ్ఞాపకార్థం చేయండి అని ఆదేశించాడు. ఇదే నేటి మన పూజ. పూజబలి పాస్క విందే.

## 3. తొలినాటి క్రైస్తవుల పాస్క

క్రీస్తు మరణం వేదనతో కూడింది. భయంకరమైంది. ఘోరమైంది. ఆ రోజుల్లో, విప్లవకారులకు, దేశద్రోహులకు ఆలాంటి కఠోర మరణం ప్రాప్తించేది. క్రీస్తు సిలువపై దుర్భరమైన శారీరక, మానసిక వేదనలను అనుభవించాడు. మరణ కాలంలో శిష్యులు అతన్ని విడనాడారు. తండ్రికూడ అతన్ని విడనాడాడు అన్పించింది. యెషయా ప్రవచనం అతనిపట్ల పూర్తిగా నెరవేరింది. "అతడు విచారగ్రస్తుడు, బాధామయుడు అయ్యాడు. నరులు అతనివైపు చూడ్డానికిగూడ ఇష్టపడలేదు. జనులు అతన్ని తిరస్కరించడంచే మనం అతన్ని లెక్కచేయలేదు" - 53,3.

ఆ రోజుల్లో యూదులు సిలువ మరణాన్ని నీచాతి నీచమైనదాన్నిగా గణించారు. ద్వితీయోపదేశకాండం సిలువ చేయబడినవాడు శాపగ్రస్తుడు అంటుంది - 21,23. గల

3,13. తొలిరోజుల్లో రోమను సమాజంలో క్రైస్తవులకు చాలమంది శత్రువులు వుండేవాళ్ళు. సెల్సస్, పోర్ఫిరస్, లూష్యస్ మొదలైనవాళ్ల పేర్లు మనకు తెలుసు. వీళ్లంతా సిలువ వేయబడిన క్రీస్తుని ఆరాధిస్తున్నందుకు క్రైస్తవులను ఎగతాళి చేసారు. ఈ నరులు గాడిదను ఆరాధిస్తున్నారని వెక్కిరించారు. సిలువపై చనిపోయినవాడు వివేకహీనుడని వీళ్ళ భావం. ఈలాంటి పరిస్థితుల్లో తొలినాటి క్రైస్తవులు క్రీస్తుని విశ్వసించారు. అతడు నరులకు రక్షకుడని ప్రకటించారు. వాళ్ళు ఆపని ఏలా చేయగలిగారు? తండ్రి మృతక్రీస్తుని ఉత్థానుణ్ణి చేసి అతనికి న్యాయం చేకూర్చి పెట్టాడని నమ్మారు - క్రీస్తు ఉత్థానమే అతడు దైవ భక్తుడనీ లోకరక్షకుడనీ రుజువు చేసింది. తొలినాటి అపోస్తలుల బోధ యిదే. "క్రీస్తు మన పాపాల కొరకు మరణించాడు. మూడవ దినాన అతడు తండ్రిచే సజీవుడుగా లేవనెత్తబడ్డాడు" - 1 కొ 15,3-4. అవమానకరమైన మరణమే అతనికి మహిమగల ఉత్థానాన్ని చేకూర్చి పెట్టింది. ఈ మరణోత్థానాలకు కర్తయైన క్రీస్తుకోసం చనిపోవడానికి గూడ తొలినాటి శిష్యులు వెనుదీయలేదు. స్తెఫను, తర్వాత పౌలు ఈలాగే వేదసాక్షులుగా మరణించారు.

"మన పాస్క గొర్రెపిల్లయైన క్రీస్తు బలి అయ్యాడు" అని వ్రాసాడు పౌలు - 1 కొరి 5,7. యూదులు పాస్కబలి జరుపుకొనే కాలంలోనే క్రీస్తు మరణోత్థానాలు సంభవించాయని ఆదిమ క్రైస్తవులకు తెలుసు. ఈజిప్టు పాస్కద్వారా యూదులు బానిసంనుండి స్వేచ్ఛను పొందారు. మరణాన్ని తప్పించుకొని జీవాన్ని పొందారు. పాపాన్ని విడనాడి వరప్రసాదాన్ని పొందారు. తండ్రి క్రీస్తుని మరణంనుండి లేపడంద్వారా కూడ క్రైస్తవులకు ఇవే లాభాలు చేకూరాయి. పౌలు భక్తుడు క్రీస్తు మరణోత్థానాల్లో తండ్రి జ్ఞానాన్ని చూచాడు. నరులపట్ల తండ్రికిగల ప్రేమను చూచాడు. తాను సేవకుడైన క్రీస్తుకి సేవకుడై వేదబోధ చేస్తున్నట్లుగా చెప్పుకొన్నాడు. నేను సిలువవేయబడిన క్రీస్తుని బోధిస్తున్నాను అని సగర్వంగా చెప్పుకొన్నాడు- 1 కొరి 1,23. అపోస్తలుల వేదబోధ క్రీస్తు పాస్కను ప్రకటించేదే.

ఆ తొలినాటి దైవర్చాన కూడ క్రీస్తు పాస్కను వివరించేదే. యూదులు తమ పాస్కను ఏడాదికి ఒకసారే ఉత్సవంగా జరుపుకొన్నారు. కాని క్రైస్తవులు తమ పాస్కను ప్రతి ఆదివారం జరుపుకొన్నారు. ఈ పాస్కలో యేసు మరణోత్థానాలే ముఖ్యాంశం. దాన్ని "ప్రభుభోజనం" అన్నారు. అది ప్రభువు మరణోత్థానాలను జ్ఞప్తికి తెచ్చేది అన్నారు- 1 కొరి 11,20. పాస్క విందు క్రైస్తవుల దివ్యసత్ప్రసాద విందుగా మారిపోయింది. యెరూషలేములోని భక్తులు అపోస్తలుల బోధ వినడంలోను, సహవాసంలోను, రొట్టె విరవడంలోను, ప్రార్ధనలోను మునిగివుండేవాళ్లు - అచ 2,42. ఈ "రొట్టె విరవడమే" దివ్యసత్ప్రసాదం. ఉత్థానక్రీస్తు ప్రభావం ఈ శిష్యులమీద బలంగా సోకింది. వాళ్లు ఉమ్మడి

జీవితం గడపారు. ఆస్తిపాస్తులు వస్తువులు అందరు ఉమ్మడిగా వాడుకొన్నారు. ఉన్నవాళ్ళు తమ సొత్తును లేనివాళ్ళతో పంచుకొన్నారు. వీళ్ళు పేదలు, వీళ్ళు ధనికులు అనే తారతమ్యం లేకుండా జీవించారు. దేవుణ్ణి స్తుతించారు. సంతోషంగా జీవించారు - అచ 2,44-47. ఇది నిజమైన సత్ప్రసాదసమాజం.

ఆరోజుల్లో ఓవైపు పాస్క, దాని ప్రతిరూపమైన దివ్యసత్ప్రసాద విందు జరుగుతూంటే, మరోవైపు వేదహింసలుకూడ చెలరేగాయి. పాస్కకూ హింసకూ విడదీయరాని సంబంధంవుంది. చాలమంది క్రీస్తు శిష్యులు భక్త సమాజంలో చేరడం జూచి కన్ను గుట్టి యూదులు క్రైస్తవులను హింసించారు. క్రీ.శ. 50 ప్రాంతంలో ఈ హింస బలంగా వుండేది.

కాని ఇంతకంటె బలమైంది రోమను ప్రభువులు పెట్టినహింస. 64 ప్రాంతంలో రోము తగలబడింది. దీనికి క్రైస్తవులే కారణమని నీరోచక్రవర్తి వారిని క్రూరంగా హింసించాడు. 81-96 మధ్యలో డొమీష్యను చక్రవర్తి నేనే దేవుణ్ణని ప్రకటించుకొన్నాడు. యూదులు క్రైస్తవులు మరో దేవుణ్ణి పూజిస్తున్నందున వారిని దారుణంగా చంపించాడు. ఈ కాలంలో హింసలకు గురైన క్రైస్తవులు క్రీస్తు శ్రమలనుండీ మరణంనుండీ శక్తిని పొందారు. లోకం నన్ను హింసిస్తే మిమ్ములను గూడ హింసిస్తుంది అనే ప్రభువు వాక్యం నుండి ప్రేరణం పొందారు - యోహా 15,20. దివ్యసత్ప్రసాదబలినుండి శక్తిని పొంది ఉత్థాన క్రీస్తుతో ఐక్యమయ్యారు. తమలో తాము ఐక్యమయ్యారు.

150 ప్రాంతంలో వేదసాక్షిగా మరణించిన జస్టిన్ భక్తుడు దివ్యసత్ప్రసాద విందును విపులంగా వర్ణించాడు ఈ విందు భక్త సమాజాన్ని బలపరుస్తుంది. ఈ విందుకు హాజరుకాలేని రోగులకొరకు సత్ప్రసాదాన్ని వారియిండ్లకు తీసికొనిపోయేవాళ్ళు. భక్తులు ఈ విందుకు హాజరైతే రోమను ప్రభువులు ఆగ్రహం చెందేవాళ్ళు. ఐనా అందరు ధైర్యంతో ఈ భోజనానికి విచ్చేసేవాళ్ళు. 165 ప్రాంతంలో సార్దీనియా పీఠాధిపతి మెలీటో ఈ విందును గూర్చి ప్రసంగించాడు. యూదులు గొర్రెపిల్లను వధించి పాస్క భోజనాన్ని భుజించిన సంఘటనం క్రీస్తునందు ఫలసిద్ధిని పొందిందని బోధించాడు.

ఈ కాలంలోనే వేదసాక్షులు అనే భక్తులు ప్రచారంలోకి వచ్చారు. 167లో స్మిర్నా బిషప్ పోలికార్ప్ వేదసాక్షిగా మరణించాడు. ఆనాటి భక్తులు ఆయన మరణానికి క్రీస్తు మరణానికీ సామ్యం వుందన్నారు. క్రీస్తులాగే పోలికార్పు కూడ ఆత్మార్పణం చేసికొన్నాడు.

177 ప్రాంతంలో మార్కస్ ఔరేలియస్ అనే రోమను చక్రవర్తి క్రైస్తవులను మళ్ళా క్రూరంగా హింసించాడు. లియోను, వియన్నా నగరాల్లో చాలమంది క్రైస్తవులు

వేదసాక్షులుగా మరణించారు. ఆ కాలపు వేదశాస్త్రి టెర్టూలియను "క్రైస్తవుల నెత్తురు తిరుసభకు నారుమడి" అని వ్రాసాడు. అనగా వేదసాక్షుల మరణం వల్ల చాలమంది రోమనులు క్రైస్తవ మతంలో చేరతారని భావం. ఈ వేదసాక్షులు మరణదినాన క్రైస్తవభక్తులు వారిని స్మరించు కొని ప్రార్థనలు చేసేవాళ్ళు. అదేవారి జన్మదినంగా గణింపబడింది. ఆ దినాన వాళ్ళు పరలోక జీవితానికి జన్మించారని భావం.

తొలిమూడు శతాబ్దాలు తిరుసభ హింసలు అనుభవించింది. ఆ కాలంలో చాలమంది క్రైస్తవులను సిలువవేసారు. వారి తలలు కొట్టించారు. వారిని నిలువున కాల్చి చంపారు. క్రూరమృగాలకు మేతగా వేసారు. ఐనా క్రైస్తవుల సంఖ్య పెరిగిందే గాని తరగలేదు. సత్ప్రసాద బలివాళ్లకు బలాన్నిచ్చింది. వాళ్ళు క్రీస్తుపట్ల అనంత విశ్వాసంతో, పరస్పర ప్రేమభావంతో, ఐక్యభావంతో జీవించారు. ధైర్యంతో శ్రమలను ఎదుర్కొన్నారు. క్రీస్తు మరణంతో ఏకమైతే అతని పునరుత్థానంతో కూడ ఏకమౌతామని నమ్మారు - రొమా 6,5.

## 4. 21వ శతాబ్దపు పాస్క

20వ శతాబ్దంలో చాల వేద హింసలు జరిగాయి. కమ్యూనిస్టు రష్యా చాలమంది క్రైస్తవులను హింసించింది. ల్యాటిను అమెరికా కూడ చాలమంది క్రైస్తవులను బాధించింది. ఈ హింసల్లో చాలవరకు క్రైస్తవులే క్రైస్తవులను వేధించారు. క్రీస్తు తన్నుతాను ఒక్కసారే కల్వరిమీద బలిగా అర్పించుకొన్నాడు - హెబ్రే 9,12,26. కాని క్రైస్తవ భక్తులు ఆ ప్రభువుతో కలిసి పెక్కుసార్లు తమ్ముతాము బలిగా అర్పించుకొన్నారు. అతని మరణంతో కలిసి వాళ్ల మరణం కూడ అనేకులకు రక్షణ సాధనమైంది.

లోకమంతటా హింసలకు గురైన దివ్యసత్ప్రసాద సమాజాలు పాస్క పరమరహస్యాన్ని తమ జీవితంలో ప్రతిబింబించుకొన్నాయి. క్రీస్తు బాధామయ సేవకుడు. శిష్యులకాళ్ళు కడిగిన గురువు. హింసలకు గురైన ప్రవక్త. ప్రాణప్రదాతయైన విమోచకుడు. ఈ ప్రభువు హింసలకు గురైన వారిని ప్రభావితం చేసాడు. దీన్ని నా జ్ఞాపకార్థం చేయండి అన్న ప్రభువు ఆజ్ఞ వారిని ప్రేరేపించింది. వాళ్లు రొట్టె విరిచినప్పుడే వాళ్ళ శరీరాలు కూడ విరిగిపోయాయి. వాళ్ళు పాత్రంనుండి పానం చేసినప్పుడే శ్రమలను గూడ పానం చేసారు.

పూజలో అప్పాన్ని క్రీస్తు శరీరంగా మార్చాక ఈ విధంగా విశ్వాస ప్రకటనం చేస్తాం.

"యేసువా! మీ మరణాన్ని ప్రకటిస్తాం. మీ వుత్థానాన్ని చాటుతాం. మీరు మరల వచ్చే వరకు వేచివుంటాం."

"మీ మరణంచేత మా మరణాన్ని ద్వంసంచేసి మీ వుత్థానం చేత మాకు పునర్జీవాన్ని ప్రసాదించిన మా యేలినవారైన యేసువా! మీరు మహిమతో వేంచేసిరండి."

"యేసువా! ఈ యప్పాన్ని భుజించిపుడెల్ల, ఈ పాత్రం నుండి పానం చేసినపుడెల్ల మీరు మరల వచ్చేవరకు మీ మరణాన్ని చాటుతాం."

ఈ ప్రకటనలు అన్నీ కూడ క్రీస్తుపాస్కను గుర్తుకి తెస్తాయి. ఈ ప్రకటనల ద్వారా మన శ్రమల్లో బలాన్ని పొందుతాం.

శ్రమలు వేదనలు ప్రపంచంలోని నరులందరికి వున్నాయి. ఈ శ్రమలు ఒక విధంగా క్రీస్తు శ్రమలతో కలుస్తాయి. క్రీస్తు లోకంలోని నరులందరి కొరకు చనిపోయాడు. కనుక అతని శ్రమలు మరణోత్థానాలు మనకు తెలియని రీతిలో నరులంలరినీ ప్రభావితం చేస్తాయి. పవిత్రాత్మే ఈ కార్యాన్ని సాధిస్తుంది. క్రీస్తు శ్రమల వల్ల లోకంలోని నరులు తమ శ్రమలను భరింపగల్గుతున్నారు. అవి పునీతమౌతున్నాయి. కాని క్రైస్తవులమైన మనం దివ్యసత్ప్రసాద బలిద్వారా క్రీస్తు శ్రమలనుండి ఎక్కువ ఫలితాన్ని పొందుతున్నాం.

ఓస్కార్ రొమేరో దక్షిణ అమెరికాలోని ఎల్‌సాల్వడోరులో ఆర్చిబిషప్ . ఆయన పేదల అభ్యుదయం కొరకు కృషిచేస్తుంటే సహించలేక, ధనిక క్రైస్తవవర్గం దేవాలయంలో పూజ చేస్తున్నపుడు ఆయన్ని కాల్చి చంపింది. తన మరణానికి ముందు రోమేరో "బలియైన క్రీస్తు శరీరం, ఆ ప్రభువు చిందించిన రక్తం మనకు జీవాన్ని ఇస్తాయి. అతనిలాగే మనంకూడ మన శరీరాలను సమర్పించి వేదనలకు బాధలకు గురికావాలి. దీనిద్వారా మన ప్రజలకు శాంతి, న్యాయం లభిస్తాయి" అని వాకొన్నాడు. ఆయన చెప్పినట్లే ఆయన మరణం సాల్వడోర్‌లో న్యాయాన్ని స్థాపించింది. ఈ బిషప్‌లాగే తూర్పు టిమోర్ దేశంలో బిషప్ కార్లోస్ బెల్లోగారుకూడ హింసలు అనుభవించి స్వాతంత్ర్యాన్ని సంపాదించారు.

ఇక, భారత దేశంలో పేదలు, గిరిజనులు దళితులు ఐన క్రైస్తవులు విశేషంగా హింసలకు గురౌతున్నారు. ఒరిస్సా, గుజరాతు, మధ్యప్రదేశ్, బీహారు రాష్ట్రాల్లోని దళిత క్రైస్తవులు చాలమంది బాధలు అనుభవించారు. పట్టణాల్లో వున్న మన ఇంగ్లీషు మీడియం స్కూళ్ళు, ఆస్పత్రులుమాత్రం ఏ హింసలకు గురికావడంలేదు. ఐతే మనం ఈ సందర్భంలో "మీరు లోకానికి చెందినవారైతే లోకం మిమ్ము ప్రేమిస్తుంది" అన్న క్రీస్తు వాక్యాన్ని స్మరించుకోవాలి - యోహా 15,19. క్రీస్తు సువార్తను విన్పించనిచోట క్రైస్తవులకు హింసలుండవు.

పూర్వం దివ్యసత్ప్రసాదం వేదహింసల్లో తార్సు వాసియైన పౌలు భక్తునికీ, అంటియోకయ బిషప్పయిన ఇగ్నేష్యసుగారికీ బలాన్నిచ్చింది. ఆఫ్రికా, జపాను వేదసాక్షులకు ధైర్యాన్నిచ్చింది. అదే దివ్యభోజనం ఇప్పుడు మన దేశంలోని ఒరాను, ముండా, నాగ, వర్లీ, వాసవి, డాంగి, మాల, మాదిగ వర్గాల క్రైస్తవులకు శక్తి నిస్తుంది. పిశాచశక్తులు మానవ హక్కులను భంగపరచి చావుని తెచ్చిపెడతాయి. కాని సత్ప్రసాదం నరులకు విమోచనాన్నీ జీవాన్నీ ప్రసాదిస్తుంది. వేదహింసలకు గురైనవాళ్ళు శ్రమలు అనుభవిస్తారు. ఆత్మార్పణం చేసికొంటారు. పౌలు భక్తుడు "మీ శరీరాలను పవిత్రమూ సజీవమూ ఐన యాగంగా దేవునికి అర్పించుకోండి" అని చెప్పాడు - రోమా 12,1.

పాస్క వున్నచోట హింసకూడ వుంటుంది. యూదుల పాస్క ఫరో చక్రవర్తి హింసను పురస్కరించుకొని వచ్చింది. క్రీస్తు పాస్కలో శ్రమలూ మరణమూ వున్నాయి. ఆదిమ క్రైస్తవుల శ్రమల్లో, వేదసాక్షుల మరణంలో హింసవుంది. నేడు పాస్కబలినీ దాని ప్రతిరూపమైన దివ్యసత్ప్రసాద బలినీ సమర్పించుకొనే మనకు కూడ హింసలు తప్పవు. కాని ఈ హింసల్లోనే మనకు జీవం లభిస్తుంది.

క్రీస్తు వచ్చాక 2000 సంవత్సరాలు గతించాయి. ఇప్పుడు మూడవవేయి సంవత్సరంలో అడుగుపెట్టాం. ఈ మూడవ సహస్రాబ్దంలో కూడ మనకు తిప్పలు తప్పవు. మన బాధలు పూర్వభక్తులు బాధల కంటె ఇంకా అధికంగా పెరుగుతాయి. "క్రీస్తు శ్రీసభ కొరకు పడిన బాధల్లో కొదవగా వున్న వాటిని నేను నా శ్రమల ద్వారా పూర్తిచేస్తున్నాను" అన్న పౌలుభక్తుని వాక్యాలను మనమందరం స్మరించుకోవలసివస్తుంది - కోలో 1,24

పూజలో మనం బలిమూర్తియైన క్రీస్తుతోపాటు అతని శరీర రక్తాలతోపాటు, మనబాధామయ జీవితాలను తండ్రికి అర్పించుకోవాలి. "ఇది మీ కొరకు అప్పగింపబడనున్న నా శరీరం", "ఇది మీ కొరకు చిందింపబడనున్న నా రక్తం" అనే క్రీస్తు పలుకులు మనకు అనుదినం ప్రేరణం కలిగిస్తుంటాయి. ఆ జీవమయ శరీరాన్ని భుజించి ఆ పాత్రలోని రక్తాన్ని పానంజేసి మనం కొంతవరకు శ్రమలకు తట్టుకోగలుగుతున్నాం.

తిరుసభ దివ్యసత్ప్రసాదాన్ని సిద్ధంచేస్తుంది. ఐతే దివ్యసత్ప్రసాదం తిరుసభను నిర్మిస్తుంది. అనగా మనం దివ్యసత్ప్రసాదాన్ని యోగ్యంగా భుజించి తిరుసభను ఓ భవనంలా కట్టుకొనిపోతాం. దాని పెంపుకి తోడ్పడతాం. అది అన్ని తావుల్లో వ్యాపించేలా కృషిచేస్తాం. ఉత్థాన క్రీస్తు తండ్రి నన్ను పంపినట్లే నేనూ మిమ్ములను పంపుతానని వాకొన్నాడు - యోహా 20,21. మన ప్రేషిత సేవద్వారానే మనం తిరుసభను వ్యాప్తిచేస్తాం.

ప్రభువు మీ శత్రువులను ప్రేమించండి, మిమ్ము హింసించే వారికొరకు ప్రార్థించండి అన్నాడు - మత్త 5,44. ఈ సూత్రం ప్రకారం మనం హింసితులమైనా పగతీర్చుకోవడానికి పూనుకోగూడదు. వారిని క్షమించి వదలివేయాలి. మన క్షమాగుణంవల్ల వారి మనసులు మారవచ్చు.

మూడవ వేయి సంవత్సరంలోగూడ ఇండియాలో క్రైస్తవులు మైనారిటీ వర్గంగానే వుంటారు. కాని భారతదేశ తిరుసభ సేవక తిరుసభగా వుంటుంది. బలిమూర్తియైన క్రీస్తుతోపాటు తానూ శ్రమలు అనుభవిస్తుంది. రోజురోజు దివ్యసత్ప్రసాద బలినర్పిస్తూ ఈ దేశాన్ని సత్ప్రసాద ప్రభావంతో నింపుతుంది.

ఆర్చిబిషప్ రోమేరో తన మరణానికి ముందు ఈలా వాకొన్నారు. "నేను చావునిగాక ఉత్థానాన్ని నమ్ముతాను. శత్రువులు నన్ను చంపితే నేను సాల్వడోర్ ప్రజల్లో మళ్లా జీవిస్తాను. నేను వేదసాక్షి మరణానికి పాత్రుణ్ణిగాను. కాని ప్రభువు నా జీవితార్పణను అంగీకరిస్తే, నా రక్తం ఈ దేశానికి స్వాతంత్ర్యం తెచ్చిపెట్టాలని కోరుకొంటున్నాను. నేను చిందించే నెత్తురుద్వారా నా దేశ ప్రజల ఆశలు ఫలప్రదం కావాలని కోరుకొంటున్నాను. ఈ బిషప్పు చనిపోవచ్చుగాక. కాని తిరుసభ, అనగా ఈ దేశ ప్రజలు ఎంతమాత్రం చనిపోరు." ఈ వాక్యాలు ఇప్పుడు మనదేశంలో మనకుకూడ అక్షరాల వర్తిస్తాయి.

కాని భారతదేశంలోని హింసిత తిరుసభ ధైర్యం తెచ్చుకోవాలి. ఆయా కాలాల పొడుగునా ప్రపంచం నలుమూలలా చాలమంది శ్రమలు అనుభవించారు. ఆ శ్రమల్లో వాళ్ళు పుటంవేసిన బంగారంలాగ శుద్ధులయ్యారు. "మీకు కలుగబోయే శ్రమలను గూర్చి భయపడవద్దు. మీరు మరణం వరకు విశ్వాస పాత్రులై వుండండి. అపుడు నేను మీకు జీవకిరీటాన్ని అనుగ్రహిస్తాను" - దర్శ 2,10. ఈలాంటి వేదవాక్యాలను నమ్మి మనం ధైర్యంతో ముందుకి సాగాలి.

భారతదేశ తిరుసభ మైనారిటీ సంస్థ. విరోధులు మన విద్య, వైద్య, సాంఘిక సేవాసంస్థలకు కీడు తలపెట్టవచ్చు. మైనారిటీ వర్గంగా మనకున్న హక్కులను, సదుపాయాలను తొలగించవచ్చు. మన వేదబోధకు ఆటంకాలు కలిగించవచ్చు. మతాంతరీకరుణను నిషేధించవచ్చు. అసూయ ద్వేషాలతో మన గురువులనూ మఠకన్యలనూ బాధించవచ్చు. వేదహింసలు నానా రకాలుగా వుంటాయి. కాని వీటికి మనం దడవనక్కరలేదు. మతహింసల్లో మనకు ధైర్యాన్నిచ్చేది సత్ప్రసాద శక్తి. దానిలో నెలకొని వున్న పవిత్రశక్తి. మత్త 10,17-23 వాక్యాలు వేద హింసలను ప్రస్తావిస్తాయి. ఈ హింసల కాలంలో ఆత్మే మనచేత ధైర్యంగా మాట్లాడిస్తుందని చెప్తాయి.

ఇంకో విషయంగూడ. క్రైస్తవులమైన మనం ఈ దేశంలో అల్ప సంఖ్యాకులం. కనుక మనం చాల యేండ్లుగా కొన్ని సదుపాయాలు, రాయితీలు అనుభవిస్తూ వచ్చాం. సహజంగానే వీటిని పోగొట్టుకోవడానికి ఇప్పుడు మనం ఇష్టపడం. ఐనా మనం వీటిని వదలుకోవలసిన రోజు వస్తుంది. పైగా నేడు చాలమంది క్రైస్తవుల్లో భక్తిశ్రద్ధలు లేవు. ఆ మాటకొస్తే క్రైస్తవాధికారుల్లో గూడ చిత్తశుద్ధి, మంచి ఆదర్శం లేవు. మనం విదేశాల ఆర్థిక సహాయంమీద అతిగా ఆధారపడుతున్నాం. మన పేదవర్గాల ప్రజలను చూస్తే, వాళ్లల్లో వాళ్ళకు ఐక్యతలేదు. ఒకరినొకరు కూలద్రోయ జూస్తున్నారు. అందరూ మతం పేరుమీదిగా ఆర్థికలాభాలు పొందాలని కోరుకొనేవాళ్ళే. క్రీస్తుబోధలు పాటించేవాళ్ళు, నిజమైన శిష్యులుగా జీవించేవాళ్ళు చాల తక్కువ. ఈలాంటి పరిస్థితుల్లో వేదహింసలు మనలను మేలుకొల్పి మనకు బుద్ధిచెప్తాయి. మనకు పట్టిన తుప్పును వదిలిస్తాయి. మన మాలిన్యాన్ని కడిగివేసి మనలను శుద్ధిచేస్తాయి. త్రోవదప్పిన మనలను తిరుగ దారికి తీసుకవస్తాయి. మన పాపాలకు, ద్రోహాలకు, వంచనలకు, అక్రమార్జనలకు మనం పశ్చాత్తాపపడేలా చేస్తాయి. మనం భక్తివిశ్వాసాలతో గూడిన క్రైస్తవ జీవితం గడిపేలా చేస్తాయి. ఇందువల్ల వేదహింసలు మనకు కీడుచేసిన దానికంటె మేలే యెక్కువ చేస్తాయి. ఇందుచే మనం ఈ హింసలను ఆహ్వానించాలి. ఇవి లేనప్పుడుకూడ ఇవి వుండాలని కోరుకోవాలి. వీటంతట ఇవి వచ్చినపుడు వీటిని విశ్వాసంతో స్వీకరించాలి.

ఇప్పుడు క్రైస్తవులమైన మనకు ఐక్యతలేదు. మనలో మనం కులాల పేరుమీదిగా, వర్గాల పేరుమీదిగా తన్నుకొని చస్తున్నాం. హింసలు మనలను ఐక్యంచేస్తాయి. అందరూ ఒకరినొకరు అంగీకరించి ఒక త్రాటిమీద నడిచేలా చేస్తాయి. మనం బైబులు గ్రంథాన్ని భక్తితో చదివి, దేవద్రవ్యానుమానాలను భక్తితో స్వీకరించేలా చేస్తాయి. క్రీస్తుకి భక్తితో ప్రార్థన చేసికొని ఆ ప్రభువు సహాయాన్నీ బలాన్నీ పొందేలా చేస్తాయి. ఒక్కమాటలో చెప్పాలంటే, మనం నిజమైన క్రైస్తవులంగా జీవించేలా చేస్తాయి. అందుచే మనం హింసలకు జంకకూడదు. అవి వచ్చినపుడు వాటిని నిండు మనస్సుతో ఆహ్వానించాలి.

# 4. జ్ఞానస్నానం

## మనవిమాట

ఈ గ్రంథంలో జ్ఞానస్నానం, భద్రమైన అభ్యంగనం అనే రెండు సంస్కారాలను వివరించాం. దీనిలోని తొలి ఐదధ్యాయాలను మాత్రం ఈ వరకే బైబులుభాష్యం 57-58 సంచికల్లో ముద్రించాం.

క్రైస్తవుడు మొట్టమొదట స్వీకరించే సంస్కారం జ్ఞానస్నానం. ఇదిలేందే ఇతర సంస్కారాలు పనిచేయవు. భక్తుడు విశ్వాసమందిరంలో అడుగిడడానికి జ్ఞానస్నానం ప్రవేశద్వారంలా ఉపకరిస్తుంది. కనుక విశ్వాసులు ఈ సంస్కారాన్ని గూర్చిన వివరాలను భక్తిశ్రద్ధలతో నేర్చుకోవాలి. ఇది నాల్గవ ముద్రణం.

## విషయసూచిక

# 1. జ్ఞానస్నానమూ బైబులు బోధలూ

నూత్నవేదంలోని ముఖ్య భావాల్లో జ్ఞానస్నానం కూడ ఒకటి. తొలి మూడు సువిశేషాలు వ్రాసిన రచయితలూ, పౌలూ యోహానూ - ఒక్కొక్కరూ ఒకొక్కక్క పద్ధతిలో జ్ఞానస్నానాన్ని గూర్చి వ్రాసారు. ఇక్కడ మనం నాలుగంశాలను పరిశీలిద్దాం.

## 1. మొదటి మూడు సువిశేషాల రచయితల భావాలు

ప్రస్తుతానికి క్రీస్తు యోర్దాను నదిలో స్నాపక యోహాను నుండి జ్ఞానస్నానం పొందడాన్ని గూర్చి మాత్రం విచారిద్దాం -మత్త 3,13-17. క్రీస్తుకి సొంత పాపాలేమీ లేవు. కాని అతడు మన పాపాలను భరించిన బాధామయ సేవకుడు - యెష 53,5-6. మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేయడానికే అతడు యోహానునుండి జ్ఞానస్నానం పొందాడు. ఈ యోహాను జ్ఞానస్నానం నేటి మన జ్ఞానస్నానంలాగ పాప క్షమను దయచేయదు. కేవలం దాన్ని సూచిస్తుంది. కనుక అది రాబోయే నూత్నవేద జ్ఞానస్నానానికి చిహ్నంగా వుంటుంది - మత్త 3,11.

క్రీస్తు జ్ఞానస్నానాన్ని స్వీకరిస్తూండగా తండ్రి ఆయన్ని గూర్చి “నీవు నా ప్రియకుమారుడివి” అని సాక్ష్యం పలికాడు. ఇది పూర్వవేదంలో యెషయా బాధామయ సేవకుణ్ణి గూర్చి చెప్పిన వాక్యం - 42,1. పూర్వవేదంలో ఒక మహాసేవకుడు దేవుని చిత్తాన్ని పాటించి ప్రాణత్యాగం చేస్తాడు. అతడు రాబోయే క్రీస్తుని సూచిస్తాడు. క్రీస్తు సిలువమరణం ద్వారా తండ్రికి ప్రియపడతాడు. ఆ కుమారుని లోనికి జ్ఞానస్నానం పొందిన మనంకూడ తండ్రికి దత్తపుత్రులమై అతనికి ప్రీతిపాత్రుల మౌతాం - గల 4,6.

పైరీతిగా తండ్రి క్రీస్తుకి సాక్ష్యం పలుకుతూండగానే ఆకాశం తెరచుకొని ఆత్మ పావురం రూపంలో దిగివచ్చింది. ఈ సంఘటనం, తర్వాత ఆత్మ శిష్యులమీదికి దిగిరావడాన్ని సూచిస్తుంది. ఆలా దిగిరావడమే శిష్యుల జ్ఞానస్నానమౌతుంది - అచ 1,5 నీటిద్వారాను, ఆత్మద్వారాను పాపపరిహారం జరుగుతుందనే సత్యం ఈ యోర్దాను జ్ఞానస్నాన సంఘటనం నిరూపిస్తుంది.

ఇంకోవిషయంగూడ. క్రీస్తు యోర్దాను జ్ఞానస్నానం అతడు భవిష్యత్తులో పొందబోయే మరో జ్ఞానస్నానానికి చిహ్నంగా వుంటుంది. ప్రభువు “నేను పొందవలసిన జ్ఞానస్నానం మరొకటుంది. దాన్ని పొందినదాకా నాక సంతృప్తి లేదు” అని వాకొన్నాడు - లూకా 12, 50. ఈ జ్ఞానస్నానం అతని సిలువ మరణమే. యెషయా ప్రవక్త తన ప్రవచనం 42, 1లో పేర్కొన్న బాధామయ సేవకునిలాగే క్రీస్తుకూడ ప్రజల తరపున ప్రాణాలర్పించాలి. అతడు బాధల్లో మునిగి తేలాలి. కనుక క్రీస్తు జ్ఞానస్నానం అతని

పాపాల కొరకుగాదు, మన పాపాలకొరకు. ఆయన లోకం పాపాలను భరించే దేవుని గొర్రెపిల్ల - యోహా 1,29.

క్రీస్తు యోర్దాను జ్ఞానస్నానం ఆయన సిలువ మరణాన్ని సూచిస్తుందని చెప్పాం. ఈ మరణం ద్వారా ఆయన ఉత్థానం చెంది ఆత్మను పొందుతాడు. తర్వాత ఆయన తన్ను విశ్వసించి తనలోనికి జ్ఞానస్నానం పొందేవాళ్ళకు ఈ యాత్మను దయచేస్తాడు - 1కొరి 15,45. మనం ఆయన మరణోత్థానాల్లోనికి జ్ఞానస్నానం పొంది ఆయన ఆత్మను స్వీకరిస్తాం.

యోహాను తన జ్ఞానస్నానం తన తర్వాత వచ్చే మెస్సియా జ్ఞానస్నానాన్ని సూచిస్తుందని వాకొన్నాడు. ఇదే నూత్నవేద జ్ఞానస్నానం. ఇది పరిశుద్ధాత్మతోను అగ్నితోను ఈయబడేది - మత్త 3,11. ఇక్కడ అగ్ని అంటే ఏమిటి? అగ్ని దేవుని ప్రేమకు గుర్తు. ఆ ప్రేమే పవిత్రాత్మ - అచ 2,3. హెబ్రే 12,29. కనుక నూత్నవేద జ్ఞానస్నానం దేవునిప్రేమ శక్తియైన పరిశుద్ధాత్మతో ఈయబడేదని భావం.

పై యోర్దాను సంఘటనంతో సంబంధం లేనిదైనా, సువిశేషాల్లో జ్ఞానస్నానాన్ని గూర్చిన మరో ముఖ్యవాక్యం వుంది. అదే క్రీస్తు అంతిమ ఆజ్ఞ. ఉత్థాన క్రీస్తు "మీరు వెళ్ళి సమస్త జనులను నా శిష్యులనుగా జేయండి. పిత పుత్ర పవిత్రాత్మల నామంలోనికి వాళ్ళకు జ్ఞానస్నానమీయండి" అని శిష్యులకు ఆదేశించాడు. ఇక్కడ జ్ఞానస్నానం పొందేవాళ్ళు త్రీత్వంలోనికి దాన్ని పొందుతారని భావం. ముగ్గురు దైవవ్యక్తుల నామంలోనికి జ్ఞానస్నానం పొందడమంటే ఆ దైవ వ్యక్తులకు అంకితం కావడం. ఆ ముగ్గురు వ్యక్తుల కుటుంబంలోనికి ప్రవేశించడం. ఆ కుటుంబానికి దత్తపుత్రులం కావడం. కనుక దైవకుటుంబంలోనికి జ్ఞానస్నానం పొందేవాళ్ళు ఆ దైవకుటుంబం జీవించే దివ్యజీవనాన్నే జీవిస్తారు.

## 2. పౌలు భావాలు

పౌలు జ్ఞానస్నానాన్ని గూర్చి చాల సంగతులు చెప్పాడు. ఈ భావాలు విశేషంగా రోమీయుల జాబులోను గలతీయుల జాబులోను కన్పిస్తాయి. ప్రస్తుతానికి స్నానం క్రొత్తపుట్టువు, పాతిపెట్టడం, ధరించడం, దాటడం, సున్నతి, ముద్ర, వెలుగు అనే భావాలను మాత్రం పరిశీలిద్దాం.

1. "బాప్టిజ్జేయిన్" అనే గ్రీకు క్రియకు ముంచడం, కడగడం, స్నానమాడ్డం అనే అర్థాలున్నాయి. కనుకనే పౌలు ఈ క్రియ ఓ స్నానం లాంటిదని చెప్పాడు - తీతు 3,5. అపోస్తలుల చర్యలు 22,16 ఈ క్రియ మన హృదయాన్నే కడిగివేస్తుందని చెప్తుంది.

2. ఈ స్నానం ద్వారా మనకు క్రొత్తపుట్టువు లభిస్తుంది - తీతు 3,5. ఇది కేవలం వ్యక్తులకు మాత్రమేగాక శ్రీసభ కంతటికీ సిద్ధిస్తుంది - ఎఫె 5,26.

3. ఈ జ్ఞానస్నానం మనలను క్రీస్తు మరణంలోనికి పాతిపెడుతుంది. ఆయన ఉత్థానంలోనికి లేపుతుంది. రోమా 6,3-4.

ఇది చాల ముఖ్యమైన భావం. కనుక దీన్ని గూర్చి కొంచెం విస్తరంగా చెప్పాలి. మరణానంతరం క్రీస్తు శరీరాన్ని సమాధిలో పాతిపెట్టారు. ఇదే ప్రభువు భూస్థాపనం. మనం కూడ జ్ఞానస్నానంలో ప్రభువుతోపాటు భూస్థాపనం పొందుతాం. శ్రీసభ తొలిరోజుల్లో జ్ఞానస్నానం పొందేవాళ్ళను మూడుసార్లు తొట్టిలో ముంచి వెలుపలికి కొనివచ్చేవాళ్లు. మనం వాడే బప్తిస్మం అనే మాటకు ముంచడం అనే అర్థముందని చెప్పాంగదా! క్రీస్తు మృతదేహం భూమిలోనికి వెళ్ళినట్లే నీటిలోనికి ముంచబడిన క్రైస్తవులును ఒకవిధంగా భూమిలోనికి వెళ్తారు. క్రీస్తుతోపాటు భూస్థాపనం కావడమంటే యిదే. క్రీస్తు భౌతికంగా చనిపోయాడు. కాని విశ్వాసులు జ్ఞానస్నానం ద్వారా భౌతికంగా చనిపోరు. ఆధ్యాత్మికంగా చనిపోతారు. అనగా పాపజీవితానికి చనిపోతారు.

మృతక్రీస్తు పితశక్తివలన సమాధినుండి సజీవుడై లేచాడు. లేచి మహిమతోగూడిన మోక్షజీవితం జీవిస్తున్నాడు. క్రీస్తు మరణంలోను భూస్థాపనంలోను పాలుపొందిన మనం ఆ ప్రభువు ఉత్థానంలో కూడ పాలుపొందుతాం. ఏలాగ? జ్ఞానస్నానం పుచ్చుకొనేవాళ్ళు తొట్టిలోమూడుసార్లు ముంచబడినంక వెలుపలికి వచ్చేవాళ్ళు. ఈలా రావడం క్రీస్తు సమాధిలోనుండి లేక భూమిలో నుండి వెలుపలికి రావడాన్ని సూచిస్తుంది. క్రీస్తు మహిమ జీవితానికి ఉత్థానమయ్యాడు. జ్ఞానస్నానం పొందిన క్రైస్తవులు క్రొత్త జీవితానికి ఉత్థానమౌతారు. అనగా పూర్వ పాపజీవితం విడనాడి క్రొత్తజీవితం, క్రీస్తుజీవితం ప్రారంభిస్తారు.

కాని ఇక్కడ ఒక్కసంగతి గమనించాలి. ఇప్పటి మన జ్ఞానస్నానంలో తొట్టిలోకి వెళ్ళడమూ వెలుపలికి రావడమూ అనేవి లేవు. నేడు కేవలం నొసటిమీద నీళ్ళు పోస్తాం. కనుక భూమిలోకి ప్రవేశించడమూ మళ్ళీ బయటికి రావడమూ అనే సంకేతాలు ప్రాచీన జ్ఞానస్నాన విధికిమల్లె నేటి జ్ఞానస్నానవిధికి వర్తించవు. ఐనా పాపానికి చనిపోవడమూ, క్రొత్త జీవితానికి లేవడమూ అనే సంకేతాలు మాత్రం ఇప్పటి జ్ఞానస్నానవిధికీ వర్తిస్తాయి.

4. జ్ఞానస్నానం ద్వారా మనం క్రీస్తుని ధరిస్తాం - గల 3,27.పూర్వం ఈ సంస్కారాన్ని పొందేవాళ్ళను జ్ఞానస్నానపు తొట్టిలో ముంచేవాళ్ళని చెప్పాం. అలా మునగక ముందు వాళ్ళు పాతబట్టలను తీసేవేసేవాళ్ళు. నీళ్ళల్లో నుండి వెలుపలికి వచ్చాక కొత్తబట్టలను ధరించేవాళ్ళు. జ్ఞానస్నానం పొందిన భక్తులు క్రొత్తబట్లనులాగే క్రీస్తుని గూడ ధరిస్తారని పౌలు భావం.

5. పూర్వం యిస్రాయేలీయులు మోషే నాయకత్వాన రెల్లుసముద్రందాటారు. ఈ సంఘటనాన్నే పౌలు "సముద్రంలోనికి జ్ఞానస్నానం పొందడం" అని పేర్కొన్నాడు.

నూత్న వేదంలో మనం క్రీస్తు నాయకత్వాన మరో సముద్రం దాటతాం. ఈ సముద్రమే జ్ఞానస్నాన జలం. ఈలా దాటడం ద్వారా నాడు యిస్రాయేలీయులూ నేడు మనం కూడ మృత్యువు నుండి జీవంలోనికి అడుగిడతాం - 1 కొరి 10,1-2.

6. పూర్వం సున్నతిద్వారా యిస్రాయేలీయులు దేవుని ప్రజలయ్యారు. ఇప్పుడు ఈ జ్ఞానస్నానం క్రొత్తసున్నతి లాంటిది. దీనిద్వారా మనం క్రీస్తుప్రజలమౌతాం - కోలో 2,11.

7. జ్ఞానస్నానం వలన మన హృదయం మీద క్రీస్తు అనేముద్రపడుతుంది - ఎఫె 1,13. పూర్వం రోమనురాజ్యంలో ముద్రద్వారా పశువులూ బానిసలూ ఒక ప్రత్యేక యజమానునకు చెందివుండేవాళ్లు. అలాగే సైనికుల ఒక ప్రత్యేక నాయకునికీ, భక్తులు ఓ ప్రత్యేక దేవతకీ చెందివుండేవాళ్లు. జ్ఞానస్నానానికి ముందు మన నాయకుడు పిశాచం. కాని ఈ ముద్ర తర్వాత మనం క్రీస్తు అనే నాయకునికి చెందుతాం.

8. ఈ క్రియ మనకు వెలుగును ప్రసాదిస్తుంది. ఈ వెలుగు విశ్వాసం. దీనిద్వారా మనం ప్రభువునీ, విశేషంగా ఆయన మరణోత్థానాలనీ గ్రహిస్తాం - ఎఫే 5,14.

## 3. యోహాను భావాలు

ప్రభువు నికొదేముతో మాటలాడుతూ నరుడు దైవరాజ్యంలో ప్రవేశించాలంటే కొత్తగా జన్మించాలనీ, యింకా నీటినుండి ఆత్మనుండీకూడ పుట్టాలనీ సెలవిచ్చాడు - యోహా 3, 3-5. నీరూ ఆత్మా భక్తునికి క్రొత్తపుట్టువు నిస్తాయి. ఈ క్రొత్త పుట్టువు ప్రభువు మరణోత్థానాలద్వారా సిద్ధిస్తుంది. ప్రభువుని సిలువమీదికెత్తి వధిస్తారు. ఆ మరణం ద్వారా భక్తులు నాశానికితప్పి నిత్యజీవం పొందుతారు. అనగా సిలువమీద చనిపోయిన క్రీస్తుని విశ్వసించేవాళ్ళకు రక్షణం లభిస్తుంది -యోహా 3,14-15.

సిలువమీద ప్రభువు హృదయాన్ని తెరచారు. దాని నుండి నీళ్ళు స్రవించాయి. ఈ నీళ్ళు పవిత్రాత్మనీ, వరప్రసాదాన్నీ, జ్ఞానస్నానాన్నీ సూచిస్తాయి -19,34. ఇంకా ప్రభువు జీవజలాన్ని కూడ పేర్కొన్నాడు - 7, 39. ఆయన సమరయ స్త్రీకి ఇస్తానని చెప్పిన జలంకూడ ఇదే - 4,10. యోహాను దృష్టిలో ఈ జలం ఆత్మకు చిహ్నం - జ్ఞానస్నాన జలాలద్వారా మనం ఈ యాత్మను పొందుతాం.

## 4. అపోస్తలుల చర్యలు వర్ణించిన తీరు

ఆత్మ దిగివచ్చాక పేత్రు యెరూషలేములో బోధించాడు. ఆ బోధ వినిన యూదులు తమ పాపాల కొరకు పశ్చాత్తాపపడి క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందారు - అచ 2,37-41. ఈ రీతిగనే ఈ గ్రంథం ఇంకా చాలమంది భక్తుల జ్ఞానస్నానాలను పేర్కొంటుంది.

వాళ్ళల్లో సమరయులు 8,12, యితియోపీయుడు 8,38, పౌలు 9,18, కొర్నేలి, 10,48, లూదియా 16,15 మొదలైనవాళ్ళు ముఖ్యులు.

ఇక పేత్రు మొదటి జాబు జ్ఞానస్నాన సందర్భంకొరకే వ్రాయబడిందని పండితుల భావం. ఈ లేఖ చాల తావుల్లో ఈ క్రియను పేర్కొంటుంది. ఉదాహరణకు 2,9-10 వాక్యాలు మనం జ్ఞానస్నానం ద్వారా చీకటి నుండి వెలుగులోనికి ప్రవేశిస్తామని చెప్తాయి. దేవుని బిడ్డలమై అతన్ని ఆరాధిస్తామని వాకొంటాయి.

## ప్రార్థనాభావాలు

1. మనం పిత పుత్ర పవిత్రాత్మల నామంలోనికి జ్ఞానస్నానం పొందుతాం. దీనిద్వారా దైవకుటుంబములోనికి ప్రవేశిస్తాం. దేవునికి బిడ్డలమై దివ్యజీవితం జీవిస్తాం. నరుడు దేవుని జీవితం జీవించడం సామాన్యమైన భాగ్యం కాదు. నక్క యెక్కడ నాకలోక మెక్కడ? ఈ గొప్పవరానికిగాను మనం సదా కృతజ్ఞులమై యుండాలి.

2. జ్ఞానస్నానం నిజంగా స్నానం. బాప్టిజ్జేయిన్ అనే గ్రీకు క్రియకు ముంచడం, కడగడం అనే అర్థాలున్నాయని చెప్పాం. స్నానం మనదేహాన్ని కడిగి శుద్ధిచేసినట్లే ఈ సంస్కారం మన ఆత్మను కడిగిశుద్ధిచేస్తుంది. దానిలోని పాపమాలిన్యాన్ని తొలగిస్తుంది. ఈ యర్థంలోనే పౌలు దీన్ని "స్నానం" అని పేరొన్నాడు - ఎఫే 5, 26. ఈ పవిత్ర స్నానానికిగాను దేవునికి వందనశతా లర్పించాలి.

3. జ్ఞానస్నానంలో మనం క్రీస్తుతో ఎలా చనిపోయి ఎలా ఉత్థానమౌతాం అని ప్రశ్నించుకొని అలెగ్జాంద్రియాసిరిల్ భక్తుడు ఈలా వ్రాసాడు. "మనం జ్ఞానస్నానపు నీళ్ళలోనికి దిగినప్పుడు భౌతికంగా చనిపోము. భౌతికంగా భూస్థాపితం కాము. భౌతికంగా ఉత్థానంకాము. ఇక్కడ మనం క్రీస్తు మరణోత్థానాలను అనుకరిస్తాం, అంతే. ఈయనుకరణంద్వారా మనకు రక్షణం మాత్రం యథార్థంగా లభిస్తుంది. క్రీస్తయితే సిలువమీద నిజంగా చనిపోయాడు. నిజంగా సమాధిలో భూస్థాపితుడయ్యాడు. నిజంగానే అక్కడినుండి మళ్లా ఉత్థానుడయ్యాడు. మనపట్లగల ప్రేమచేత ఆయనీ బాధలన్నిటికీ పాల్పడ్డాడు. ఈనాడు మనం ఆయన బాధలను అనుకరించి రక్షణం పొందుతున్నాం. యథార్థంగా బాధలు అనుభవించినవాడు ఆయన. ఆ బాధలతో ఐక్యంగావడంవల్ల, మనం స్వయంగా బాధలను అనుభవించకపోయినా, అతడు మనకు రక్షణాన్ని దయచేస్తున్నాడు. ఇది వింతలలోకెల్ల వింతకాదా?"

4. జ్ఞానస్నాన ఫలాలను గూర్చి మాట్లాడుతూ యెరూసలేం సిరిల్ భక్తుడు ఈలా నుడివాడు. "జ్ఞానస్నానం బందీలను చెరనుండి విడిపిస్తుంది. పాపవిమోచనం కలిగిస్తుంది. దోషాన్ని తొలగిస్తుంది. ఆత్మకు నూత్నజన్మ నిస్తుంది. తేజోమయమైన వస్త్రాన్ని దయచేస్తుంది. పవిత్రమూ అవినాశమూ ఐన ముద్రను ప్రసాదిస్తుంది. ఒక వాహనమై మనలను స్వర్గానికి చేరవేస్తుంది. పరలోకానందాన్ని దయచేస్తుంది మనలను దత్తపుత్రులనుచేసి మోక్షానికి హక్కుదారులను గావిస్తుంది". ఇన్ని ఫలితాలకు దయచేసే ఈపుణ్యకార్యాన్ని మనం విలువతో చూడవద్దా?

5. ఆఫ్రికాలో వేదబోధచేసిన ఒక గురువు ఆదేశంలో ఎనబైయేండ్ల వృద్ధుని కొకనికి జ్ఞానస్నానమిచ్చారు. ఆ ముసలివాడు అటుతర్వాత రెండేండ్లు మాత్రం జీవించి ధన్యమైన మరణం మరణించాడు. అతడు చనిపోయేప్పుడు ఎవరో నీకు ఎన్నేండ్లని ప్రశ్నించారు. ఆ వృద్ధుడు "నేను రెండేండ్లు మాత్రం జీవించాను. జ్ఞానస్నానానికి పూర్వం నేను జీవించిన జీవితం గణించతగింది గాదు" అని జవాబిచ్చాడు. ఈ సంస్కారానికి ఆ భక్తుడు ఇచ్చిన విలువ అంత గొప్పది.

# 2. జ్ఞానస్నాన స్థాపనం

స్నానం ద్వారా శుద్ధిని పొందడమనేది చాల ప్రాచీన మతాల్లో వుంది. గ్రీకు రోమను ఈజిప్టు యూద హిందూమతాల్లో ఈతంతు ఏదోరూపంలో చూపడుతుంది. కనుక క్రీస్తు జ్ఞానస్నాన సంస్కారాన్ని ఏర్పాటు చేసినప్పుడు ఆయన ఆ స్నానాన్ని క్రొత్తగా స్థాపించలేదు. అంతకు పూర్వం వివిధ ప్రాచీన మతాల్లోవున్న తంతునే తీసికొని దానికి తన ప్రత్యేక వరప్రసాదాన్ని జోడించాడు. ఈ వరప్రసాదం ద్వారా మనకు క్రొత్తపుట్టువు లభించేటట్లు చేసాడు. ఈ యధ్యాయంలో ఐదంశాలు పరిశీలిద్దాం.

## 1. వివిధ ప్రాచీన మతాల్లో స్నానం

1. జలం మాలిన్యాన్ని తొలగించి శరీరాన్ని శుద్ధిచేస్తుంది కదా! ఆలాగే అది ఆత్మ మాలిన్యాన్ని – విశేషంగా కర్మకాండను పాటించడంలో కలిగే లోపాలవల్ల సంభవించే మాలిన్యాన్ని – తొలగిస్తుందనే భావం చాల ప్రాచీన మతాల్లో వుంది. ఇంకా నీరు మన దప్పికతీర్చి మనకు బలాన్నిఇస్తుంది. కనుక అది మనకు ఆరోగ్యాన్నీ శక్తినీ సత్తువనీ ప్రసాదిస్తుందని కూడ ప్రాచీనులు నమ్మారు.

పూర్వం ఈజిప్టులోను గ్రీసులోను ప్రజలకు మత రహస్యాలను బోధించేపుడు వాళ్ళచేత పవిత్ర స్నానాలు చేయించేవాళ్ళు. ఈ స్నానాలద్వారా ఆ వ్యక్తులకు క్రొత్తపుట్టువు కలుగుతుందని విశ్వసించేవాళ్ళు.

హిందూమతంలో జలకర్మలు చాలా వున్నాయి. నీళ్ళు చిలకరిస్తారు. ఆచమనం చేస్తారు, త్రాగుతారు. పుణ్యనదుల్లో స్నానాలుచేస్తారు. మార్జనం అనే కర్మకాండలో బ్రాహ్మణులు నీటిని ఎడమచేతితో బట్టుకొని కుడిచేతితో దాన్ని శిరస్సుమీద చిలకరించుకొంటారు. ఆ నీరు తమ పాపాన్ని తొలగించి బలాన్నీ పావిత్ర్యాన్నీ ప్రసాదించాలని ప్రార్థిస్తారు. ప్రతిదిన స్నానకర్మంలో బ్రాహ్మణులు తమ శారీరక, మానసిక, వాచిక పాపాలన్నీ తొలగిపోయి తాము చేపట్టనున్న కార్యాలలో విజయం సిద్ధించాలని జపిస్తారు.

2. మానసిక శాస్త్రరీత్యా పరిశీలించి చూస్తే, జలం పాపాన్ని కడిగివేస్తుందని క్రొత్తపుట్టువుని ప్రసాదిస్తుందనీ ప్రాచీన మతాలు విశ్వసించినట్లుగా కన్పిస్తుంది. జలంమృత్యువునీ జీవాన్ని కూడ తెచ్చి పెడుతుంది. కనుక అది సమాధి, మాతృగర్భంకూడ.

సి.జె.యుంగ్ అనే మానసిక శాస్త్రజ్ఞుడు జలం అనేది ప్రపంచంలోని అందరు మానవుల మనస్సుల్లో మెదలే ప్రాథమిక భావాల్లో ఒకటి అని చెప్పాడు - ఆర్కెటైప్. నరుడు స్నానానికి నీళ్లల్లోకి దిగడమంటే తన అజ్ఞాత మనస్సులోకి ప్రవేశించడమని అది మృత్యువులాంటిదనీ, అతడు నీళ్ళల్లోనుండి బయటికి రావడమంటే తన జ్ఞాతమనస్సులోనికి ప్రవేశించడమనీ అది జీవంలాంటిదనీ వర్ణించాడు.

3. ఇక బైబులుని పరిశీలించినాగూడ జలానికి ఈ మృత్యువు జీవము అనే రెండు ధర్మాలు వున్నట్లుగానే కన్పిస్తుంది. తొలుత అదుపులోలేని జలం ఉండేది. దేవుని ఆజ్ఞపై ఈ జలం అదుపులోకి వచ్చింది. దానినుండి ప్రాణులు పుట్టుక వచ్చాయి - అది 1,2,20. అటుతరువాత దేవుడు జలప్రళయం కలిగించి దుర్మార్గులను నాశంచేసాడు. పుణ్యపురుషుడైన నోవాను బ్రతికించి నూత్న మానవజాతిని రూపొందించాడు - ఆది 7,7-10. తదనంతరం అతడు యిస్రాయేలీయులను రెల్లు సముద్రం దాటించాడు. కాని ఐగుప్తీయులను అదే సముద్రంలో ముంచివేసాడు - నిర్గ 14. ఈ సంఘటలన్నిటిలోను నీళ్ళు మృత్యువునీ జీవాన్నికూడ తెచ్చిపెడతాయి అనే భావం కన్పిస్తుంది.

క్రీస్తు కూడ సిలువబలి అనే జ్ఞానస్నానంద్వారా మరణం అనే జలంలోనికి ముంచబడతాడు - మార్కు 10,38. యోనా లాగ భూగర్భంలో లేక జలగర్భంలో వుండిపోతాడు - మత్త 12,40. కాని ఆయన మృత్యుంజయుడై ఆ భూగర్భంనుండి వుత్థానమౌతాడు- 1 పేత్రు 3, 19-21. ఇక్కడ నీళ్ళు క్రీస్తుకి మరణాన్నీ జీవాన్నీ తెచ్చి పెట్టలేదు. క్రీస్తే నీళ్ళుకు మరణాన్నీ జీవాన్నీ ప్రసాదించాడు. ఆయన తాను మరణించి ఉత్థానమై నీళ్ళనే జ్ఞానస్నాన జలాలుగా నియమించాడు. ఈ జలాలను మనం ఈనాడు శ్రీసభలో వినియోగించుకొంటాం. శ్రీసభ అనే తల్లి గర్భంనుండి నూత్నంగా ఉద్భవిస్తాం.

శ్రీసభ అనే తల్లి జ్ఞానస్నానపుతొట్టి అనే తన గర్భంనుండి ప్రకాశపుత్రులమైన మనలను పవిత్రాత్మ వరప్రసాదం ద్వారా కంటుంది అని చెప్తుంది ఓ ప్రాచీన ప్రార్థనం.

నీటికి సహజంగానే మృత్యువు, జీవం అనే భావాలున్నాయని చెప్పాం. క్రీస్తు ఈ జలాన్ని స్వీకరించి దానికి తన వరప్రసాదాన్ని జోడించాడు. అతడు దాన్ని క్రొత్తగా స్థాపించలేదు. అంతకు ముందే వాడుకలో వున్న ఓ శుద్ధీకరణ వస్తువును తీసికొని దాన్ని తన వరప్రసాద సాధనంగా జేసాడు. కనుక జలం జ్ఞానస్నాన సంస్కారం ద్వారా మనకు రక్షణసాధనమైంది. ఈనాడు ఈ రక్షణాన్ని మనం తిరుసభద్వారా పొందుతున్నాం.

## 2. యూదమతంలో జ్ఞానస్నానం

అన్ని మతాలకంటే యూదమతంలో జ్ఞానస్నానానికి ఎక్కువ ప్రాముఖ్యముండేది. కనుక ఈ యంశాన్ని ప్రత్యేకంగా విచారించి చూడాలి.

1. యూదులు తమ కర్మకాండలో మాటిమాటికి జలంతో కడుగుకొని శుద్ధిని పొందుతుండేవాళ్ళు. చచ్చిన ప్రాణి దేహాన్ని ఏ వస్తువైనా తాకితే అది అపవిత్రమౌతుంది. ఆ వస్తువుని నీటితో కడిగి శుద్ధి చేయాలి - లేవీ 11, 32. ప్రజలు దేవుణ్ణి సమీపించకముందు స్నానంచేసి శుద్ధిని పొందాలి - నిర్గ 19, 10-15.యూదుల్లో అగ్రవర్గం వాళ్ళయిన పరిసయులు ప్రతి చిన్నకార్యం తర్వాతగూడ జలంతో కడుగుకొని శుద్ధిని పొందేవాళ్లు - మార్కు 7, 1-4.

2. అన్యజాతివాళ్ళు కొందరు యూద మతంమీద అభిమానం చూపేవాళ్లు. ఒకోసారి యూదమతంలో చేరేవాళ్ళుకూడ. వీళ్ళకు యూదమత ప్రవిష్టులని పేరు - అచ 13, 43. వీళ్ళు మొదట శుద్ధీకరణ స్నానంచేసిగాని ఈవర్గం ప్రజలుగా తయారయ్యేవాళ్లుకాదు.

3. క్రీస్తుశకం మొదటి శతాబ్దంలో యూదుల్లో చాల స్నానవర్గాలు వుండేవి. ఎస్సీనులు, దమస్కు వర్గంవాళ్లు, కుమ్రాను వర్గంవాళ్లు మొదలైన ముఠాలు ముఖ్యమైనవి. మెస్సీయా తమ ముఠాలోనే పుడతాడని ఈ వర్గాలవాళ్ళందరూ ఆశించారు. వీళ్ళంతా ఒకరకమైన జ్ఞానస్నానాన్ని పాటించారు. వీళ్ళదృష్టిలో ఈ కర్మ పాపపరిహారాన్ని సంపాదించి పెట్టదు, కేవలం ఆ పరిహారాన్ని సూచిస్తుంది.

4. స్నాపక యోహాను ఒక ప్రత్యేకమైన జ్ఞానస్నానపద్ధతిని ప్రారంభించాడు. ఇతరవర్గాల్లో ఎవరిమీద వాళ్ళే నీళ్ళు పోసికొనేవాళ్ళు. కాని యోహాను మొట్టమొదటిసారిగా తాను ఇతరులమీద నీళ్ళుపోయడం ప్రారంభించాడు - మత్త 3,7.

యోహాను బోధప్రకారం చివరిరోజులు, అనగా మెస్సియా విజయంచేసే దినాలు, వచ్చాయి. మెస్సియా రాకడ కొరకు దేవుడు ప్రజలను శుద్ధి చేస్తాడు. ఈ శుద్ధి యోహాను

జ్ఞానస్నానం ద్వారా జరుగుతుంది. అది పాపక్షమనూ హృదయ పరివర్తనాన్నీ సూచిస్తుంది - మార్కు 1,4. ఈ జ్ఞానస్నానం పొందినవాళ్ళంతా ఒక వర్గంగా తయారయ్యారు. ఐనా యోహాను జ్ఞానస్నానం మన నూత్నవేద జ్ఞానస్నానంలా పాపాలను పరిహరించేది కాదు. కేవలం పాపపరిహారాన్ని సూచించేది, అంతే. యోహాను స్వయంగా "నేనైతే మీకు నీళ్ళతో జ్ఞానస్నాన మిస్తున్నాను. నా తర్వాత వచ్చేవాడు నాకంటే అధికుడు. ఆయన మీకు ఆత్మతోను అగ్నితోను జ్ఞానస్నానమిస్తాడు" అని చెప్పాడు - మత్త 3,11. యోహాను జ్ఞానస్నానం మెస్సీయావల్ల లభించే నూత్నవేద జ్ఞానస్నానాన్ని సూచిస్తుంది. పూర్వవేద జ్ఞానస్నానాలన్నీటిలోను అతనిది నూత్న వేదానికి అత్యంత సన్నిహితమైంది.

నూత్నవేద జ్ఞానస్నానం క్రీస్తు మరణోత్థానాల ద్వారా పని చేస్తుంది. అది పాపాలను పరిహరిస్తుంది. ఆత్మను ప్రసాదిస్తుంది. క్రొత్తపుట్టువునిస్తుంది, దైవకుటుంబంలోనికి ప్రవేశించేలా చేస్తుంది. యోహాను జ్ఞానస్నానానికి ఈ లక్షణాలు లేవు.

## 3. క్రీస్తు జ్ఞానస్నానాన్ని ఎప్పుడు స్థాపించాడు ?

ప్రభువు యోర్దాను నదిలో స్నాపక యోహాను నుండి జ్ఞానస్నానం పొందాడు - మత్త 3, 13-17. నరుడు నీటిద్వారాను ఆత్మద్వారాను క్రొత్తగా జన్మిస్తేనేగాని దైవరాజ్యంలో చేరడని నికొదేముతో నుడివాడు - యోహా 3,15. క్రీస్తు శిష్యులూ యూదులకు జ్ఞానస్నాన మిచ్చారు - యోహా 3, 22-26. కడన ప్రభువు ఉత్థానానంతరం శిష్యులను జ్ఞానస్నాన మీయండని ఆజ్ఞాపించాడు. సమస్త జనాన్ని తన శిష్యులనుగా జేసి పిత పుత్ర పవిత్రాత్మ పేరుమీదిగా వాళ్ళకు జ్ఞానస్నాన మీయండని ఆదేశించాడు - మత్త 28,19. ఈ సంఘటనల ద్వారా క్రీస్తు జ్ఞానస్నానావసరాన్ని, దాని స్వభావాన్నీ దాన్ని పాటింపవలసిన తీరునీ వివరించాడు. దాన్ని స్థాపించాడు గూడ.

## 4. నీళ్లు, మాటలు

ఇప్పుడు జ్ఞానస్నానం పొందేవ్యక్తి నొసటిమీధ మూడుసార్లు నీళ్ళుపోసి "పిత పుత్ర పవిత్రాత్మ పేరుమీదిగా నీకు జ్ఞానస్నానమిస్తున్నాను" అని చెప్తాం.

1. నీళ్ళు. తొలిరోజుల్లో నీళ్లల్లో ముంచి జ్ఞానస్నానమిచ్చేవాళ్ళు - అచ 8, 38. రోమా 8,4. నూత్నవేదం స్పష్టంగా చెప్పకపోయినా, తలమీద నీళ్ళుపోసి జ్ఞానస్నానమిచ్చే పద్ధతికూడ తొలిరోజుల్లోనే వుండివుంటుంది. ఉదాహరణకు అననీయా పౌలుకి యూదా అనేవాని యింటిలోనే జ్ఞానస్నాన మిచ్చాడు - అచ 9,11,18. ఫిలిపిలో పౌలు చెరసాల

అధికారికిని అతని కుటుంబానికిని కారాగారంలోనే జ్ఞానస్నానమిచ్చాడు - 16,33. ఈ సందర్భాల్లో ఈ వ్యక్తులను నీళ్ళల్లో ముంచారు అనడంకంటే వీళ్ల నొసటిమీద నీళ్లుపోసి జ్ఞానస్నానమిచ్చారని చెప్పడం సబబుకదా!

లాటిన్ శ్రీసభలో నీళ్ళల్లో ముంచే పద్ధతి 12వ శతాబ్దం దాకా వుండేది. ఆ తర్వాత నొసటిమీద నీళ్ళుపోసే పద్ధతి సర్వత్ర ప్రచారంలోకి వచ్చింది. కాని ఈ రెండవపద్ధతి కూడ అడపాదడపా రెండవ శతాబ్దంనుండే ల్యాటిను శ్రీసభలోవాడుకలో వుండేదని ముందే చెప్పాం. గ్రీకు శ్రీసభలో ఇప్పటికీ నీళ్ళల్లో ముంచిగాని జ్ఞానస్నాన మీయరు. నీళ్ళల్లో ముంచినా లేక నీళ్లు నొసటిమీద పోసినా ఫలితం సమానమే. ఈ నీళ్లు పాపపరిహారాన్నీ క్రొత్తపుట్టువునీ దయచేస్తాయి.

ఇప్పుడు జ్ఞానస్నాన మీయడానికి గురువు ప్రత్యేకంగా ఆశీర్వదించిన నీళ్లు వాడాలి. అత్యవసర పరిస్థితుల్లో మాత్రం మామూలు నీళ్లు వాడవచ్చు.

2. మాటలు. పేత్రు యోహాను సమరియకు వచ్చి అచటి భక్తులమీద చేతులుచాచి వాళ్లు ఆత్మను పొందాలని ప్రార్థించారు - అచ 8,15,17. ఈ విధంగా సంస్కారాలు జరిగించేప్పుడు బైబుల్లో కొన్ని పరిశుద్ధ క్రియలూ వాటితోపాటు కొన్ని మాటలూ వాడ్డం పరిపాటి. జ్ఞానస్నానంలో నొసటిమీద నీళ్లుపోయడం పరిశుద్ధ క్రియ. "పిత పుత్ర పవిత్రాత్మల నామంమీదిగా నేను నీకు జ్ఞానస్నానమిస్తున్నాను" అని చెప్పడం కొన్ని మాటలను వాడడ మౌతుంది. ఈ పలుకులు మత్తయి 28, 19 నుండి గ్రహింపబడ్డాయి. ఈ పలుకు ద్వారా మనం పిత పుత్ర పవిత్రాత్మలనే ముగ్గురు వ్యక్తులతో గూడిన దైవకుటుంబంలోనికి ప్రవేశించి దైవజీవితం జీవిస్తామని అర్థం చేసికోవాలి.

## 5. జ్ఞానస్నానాన్ని ఇచ్చేవాడు, పొందేవాడు

1. జ్ఞానస్నానాన్ని ఎవరీయవచ్చు? అత్యవసర పరిస్థితుల్లో ఎవరైనా, క్రైస్తవేతరులుకూడ ఈయవచ్చు. కాని వీళ్లు పైన పేర్కొన్న నీటినీ మాటలనూ వాడాలి. జ్ఞానస్నానమిచ్చేప్పుడు తిరుసభకు ఏలాంటి ఉద్దేశముంటుందో అలాంటి ఉద్దేశంతోనే తామూ దాన్నీయాలి. అప్పుడే ఈ పుణ్యక్రియ చెల్లేది. మామూలుగా రక్షణం పొందడానికి జ్ఞానస్నానం అవసరం. కనుక మరణాపాయంలాటి అత్యవసర పరిస్థితుల్లో దాన్ని ఎవరైనా ఈయవచ్చునని నియమం చేసారు. అయితే, మామూలు పరిస్థితుల్లో ఈ సంస్కారాన్ని జరిగించేవాళ్లు గురువులూ డీకన్లూను. జ్ఞానస్నానం తిరుసభ కార్యం. అది మనలను తిరుసభలో సభ్యులనుగా చేస్తుంది. కనుక తిరుసభ ప్రతినిధియైన గురువు తిరుసభ పేరటనే దాన్ని జరిపించడం సమంజసం.

2. ఈ సంస్కారాన్ని ఎవరెవరు పొందవచ్చు? ప్రభువు మీరు సమస్త జాతిజనులకు బోధించి జ్ఞానస్నాన మీయండని ఆదేశించాడు-మత్త 28 19. ప్రతి నరుడు రక్షణం పొందాలనే భగవంతుని కోరిక-1తిమో 2,4. క్రీస్తు నికొదేముతో చెప్పినట్లు రక్షణం పొందాలంటే మామూలుగా ఈ సంస్కారం అవసరం - యోహా 3,5. కనుక ప్రతిఒక్కరూ వొకసారి జ్ఞానస్నానం పొందవచ్చు. పొందాలి. అలా పొందనివాళ్లను వాళ్ళవాళ్ళ హృదయాల్లోని భక్తినిబట్టి భగవంతుడు ప్రత్యేక పద్ధతిలో రక్షిస్తుంటాడు. ఈ విషయాన్ని మీదట పరిశీలిద్దాం.

## ప్రార్థనాభావాలు

1. మంత్రించిన నీటితో గురువు జ్ఞానస్నాన మిస్తారు. ఈ జలంతో పవిత్రాత్మ శక్తి నెలకొని వుండడంవల్ల అది మన పాపమాలిన్యాన్ని తొలగిస్తుంది. ఈ సందర్భంలో ఇతియోపియను ఆరాధనవిధిలోని ఓ ప్రార్థనం ఇది. "ఓ ప్రభూ! నీవు యోషువా కాలంలో యోర్దాను నదీప్రవాహం వెనుకకు మరలేలాచేసావు. ఏలీయా సమర్పించిన జలసంబంధమైన బలిని అంగీకరించి ఆకాశంనుండి అగ్నిని పంపావు. ఎలీషా ప్రవక్త ద్వారా నామాను యోర్దాను నదీజలంలో శుద్ధిని పొందేలా చేసావు. నీవు అన్ని పనులూ చేయగలవు, నీకు అసాధ్యం ఏమీ లేదు. ఆ యోర్దాను నదికున్న శక్తినే ఇప్పుడు ఈ జలాలకు గూడ ప్రసాదించు. నీ పవిత్రాత్మను ఈ నీటి మీదికి పంపు."

2. జ్ఞానస్నానం పొందిన పిదప గురువు అభ్యర్థి తలకు క్రిస్మాతైలంతో అభిషేకం చేస్తారు. క్రిస్మా అనే గ్రీకు మాటకు తైలం, అభిషేకం అని అర్థాలు. ఈ సందర్భంలో గురువు "సర్వేశ్వరుడు మిమ్ము క్రిస్మా తైలంతో అభిషేకం చేస్తున్నాడు. దీని ఫలితంగా మీరు దేవుని ప్రజలలో చేరుదురుగాక. గురువు రాజు ప్రవక్తయైన క్రీస్తుతో మీరు నిత్యం ఐక్యమై యుందురుగాక" అనే ప్రార్థనను చెప్తారు. క్రిస్మాని లేక అభిషేకాన్ని పొందిన వ్యక్తి క్రీస్తు. క్రీస్తు తండ్రినుండి ఆత్మనుండి అభిషేకం పొంది రక్షకపదవిని స్వీకరించాడు. ఆ క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది అతని అడుగుజాడల్లో నడిచేవాళ్ళం గనుక మనం క్రైస్తవులమయ్యాం. జ్ఞానస్నానంలో మనం పొందే అభిషేకం ద్వారా మనమీద అక్షయమైన క్రీస్తు ముద్ర పడుతుంది. కనుక మనం ఆ ప్రభువులోనికి ఐక్యమైనవాళ్ళం, అతనికి అంకితమైనవాళ్ళం, అతని శిష్యులం అన్న భావాన్ని ఎప్పుడూ విస్మరించకూడదు.

3. జ్ఞానస్నానాంతంలో గురువు అభ్యర్థిచేతికి తెల్లని కండువా నిస్తారు. ఈ సందర్భంలో గురువు "ఈ తెల్లని వస్త్రం నీ క్రైస్తవ ఘనతకు గుర్తు. నీవు మన ప్రభువైన యేసు క్రీస్తు సమక్షంలోనికి వెళ్ళి నిత్యజీవితంలో ప్రవేశించేదాకా దీన్ని నిర్మలంగా వుంచుకో" అనే ప్రార్థనను జపిస్తారు. ఈ తెల్లని వస్త్రం క్రీస్తుకీ నిర్మలత్వానికీ చిహ్నం. తబోరు కొండమీద రూపాంతరం పొందిన క్రీస్తు బట్టలను వెలుగువలె తెల్లగా వున్నాయి-మత్త 17,3. జ్ఞానస్నానంద్వారా మనం క్రీస్తుని ధరిస్తాం. పూర్వం ఈ సంస్కారాన్ని పొందే అభ్యర్థులు ప్రాత బట్టలను విడచి మడుగులో దిగేవాళ్ళు. మళ్లా ఒడ్డుకి వచ్చాక ప్రాత బట్టలనుకాక తెల్లని క్రొత్త బట్టలను తాల్చేవాళ్ళు. కనుక ఇక్కడ మనం క్రొత్తబట్టలను ధరించినట్లుగా క్రీస్తుని ధరిస్తామని భావం - గల 3,27. దీనివల్ల మనకు ప్రాతతనం పోయి క్రొత్తతనం వస్తుంది. పాపాన్ని విసర్జించి పుణ్యాన్ని చేపడతాం. కనుకనే పౌలు "ఎవడైనా క్రీస్తునందుంటే వాడు నూత్నసృష్టి ఔతాడు. పాతవి గతించి సమస్తమూ క్రొత్తవయ్యాయి" అని పల్కాడు - 2కొరి 5,17. క్రీస్తు నుండి మనం పొందిన ఈ నూతనత్వాన్నీ పుణ్యజీవితాన్నీ రోజువారి జీవితంలో నిలబెట్టుకోగలిగి వుండాలి.

పదిమంది కన్యల సామెతలో వివేకవతులైన ఐదుగురు కన్యలు మేల్కొనివుండి పెండ్లికుమారుడు వచ్చేవరకు అతని కొరకు ఎదురుచూస్తూ వుండిపోయారు. అతడు విజయం చేయగానే అతనితోపాటు తామూ విందుశాల లోనికి వెళ్ళారు - మత్త 25, 10. అలాగే జ్ఞానస్నానంలో తెల్లని కండువానూ అది సూచించే నూతనత్వాన్నీ పొందిన క్రైస్తవుడు ప్రభువు రెండవసారి విజయంచేసేదాకా గూడ తన విశ్వాసాన్నీ క్రొత్త తనాన్నీ నిలబెట్టుకొంటూ భక్తి భావంతో వేచివుండాలి.

4. జ్ఞానస్నానంలో చివరిసాంగ్యం అభ్యర్థి చేతికి వెలిగే కొవ్వువత్తి నీయడం. ఈ సందర్భంలో గురువు "నీవు క్రీస్తునందు వెలుగువైతివి. కనుక సదా ప్రకాశపుత్రుడవుగా నడువు" అనే జపం చెప్తారు. పూర్వం జ్ఞానస్నానాన్ని పాస్క శనివారం రాత్రి యిచ్చేవాళ్ళు. ఆ సందర్భంలో వెలిగింపబడిన పాస్క వత్తినుండే జ్ఞానస్నానం పొందే అభ్యర్థికిచ్చే చిన్న వత్తిని గూడ వెలిగించేవాళ్ళు. కనుక ఈ వత్తి క్రీస్తుకి చిహ్నంగా వుంటుంది. ఆ ప్రభువు లోకానికి వెలుగు. ఆయన్ననుసరించే వాళ్లు చీకట్లో నడవరు- యోహా 18,12. ఆయనలోనికి జ్ఞానస్నానం పొందినవాళ్లు కూడ చీకటిని దాటి వెలుగులోనికీ, మరణాన్నీ దాటి జీవంలోనికీ ప్రవేశిస్తారు. కనుక ఈ సంస్కారాన్ని పొందిన భక్తులు నిత్యజీవితంలో ఈ వెలుగునీ, ఈ

జీవాన్నీ నిలబెట్టుకోగలిగి వుండాలి. అసలు జ్ఞానస్నానానికి "వెలుగు" అనే పేరుకూడ వుంది. కనుక ఈ సంస్కారాన్ని పొందిన మనం జ్యోతిర్మయ మానవులంగా మెలగాలి కాని తమోమయ మానవులంగా మెలగ కూడదు.

5. పెద్దవాళ్లు జ్ఞానస్నానం పొందేపుడు ఆ పవిత్ర సంస్కారానికి జాగ్రత్తగా సిద్ధం కావాలి. యెరూషలేము సిరిల్ భక్తుడు ఈలా వాకొన్నాడు. "పెండ్లి చేసుకొనేవాడు ఉత్సాహంతో వివాహానికి అన్నీ సిద్ధం చేసికొంటాడు గదా! జ్ఞానస్నానంలో మన ఆత్మ దేవుణ్ణి వరుణ్ణిగా స్వీకరించి ఆ ప్రభువుని పెండ్లియాడుతుంది. కనుక నరులు ప్రాపంచిక చింతలుమాని ఈ పుణ్యకార్యానికి చక్కగా సంసిద్ధం కావాలి. పాపకార్యాలనూ పాపపు మాటలనూ పరిత్యజించి స్వర్గంలో సింహాసనాసీనుడై యున్న లోకాధిపతినీ, ఆయన కుడిప్రక్కనవున్న కుమారుణ్ణీ, ఆయన చెంతవున్న ఆత్మనీ ధ్యానించుకోవాలి".

## 3. జ్ఞానస్నానమూ పితృపాదుల సూచన బోధలు

ఆగస్టీను, అంబ్రోసు, జెరోము, క్రిసోస్తం, సిరిల్, గ్రెగోరీ. ఏఫ్రేము మొదలైన వాళ్ళకు పితృపాదులని పేరు. వీళ్ళంతా 2-6 శతాబ్దాల మధ్యకాలంలో జీవించినవాళ్ళు. వీళ్ళల్లో అధిక సంఖ్యాకులుపీఠాధిపతులు, అర్చ్యశిష్టులు కూడ. వీళ్లు బైబులుమీద వ్యాఖ్యచెప్పి ఆనాటి క్రైస్తవ ప్రజలకు బోధ చేసారు. దీనికే పారంపర్యబోధ అని పేరు. మనకు బైబులు ఎంత ప్రమాణమో ఈ పితృపాదుల పారంపర్యబోధ కూడ అంత ప్రమాణం. జ్ఞానస్నానాన్ని గూర్చి బోధించేపుడు పితృపాదులు పూర్వనూత్నవేదాలబోధలను సమన్వయం చేస్తూ చాలా సంగతులు చెప్పారు. వీటికే సూచన బోధలు (Typology) అని పేరు. ఉదాహరణకు పూర్వవేదంలోని జలప్రళయంలో నోవావోడ ఎన్మిదిమంది భక్తులను రక్షించింది. ఈ వోడ నూత్నవేదంలోని జ్ఞానస్నానానికి సూచనంగా వుంటుంది. ఇక్కడ పూర్వవేదంలోని నోవా వోడ సూచన వస్తువు. నూత్నవేదపు జ్ఞానస్నానం ఆ వోడ ద్వారా సూచింపబడిన వస్తువు-1 పేత్రు 3,20-21. ఈ యధ్యాయంలో ఈలాంటి సూచన బోధలను కొన్నిటిని పరిశీలిద్దాం. ఇక్కడ రెండంశాలను విచారిద్దాం.

### 1. జ్ఞానస్నానం ద్వారా రక్షణ ప్రణాళికను అనుభవానికి తెచ్చుకొంటాం

భగవంతుడు ప్రేమతో ఈ ప్రపంచాన్ని సృజించాడు. దేవుడు అనురాగంతో నరుణ్ణి కలిగింపగా ఆ నరుడు పాపంచేసి దేవుని ప్రేమను ధిక్కరించాడు. ఆ దేవునికి

దూరమయ్యాడు. ఐనా దేవుడు కరుణగలవాడు కనుక నరుణ్ణి మళ్ళా తన చెంతకు తీసికొని రావడానికి తన కుమారుణ్ణి పంపాడు. ఆ కుమారుడు నరుడై జన్మించి మనలను రక్షించాడు. ఆనరావతారాన్ని ఇప్పుడు మన మధ్యలో కొనసాగించేదే జ్ఞానస్నానం. కనుక జ్ఞానస్నానం ద్వారా నరుడు భగవంతుని ప్రేమరహస్యాన్నీ, అతని రక్షణ ప్రణాళికనీ అనుభవానికి తెచ్చుకొంటాడు.

భగవంతుడు ప్రేమతోనరుణ్ణి సృజించడానికి, పతనమైన నరుణ్ణి రక్షించడానికీ ప్రణాళిక వేసాడు. మనం జ్ఞానస్నానం పొందినపుడు ఈ ప్రేమ ప్రణాళికను అనుభవానికి తెచ్చుకొంటాం. ఆ ప్రభువుని అంగీకరించి ప్రేమించి అతనితో ఐక్యమౌతాం, అతనికి ప్రార్థన లర్పిస్తాం.

జ్ఞానస్నానమంటే పిచాచంతో పోరాడ్డం, ఈలోకనాయకుణ్ణి ఎదిరించడం - యోహా 12,31. క్రీస్తు ఈ పిశాచాన్ని జయించినా ఈ లోకంలో మనకు అతనితో పోరాటం తప్పదు. కనుక జ్ఞానస్నాన సయయంలో పిశాచవిముక్తికి ప్రార్థనలు జరుగుతాయి. రక్షణదాయకమైన పరిశుద్ధ తైలంతో అభ్యంగనం జరుగుతుంది. పిశాచ పరిత్యాగ ప్రమాణం జరుగుతుంది. భక్తులు పిశాచ యజమానుణ్ణి విడనాడి క్రీస్తు యజమానుణ్ణి సేవిస్తామని ప్రమాణం చేస్తారు.

జ్ఞానస్నానం పొందడమంటే క్రైస్తవ సమాజంలో చేరిపోవడం. క్రొత్తగా జ్ఞానస్నానం పొందబోయేవాళ్ళకొరకు స్థానిక క్రైస్తవులంతా ప్రార్థన లర్పిస్తారు. వాళ్ళ అనుమతిని సలహానూస్వీకరించిన పిదపనేగాని గురువు నూత్న అభ్యర్థులకు జ్ఞానస్నాన మీయరు. ఈ సంస్కారాన్ని పొందిన పిదప నూత్న అభ్యర్థుల పాతక్రైస్తవులతోకలసి దివ్యారాధనంలో పాల్గొంటారు. తాము గూడ ఆరాధనా సమాజంలో సభ్యులౌతారు. ఇవి జ్ఞానస్నాన ప్రారంభంలో పితృపాదులు బోధించే భావాలు.

# 2. సూచన బోధలు

నూత్నవేదంలోని జ్ఞానస్నానాన్నిగూర్చి పూర్వవేదంలో చాల సూచనలున్నాయి. పితృపాదులు ఈ సూచనలను విపులంగా వివరించారు. ప్రస్తుతానికి వాళ్ళ సూచన బోధల్లో ఓ పదింటిని మాత్రం పేర్కొందాం.

## 1. జలం కడిగి శుద్ధిచేస్తుంది, రోగాన్ని కుదుర్చుతుంది.

నీటితో మనదేహాలను కడుగుకొని మాలిన్యం తొలగించుకొంటాం. అలాగే హృదయ మాలిన్యాన్ని కడిగివేసే జలంకూడ ఒకటుందనీ, జనులు ఈ జలం కొరకు ఉవ్విళ్లూరాలనీ బోధించారు ప్రవక్తలు. "ఆరోజుల్లో దావీదు కుటుంబంవాళ్లూ యెరూషలేము

నివాసులూ తమ పాపాలనూ మాలిన్యాలనూ తొలగించుకోవడానికి ఒక నీటిబుగ్గ వెలువడుతుంది" అని పల్కాడు జకర్యా ప్రవక్త – 13, 1. "నేను మీమీద శుద్ధ జలాన్ని కుమ్మరించగా మీరు శుద్ధిని పొందుతారు. మీ మాలిన్యాన్నుండి నేను మీకు శుద్ధి చేస్తాను. నేను మీకు నూత్న హృదయాన్ని దయచేస్తాను" అన్నాడు ప్రభువు యెహెజ్కేలు ప్రవచనంలో – 36, 25.

నరుడు మాలిన్యంనుండి శుద్ధిని పొందడమనేది నామాను కథలో చక్కగా వివరింపబడింది – 2 రాజు 5, 1–14. క్రీస్తుకూడ ఈ వుదంతాన్ని పేర్కొన్నాడు – లూకా 4,27. ఈ నామాను సిరియాదేశ సైన్యాధిపతి, కుష్ఠరోగి. ఇతడు రోగవిముక్తికొరకు యిస్రాయేలు ప్రవక్తయైన ఎలీషా వద్దకు వచ్చాడు. ప్రవక్త అతన్ని యోర్దాను నదిలో ఏడుసార్లు స్నానంచేయమని ఆజ్ఞాపించాడు. నామానుకు యోర్దానులో స్నానంచేయడం ఇష్టంలేదు. తన దేశపు నదులు ఈ యిస్రాయేలు నదికంటె పవిత్రమైనవని అతని తలంపు. ఐనా అతడు తన సేవకుల సలహాపై ప్రవక్త ఆజ్ఞాపించినట్లే ఏడుసార్లు యోర్దానులో మునిగాడు. వెంటనే అతని కుష్ఠపోయింది. అతని చర్మం పసిబిడ్డ చర్మంలా తయారైంది. ఈ నామాను కుష్ఠ మన పాపానికీ, యోర్దాను నీళ్లు మన జ్ఞానస్నాన జలానికీ చిహ్నంగా వుంటాయన్నారు పితృపాదులు. జ్ఞానస్నాన జలాలు మనలను కడిగి శుద్ధిచేస్తాయి. ప్రభువు శ్రీసభను వాక్యంతోను ఉదకస్నానంతోను శుద్ధిచేసి పవిత్రపరచాడు. ఈ ఉదకస్నానం జ్ఞానస్నానమే – ఎఫే 5,25. మనం నిర్మలమైన ఉదకంలో స్నానంచేసి పవిత్ర హృదయంతో దేవుని సన్నిధిలోకి రావాలి. ఈ స్నానమే జ్ఞానస్నానం – హెబ్రే 10,22.

ఈ సందర్భంలో అంబ్రోసు భక్తుడు ఈలా నుడివాడు. "నామాను స్నానం యూదులుకాని అన్యజాతులవాళ్లు జ్ఞానస్నానం పొందడాన్ని సూచిస్తుంది. ఈపుణ్యక్రియలో పాల్గొనే వరకూ మనమూ ఆనామానులాగే పాపపు కుష్ఠ సోకి అశుద్ధులంగా వుంటాం. కాని ఈ పుణ్యస్నానం ద్వారా మన ఆత్మ శరీర మాలిన్యాలు తొలగిపోతాయి. నామాను ఉదంతంద్వారా భవిష్యత్తులో అన్యజాతులకు రక్షణం లభిస్తుందని సూచింపబడింది."

ఇంకా, ఈజ్ఞానస్నానం మన రోగాన్ని కుదుర్చుతుంది. ఇందుకు తార్కాణం బెత్సయిదా మడుగువద్దపడివున్న రోగి. ఇతడు 38 ఏండ్లుగా ఆ మడుగువద్ద కాచుకొని వున్నాడు. మడుగులోని నీళ్ళు కదలినప్పుడు ఎవరు మొదటిసారి దానిలోనికి దిగుతారో వాళ్ళకు ఆరోగ్యం చేకూరుతుంది. ఈరోగి అవకాశంకొరకు కాచుకొని వున్నాడు. కాని నీళ్లు కదలినప్పుడు ఎవరో ఒకరు అతనికంటె ముందుగా మడుగులోనికి దిగి ఆరోగ్యం పొందేవాళ్లు. కడన క్రీస్తు అతని దగ్గరికివచ్చి అతనికి ఆరోగ్యం దయచేసాడు – యోహా 5, 1–4. ప్రభువు మనకు ఈనాడు జ్ఞానస్నాన జలాల ద్వారా ఆరోగ్యం దయచేస్తాడు. ఈ యారోగ్యం ప్రధానంగా ఆత్మగతమైంది.

## 2. జలరాశిమీద ఆత్మ

సృష్ట్యాదిలో ఆత్మ జలరాశిమీద ఎగిరింది. ఆ జలరాశిలోనుండి ప్రాణులను పుట్టించింది - అది 1.2.20. జలప్రళయం ముగిసాక నోవా ఒక పావురాన్ని ఓడనుండి బయటికి విడిచాడు. అది కొమ్మను ముక్కున గరచుకొని తిరిగి వచ్చింది. ఈ పావురం గూడ ఆత్మకు చిహ్నమే - అది 8,11. ఇంకా యిస్రాయేలీయులు ఎడారిలో ప్రయాణం చేస్తుండగా ఒక మేఘం ముందుగావెళ్ళి వాళ్ళకు దారి చూపుతూండేది. ఈ మబ్బు కూడ ఆత్మకు చిహ్నమే - నిర్గ 14, 34-36.

ఆత్మను గూర్చిన పూర్వవేద భావాలు నూత్న వేదపు జ్ఞానస్నానంలో నెరవేరాయి. క్రీస్తు పరిశుద్ధాత్మతోను అగ్నితోను జ్ఞానస్నాన మిచ్చేవాడు - మత్త 3,11. ఆ ప్రభువు యోర్దాను నదిలో మునిగాక ఆత్మ పావురంరూపంలో అతని మీదికి దిగివచ్చింది - లూకా 3, 21-22. ఆ ప్రభువు తన్నా శ్రయించేవాళ్ళకు జీవజలాన్ని ఇస్తానన్నాడు. ఆ జీవజలం పవిత్రాత్మే - యోహా 7,37-39. జ్ఞానస్నాన సమయంలో మన మీ యాత్మను సమృద్ధిగా పొందుతాం. ఆ సమయం నుండి ఆత్మ ఓ దేవాలయంలోలాగ మనహృదయంలో వాసం చేయడం మొదలుపెడుతుంది - 1 కొరి 3,16. జ్ఞానస్నానంలో మనమీద పనిచేసి మనలను పాపమాలిన్యంనుండి శుద్ధిచేసేదీ మనకు నూత్నజన్మ నిచ్చేదీ ఆత్మే.

## 3. జీవాన్ని కొనితెచ్చే నీళ్ళు

దేవుడు నీటిలో నుండి జీవకోటి పుట్టాలి అని ఆజ్ఞాపించాడు. ప్రభువు ఆదేశించినట్లే సృష్ట్యాదిలో నీటినుండి జీవరాశి పుట్టింది - అది 1,20. ఈలాగే జ్ఞానస్నాన జలాలు కూడ మనకు జీవాన్ని దయచేస్తాయి. క్రొత్తపుట్టువు నిస్తాయి. రెండవ శతాబ్దానికిచెందిన టెర్టూలియన్ అనే వేదశాస్త్రి ఈలా వ్రాసాడు. "మన చేప క్రీస్తు. ఆ చేపననుసరించి మనంకూడా నీటిలో చిన్న చేపలంగా పుడతాం. నీటిలో వుంటేనేగాని మనకు రక్షణం లేదు". తొలి శతాబ్దంలోని రోమను సొరంగాల్లో క్రీస్తుని చేపగా చిత్రించేవాళ్ళు. ఆ చిత్రాన్ని ఆధారంగా తీసికొని టెర్టూలియన్ ఈ వాక్యం చెప్పాడు. జ్ఞానస్నానపు నీటినుండి మనం క్రొత్తగా పుడతామని ఈ వేదశాస్త్రి భావం. నీటి ద్వారాను ఆత్మద్వారాను జన్మించందే ఏనరుడూ దైవరాజ్యంలో ప్రవేశించడని యోహాను సువిశేషం చెబుతుంది కదా! - 3,35. దేవుడు మొట్టమొదట చేసిన ప్రాతసృష్టి వుండనేవుంది - అది 1,1. నరుడు జ్ఞానస్నానం పొందినపుడు క్రొత్తసృష్టి ఔతాడు - 2కొరి 5, 17. అనగా అతడు ప్రాకృతిక మానవుని నుండి ఆధ్యాత్మిక మానవుడుగా మారిపోతాడు. క్రొత్తగా పుట్టిన శిశువువలె నిర్మలమైన వాక్యమనే పాలు సేవిస్తాడు. ఆ పాలవలననే రక్షణం పొందుతాడు గూడ - 1పేత్రు 2,3.

జలం ఎప్పుడు కూడ జీవనదాత. పై టెర్టూలియన్ వేదశాస్త్రి ఈలా వాకొన్నాడు "లోకంలో ఆదివస్తువు జలమే. ఈ జలంనుండే దేవుడు మొదట ప్రాణులను పుట్టించాడు – ఆది 1,2,20. ఆదిలో జలంనుండి ప్రాణులు పుడితే, ఇప్పుడు జ్ఞానస్నాన జలంనుండి జీవం పుట్టడంలో ఆశ్చర్యమేముంది?"

నీటి నుండి చేపలు పుట్టినట్లే జ్ఞానస్నాన జలం నుండి మనం చేపల్లా పుడతాం ఈ పట్టున అంబ్రోసు భక్తుడు ఈలా వ్రాక్రుచ్చాడు. "మిమ్ము జ్ఞానస్నాన జలాల్లోనికి ముంచేది దేనికో తెలుసా? పూర్వం దేవుడు జలంనుండి ప్రాణులు పుట్టాలి అనగానే చేపలు పుట్టాయి – ఆది 1,20. ఇది సృష్ట్యాదిలో జరిగిన కార్యం. ఆ నీళ్ళవలన భౌతిక ప్రాణులు పుట్టాయి. ఈ జ్ఞానస్నాన జలాలవల్ల ఆధ్యాత్మిక ప్రాణులైన మీరు పుట్టారు. మీరు మన చేప ననుసరించి పుట్టారు".

## 4. ఏదెను వనంలోని నాల్గు నదులు

ఆదిదంపతుల వసించిన శృంగారవనంలో ఒక నది పారుతుండేది. ఆ నది నాల్గుపాయలుగా చీలి వనాన్నంతటినీ తడిపేది – 2,10. ఈ నదీజలం జ్ఞానస్నాన జలాన్ని సూచిస్తుందన్నారు పితృపాదులు. దేవుడు పాపం చేసిన తొలిమానవుణ్ణి శృంగారవనంనుండి వెళ్ళగొట్టాడు కదా! ఇప్పుడు జ్ఞానస్నానం ద్వారా నరుడు మళ్లా ఆ భాగ్యవనంలో ప్రవేశిస్తాడు. ఈ సందర్భంలో భక్తుడు గ్రెగోరీ నీస్సా ఈలా నుడివాడు. "జ్ఞానస్నానం పొందబోయే అభ్యర్థీ! నీవు ఇప్పుడు ఏదెనువనానికి వెలుపల వున్నావు. మన తొలితండ్రియైన ఆదాములాగ తోట బయట వున్నావు. అదిగో వన ద్వారం తెరిచారు చూడు! ఏ ద్వారంగుండా పూర్వం నీవు తోటనుండి బయటికి వచ్చావో ఆ ద్వారంగుండానే మళ్ళా తోటలోనికి ప్రవేశించు, జాగుచేయకు".

ఈ భక్తుని భావమేమిటంటే జ్ఞానస్నాంద్వారా నరుడు శృంగారవనప్రవేశం చేస్తాడు. పాపం చేయకముందు ఆదామునకున్న భాగ్యస్థితిని చేరుకొంటాడు. దేవునితో సఖ్యసంబంధాలు పెంపొందించుకొంటాడు. క్రీస్తు మరణోత్థానాల్లో పాల్గొనడం ద్వారా అతనికీ భాగ్యం సిద్ధిస్తుంది.

పూర్వం జ్ఞానస్నానం పొందేవాళ్ళు బట్టలు విడిచి దిగంబరులుగా ఈ సంస్కారాన్ని పొందేవాళ్లు. ఈ క్రియ పాపం చేయకముందు శృంగార వనంలో దిగంబరుడుగా వున్న ఆదాము భాగ్యస్థితిన తలపిస్తుందన్నారు పితృపాదులు – ఆది 2,25. ఈ పట్టున యెరూషలేం సిరిల్ భక్తుడు ఈలా వాకొన్నాడు. "నీవు దిగంబరుడవుగా జ్ఞానస్నానం పొందుతున్నావు. నీ దిగంబరత్వానికి నీవు సిగ్గుపడ్డం లేదు. నీవు మొదటి ఆదామునకు పోలికగా వున్నావు.

అతడు కూడ శృంగారవనంలో దిగంబరుడుగావుండి సిగ్గు చెందకుండా వుండేవాడు". ఈ భక్తుని ఉద్దేశం ఇది. జ్ఞానస్నానం ద్వారా మనం భాగ్యస్థితిని చేరుకొంటాం. తొలిమానవుని శృంగారవనపు జీవనస్థాయిని అందుకొంటాం. తొలినరుడు దేవునికి పోలికగా ఉండేవాడు. ఈ సంస్కారం ద్వారా మనం కూడ ఈ పోలికను పూర్ణంగా పొందుతాం.

క్రీస్తు జ్ఞానస్నానం పొందిన పిదప పిశాచంచే శోధింపబడ్డానికి ఎడారికివెళ్ళి అక్కడ "వన్యమృగాలతో వసించాడు" అని చెప్తుంది మార్కు సువిశేషం - 1, 13. ఈవర్ణనం ఈ వొక్క సువిశేషంలో మాత్రమే కన్పిస్తుంది. క్రీస్తు వన్యమృగాలతో వసించడమనేది పూర్వం ఆదాము ఏదెను వనంలో మృగాలన్నిటికి పేర్లు పెట్టి వాటికి యజమానుడుగా వున్న భాగ్యస్థితిని తలపిస్తుంది - ఆది 2,20. అనగా క్రీస్తు శృంగార వనంలోని ఆదాములాంటివా దయ్యాడు. తాను రెండవ ఆదాము అయ్యాడు. అతనిలోనికి జ్ఞానస్నానం పొందిన మనం కూడ ఏదెను వనాన్ని చేరుకొంటాం. అచటి భాగ్యజీవనాన్ని అనుభవిస్తాం.

## 5. జలప్రళయ జలం

నోవా కాలంలో భూమిమీద జనం బొత్తిగా చెడిపోయారు. దేవుడు నలువదినాళ్ళు జలప్రళయం కలిగించాడు. అది భూమిమీది పాపాత్ముల నందరినీ తుడిచిపెట్టింది. నోవా అతని కుటుంబ సభ్యులు ఎన్మిదిమంది మాత్రం ఓడలో ఎక్కి బ్రతికిపోయారు. ఇక్కడ ఒకే జలం మృత్యువుకీ జీవనానికీ గూడ కారణమైంది - ఆది 7,21-24.

ఈ జలప్రళయ జలం జ్ఞానస్నానజలాన్ని సూచిస్తుంది. అది మన దేహమాలిన్యాన్ని మాత్రమేకాక అంతరాత్మ మాలిన్యాన్ని కూడ తొలగించి మనలను శుద్ధిచేస్తుంది - 1 పేత్రు 2, 19-21. క్రీస్తుని నమ్మి ఆయనలోనికి జ్ఞానస్నానం పొందినవాళ్ళకు ఈ నీరు జీవనసాధన మౌతుంది. కాని ఆయన్ని విశ్వసించనివాళ్ళకు అదే నీరు తీర్పు విధిస్తుంది. వాళ్ళు దుష్టులనీ శిక్షార్హులనీ నిరూపిస్తుంది - మత్త 24, 37- 42.2 పేత్రు 2,4-10.

ఇంకా, జ్ఞానస్నాన జలం మనలోనిపాపపు మానవునికి మృత్యువునీ, మనలోని ఆధ్యాత్మిక మానవునికి జీవాన్నీ తెచ్చి పెడుతుంది. ఈ విధంగా అది మనకు మృత్యువూ జీవం కూడ ఔతుంది. జలప్రళయ జలాలు జ్ఞానస్నానానికి సంకేతంగా వుంటాయి. దేవుని తీర్పువలన జలప్రళయంలో పాపపు నరజాతి అంతా చనిపోయింది. పుణ్యపురుషుడైన నోవా మాత్రం బ్రతికాడు. అలాగే జ్ఞానస్నానంలో మనలోని పాప మానవుడు చనిపోతాడు. మనలోని నూత్నమానవుడు, పుణ్య మానవుడు బ్రతుకుతాడు.

ఈ సందర్భంలో సిరిల్ భక్తుడు ఈలా వ్రాసాడు. "క్రీస్తు దేహాన్ని సమాధిలో వుంచినట్లే నిన్ను జ్ఞానస్నానపు తొట్టిలోనికి తీసుకవెళ్ళారు. అక్కడ ముగ్గురు దైవవ్యక్తుల

పేరు మీదిగా నిన్ను మూడుసార్లు ప్రశ్నించగా నీవు మూడు సార్లు ఆ దైవవ్యక్తులను నమ్ముతున్నానని జవాబు చెప్పావు. అప్పుడు నిన్ను మూడుసార్లు నీళ్ళల్లో ముంచారు. దీనివల్ల నీవు మూడు రోజులు సమాధిలోవున్న క్రీస్తుని పోలిన వాడివయ్యావు. తర్వాత నీళ్ళల్లో నుండి బయటికి వచ్చావు. ఆ నీళ్లల్లోనే నీవు చనిపోయావు. వాటిల్లోనే మరలా జన్మించావు కూడ. ఆ రక్షణజలం నీకు సమాధిగాను, మాతృగర్భంగాను కూడ పరిణమించింది".

## 6. రెల్లు సముద్రపు నీళ్లు

పూర్వవేద సంఘటన అన్నిటిలోను నూత్నవేద జ్ఞానస్నానాన్ని ఎక్కువగా సూచించేది సముద్రోత్తరణం. నూత్నవేద రచయితలూ పితృమూర్తులూ ఈ ఉదంతాన్ని చాలసార్లు పేర్కొన్నారు. కనుక ఇక్కడ ఈ యంశాన్ని విపులంగా పరిశీలించి చూద్దాం.

1) యిస్రాయేలు ప్రజలు ఐగుప్తులో పాస్కగొర్రెపిల్లను భుజించారు. మోషే నాయకత్వాన అక్కడినుండి వెడలివచ్చి సముద్రాన్ని దాటారు. వాళ్లను వెంబడించిన ఫరో సైన్యం మాత్రం ఇదే సముద్రంలో మునిగిపోయింది. ఈ సంఘటనంలో గూడ నీళ్లు మృత్యువుకీ జీవానికి కారణమయ్యాయి. ఈ సంఘటనంతో హెబ్రేయుల దాస్యమూ కష్టాలూ తొలగిపోయాయి. ప్రభువు మేఘరూపంలో రేయింబవళ్లు వాళ్ళను నడిపించాడు. సీనాయి కొండవద్ద వాళ్లతో నిబంధనం చేసికొన్నాడు. ఫలితంగా తాను వాళ్ళకు దేవుడయ్యాడు వాళ్ళు ఆయన్ని కొలిచే భక్తసమాజమయ్యారు. ప్రభువు వాళ్లను ఆ కొండనుండి వాగ్దత్తభూమికి నడిపించాడు. వాళ్ళకొరకు దారిలో మన్నా కురిపించాడు. మెరిబావద్ద రాతిబండ నుండి నీళ్లు దయచేసాడు. ఇంకా యెన్నో అద్భుత కార్యాలు కూడ చేసాడు.

ఇది క్రీస్తుపూర్వం 13వ శతాబ్దంలో ఐగుప్తునుండి జరిగిన నిర్గమనం. క్రీస్తుపూర్వం 6వ శతాబ్దంలో మరో నిర్గమనం జరిగింది. అది బాబిలోను నుండి. 6వ శతాబ్దంలో బాబిలోను రాజులు యిస్రాయేలీయులను బందీలనుగా గొనిపోయారు. పూర్వం ఐగుప్తు ప్రవాసంనుండివలె ఈ ప్రవాసం నుండి గూడ ప్రభువు వాళ్ళను విడిపించాడు. 5వ శతాబ్దంలో ప్రజలు మళ్ళా యెరూషలేముకి తిరిగివచ్చారు. ఈ సదర్భంలో ప్రభువు "నేను పూర్వంకంటె గూడ గొప్ప అద్భుతాలను చేస్తాను. అవి యిప్పుడే సిద్ధమై యున్నాయి. మీరు వాటిని అర్థం చేసికోగలరా? నేను ఎడారిగుండా మార్గం నిర్మిస్తాను. మరుభూమి గుండా నీటి కాల్వలు పారిస్తాను" అంటాడు - యెష 43, 14-21.

2) పూర్వవేదంలోని పై రెండు నిర్గమనాలు నూత్నవేదంలో క్రీస్తు కొనిరాబోయే రక్షణాన్ని సూచిస్తాయి. అతని మరణోత్థానాలు నిర్గమనం లాంటివే. ఈ సందర్భంలో నాల్గవ శతాబ్ద భక్తుడైన అఫ్రాటెస్ అనే అతడు ఈలా వాకొన్నాడు "తొలి పాస్కవలన

యూదులు ఫరో దాస్యాన్నుండి తప్పించుకొన్నారు. క్రీస్తు సిలువ మరణం వలన మనం పిశాచ దాస్యంనుండి తప్పించుకొన్నాం. వాళ్ళు గొర్రెపిల్లను చంపి దాని నెత్తుటిని ద్వారబంధాలకు పూసి వినాశమూర్తియైన దేవదూతనుండి తప్పించుకొన్నారు. క్రీస్తు చిందిన నెత్తురు మనలను మన పాపకార్యాలనుండి రక్షించింది. వాళ్ళ నాయకుడు మోషే. మన నాయకుడు క్రీస్తు. మోషే సముద్రాన్ని పాయలుగా చీల్చి ఆ ప్రజలను ఆవలి వొడ్డుకి నడిపించాడు. మన రక్షకుడు పాతాళానికి దిగి దాని ద్వారాలను తెరిచాడు. తన్ను విశ్వసించే వాళ్ళందరూ ఆ పాతాళం నుండి వెలుపలికి రావడానికి మార్గం నిర్మించాడు".

ఈ వాక్యంలో చాలా భావాలున్నాయి. ఐగుప్తులో గొర్రెపిల్ల నెత్తురు పూర్వవేద ప్రజలను కాపాడింది. ఇక్కడ క్రీస్తు చిందించిన నెత్తురు నూత్నవేద ప్రజలను కాపాడుతుంది. ఈ నూత్నప్రజను విమోచించింది వెండి బంగారాలలాంటి క్షుద్రవస్తువులు కాదు. నిర్దోషమూ నిష్కలంకమూ అమూల్యమునైన గొర్రెపిల్ల నెత్తురు -1 పేత్రు 1,18-19.

ఐగుప్తులోని ప్రజలు దాస్యగృహంనుండి బయలుదేరి సముద్రాన్ని దాటారు. పాలు తేనెలు ప్రవహించే వాగ్దత్త భూమిని చేరారు. క్రీస్తు ఈ లోకాన్ని దాటి తండ్రి వద్దకు వెళ్ళాడు. ఈ భావాన్ని యోహాను సువిశేషం "యేసు తాను ఈ లోకంనుండి తండ్రి యొద్దకు వెళ్ళవలసిన గడియ వచ్చినదని యెరిగినవాడై" అన్న వాక్యంలో సూచించింది - 13,1.

అక్కడ మోషే నాయకుడు. అతడు యిస్రాయేలీయులకు విమోచకుడు- అచ 7,35. కాని అతడురాబోయే మరో గొప్ప విమోచకుడు క్రీస్తుకి సూచనంగా వుంటాడు.

మోషే సముద్రాన్ని పాయలుగా చీల్చి దారి కల్పించాడు. క్రీస్తు పాతాళద్వారాలను విప్పి అక్కడ బందీలైయున్న నీతిమంతులు వెలుపలికి రావడానికి మార్గం నిర్మించాడు. మృతక్రీస్తుని సమాధి చేసారుకదా! అక్కడి నుండి అతడు పాతాళానికి దిగి పిశాచాన్నీ మృత్యువునీ జయించాడు. పూర్వ వేదపు నీతిమంతులను పాతాళంనుండి విడిపించాడు. మూడవనాడు ఉత్థానుడై తనతోపాటు ఆ నీతిమంతులను గూడ స్వర్గానికి తోడ్కొని పోయాడు -1 పేత్రు 3,19. ఇది క్రీస్తు నిర్గమనం.

3) ఇక, యిస్రాయేలీయుల నిర్గమనం, క్రీస్తునిర్గమనం జ్ఞానస్నానంలో మనకు సంక్రమిస్తాయి. సముద్రంగుండా దాటిపోయి యిస్రాయేలీయులు ఫరో దాస్యంనుండి తప్పించుకొన్నారు. జ్ఞానస్నాన జలంగుండా దాటిపోయి ఈనాడు మనం పిశాచ దాస్యంనుండి తప్పించుకొంటాం. ఈ సంస్కారం ద్వారా మనం క్రీస్తుతోనిబంధనం చేసికొంటాం. అతడు మనకు దేవుడౌతాడు, మనం అతన్ని కొలిచే భక్తుల మౌతాం. అతని నాయకత్వాన మనం ఈ లోకాన్ని దాటతాం. ఇక్కడినుండి మోక్షానికి యాత్ర చేస్తాం. ఈ యిహలోకం మనకు కేవలం యాత్రాస్థలం - హెబ్రే 13,14.

కాని మనకు దాస్యవిముక్తిఏలా జరిగింది? క్రీస్తు రక్షణాత్మకమైన మరణం ద్వారా. ఆ మరణమే ఇప్పుడు మన జ్ఞానస్నానంలో పనిచేసేది. జ్ఞానస్నానజలం క్రీస్తుమరణ ఫలితాన్ని మన మీద చూపుతుంది. పూర్వం జ్ఞానస్నానం పొందే అభ్యర్థి మడుగులోకి దిగి మూడుసార్లు నీటిలో మునిగేవాడు. ఈలా దిగడం ద్వారా అతడు సమాధిలో పాతిపెట్టబడిన క్రీస్తు మరణంలోనికి దిగుతున్నాని సూచించేవాడు. తాను క్రీస్తుతోపాటు పాతిపెట్టబడి పాపానికి చనిపోతున్నాననీ సూచించేవాడు. తర్వాత మడుగులోనికి దిగిన అభ్యర్థి దిగిన వైపుగా గాకుండా ఆవలివైపుగా వొడ్డుకి ఎక్కివచ్చేవాడు. ఈలా ఎక్కిరావడం ద్వారా తాను కూడ క్రీస్తుతోపాటు ఉత్థాన మౌతున్నానని సూచించేవాడు. నూత్న జీవాన్ని జీవిస్తున్నానని తెలియజేసేవాడు. ఈ విధంగా క్రీస్తు మరణోత్థానాలు మన జ్ఞానస్నానంలో నెరవేరతాయి. కనుకనే ఈ సంస్కారం ఈనాడు మనకు ఫలితమీయ కలుగుతుంది. అందుకే భక్తుడు తోమాసు అక్వినాసు “జ్ఞానస్నాన సంస్కారంలో క్రీస్తు మరణోత్థానాలు సాంకేతికంగా మనమీద సోకుతాయి” అని చెప్పాడు. ఈ భావాన్నే పౌలు “మీరు జ్ఞానస్నానంలో క్రీస్తుతోపాటు పాతిపెట్టబడుతున్నారు, అతనితో పాటు లేపబడుతున్నారు” అన్న వాక్యంలో పేర్కొన్నాడు- కొలో 2,12. రోమీయులు 6, 3-5లోకూడ అతడు ఇదే భావాన్ని వ్యక్తం చేసాడు.

ఇక్కడ పౌలు వ్రాసిన ఈ క్రింది వాక్యాలు మననం చేసికోదగ్గవి. “మన పితరులంతా మేఘంక్రింద ఉండేవాళ్ళు. వాళ్ళు సముద్రంగుండా నడచిపోయారు. వాళ్ళంతా మోషే ద్వారా సముద్రంలోనికి మేఘంలోనికి జ్ఞానస్నానంపొందారు. అందరు అదే ఆధ్యాత్మికాహారాన్ని భుజించారు. అదే ఆధ్యాత్మిక పానీయాన్ని సేవించారు. అందరూ ఎడారిలో తమ్మనుసరించిన ఆధ్యాత్మిక శిలనుండి పానీయం త్రాగారు. ఆ శిలక్రీస్తే - 1కొరి 10, 1-5.

ఈ వాక్యాల్లో పౌలు యిస్రాయేలు ప్రజలు సముద్రం గుండా నడచిపోవడాన్ని వాళ్ళ జ్ఞానస్నానంగా ఉత్ప్రేక్షించాడు. నూత్న వేదంలో మనం జ్ఞానస్నాన జలాలగుండా నడచిపోతామని ముందే చెప్పాం. పౌలు పేర్కొన్న మేఘం పవిత్రాత్మకు చిహ్నం. అక్కడ యిస్రాయేలీయులు సేవించిన ఆధ్యాత్మికాహారం మన్నా. నూత్నవేదంలో మనం దివ్యసత్ప్రసాదం సేవిస్తాం. అక్కడ వాళ్ళు త్రాగిన ఆ ఆధ్యాత్మిక పానీయం, మెరీబావద్ద బండనుండి వెలువడిన నీళ్లు-నిర్గ 17,6. ఈ నీళ్లు నూత్నవేదంలో జీవజలానికీ పవిత్రాత్మకీ జ్ఞానస్నాన జలానికీ గుర్తు. మోషే మెరీబావద్ద బెత్తంతో కొట్టిన బండ అటుపిమ్మట యిస్రాయేలీయులతోపాటు ఎడారిలో ప్రయాణం చేస్తూపోయిందని రబ్బయిలు చెప్పేవాళ్ళు. ఇక్కడ పౌలు ఈ సంప్రదాయాన్ని పేర్కొన్నాడు. ఈ బండ క్రీస్తుకి సూచనంగా వుంటుంది

అన్నాడు. సిలువమీద అతని హృదయాన్ని తెరవగా నీళ్లు స్రవించాయి కదా!- యోహా 19,34 ఈ సంఘటనం ఆ బండనుండి నీళ్ళు వెలువడ్డాన్ని తలపిస్తుంది. పూర్వవేదపు సముద్రోత్తరణానికీ నూత్నవేదపు జ్ఞానస్నానానికీ ఎంత దగ్గరి సంబంధం వుందో ఈ పౌలు భావనాసరణినిబట్టే అర్థం చేసికోవచ్చు.

## 7. యోర్దాను నీళ్ళు

పూర్వవేద ప్రజలకు సముద్రోత్తరణంవలె యోర్దాను ఉత్తరణం కూడ ముఖ్యసంఘటనం. ఆ నదిని దాటిన పిదపగాని వాళ్లు వాగ్దత్త భూమిని స్వాధీనం చేసికోలేదు. ప్రాచీన క్రైస్తవులు యోర్దాను నీటిని కూడ జ్ఞానస్నానపు నీటితో పోల్చారు. యూదులు యోర్దానును దాటి వాగ్దత్త భూమిని స్వాధీనం చేసికొన్నట్లే మనం జ్ఞానస్నాన జలాలను దాటి మరో వాగ్దత్తభూమిని స్వాదీనం చేసికొంటాం. అదే మోక్షం. పెద్దవాళ్ళు జ్ఞానస్నానం తర్వాత దివ్యసత్ప్రసాదాన్ని స్వీకరిస్తారు కదా! ఈ భోజనం మనకు మోక్ష బహుమానాన్ని సంపాదించి పెడుతుంది.

ఇంకా, యోర్దాను నీళ్ళు క్రీస్తు జ్ఞానస్నానాన్ని గూడ తలపిస్తాయి. మనం క్రీస్తు మరణంలోనికి జ్ఞానస్నానం పొందుతామని చెప్పాం. ప్రభువు యోర్దాను జ్ఞానస్నానం అతని మరణాన్ని సూచిస్తుంది. ఈ మరణాన్ని ఉద్దేశించే ప్రభువు "నేను పొందవలసిన జ్ఞానస్నానం ఒకటుంది" అని పల్కాడు - లూకా 12,50. క్రీస్తు యోహాను నుండి జ్ఞానస్నానం పొందింది స్వీయ పాపపరిహారానికిగాదు, మన పాపాల పరిహారానికి - యోహా 1,29. అతడు మన కిల్బిషాలను భరించే గొర్రెపిల్ల - యోహా 1, 29.

ప్రభువు యోర్దాను నీటినుండి బయటికి రాగానే మోక్షం తెరువబడింది. తండ్రి అతనికి సాక్ష్యం పలికాడు. ఆత్మ దిగివచ్చింది. ఈ సంఘటనలద్వారా తండ్రి క్రీస్తుని అంగీకరించడమూ, అతనికి ఉత్థానాన్ని దయచేసి మహిమను ప్రసాదించడమూ అనే దైవరహస్యాలు సూచింపబడ్డాయి - మత్త 3, 16-17.

క్రీస్తు యోర్దాను జ్ఞానస్నానం మన జ్ఞానస్నానానికి పోలికగా వుంటుంది. మనం జ్ఞానస్నానం పొందేది క్రీస్తు మరణోత్థానాల్లోనికిగాని అతని జ్ఞానస్నానంలోకి కాదు. ఐనా ఆ సంఘటనం నేటి మన జ్ఞానస్నానాన్ని సూచిస్తుంది. కనుక మనం ప్రభువు జ్ఞానస్నానాన్ని భక్తితో స్మరించుకోవాలి. మన ఆరాధన సంవత్సరంలో ఈ ఉత్సవం జనవరిలో వస్తుంది.

## 8. జ్ఞానస్నానం వెలుగుని ప్రసాదిస్తుంది

క్రీస్తు గ్రుడ్డివానికి చూపునిచ్చాడు. అతడు సిలోయము అనే కోనేటిలో కండ్లు కడుగుకొని దృష్టిని పొంది వెలుగుని చూడగలిగాడు-యోహా 9,7. ఈనాడు ప్రభువు

జ్ఞానస్నానజలాల ద్వారా మనకు గూడ దృష్టినీ వెలుగునీ ప్రసాదిస్తాడు. కనుకనే పౌలు "ఓయి నీవు నిద్రనుండి మేల్కొనాలి. క్రీస్తు నీకు వెలుగుని దయచేస్తాడు" అని హెచ్చరించాడు - ఎఫె 5,14.

కాని ఈ వెలుగు ఏమిటి? క్రీస్తునందు విశ్వాసమే. ప్రభువు పై గ్రుడ్డివానికి చూపుని ప్రసాదించిన తర్వాత నీవు దేవుని కుమారుని విశ్వసిస్తున్నావా అని అడిగాడు. అతడు విశ్వసిస్తున్నాను ప్రభో అని క్రీస్తు పాదాలకు మ్రొక్కాడు - యోహా 9, 35-38. అనగా ప్రభువు ఆ గ్రుడ్డివానికి భౌతిక దృష్టినీ విశ్వాస దృష్టినీ గూడ అనుగ్రహించాడు. ఈనాడు జ్ఞానస్నానంలో మనకు దయచేసేది కూడ ఈ విశ్వాస దృష్టినే.

జ్ఞానస్నానమిచ్చే వెలుగు విశ్వాసమేనని చెప్పాం. పెద్దవాళ్ళు జ్ఞానస్నానం పొందేప్పుడు విశ్వాసముండాలి. ముగ్గురు దైవవ్యక్తులను విశ్వసించందే ఈ సంస్కారాన్ని ఈయకూడదు. అనగా జ్ఞానస్నానానికి ముందే విశ్వాసముండాలి. ఐనా ఈ సంస్కారం ప్రధానంగా మన విశ్వాసాన్ని పెంచేది. ఈ దివ్యకార్యం మనలను క్రీస్తుతో జోడిస్తుంది. విశ్వాసంద్వారా గాని మనం క్రీస్తుని దర్శించం. కనుక ఆ ప్రభువుని దర్శించడానికి అవసరమైన విశ్వాసాన్ని ఈ దివ్యకార్యం మనకు దయచేస్తుంది. ఈ సంస్కారానికి ముందే మనకు ముగ్గురు దైవ వ్యక్తులమీద విశ్వాసముండాలని చెప్పాం. ఈ సంస్కారం తర్వాత మన విశ్వాసం పెరుగుతుంది. ఫలితంగా ఆ ముగ్గురు దైవవక్తులు మనహృదయంలోకి విచ్చేసి దానిలో ఓ దేవాలయంలోలాగ వసిస్తారు - 1 కొరి 6,19.

జ్ఞానస్నానం పొందిన వ్యక్తి చేతిలో వెలుగుతున్న కొవ్వు వత్తిని పెడతాం. పాస్కవత్తిలాగే ఈ వత్తికూడ క్రీస్తుకి చిహ్నం. ఆ ప్రభువు మనలను వెలిగించే వెలుగు. కనుకనే యోహాను "నిజమైన వెలుగొకటి వుంది. అది ఈ లోకంలోకి వచ్చే ప్రతి నరుణ్ణీ వెలిగిస్తుంది" అని చెప్పాడు- 1,9. తండ్రే మనలను చీకటిలో నుండి ఈ యద్భుతమైన వెలుగులోనికి రప్పిస్తాడు - 1 పేత్రు 2,9.

పదిమంది కన్నెలూ వెలుగుతూన్న దివిటీలతో పెండ్లికుమారుని కొరకు వేచివున్నారు - మత్త 25, 1-7. వాళ్ళలాగే మనంకూడ జ్ఞానస్నానపు వెలుగుతో ప్రభువు రెండవ రాకడ కొరకు వేచివుండాలి. ఈలా ఈ సంస్కారం మనలను అంత్యకాలానికీ, అనగా ప్రభువు రెండవ రాకడకు, సిద్ధం చేస్తుంది.

## 9. జ్ఞానస్నానమూ పిశాచంతో పోరాటమూ

జ్ఞానస్నానం మనకు పిశాచంతో పోరాడ్డానికి వలసిన బలాన్ని దయచేస్తుంది. గురువు జ్ఞానస్నానాన్ని ఈయక ముందు పిశాచాన్ని పారద్రోలే ప్రార్థనలను జపిస్తారు.

ఉదాహరణకు ఒక ప్రార్థనం ఇది. "ఓ ప్రభూ! ఈ నీ సేవకులనుండి అవిశ్వాసాన్ని తొలగించు. విగ్రహారాధన, మాయాశక్తి పిశాచ మంత్రతంత్రాలు ధనాశా శరీరాశాపాశాలు వైరం స్పర్ధా అవినీతికార్యాలూ తొలగించు. నీ సముఖంలో వీళ్ళు పవిత్రులూగా వుండేలా నీవు వీళ్ళను పిల్చావు. కనుక వీరికి విశ్వాసమూ భక్తీ సహనముగా నమ్మకమూ నిగ్రహమూ నిర్మలత్వమూ ప్రేమా శాంతీ మొదలైన వరాలను దయచేయి". ఈలాంటి ప్రార్థనల ద్వారా పిశాచ ప్రభావాన్ని వదలించుకొంటాం. ఈ సందర్భంలో సిరిల్ భక్తుడు ఈలా చెప్పాడు. "కమసాలి బంగారాన్ని కొలిమిలో పెట్టి పుటంచేస్తే దానిలోని మాలిన్యం తొలగి పోతుంది. ఆలాగే పిశాచ నిర్మూలన ప్రార్థనం ద్వారా ఆత్మలోని పైశాచిక మాలిన్యం తొలగిపోయి ఆత్మ శుద్ధిని పొందుతుంది".

అటుపిమ్మట గురువు అభ్యర్థిని పరిశుద్ధ తైలంతో అభిషేకంచేసి "రక్షణ తైలంతో నిన్ను అభ్యంగనం చేస్తున్నాను. రక్షకుడైన క్రీస్తుని శక్తి నిన్ను బలపరుచుగాక" అని ప్రార్థిస్తారు. పూర్వం గ్రీకు రోమను ప్రజలు బహిరంగక్రీడల్లో పాల్గొనే క్రీడాకారులకూ యోధులకూ తైలంతో అభ్యంగనం చేసేవాళ్ళు. దాని ద్వారా వాళ్ళు శారీరక బలాన్ని పొందేవాళ్ళు. జ్ఞానస్నానాన్ని పుచ్చుకొనేవాళ్ళుకూడ పిశాచంతో యుద్ధం చేసే యోధుల్లాంటివాళ్లు కనుకనే జ్ఞానస్నానపు తంతులో ఈ యభ్యంగనాన్ని ప్రవేశపెట్టారు. దాని ద్వారా మనం ప్రభువు బలాన్ని పొంది పిశాచంతో పోరాడ్డానికి సమర్థుల మౌతాం.

పూర్వం జ్ఞానస్నానాన్ని పొందేవాణ్ణి మడుగులో ముంచేవాళ్ళని చెప్పాం. అతడు నీటిలోనికి పోయేవాడు. బైబులు భావాల ప్రకారం జలగర్భంలో జలభూతం వసిస్తూంటుంది. అది పిశాచానికి చిహ్నంగా వుంటుంది. సృష్టి చేసినప్పుడే భగవంతుడు ఈ భూతాన్ని అదుపులోకి తెచ్చుకొన్నాడు. క్రీస్తు చనిపోయి పాతాళానికి దిగిందికూడ ఈ భూతాన్ని జయించడానికే. ఇక జ్ఞానస్నాన సమయంలో నీటిలోనికి మునిగే భక్తుడు కూడ సాంకేతికంగా క్రీస్తుతోపాటు పాతాళానికి వెళ్తాడు. క్రీస్తుతోపాటు తానూ భూతరూపమైన పిశాచంతో యుద్ధం చేస్తాడు. ప్రభువు బలంతోనే దాన్ని జయించి మళ్లా మడుగులో నుండి వెలుపలికి వస్తాడు. ప్రభువే బలవంతుణ్ణి జయించిన మహా బలవంతుని సామెతను చెప్పాడు - లూకా 11, 21-22. ఈ మహాబలవంతుడు క్రీస్తు, అతడు జయించిన బలవంతుడు పిశాచం. ఈ ప్రభువుతో ఐక్యమై ఈనాడు మనం దయ్యాన్ని ఓడిస్తాం.

క్రీస్తునందు మనం పిశాచాన్ని సూత్రప్రాయంగా జయించినా జీవితాంతమూ మనం ఆ దుష్టశక్తితో పోరాడవలసిందే. పౌలు ఈ లోకంలో జీవించే క్రైస్తవుణ్ణి పిశాచంతో

పోరాడే యోధునితో పోల్చాడు. ఈ పోరాటంలో మనం ధరించే ఆయుధాలు విశ్వాసమూ భక్తీ మొదలైనవి - ఎఫె 6, 14-18. ఈ జీవితంలో నిత్యమూ పిశాచ శోధనలకు గురౌతుంటామనేది మనందరి అనుభవమే. ఈ పోరాటంలో జ్ఞానస్నాన బలం మనకు సాయపడుతుంది. క్రీస్తు శక్తి మన మీద పనిచేసి మనకు విజయాన్ని చేకూర్చి పెడుతుంది. దుర్బలమైన నేతిబీరతీగ బలమైన వేపచెట్టుమీదికి అల్లుకొని ఆ చెట్టుబలంలో పాలుపంచుకొంటుంది. అలాగే మనం ఈ సంస్కారం ద్వారా క్రీస్తులోనికి ఐక్యమై అతని నుండి బలాన్ని పొందుతాం. ఆ బలంతోనే దుష్టుడైన పిశాచంతో పోరాడతాం.

## 10. క్రీస్తు విజయంలో పాలుపొందుతాం.

జ్ఞానస్నానం ద్వారా మనం క్రీస్తు విజయంలో పాలుపొందుతాం. ఈ విజయం ఈ లోకంలోనే ప్రారంభమై మోక్షంలో ముగుస్తుంది. జ్ఞానస్నానంవల్ల మనం మోక్షానికి అర్హులమౌతాం. ఆవాగ్దత్త భూమి మనదౌతుంది. ఆ ప్రభువు విజయం మనకు సంక్రమిస్తుంది.

జ్ఞానస్నాన సాంగ్యంలో చిట్టచివర గురువు అభ్యర్థి తెల్లని కండువానిస్తారు. బైబుల్లో తెల్లని బట్ట దేవునికి అతని పునీతులకి చిహ్నంగా వుంటుంది. దానియేలు దర్శనంలో చూచిన దేవుడు మంచులాంటి తెల్లనిబట్టలు తాల్చినవాడు. 7,9. తబోరు కొండమీద శిష్యులు చూచిన క్రీస్తుబట్టలు కూడ ఏ చాకలీ చలువ చేయలేనంత తెల్లగా మెరుస్తున్నాయి. మార్కు 9,3. ప్రభువు ఉత్థాన సమయంలో కన్పించిన దేవదూత బట్టలు తెల్లనివి - మత్త 28,3. మోక్షంలో ప్రభువు సింహాసనం చుట్టూ ఆసీనులైయున్న ఇరువది నల్గురు పెద్దలు తెల్లనిబట్టలను తాల్చి వున్నారు - ప్రక 4,4. ఈ సందర్భాలనుబట్టి జ్ఞానస్నానంలో తెల్లని కండువాను పొందే క్రైస్తవుడు కూడ పిశాచాన్ని పాపాన్నీ జయించి ఒకనాడు దేవుణ్ణి అతని పునీతుల బృందాన్నీ చేరుకొంటాడని అర్థంచేసికోవాలి. ఈ విజయం ఇక్కడే ప్రారంభమై భవిష్యత్తులో మోక్షంలో ముగుస్తుంది.

వివాహపు విందులో పాల్గొనే వాళ్ళకు వివాహపు వస్త్రం అవసరం-మత్త 22,11-12. యూదులు మోక్షాన్ని వివాహపు విందుగా భావించేవాళ్ళు. పై జ్ఞానస్నానపు కండువా ఈ వివాహ వస్త్రాన్నిగూడ తలపిస్తుంది. ఇవన్నీమనలను భావిలో రానున్న మోక్షానికి సిద్ధంచేస్తాయి. జ్ఞానస్నానజీవితం ఇక్కడ ప్రారంభమై మోక్షంలో ముగుస్తుంది. మనం ఈ లోకంలోనే క్రీస్తు విజయంలో పాలుపొందడం మొదలిడతాం. కాని పూర్తి పాలు స్వర్గంలో లభిస్తుంది. ఈ విధంగా ఈ సంస్కారం మనకు భవిష్యత్తుతో గూడ సంబంధం కలిగిస్తుంది.

# ప్రార్థనాభావాలు

1. పూర్వవేద సంఘటనన్నిటిలోను ఐగుప్త నిర్గమనమూ సముద్రోత్తరణమూ నూత్నవేద జ్ఞానస్నానానికి ఎక్కువ చేరువగా వుంటాయని చెప్పాం. ఫరోకు పిశాచానికి పోలికలు చెప్తూ టెర్టూలియను ఈలా వ్రాసాడు. "యిస్రాయేలు ప్రజలు ఫరోదాస్యాన్నుండి తప్పించుకొనివచ్చి సముద్రం దాటారు. ఫరో అతని సైన్యమూ ఆ సముద్రజలాల్లో మునిగి చచ్చారు. ఈ సంఘటనం జ్ఞానస్నానాన్ని సూచిస్తుంది. నూత్నవేద ప్రజలు ఈ లోకమనే ఐగుప్తునుండి వెడలివచ్చి జ్ఞానస్నాన జలాలగుండా ఆవలికి దాటిపోతారు. ఇంతవరకూ వాళ్ళమీద అధికారం నెరపిన పిశాచం ఇప్పుడు ఈ నీళ్ళలో మునిగి చస్తుంది".

ఇంకా ఈ సందర్భంలో బాసిలు భక్తుని వాక్యాలివి. "యిస్రాయేలీయులు సముద్రజలాన్ని దాటకపోతే ఫరోనుండి తప్పించుకొనేవాళ్ళు కాదు. అలాగే మీరుకూడ జలంగుండా నడవకపోతే పిశాచం క్రూరదాస్యంనుండి తప్పించుకోలేరు".

2. ఈ పట్టున ఆంబ్రోసు భక్తుడు ఈలావాకొన్నాడు. "యిస్రాయేలీయులకు సముద్రజలాన్ని దాటడం మహాకార్యం. కాని వాళ్ళలో సముద్రాన్ని దాటిన వాళ్ళుకూడ తర్వాత ఎడారిలో చనిపోయారు. కాని యిపుడీ నీటిబుగ్గగుండా నడచిపోయేవాళ్లు పాపంనుండి జీవానికి, భూలోకంనుండి పరలోకానికీ సాగిపోతారు. వాళ్ళు ఇక చనిపోక జీవానికి ఉత్థానమౌతారు".

3. ఆనాడు ఒక కాంతిమేఘం యిస్రాయేలీయులను సముద్రంగుండా, ఎడారిగుండా నడపించింది. నేడు మన స్నానంలో గూడ ఈ వెలుగు వుంటుంది. ప్రాచీనక్రైస్తవులు జ్ఞానస్నానానికి వాడిన పేర్లలో "వెలుగు" అనేదికూడ ఒకటి. ఈ సందర్భంలో ఆంబ్రోసు భక్తుని పల్కులివి. "యిస్రాయేలీయులను ఒక జ్యోతిర్మేఘం నడిపించిందని వింటున్నాం. ఈ కాంతిమేఘం క్రీస్తే. అతడు మన అజ్ఞానాన్ని తొలగించి మన హృదయాల్లో సత్యజ్యోతిని వెలిగించాడు."

4. యిస్రాయేలీయుల సముద్రోత్తరణానికీ మన జ్ఞానస్నానానికీ చాల పోలికలున్నాయని చెప్పాం. ఈ పోలికలను సిరిల్ భక్తుడు ఈలా వివరించాడు. "అక్కడ ప్రభువుమోషేను ఐగుప్తులోకి పంపాడు. ఇక్కడక్రీస్తుని లోకంలోకి పంపాడు. ఆ ప్రజను ఐగుప్త దాస్యం నుండి విడిపించాలి. ఈ ప్రజను పాపదాస్యం నుండి విడిపించాలి. అక్కడ గొర్రెపిల్ల నెత్తురు వినాశక శక్తిని ఆవలకు పంపించింది.

ఇక్కడ క్రీస్తు నెత్తురు పిశాచాన్ని పారదోలుతుంది. అచ్చట క్రూర నియంతయైన ఫరో ప్రజలను సముద్రంవరకు వెన్నాడాడు.ఇచ్చట సిగ్గులేనిదయ్యం జ్ఞానస్నాన జలాలవరకు భక్తులను వెన్నాడుతుంది. అక్కడ ఒక నియంత సముద్ర జలాల్లో మునిగి చచ్చినట్లే ఇక్కడ మరొక నియంత రక్షణజలాల్లో మునిగిచస్తాడు".

5. పూర్వవేద ప్రజలకు సున్నతి అనేది ఉంది. దానిద్వారానేవాళ్లు దేవుని ప్రజలయ్యారు. నూత్న వేదంలోమనకు జ్ఞానస్నానం సున్నతిలాంటిది. సున్నతి ద్వారా యూదులు పూర్వనిబంధనానికి చెందినట్లే. జ్ఞానస్నానం ద్వారా మనం నూత్న నిబంధనానికి చెందుతాం. ఈ పట్టున సిరిల్ భక్తుని పలుకులివి, "పూర్వం అబ్రాహాము సున్నతిని పొందాడు. జ్ఞాన స్నానంలో మనంకూడ సున్నతిని పొందుతాం. పవిత్రాత్మే మనమీద సిలువగుర్తువేసి మనకు ఈ సున్నతి చేస్తుంది."

# 4. జ్ఞానస్నాన ఫలితాలు

జ్ఞానస్నానంవల్ల మన జీవితంలో గొప్ప మార్పు వస్తుంది. క్రింది అంతస్తులోని నరుడుపై అంతస్తులోనికి ఎక్కిపోయినట్లుగానే, ఈ సంస్కారంద్వారా మనం ప్రాకృతిక జీవితంనుండి ఆధ్యాత్మిక జీవితానికి ఎక్కిపోతాం. ఈ యధ్యాయంలో రెండంశాలు పరిశీలిద్దాం.

## 1. మన సహకారం

జ్ఞానస్నానం దైవకార్యమైనా అది మన సహకారాన్ని కోరుకొంటుంది. ఆగస్టీను భక్తుడు చెప్పినట్లు దేవుడు మన సహకారం లేకుండానే మనలను పుట్టిస్తాడు. కాని మన సహకారం లేందే మనలను రక్షించడు. జ్ఞానస్నానంలో మన సహకారం విశేషంగా పరివర్తనం, విశ్వాసం అనే రెండంశాల మీద ఆధారపడి వుంటుంది. కనుక ప్రస్తుతం ఈ రెండంశాలను పరిశీలిద్దాం.

1) పరివర్తనం. "యెరూషలేము మొదలుకొని సమస్త జాతులకును క్రీస్తు పేరిట పరివర్తనము పాపక్షమాపణము ప్రకటింపబడుతుంది" - ఇది వుత్థాన క్రీస్తు శిష్యులతో చెప్పిన వాక్యం - లూకా 24, 47. అనగా ప్రజలు క్రీస్తుని తలంచుకొని పశ్చాత్తాపడితే పాపక్షమను పొందుతారని భావం. కనుక జ్ఞానస్నానానికి ముందు మన తరపున మనకు పశ్చాత్తాపం వుండాలి. ఆత్మదిగివచ్చాక పేత్రు యెరూషలేము యూదులతో మాటలాడుతూ "మీరు పరివర్తనము చెంది పాపక్షమ కొరకు క్రీస్తు నామాన జ్ఞానస్నానం పొందండి" అని నుడివాడు - అచ 2, 38. కావున మన పాపాల కొరకు పశ్చాత్తాపపడందే జ్ఞానస్నానం ఫలితమీయదు.

నరుడు సృష్టికర్తను విడనాడి సృష్టివస్తువుల దగ్గరికి వెళ్తూంటాడు. దుడుకుచిన్నవాడు తన్ను అనురాగంతో చూచే తండ్రిని కాదని దూరదేశాలకు వెళ్ళాడు. నిత్యజీవితంలో మనమూ ఈలాగే చేస్తాం. దేవుని నుండి వైదొలగి లోకవస్తువుల దగ్గరికి వెళ్తూంటాం. బైబులు బోధల ప్రకారం పాపం అంటే యిదే.

ఇక, పరివర్తనమంటే, ఆ సృష్టి వస్తువుల నుండి మళ్ళా దేవుని దగ్గరికి తిరిగిరావడం. దుడుకుచిన్నవాడు మళ్ళా తండ్రిదగ్గరికి తిరిగివచ్చాడు. మనమూ అనురాగమయుడైన దేవుని దగ్గరికీ, అతడు పంపిన క్రీస్తుదగ్గరికీ తిరిగిరావాలి. ఇదే పశ్చాత్తాపం.

ప్రభువు పిశాచాన్ని ఓడించాడు – యోహా 12,31. ఐనా ఈ ఇహలోక యాత్రలో పిశాచం మనలను శోధిస్తూనే వుంటుంది. మనలను తన పక్షానికి ఆకర్షించుకొంటూనే వుంటుంది. ఎప్పుడూ యిద్దరు నాయకులు మనలను బలంగా ఆకర్షిస్తారు. ఒకవైపు క్రీస్తూ, మరోవైపు పిశాచమూ. మనం పిశాచపక్షాన్ని విడనాడి క్రీస్తు పక్షాన్ని అవలంబించగలిగి వుండాలి. జ్ఞానస్నాన సమయంలో గురువు నీవు పిశాచాన్నీ దాని ఆడంబరాలనూ విసర్జిస్తావా అని అడిగితే మనం విసర్జిస్తాను అని జవాబు చెప్తాం. ఈ జవాబుని నిత్యజీవితంలో జీవించడమే యథార్థమైన పరివర్తనం ఔతుంది. ఇంకా, ఈ పరివర్తనాన్ని బలపరచడానికే జ్ఞానస్నాన సమయంలో మనచేత పిశాచ విసర్జన ప్రమాణం చేయిస్తారు. గురువుపిశాచాన్ని పారద్రోలే జపాలు జపిస్తారు. క్రీడాకారులకులాగ మనకు గూడ తైలంతో అభ్యంగనం చేయిస్తారు. మనం ఈ పుణ్యక్రియల బలంవల్లా, సొంత ప్రార్థనవలని బలంవల్లా చిత్త శుద్ధితో పశ్చాత్తాపడి జ్ఞానస్నానాన్ని స్వీకరించాలి.

2) విశ్వాసం. ఫిలిప్పు ఇతియోపీయ ఉద్యోగి రథంమీదికెక్కి కూర్చుండి అతనికి క్రీస్తుని గూర్చి బోధించాడు. ఆ యుద్యోగి తనకు జ్ఞానస్నానమీయమని అడిగాడు. ఫిలిప్పు నీవు పూర్ణహృదయంతో ప్రభువుని విశ్వసిస్తే ఆసంస్కారాన్ని పొందవచ్చు అనిచెప్పాడు. ఆ ఉద్యోగి నేను క్రీస్తు దేవుని కుమారుడని విశ్వసిస్తూనే వున్నాను అని బదులు చెప్పాడు అప్పుడు ఫిలిప్పు అతనికి జ్ఞానస్నానమిచ్చాడు – అచ 8, 35–37. కనుక జ్ఞానస్నానాన్ని యోగ్యంగా పొందాలంటే క్రీస్తుని విశ్వసించాలి. ఇంకా ఉత్థానక్రీస్తు "విశ్వసించి జ్ఞానస్నానం పొందినవాడు రక్షణం పొందుతాడు. విశ్వసించనివానికి శిక్ష తప్పదు" అని వాకొన్నాడు – మార్కు 16,16.

జ్ఞానస్నాన తంతులో గురువు మనలను "మీరు శ్రీసభనుండి ఏమి కోరుతున్నారు?" అని ప్రశ్నిస్తారు. మనం విశ్వాసాన్ని అని బదులు చెప్తాం. కనుక జ్ఞానస్నానాన్ని స్వీకరించాలంటే విశ్వాసం వుండాలి. ఈ సందర్భంలో భక్తుడు జెరోము ఈలా వ్రాసాడు. "అపోస్తలులు మొదట

ఆయా జాతులకు బోధచేసేవాళ్లు. అటుతరువాత తమ బోధను వినినవారికి నీటితో జ్ఞానస్నానమిచ్చేవాళ్ళు. ఆత్మలో విశ్వాసం నెలకొనిన పిదపగాని దేహాన్ని నీటితో కడగడమనేది జరుగదు". ఇంకా బాసిల్ భక్తుడు ఈలా వాకొన్నాడు. "రక్షణానికి విశ్వాసమూ జ్ఞానస్నానమూ రెండు అవసరమే. మొదట హృదయంలో విశ్వాసం పుడుతుంది. మనలను రక్షించేది ఆ విశ్వాసమే. అటుపిమ్మట జ్ఞానస్నానం పొందుతాం. ఈ తంతు మన విశ్వాసాన్ని సురక్షితం చేస్తుంది".

జ్ఞానస్నానం పొందడానికి విశ్వాసం అవసరమని చెప్పాము. కాని వేదాంతులు జ్ఞానస్నానం విశ్వాసాన్ని దయచేసే సంస్కారమని చెప్తారు. మన హృదయంలో జ్ఞానస్నానానికి ముందే విశ్వాసముంటే, ఆ జ్ఞానస్నానం మళ్లా మనకు విశ్వాసాన్ని దయచేయడం ఏలా జరుగుతుంది?

ఈ సంస్కారం ద్వారా మన విశ్వాసమేమో తప్పక పెరుగుతుంది. బలపడుతుంది. ఇది ఏలాగు?

1. అన్ని సంస్కారాల్లాగే జ్ఞానస్నానంకూడ శ్రీసభ నెరవేర్చే కార్యం. ఈ శ్రీసభ క్రీస్తుని విశ్వసించి, క్రీస్తు పేరట సంస్కారాన్ని జరుపుతుంది. కనుక జ్ఞానస్నానం పొందే వాళ్ళమీద శ్రీసభ విశ్వాసం సోకుతుంది. ఆ తల్లి విశ్వాసం తన బిడ్డలకు సంక్రమిస్తుంది. ఈ విధంగా మన విశ్వాసం పెరుగుతుంది.

2. జ్ఞానస్నానం పొందే వ్యక్తికి ఆ సంస్కారాన్ని స్వీకరించకముందే క్రీస్తునందు కొంత విశ్వాసముంటుంది. అతడు ఈ సంస్కారాన్ని పొందేప్పుడు విశ్వాస సంగ్రహజపాన్ని జపిస్తాడు. ముగ్గురు దైవవ్యక్తులను నమ్ముతున్నానని ప్రమాణం చేస్తాడు. దీనివల్ల అతనిలో విశ్వాసముందనే అనుకోవాలి.కాని జ్ఞానస్నానానికి పూర్వం భక్తుని హృదయంలో పుట్టిన ఈ విశ్వాసం, అతడు తర్వాత పొందబోయే జ్ఞానస్నాన సంస్కారాన్ని బట్టే పుట్టింది. క్రీస్తు శ్రీసభలో నెలకొల్పిన జ్ఞానస్నాన సంస్కారం ద్వారా ఈ నరులు యథార్థంగా శ్రీసభలో చేరతారు. కనుక మొదట వాళ్ళ హృదయంలో క్రీస్తుపట్ల విశ్వాసం పుడుతుంది. తర్వాత వాళ్ళు ఈ సంస్కారాన్ని స్వీకరించి క్రీస్తు శిష్యులౌతారు. అందుచేత జ్ఞానస్నానాన్ని స్వీకరించని విశ్వాసం పరిపూర్ణమైనది కాదు. ఇంకా శ్రీసభలో జ్ఞానస్నానమనేది లేకపోతే అసలు మన హృదయంలో విశ్వాసమే పుట్టదు. లూతరు జ్ఞానస్నానం కాదు. విశ్వాసం మనలను రక్షిస్తుంది అన్నాడు. ఇది పొరపాటు. విశ్వాసం దానంతట అది మనలను రక్షించదు. మనలను జ్ఞానస్నానం వైపు త్రిప్పుతుంది కనుకనే అది మనలను రక్షిస్తుంది.

ఫలితాంశమేమిటంటే, జ్ఞానస్నాన సంస్కారమే మొదట మనలో విశ్వాసం పుట్టించి మనలను క్రీస్తువైపు ఆకర్షిస్తుంది. కనుక మనం ఆ సంస్కారాన్ని పుచ్చుకొంటాం. ఆలా పుచ్చుకొన్న పిదప ఆ పూర్వ విశ్వాసం ఇంకా పెరుగుతుంది.

3. జ్ఞానస్నాన సంస్కారం మన విశ్వాసాన్ని పెంచేదైతే, చిన్నబిడ్డల్లో ఈ కార్యం ఏలా నెరవేరుతుంది? పసిబిడ్డల్లో విశ్వాసం ఏలా వుంటుంది? దాన్ని వాళ్ళు బయటికి ఏలా వ్యక్తం చేస్తారు?

జ్ఞానస్నానం పొందే చిన్నబిడ్డమీద మొదట శ్రీసభ విశ్వాసం సోకుతుంది. తర్వాత తల్లిదండ్రులు జ్ఞాన తల్లిదండ్రులు మొదలైనవాళ్ల విశ్వాసం బిడ్డమీద సోకుతుంది. అటుపిమ్మట జ్ఞానస్నాన సంస్కారం దయచేసే విశ్వాసం ఆ బిడ్డ హృదయంలో బీజంలా పుడుతుంది. బిడ్డకు ప్రాయమొచ్చే కొద్దీ తల్లిదండ్రుల కృషివల్లా, బిడ్డ స్వీయకృషివల్లా ఈ బీజం మొలకెత్తి ఫలిస్తుంది.

బిడ్డ తన విశ్వాసాన్ని స్వయంగా వ్యక్తం చేయలేకపోయినా, తల్లిదండ్రులూ జ్ఞాన తల్లిదండ్రులూ ఆ బిడ్డ విశ్వాసాన్ని వ్యక్తం చేయగలరు. కనుకనే ఆగస్టీను భక్తుడు ఈలా వాకొన్నాడు "చిన్నబిడ్డలకు తల్లియైన తిరుసభ ఇతరుల కాళ్ళను దయచేస్తుంది. కనుక ఆ బిడ్డలు నడచి వస్తారు. ఇతరుల హృదయాలను దయచేస్తుంది. కనుక వాళ్ళు నమ్ముతారు. ఇతరుల నాలుకను దయచేస్తుంది. కనుక వాళ్ళు తమ విశ్వాసాన్ని ప్రకటిస్తారు. బిడ్డను మోసికొని వచ్చే వ్యక్తి ఆ బిడ్డ తరపున జవాబు చెప్తాడు. పూర్వం ఒక నరుని చెయిదంవల్ల ఆ బిడ్డకు గాయం తగిలింది. ఇప్పుడు మరొక నరుని వాక్యం వలన ఈ శిశువుకి ఆరోగ్యం కలుగుతుంది. ఈ బిడ్డడు క్రీస్తుని విశ్వసిస్తాడా అని జ్ఞానస్నానమిచ్చే గురువు ప్రశ్నిస్తాడు. బిడ్డను మోసికొని వచ్చినవ్యక్తి యితడు విశ్వసిస్తున్నాడు అని జవాబు చెప్తాడు. అది చాలు". ఈ వాక్యంలో అగస్టీను ఉద్దేశించిన "ఇతరులు" తల్లిదండ్రులూ, జ్ఞానతల్లిదండ్రులూను.

జ్ఞానస్నాన సంస్కారం ఆ సంస్కారాన్ని పొందక ముందే మన హృదయంలో విశ్వాసాన్ని పుట్టిస్తుందని చెప్పాం. ఆ సంస్కారాన్ని పొందాక అది యీ విశ్వాసాన్ని ఇంకా పెంచుతుందని గూడ చెప్పాం. కనుకనే వేదశాస్త్రులు ఇది విశ్వాసాన్ని దయచేసే సంస్కారమని వాకొన్నారని గూడ తెలియజేసాం. కనుక దీనిలో విశ్వాసం అతి ముఖ్యం. కొంతమంది కక్కుర్తికొద్దీ ఎవరికిబడితే వాళ్ళకు జ్ఞానస్నానమిస్తుంటారు. మేమింతమందికి జ్ఞానస్నానమిచ్చాము చూడండని వట్టిసంఖ్యలు చూపించుకొని మురిసిపోతుంటారు. ఇది చెడ్డ పద్ధతి. తగినంత విశ్వాసం లేనివాళ్ళకు త్వరపడి జ్ఞానస్నానం ఈయకూడదు. విశేషంగా పల్లెల్లో ఓ కుటుంబంవాళ్ళంతాగాని, ఇంకా చాల కుటుంబాలవాళ్ళు మూకుమ్మడిగా గాని, జ్ఞానస్నానం పొందేపుడు ఈ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించి చూడాలి. ప్రతివ్యక్తికీ తగినంత విశ్వాసముంటేనేగాని జ్ఞానస్నానం ఈయకూడదు.

## 2. జ్ఞానస్నాన ఫలితాలు

జ్ఞానస్నాన ఫలితాలు చాలా వున్నాయి. ప్రస్తుతానికి ఆరింటిని పేర్కొందాం. కాని వీటిని ఆరుగా విభజించి చూపించినా, ఇవన్నీ ఒకే ఫలితం అని చెప్పడం సబబు.

### 1. జ్ఞానస్నానం మనలను శ్రీసభలో చేరుస్తుంది.

జ్ఞానస్నానం చేసే మొదటిపని, మనలను శ్రీసభలోనికి చేర్చి ఆ సభ సభ్యులనుగా చేయడం. యూదులమైనా గ్రీసు దేశీయులమైనా, దాసులమైనా, స్వతంత్రులమైనా, మన మందరమూ ఒక్క శరీరంలోనికి జ్ఞానస్నానం పొందుతాం అన్నాడు పౌలు - 1కొరి 12, 13. ఈ వొక్క శరీరం తిరుసభే. ఇంకా అతడు శరీరమొక్కటే, ప్రభువొక్కడే, విశ్వాస మొక్కటే, జ్ఞానస్నానమొక్కటే అని కూడ వాకొన్నాడు - ఎఫే 4, 4-5. అనగా జ్ఞానస్నానం ద్వారా మనం ఒకే క్రీస్తులోనికీ, ఒకే తిరుసభలోనికీ చేరిపోతామని భావం.

"మొట్టమొదట వచ్చే సంస్కారం జ్ఞానస్నానం. అది ఆధ్యాత్మిక జీవితానికి ద్వారం లాంటిది. దాని ద్వారా మనం క్రీస్తుదేహానికి అవయవాల మౌతాం. అతని దేహమైన శ్రీసభలో సభ్యులమౌతాం" అని బోధించింది ఫ్లోరెన్సు మహాసభ. ట్రెంటు మహాసభకూడ "జ్ఞానస్నానం ద్వారా నరుడు మొదటిసారిగా శ్రీసభలో చేరతాడు" అని వాకొంది.

కనుక ఈ సంస్కారం ద్వారా మనం ఈ సభ సభ్యులమౌతాం. ఆ సభ సభ్యుల హక్కులనూ బాధ్యతలనూ గూడ పొందుతాం. ప్రభువు ఆరాధనలో పాల్గొంటూ ఇతర సంస్కారాలను గూడ స్వీకరించడానికి అర్హులమౌతాం.

గురువు జ్ఞానస్నానం పొందిన వ్యక్తిపేరును స్థానిక దేవాలయపు రిజిస్టరులో వ్రాస్తారు. ఇది మనం తిరుసభలో చేరామనడానికి గుర్తు. పూర్వం రోమను సొరంగాల్లో మంచి కాపరి తన గొర్రెల మందను తన చుట్టూ ప్రోగుజేసికొని వున్నట్లుగా చిత్రించారు. ఈ మందే శ్రీసభ. అనగా మనం ఈ సంస్కారం ద్వారా ఈ మందలోనికి, ఇది సూచించే శ్రీసభలోనికీ చేరతామని ప్రాచీన క్రైస్తవుల భావం. ఇంకా, జ్ఞానస్నానం పొందిన క్రైస్తవులు గుడిలోనికి ప్రవేశించి మొదటిసారిగా పూజలో పాల్గొని దివ్యసత్ప్రసాదం పుచ్చుకొంటారు. ఈ దివ్యభోజనం క్రైస్తవ ప్రజలను ఐక్యపరచే సాధనం. ఈ క్రియ ద్వారా గూడ ఆ ప్రజలు క్రైస్తవ సమాజంలోనికీ శ్రీసభలోనికీ ప్రవేశించారని సూచించినట్లువుతుంది.

శ్రీసభ క్రీస్తు ఆధ్యాత్మిక దేహం. ఆ సభ పవిత్ర కన్యా పవిత్రమాతా కూడ. ఆమె కన్యమాతగానే జ్ఞానస్నానమార్గాన మనలను కంటుంది. మనకు దివ్య జీవనాన్ని ప్రసాదిస్తుంది. కనుక ఈ సంస్కారం ద్వారా ఈ సభ నిరంతరమూ పెరుగుతూంటుంది.

ఒకమారు శ్రీసభలో చేరాక మనం పాపంచేసి దివ్యజీవనాన్ని పోగొట్టుకొంటే, ఆ తల్లి తన యాజకులైన గురువుల పరిచర్య ద్వారా మనకు పాపోచ్చారణ సంస్కారాన్ని దయచేస్తుంది. ఆ కరుణాకార్యంవల్ల మనంపోగొట్టుకొన్న దివ్య జీవనాన్ని మళ్ళా సంపాదించుకొంటాం.

శ్రీసభలో ప్రవేశించిన క్రైస్తవులకు గొప్ప బాధ్యతలున్నాయి. వాళ్ళు స్వయంగా పవిత్రజీవితం జీవిస్తూ శ్రీసభ పవిత్రతకు సాక్ష్యంగా వుండాలి. ఈ పవిత్ర జీవితం ద్వారానే ఇతరులను గూడ శ్రీసభలోనికి ఆకర్షిస్తూండాలి. ఆసభను నిరంతరమూ పెంచుతూండాలి. ఇంకా శ్రీసభలోని సభ్యులంతా పరస్పరం ఐక్యమై ప్రేమజీవితం జీవించాలి. ఈ యైక్యతకీ ప్రేమకీ చిహ్నంగా వుండేది దివ్యసత్ప్రసాదం. కనుక క్రైస్తవులు ఈ సంస్కారాన్ని యోగ్యంగా స్వీకరించి శ్రీసభ ఐక్యతను పెంచాలేగాని అంతఃకలహాలతో విభజనలు తెచ్చిపెట్టకూడదు. జాతులూ వర్గాలూ కులాలతో కూడిన మనదేశంలో ఈ బెడద యెప్పుడూ వుండనే వుంటుంది. పౌలు క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినవాళ్ళంతా క్రీస్తుని ధరిస్తారని చెప్పాడు. ఇక వాళ్ళలో యూదుడనీ గ్రీసు దేశీయుడనీ, దాసుడనీ స్వతంత్రుడనీ, పురుషుడనీ స్త్రీ అనీ తారతమ్యాలు ఉండకూడదన్నాడు. క్రీస్తునందు మనమందరమూ ఐక్యమౌతామన్నాడు - గల 4,27-28. అనగా క్రైస్తవులమైన మనలో ఆ కులం ఈ కులం అనే భేదముండకూడదు. ధనికులూ దరిద్రులనే భేదం వుండకూడదు. స్త్రీ పురుషులనే లింగభేదమూ వుండకూడదు. కాని నేడు మనం ఈ సూత్రాలను ఎంతవరకు పాటింపగల్గుతున్నాం?

జ్ఞానస్నానం ద్వారా మనం శ్రీసభలోనికి ఐక్యమౌతామని చెప్పాం. కాని ఆ శ్రీసభ ఎల్లప్పుడూ మోక్ష క్రీస్తువైపు ముఖం త్రిప్పి వుంటుంది. కనుక ఈ లోకంలో జీవించే మనం కూడ మోక్షంవైపు మనసు త్రిప్పుతూండాలి. "మనకిక్కడ నిలవరమైన పట్టణంలేదు. మన నిజపట్టణం మోక్షమే" - హెబ్రె 13,14. ఈ లోకంలో మనం కేవలం యాత్రికులం. మన గమ్యస్థానం మోక్షం. అందుకే మన దృష్టి ఎప్పుడు కూడ అక్కడుండాలి.

## 2. జ్ఞానస్నానం మనలను క్రీస్తుతో ఐక్యం చేస్తుంది.

క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినవాళ్ళు ఆయనతో చనిపోయి ఆయనతో జీవిస్తారు - రోమా 6, 3.8. ప్రభువులోనికి జ్ఞానస్నాన పొందినవాళ్ళు ఆయన శరీరమై ఆయన అవయవాలౌతారు - 1 కొరి 12,27. ఆయనలోనికి జ్ఞానస్నానం పొందినవాళ్ళు ఆయనతో ఏకమౌతారు- గల 3,28. ఈ వాక్యాలన్నీ మనం క్రీస్తుతో ఐక్యమౌతామని రుజువుచేస్తాయి. ఈ యైక్యత జ్ఞానస్నానం వల్లనే సిద్ధిస్తుంది. ఈయైక్యతను సూచించడానికే

జ్ఞానస్నానం పొందేవ్యక్తిని గురువు క్రీస్తుకి గుర్తుగా వుండే క్రిస్మాతైలంతో అభిషేకిస్తారు. ఆయన తలమీద ఆ తైలంతో సిలువగుర్తు వేస్తారు. ఆ మీదట ఆ వ్యక్తి క్రీస్తుతో ఐక్యమై ఆయన సిలువను భరిస్తాడు.

జ్ఞానస్నానంవల్ల మన జీవితం క్రీస్తుజీవితాన్ని పోలిందవుతుంది. అనగా క్రీస్తు మరణోత్థానాలు మనలోకూడ ప్రత్యక్షమౌతాయి. పౌలు దృష్టిలో క్రైస్తవ జీవితమంటే జ్ఞానస్నాన జీవితాన్ని సంపూర్ణంగా జీవించడమే. ఈ సంస్కారం ద్వారా మనం పాత జీవితాన్ని విడనాడి నూత్నజీవితాన్ని, అనగా క్రీస్తుజీవితాన్ని జీవించడం మొదలిడతాం. ఈ నూత్నజీవితానికి తగ్గట్టుగా మన చేతలు గూడ నూత్నంగానే వుండాలి. పౌలు మాటల్లో చెప్పాలంటే మనం క్రీస్తుని ధరిస్తాం - గల4 ,27. ఫలితంగా నూత్న జీవితం జీవిస్తాం - రోమా 6,4, మన యీ దేహంలో క్రీస్తు మరణాన్ని భరించే మనం ఆయన జీవాన్ని కూడ భరిస్తాం - 2 కొరి 4,10.

జ్ఞానస్నానంవల్ల మన జీవితం క్రీస్తు జీవితానికి పోలికగా తయారౌతుందని చెప్పాం. ఈ పోలిక మన జీవితాంతమూ వుంటుంది. మన మరణం ఈ పోలికలో చివరిమెట్టు. జ్ఞానస్నాన బలంవల్ల మన మరణం ఆ ప్రభువు మరణాన్ని పోలినదౌతుంది. ఆయన దివ్యమరణం మన మరణంమీదసోకి దాన్ని ఫలభరితం చేస్తుంది. కనుక మరణం తర్వాత మనకు ఉత్థాన భాగ్యం సిద్ధిస్తుంది. పాప ఫలితం మరణం. కాని ఆ మరణమే ప్రభువైన క్రీస్తు ద్వారా మనకు నిత్యజీవితాన్ని దయ చేస్తుంది - రోమా 6, 23.

జ్ఞానస్నానం ద్వారా క్రీస్తు మరణంలో పాలుపొంది ఆయనతో ఐక్యమౌతామనే సత్యాన్ని తిరుసభలో రెండుజీవిత విధనాలు విశేషంగా రుజువుచేస్తాయి. అవి వేదసాక్షిమరణం, సన్యాస జీవితం.

వేదసాక్షిగా మరణించడమంటే ప్రేమభావంతో క్రీస్తు మరణాన్ని ఆహ్వానించడమే. కనుక ఆమరణం మనలను సిలువమరణం చెందిన క్రీస్తుతో ఐక్యంచేస్తుంది. అసలు వేదసాక్షిగా మరణించే వ్యక్తిలో క్రీస్తే మరణిస్తాడు. కనుకనే పెర్పెత్తువా అనే భక్తురాలు వేదసాక్షిగా మరణిస్తూ "ఇంతకు ముందు నేను హింసలనుభవించాను. కాని ఇప్పుడు క్రీస్తే నాలో హింసలనుభవిస్తాడు" అని వాకొంది.

వేదహింసలు అడుగంటాక శ్రీసభలో వేదసాక్షి మరణం అరుదైపోయింది. దానిస్థానే సన్యాస జీవితం వచ్చింది. వేదసాక్షి ఒక్కక్షణంలో ప్రాణత్యాగం చేస్తే సన్యాస జీవితం గడిపేవాళ్ళు జీవితమంతా ప్రాణత్యాగం చేయవలసివుంటుంది. కనుక ఈ జీవితం కూడ క్రీస్తు మరణంలో పాలుపొందడమే ఔతుంది.

## 3. జ్ఞానస్నానం మనలను దత్తపుత్రులను చేస్తుంది

సమస్తజాతి జనులకూ పిత పుత్ర పవిత్రాత్మల నామంలోనికి జ్ఞానస్నాన మీయండని శిష్యులను ఆదేశించాడు ఉత్థాన క్రీస్తు - మత్త 28,19. ముగ్గురు దైవవ్యక్తుల "నామంలోనికి" జ్ఞానస్నానం పొందినవాళ్ళు ఆ దివ్యవ్యక్తులకు అంకితమౌతారు. ఆ దివ్యవ్యక్తుల దివ్యకుటుంబానికి చెందిపోతారు. ఇదే దత్తపుత్రత్వం.

క్రీస్తు తండ్రికి సహజపుత్రుడు. మనం అతనిలోనికి జ్ఞానస్నానం పొందినప్పుడు ఆయన పుత్రత్వం మనమీద సోకి మనలను కూడ పుత్రులను చేస్తుంది. ఆయన ద్వారా ఆయన తండ్రికి మనం కూడ పుత్రులమౌతాం. క్రీస్తు తండ్రికి సహజపుత్రుడైతే మనం దత్తపుత్రులమౌతాం - అంతే వ్యత్యాసం. ఇక, క్రీస్తుద్వారా మనలను తండ్రికి పుత్రులనుగా మార్చే వ్యక్తి పవిత్రాత్మ. ఆ యాత్మ మన హృదయాల్లో వుండి మనం దేవుణ్ణి "అబ్బా" - అనగా నాన్నా అని పిలిచేలా చేస్తుంది. మీరు దేవుని బిడ్డలుసుమా యని ఆ యాత్మ నిత్యం మన హృదయంలో ఘోషిస్తూంటుంది. పూర్వవేదంలోని యూదులు తాము దేవుని దాసులమనుకొన్నారు గాని బిడ్డలమనుకో లేదు. నూతనవేదంలో జ్ఞానస్నానం ద్వారా బిడ్డలమయ్యే భాగ్యం మనకు ప్రత్యేకంగా లభిస్తుంది. ఇక, దేవుని బిడ్డలకు దేవుని వారసం లభిస్తుంది. అదే మోక్షభాగ్యం. జ్ఞానస్నానం వల్ల క్రీస్తు మరణోత్థానాలలో పాలుపొందేవాళ్లు కడన ఆ క్రీస్తు వారసాన్ని కూడ పొందుతారు. - రోమా 8, 14-17.

దేవుని దత్తపుత్రులమైన మనం ఈ లోకంలో ఆ దేవుని జీవితమే జీవించాలి. దేవుని జీవితం ప్రధానంగా ప్రేమ జీవితం. అతడు ప్రేమమయుడు - 1యోహా 4,8. కనుకన దత్తపుత్రులమైన మనంకూడ ప్రేమజీవితం జీవించడం అలవాటు చేసికోవాలి. ఈ ప్రేమజీవితం దైవప్రేమ సోదరప్రేమ అనే రెండు రూపాల్లో వుంటుంది. ఇక, ఈ ప్రేమజీవితాన్ని గడిపే శక్తిని మనకు దయచేసేదికూడ పవిత్రాత్మే.

ఇక్కడే జ్ఞానస్నానానికీ ఆత్మకీ వుండే సంబంధాన్ని కూడ వివరించాలి. మనం జ్ఞానస్నానం ద్వారా ఆత్మను సమృద్ధిగా పొందుతాం. ఈ సంస్కారాన్ని పొందినప్పటినుండి ఆత్మ ఓ దేవాలయంలోలాగ మన హృదయంలో వసించడం మొదలు పెడుతుంది - 1 కొరి 6,19. మనలను దేవునిబిడ్డలనుగా మార్చి తన ప్రేరణతో నడిపిస్తూంటుంది - రోమా 8,14. మనకు తన ఫలాలను దయచేస్తుంది - గల 5,22. విశ్వాసం. నిరీక్షణం, దైవప్రేమ అనే దైవపుణ్యాలను ప్రసాదిస్తుంది. ఈ మూడింటిలో మళ్ళా ప్రేమ ముఖ్యమైంది. ఈ ప్రేమ దైవప్రేమ సోదర ప్రేమకూడ. ఆత్మ ఈ ప్రేమను మన హృదయాల్లో సమృద్ధిగా కుమ్మరిస్తుంది, బొక్కెనతో మొక్కకు నీళ్లు పోసినట్లుగా - రోమా 5,5. ఇంకా ఆత్మ

మనకు నానా వరాలను దయచేస్తుంది - 1కొరి 12, 4-11. ఈలా మన దత్తపుత్రత్వం, ప్రేమజీవితం, మోక్షభాగ్యానికి వారసులం కావడం మొదలైన భాగ్యాలన్నీ ఆత్మద్వారానే సిద్ధిస్తాయి.

## 4. క్రీస్తు మూడుగుణాల్లో పాలుపొందుతాం

జ్ఞానస్నాన సంస్కారం చివరలో గురువు అభ్యర్థి శిరస్సును క్రిస్మాతైలంతో అభిషేకించి సిలువగుర్తు వేస్తారు. దీనివల్ల అభ్యర్థిమీద ఓ ముద్ర పడుతుంది. ఈ ముద్రను గూర్చే పౌలు "మీరు వాగ్దానం చేయబడిన ఆత్మచేత ముద్రింప బడ్డారు" అని పేర్కొన్నాడు. - ఎఫె 1,13. ఇక్కడభావం ఇది. పూర్వం గ్రీకు రోమను దేశాల్లో బానిసలమీదా జంతువుల మీదా యజమానునిముద్ర వేసేవాళ్ళు. సైనికులమీద రాజుముద్ర వుండేది. భక్తులమీద వాళ్ళు కొల్చే దేవతముద్ర వుండేది. ఈలాగే జ్ఞానస్నానానికి ముందు మనమీద పిశాచముద్ర వుంటుంది. ఈ సంస్కారంలో పవిత్రాత్మ మనమీద క్రీస్తుముద్ర వేస్తుంది. ఆ మీదట మనం పిశాచమనే యజమానునికిగాక క్రీస్తనే యజమానునికి చెందినవాళ్ళ మౌతాం.

ఇది చెరగిపోని అక్షయమైన ముద్ర. కనుకనే ఒకసారి యోగ్యంగా జ్ఞానస్నానం పొందినవాళ్ళు దాన్ని మళ్ళా పొందరు. మూడవ శతాబ్దంనాటికే తిరుసభలో ఈ నియమం అమలులోనికి వచ్చింది. నరుడు చావైన పాపంచేసినా, మత పరిత్యాగం చేసినాకూడ ఈ ముద్ర చెరగిపోదు. అదికాల్చిన ఇనుపకడ్డీతో చర్మంపై వేసిన ముద్రకంటె ఇంకా దృఢంగా నిలుస్తుంది. ఈ ముద్ర వరప్రసాదాన్ని సూచిస్తుంది. కనుక పాపి పాపంవల్ల వరప్రసాదాన్ని పోగొట్టుకొన్నా, మళ్ళా పశ్చాత్తాపపడగానే పూర్వవరప్రసాదాన్ని పొందుతాడు. ఈ ముద్రద్వారానే మనం క్రీస్తులోనికి ఐక్యమై ఆయన్ని పోలినవాళ్ళ మౌతాం.

ఇక, క్రీస్తులో మూడు గుణాలున్నాయి. ఆయన్ని రాజు, యాజకుడు, ప్రవక్త. ఈ గుణాలను పొందడానికి ప్రభువు మూడు అభిషేకాలను స్వీకరించాడు. అసలు ఆయన పేరుకే అభిషేకం పొందినవాడని అర్థం. మెస్సియా అనే హీబ్రూ పదానికీ, క్రీస్తు అనే గ్రీకుమాటకీ అభిషిక్తుడని భావం. పూర్వం యూదులు రాజులనీ ప్రధానయాజకులనీ అభిషేకించేవాళ్ళు. అభిషేకంద్వారా దేవుడు ఆ భక్తులను ఈ పదవుల్లోనియమించేవాడు. అలాగే తండ్రి కుమారుణ్ణి తన ప్రతినిధిగా ఈలోకంలోకి పంపాడు. కుమారుణ్ణి ప్రతినిధి పదవిలో నియమిస్తూ ఆయనకు అభిషేకం చేసాడు. కనుక ఆ కుమారునికి మెస్సీయా, లేక క్రీస్తు, లేక అభిషిక్తుడు అని పేరు.

ఇక, క్రీస్తు పొందిన మూడభిషేకాలు ఇవి. ఉత్థాన సమయంలో తండ్రి ఆయన్ని రాజుగా అభిషేకించాడు. - అచ 2, 36. మనుష్యావతారమెత్తిన సమయంలో యాజకుడుగా

అభిషిక్తుడయ్యాడు. ఇక్కడ దైవవార్తే తాను చేకొన్న మానవ దేహానికీ అభిషేకం చేసింది - హెబ్రే 2, 17-18. జ్ఞానస్నానం పొందిన సమయంలో పవిత్రాత్మ ఆయన్ని ప్రవక్తగా అభిషేకించింది - మత్త 3, 16.

మనం జ్ఞానస్నానం పొందినపుడు రాజు, యాజకుడు, ప్రవక్త ఐన క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందుతాం. కనుక క్రీస్తుకి వర్తించే పై మూడు గుణాలూ మనకుగూడ సంక్రమిస్తాయి. వీటిల్లో యాజకత్వం చాల ముఖ్యమైంది. ఇక్కడ ఈ మూడు లక్షణాలను క్రమంగా పరిశీలిద్దాం.

1) యాజకత్వం. క్రీస్తు యాజకత్వాన్ని పొంది మనమందరమూ యాజకులమౌతాం. దీని ద్వారా దేవుణ్ణి పూజించి ఆరాధించే శక్తిని పొందుతాం. క్రీస్తు జీవితం ప్రధానంగా ఆరాధనాత్మకమైంది. ఆయన నిరంతరమూ తండ్రిని ఆరాధిస్తూ జీవించేవాడు. కడన సిలువమీద ఆ తండ్రి చేతుల్లోనికే ఆత్మార్పణం చేసికొన్నాడు. జ్ఞానస్నానంద్వారా మనం కూడ ఆరాధకుడైన క్రీస్తునందు ఆరాధకుల మౌతాం. మన ఆరాధనను ఇప్పుడు ప్రధానంగా పూజబలితో నిర్వర్తిస్తాం. జ్ఞానస్నానంద్వారా క్రీస్తులోనికి ఐక్యమైనవాళ్ళంతా ఒక్క ఆరాధనా సమాజమౌతారు. క్రీస్తుతో ఐక్యమై ఆయన ద్వారా తండ్రిని కొలుస్తారు.

నూత్నవేదంలో జ్ఞానస్నానం పొందిన వాళ్ళంతా యాజకులౌతారు. కాని మనకు రెండు యాజకత్వాలున్నాయి. మొదటిది జ్ఞానస్నాన యాజకత్వం. ఇది అందరికీ సంక్రమిస్తుంది. రెండవది పరిచర్యకొరకు కొందరు ప్రత్యేకంగా పొందే యాజకత్వం. దీన్నే గురుపట్టం అంటాం. గురువులు శ్రీసభకు శిరస్సయిన క్రీస్తుకి ప్రతినిధులుగావుండి క్రైస్తవ సమాజానికి సేవలు చేస్తూంటారు. ప్రస్తుతం మనకు ప్రస్తావించేది మొదటి రకం యాజకత్వాన్ని మాత్రమే.

ఈ యాజకత్వం మనకు జ్ఞానస్నానపు ముద్రనుండే సంక్రమిస్తుంది. పూర్వవేదంలో యిస్రాయేలు ప్రజలంతా యాజకులు. ఎన్నికద్వారాను సీనాయి నిబంధనం ద్వారాను వాళ్ళకు ఆ భాగ్యం లభిస్తుంది. ప్రభువు వాళ్ళతో "మీరు నాకు యాజకులూ, పవిత్ర ప్రజా ఔతార"ని చెప్పాడు - నిర్గ 19,6. వాళ్ళు యావే యాజకులూ, ప్రభువు పరిచారకులూ అని పిలువబడతారు అని చెప్పాడు - యెష 61, 6. నూత్న వేదంలో మనం జ్ఞానస్నానంద్వారానే ఈ యాజకత్వం పొందుతాం. కనుకనే పేత్రు మొదటిజాబు జ్ఞానస్నానం పొందినవాళ్ళ నుద్దేశించి "మీరు ఎన్నుకోబడిన ప్రజలు, శ్రేష్ఠయాజక సమూహం, పరిశుద్ధ జనం, దేవునిచే కొనబడిన ప్రజలు" అని చెప్తుంది. అనగా పూర్వవేదంలో ఎన్నికా నిబంధనమూ ఏలాంటివో నూత్న వేదంలో జ్ఞానస్నానం అలాంటిది. ఆ ప్రజలు దేవుణ్ణి కొల్చినట్లే మనమూ తండ్రిని పూజిస్తాం.

ఈ యాజకత్వం ద్వారా క్రైస్తవ ప్రజలు ఇతర దేవద్రవ్యానుమానాలను పొందడానికి అర్హులౌతారు. గురువుతో కలసి పూజబలి నర్పిస్తారు. అప్పరసాలను క్రీస్తు శరీర రక్తాలుగా మార్చే శక్తి గురువుకేవున్నా, క్రైస్తవ ప్రజలు కూడ అతనితోకూడి యథార్థంగా పూజబలినర్పిస్తారు, దేవుణ్ణి ఆరాధిస్తారు. ఇంకా, ఈ యాజకత్వం ద్వారా వివాహం చేసుకొన్న స్త్రీ పురుషులు పరస్పరం వివాహ సంస్కారాన్ని ప్రసాదించుకొంటారు. జ్ఞానవివాహంలో భార్యాభర్తలే ఒకరికొకరు ఈ సంస్కారాన్ని ఇచ్చుకొంటారు. అక్కడ గురువు కేవలం సాక్షిమాత్రమే.

జ్ఞానస్నానం దివ్యసత్ప్రసాదానికి దారితీస్తుంది. దివ్య సత్ప్రసాదాన్ని పుచ్చుకొందే అది పూర్తికాదు. నీటినుండీ ఆత్మనుండీ జన్మిస్తేనేగాని నరుడు పరలోక రాజ్యంలో చేరడు. యోహా 3,5. కాని క్రీస్తుశరీరాన్ని భుజించి అతని రక్తాన్ని పానం జేస్తేనేగాని నరునికి జీవం లేదు - 6, 52. చిన్నబిడ్డ జ్ఞానస్నానంపొందినప్పుడే దివ్యసత్ప్రసాదానికిగూడ ఉద్దేశింపబడ్డాడు అనుకోవాలి. పసిబిడ్డ పెద్దవాళ్ళ ఉద్దేశంవల్ల జ్ఞానస్నానం పొందుతాడని చెప్పాం. ఆ సమయంలోనే అతడు పెద్దవాళ్ళ కోరిక ద్వారానే, మానసికంగా దివ్యసత్ప్రసాదాన్ని కోరుకొంటాడు, పుచ్చుకొంటాడుగూడ. అనగా జ్ఞానస్నానం పొందే పసిబిడ్డ వస్తుతః దివ్యసత్ప్రసాదాన్ని పుచ్చుకోకపోయినా దాని ఫలితాన్ని పొందుతాడు. ఇది వేదాంతియైన తోమాసు అక్వినాసు భక్తుని భావం. పూర్వం మన ల్యాటిను శ్రీసభలో పసిబిడ్డకు జ్ఞానస్నానం పొందగానే దివ్యసత్ప్రసాదం కూడ ఇచ్చేవారు. గ్రీకు శ్రీసభలో ఈ యాచారం ఇప్పటికీ వుంది.

2) రాజత్వం. క్రీస్తు రాజు. ఆయన తండ్రిని గూర్చి బోధించి దేవుని రాజ్యాన్ని స్థాపించడానికి వచ్చాడు. మనం ప్రేమభావంతో దేవుని చిత్తానికి లొంగినప్పుడు ఆ దైవరాజ్యం మన హృదయంలో కూడ నెలకొంటుంది. ప్రతి క్రైస్తవుడు మొదట దైవరాజ్యాన్ని తన హృదయంలో నెలకొల్పడానికి గూడ కృషి చేయాలి.

క్రీస్తు మనకు రాజు అంటే ఆయన మనకు నాయకుడు అని భావం. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినపుడు మనంకూడ ఈ నాయకత్వాన్ని పొందుతాం. గురువైతే ఆధ్యాత్మిక విషయాల్లో క్రైస్తవ సమాజానికి నాయకత్వం వహించడం ద్వారా ఈ గుణాన్ని క్రియాపూర్వకంగా ప్రదర్శిస్తాడు. గృహస్థులైతే భూమి మొదలైన ప్రకృతి శక్తులను వశంలోకి తెచ్చుకోవడం ద్వారా ఈ గుణాన్ని ప్రదర్శిస్తారు. ప్రభువు ఆది దంపతులతో మీరు భూమిని స్వాధీనం చేసుకొమ్మని చెప్పాడుకదా - అది 1, 28. అనగా గురువు ఆధ్యాత్మిక రంగంలోను, గృహస్థులు లౌకిక రంగంలోను కృషిచేస్తూ క్రీస్తు రాచరికంలో పాలుపొందుతారని భావం.

3) ప్రవక్తృత్వం. క్రీస్తు తండ్రినిగూర్చి బోధించిన ప్రవక్త. జ్ఞానస్నానం ద్వారా మనంకూడ అతని ప్రవక్తృత్వాన్ని పొందుతాం. గురువు అధికార పూర్వకంగా దేవుణ్ణి గూర్చి బోధిస్తాడు. కాని గృహస్థులు అధికార పూర్వకంగా గాక తమ సదాదర్శం ద్వారానే బోధిస్తారు. తమ మంచి జీవితం ద్వారానే దేవునికి సాక్ష్యంగా వుంటారు. ఆ దేవుణ్ణి గూర్చిన బోధను స్వయంగా విని దాన్ని తమ అనుదిన జీవితంలో జీవిస్తారు. తమ బిడ్డలకు వేదసత్యాలను బోధిస్తారు.

జ్ఞానస్నానం ద్వారా నరులు త్రీత్వైక సర్వేశ్వరునికి అంకితులౌతారు. ఆ ప్రభునికి బిడ్డలై అతని జీవితాన్ని జీవించడం మొదలిడతారు. కనుక ఆ భగవంతునిలాగే క్రైస్తవులంతా గూడ పరిశుద్ధ జీవితం జీవించాలి. దేవుడు పంపగా వచ్చిన క్రీస్తుని అడుగుజాడల్లో నడవాలి.

కాని సన్యాస జీవితంగడిపే వాళ్ళకు ఈ పరిశుద్ధత్వపు బాధ్యత మరీ యెక్కువ. వాళ్ళు ప్రపంచాన్ని పరిత్యజించి దేవుని సేవకు అంకితులైనవాళ్ళు. క్రీస్తుకి మరింత సన్నిహితులై అతన్ని అనుకరింపవలసినవాళ్ళు. దీనికిగాను వాళ్ళు మూడు వ్రతాలద్వారా ప్రత్యేక విధంగా దేవునికి సమర్పితులౌతారు. దేవుని కుమారుని పోలిన జీవితం జీవిస్తారు. కాని ఈ విశిష్ట సమర్పణం కూడ జ్ఞానస్నానంలో ఒక భాగమే. దీనిద్వారా వాళ్లు దేవునికి సంపూర్ణంగాను శాశ్వతంగాను అంకితులౌతారు. కనుక సన్యాస జీవితం జీవించేవాళ్లు కూడ జ్ఞానస్నాన జీవితాన్ని మరింత అర్థవంతంగా జీవిస్తారు, అంతే. క్రైస్తవుల్లో ఎవరుకూడ, ఎప్పుడు కూడ, జ్ఞానస్నాన బాధ్యతలను మించిన పవిత్ర జీవితం జీవించలేరు.

## 5. క్రొత్తపుట్టువునీ క్రొత్త సృష్టినీ దయచేస్తుంది

నరుడు నీటిద్వారాను ఆత్మద్వారాను క్రొత్త పుట్టువు పుడితేనేతప్ప దైవరాజ్యంలో ప్రవేశించలేడు - యోహా 3,5. జ్ఞానస్నానం వలన మనకు ఆదామునుండి వచ్చిన ప్రాతదైన పాపపు పుట్టువుపోయి, ఆత్మనుండీ క్రీస్తునుండీ వచ్చిన పవిత్రమైన క్రొత్త పుట్టువు సిద్ధిస్తుంది. దీన్నే యోహాను “పైనుండి పుట్టడం” అనికూడ పేర్కొన్నాడు - 3,3.

దీన్నే “పౌలు నూత్న సృష్టి” అని వాకొన్నాడు. “ఎవడైనా క్రీస్తునందుంటే అతడు నూత్నసృష్టి ఔతాడు. ప్రాతవి గతించి క్రొత్తవి వచ్చాయి” - 2కొరి 5,17. ప్రాతసృష్టి వుంది. ప్రాతమానవుడైన ఆదాముకూడ వున్నాడు. కాని జ్ఞానస్నానం మళ్ళా నూత్న సృష్టిని చేస్తుంది - గల 6,15. ఇది తొలిసృష్టి కంటెగూడ గొప్పది. ఈ సృష్టిలో పాత మానవుడైన ఆదామునకు బదులుగా నూత్నమానవుడు ఉద్భవిస్తాడు. జ్ఞానస్నానం పొందిన నరుడు దేవుని బిడ్డడౌతాడు కదా!

త్రెంటుమహాసభ బోధల ప్రకారం జ్ఞానస్నానంలో క్రీస్తుని ధరించడం ద్వారా, అతని వరప్రసాదాన్ని పొందడం ద్వారా, మనం నూత్న సృష్టిమౌతాం. ఈ వరప్రసాదం ద్వారా అపవిత్రుడైన నరుడు పవిత్రుడౌతాడు. పాపియైనవాడు పుణ్యపురుషు డౌతాడు. దేవునికి శత్రువైనవాడు ఆయనకు స్నేహితుడౌతాడు. కడన నిత్యజీవనానికి అర్హుడౌతాడు జ్ఞానస్నానంలో నరుడు మడుగులోనుండి బయటికి రావడమూ, తెల్లకండువాను స్వీకరించడమూ, వెలిగేవత్తిని చేతపట్టుకోవడమూ మొదలైన క్రియలన్నీ నూత్నత్వానికి చిహ్నాలే.

## 6. పాపపరిహారాన్నీ శిక్షానిర్మూలనాన్నీ సంపాదించి పెండుతుంది.

పవిత్రాత్మ దిగివచ్చాక పేత్రు యెరూషలేములోని యూదులకు బోధిస్తూ "మీరు యేసుక్రీస్తు నామాన జ్ఞానస్నానం పొంది పాపక్షమనూ పవిత్రాత్మనూ పొందండి" అని చెప్పాడు - అచ 2, 38. అననీయ సౌలుతో "నీవు క్రీస్తు నామాన జ్ఞానస్నానం పొంది నీపాపాలను కడిగివేసుకో" అని చెప్పాడు - 22, 16. కనుక ఈ సంస్కారం మన పాపాలను తొలగిస్తుంది. పౌలుమాటల్లో అది "స్నానం" - తీతు 3,5. అనగా స్నానం మురికిని తొలగించినట్లే అది పాపాలను తొలగిస్తుంది.

జ్ఞానస్నానపు తంతులో పిశాచాన్ని పారదోలే ప్రార్థనలుంటాయి. ప్రాతబట్టలను విప్పి వేయడమూ, మడుగులో మునగడమూ వుంటాయి. ఈ క్రియలన్నీ పాపపరిహారానికి చిహ్నాలే.

బర్నాబా లేఖ అనే ప్రాచీన గ్రంథం ఈలా చెప్తుంది. "మేము మా పాపాలతో నీళ్ళల్లోకి దిగాం. కాని ఆ మడుగులో నుండి బయటికి వచ్చినపుడు మా హృదయాల్లో క్రీస్తుపట్లా ఆత్మపట్లా భక్తివిశ్వాసాలు నెలకొన్నాయి." హెర్మసు గ్రంథం "వాళ్ళు చచ్చిన వాళ్ళుగా నీళ్ళల్లోకి దిగారు. కాని బ్రతికిన వాళ్ళుగా బయటికి వచ్చారు" అని చెప్తుంది. విశ్వాస సంగ్రహంలో "పాపవిమోచనాన్ని దయచేసే ఒకే జ్ఞానస్నానాన్ని అంగీకరిస్తున్నాను" అని చెప్తాం. 1439లో ఫ్లోరెన్సు మహాసభ ఈలా బోధించింది. "ఈ సంస్కారంద్వారా జన్మపాపమూ కర్మపాపమూ అనిత్యశిక్షా కూడ తొలగిపోతాయి. కనుక జ్ఞానస్నానం పొందినవాళ్ళు తమ పాపాలకు ప్రాయశ్చిత్తం చెల్లించనక్కరలేదు. ఈ సంస్కారాన్ని పొందినవాళ్ళు మళ్ళా సొంతపాపాలను చేయకుండానే చనిపోతే నేరుగా మోక్షానికి వెళ్ళి దేవుణ్ణి దర్శిస్తారు". (అనిత్య శిక్ష అంటే పాపాలకి మన్నింపు పొందినా, మోక్షానికి వెళ్ళకముందు శుద్ధి కొరకు ఉత్తరించే స్థలంలో కొన్ని బాధలు అనుభవించడం) జ్ఞానస్నానంలో క్రీస్తు వరప్రసాదాన్ని పొందుతామని చెప్పాం. ఈ వరప్రసాదం

మనహృదయంలో పాపాన్ని మిగులనీయదు. ఈ సంస్కారంలో క్రీస్తు మరణోత్థానాలు మనమీద సోకుతాయి. క్రీస్తు మరణం నరుల పాపాలన్నిటికీ ప్రాయశ్చిత్తం చేస్తుంది. కనుక మన పాపం పూర్తిగా పరిహారమౌతుంది.

కాని జ్ఞానస్నానానంతరం గూడ మనలో పాపపు కోరికలుంటాయి. మన బలహీనతలూ వుండిపోతాయి. ఈ బలహీన దశలోవుండే మనం పిశాచంతో పోరాడాలి. ఆ పోరాటంలో నెగ్గితేనే మనకు మోక్షబహుమానం. జ్ఞానస్నానం ద్వారా దేవుడు ఈ బలహీనదశను తొలగింపడు.

పైన జ్ఞానస్నాన ఫలితాలను ఆరింటిని పేర్కొన్నాం. పెద్దవాళ్లు తమ భక్తినిబట్టి ఈ ఫలితాలను సంపూర్ణంగానైనా అసంపూర్ణంగానైనా పొందుతారు. చిన్నబిడ్డలు ఈ ఫలితాలను సంపూర్ణంగానే పొందుతారు.

## ప్రార్థనా భావాలు

1. జ్ఞానస్నానం మనలను దేవునికి దత్తపుత్రులను చేస్తుంది. ఈ సంస్కారంద్వారా మనం దైవకుటుంబంలో సభ్యులమౌతాం. మన తండ్రియైన దేవుని జీవితాన్ని జీవిస్తాం. ఇది చాల దొడ్డ భాగ్యం.

   భగవంతుడు నరుణ్ణి తనకు పోలికగా చేసాడు - ఆది 1, 27. ఈ పోలికవల్లనే మనం దేవునికి బిడ్డలమయ్యేది. మనం పాపం చేసినప్పుడు ఈ పోలిక మాసిపోతుంది. జ్ఞానస్నానం ద్వారా ఈ పోలిక మళ్లా నెలకొంటుంది.

   మనం క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది ఆయన ద్వారా ఆయన తండ్రికి బిడ్డలమౌతాం. అతడు మనకు జ్యేష్ఠ సోదరుడౌతాడు. మనమందరమూ అతనికి కనిష్ఠ సోదరులమౌతాం – రోమా 8,29. అతడు మనకు దేవుని కుమారులమయ్యే శక్తిని దయచేస్తాడు – యోహా 1,12. నరమాత్రులమైన మనం దేవుని కుమారుల మనిపించుకోవడం, యథార్థంగా కుమారులం కావడం, ఎంత అరుదైన భాగ్యం! – 1 యోహా 3,1. మన సొంత తల్లిదండ్రుల జీవితం మనలో ఏలా నెలకొని వుంటుందో దేవుని జీవితం గూడ మనలో ఆలాగే నెలకొని వుంటుంది.

2. జ్ఞానస్నానం ద్వారా మనం శ్రీ సభలో క్రొత్తగా పుడతాం. ఈ సందర్భంలో సిప్రియన్ భక్తుడు ఈలావ్రాసాడు "క్రీస్తు ఏకైక పత్నియైన శ్రీసభ మనకు పుట్టువు నిస్తుంది. ఈ శ్రీసభ కన్యమాత. దేవుని బిడ్డలకు జన్మనిచ్చేది ఈ తల్లే. ఈ శ్రీసభ బిడ్డడు కానివాని పుట్టువు ఏమి పుట్టువు"?.

ఇంకా సీనోభక్తుడు ఈలా చెప్పాడు. "శ్రీసభ మనకు జన్మనిచ్చేతీరుకీ మన భూలోక తల్లులు జన్మనిచ్చే తీరుకీ తేడా వుంది. లోకంలోని తల్లులు బిడ్డలను కనినప్పుడు ఘోరవేదన ననుభవిస్తారు. కాని పరలోక తల్లియైన శ్రీసభ సంతాపంతోగాక సంతోషంతో మనకు జన్మనిస్తుంది. ఆమె స్వేచ్ఛతో మనలను కంటుంది. మనం కూడ పాపదాస్యానికి లొంగక స్వేచ్ఛతోనే పుడతాం".

3. జ్ఞానస్నానం ముగిసాక గురువు భక్తుని శిరస్సుమీద క్రిస్మాతైలంతో సిలువగుర్తు వేస్తారు. ఈ ముద్రను జూచి పిశాచం భయపడి మనలను పీడించడానికి జంకుతుంది. ఈ సందర్భంలో సిరిల్ భక్తుడు ఈలా వ్రాసాడు. "జ్ఞానస్నానంలో పొందే సిలువ ముద్రద్వారా నరుడు క్రీస్తుకి చెందినవా డవుతాడు. ఒకసారి ఈ ముద్రనుపొందిన పిదప అతడు భక్తితో సిలువగుర్తు వేసికొంటే చాలు, పిశాచం భయపడిపారిపోతుంది. సిలువగుర్తు వేసికోవడానికి సిగ్గుపడేవాళ్లు పడవచ్చు గాక. మనం మాత్రం బహిరంగంగా నొసటిమీద ఆ గుర్తు వేసికోవాలి. దయ్యాలు ఆ రాజగుర్తును చూచి పారిపోతాయి. కనుక మనం అన్నపానీయాలు సేవించేపుడూ నిద్రించేపుడూ మేల్కొనేపుడూ, వేయేల అన్ని పనుల్లోను ఈ గుర్తు వేసికోవాలి".

4. జ్ఞానస్నానం పొందగోరేవాళ్ళకు పిశాచం అవిశ్వాసం పుట్టించి అవరోధాలు కలిగిస్తుంది. ఈపట్టున సిరిల్ భక్తుడు ఈలా నుడివాడు. "పిశాచ సర్పం త్రోవప్రక్కన పొంచివుండి జ్ఞానస్నానాన్ని పొందబోయే నిన్ను గమనిస్తూ వుంటుంది. అది నీలో అవిశ్వాసం పుట్టించడం ద్వారా నిన్ను కాటువేస్తుంది. ఆ సర్పం రక్షణాన్ని పొందబోయే వాళ్ళ వెంటబడి వాళ్ళను మ్రింగగోరుతుంది. నీవు ఆత్మలకు అధిపతియైన దేవుణ్ణిచేరబోతున్నావు. కాని నీవు ఆ క్రూరసర్పం ప్రక్కగా నడచి పోవాలి. దాన్నేలా తప్పించుకొంటావు? నీ పాదాలకు సువిశేష సందేశమనే చెప్పులు తొడుగుకో. అప్పుడు ఆ సర్పం ఒక వేళ నిన్ను కాటువేసినా నీకు ప్రమాదం కలుగదు".

# 5. రక్షణాన్ని పొందాలంటే జ్ఞానస్నానం అవసరం

రక్షణాన్ని సాధించాలంటే జ్ఞానస్నానం అవసరం. దాన్ని వస్తుతః పొందడానికి వీలులేని పరిస్థితుల్లో ఆశజ్ఞాన స్నానం సరిపోతుంది. వేదసాక్షి మరణం కూడ జ్ఞానస్నానంతో సమానం. ఈ యధ్యాయంలో ఐదంశాలు పరిశీలిద్దాం.

## 1. రక్షణానికి జ్ఞానస్నానం అవసరం

నరుడు నీటినుండి ఆత్మనుండీ జన్మిస్తేనేతప్ప దైవ రాజ్యాన్ని ప్రవేశింపలేడు అన్నాడు ప్రభువు – యోహా 3,6. ఇంకా, విశ్వసించి జ్ఞానస్నానం పొందేవాడు రక్షణాన్ని

చేపడతాడని కూడ నుడివాడు- మార్కు 16,16. పౌలు జ్ఞానస్నానం వల్లనే రక్షణం కలుగుతుందని ఎక్కడా చెప్పకపోయినా, అతని బోధలు పరోక్షంగా ఆ భావాన్ని సూచిస్తాయి.

త్రెంటుమహాసభ "సువిశేషం ప్రకటింపబడిన తరువాత జ్ఞానస్నానం ద్వారా లేక ఆశజ్ఞానస్నానం ద్వారా మాత్రమే రక్షణం కలుగుతుంది. ఈ సంస్కారం ద్వారా మాత్రమే మనం పుణ్యాత్ములమౌతాం" అని బోధించింది. దేవునికీ నరునికీ మధ్య ఒక్కడే ఒక్కడు మధ్యవర్తి, క్రీస్తు - 1తిమో 2,5. అతని ద్వారానే మనకు రక్షణం. కాని అతడు మనం జ్ఞానస్నానం పొందాలని ఆదేశించాడు - మత్త 16,16. కనుక అది రక్షణానికి అవసరం. ఐనా ఈ యవసరమనేది మామూలు పరిస్థితుల్లోనేగాని, అన్ని పరిస్థితుల్లో కాదు. కనుక కొన్నిసార్లు ఆశ జ్ఞానస్నానం, లేక వేదసాక్షి మరణం సరిపోవచ్చు. సంస్కారాల ద్వారా మాత్రమే నరుణ్ణి రక్షించవలసిన అవసరమేమీ దేవుడికి లేదు.

## 2. చిన్న బిడ్డలకు గూడ జ్ఞానస్నానం అవసరం

ఇక్కడ రెండు ప్రశ్నలకు జవాబు చెప్పవలసి వుంటుంది. మొదటి ప్రశ్న ఇది. చిన్నబిడ్డల జ్ఞానస్నానం తిరుసభలో మొదటినుండి అమలులో వుందా? ప్రొటస్టెంటుల్లో బాప్టిస్టు శాఖకు చెందినవాళ్ళు చిన్నబిడ్డల జ్ఞానస్నానాన్ని అంగీకరించరు. శ్రీసభ తొలిరోజుల్లో ఈ పద్ధతి లేదని వీళ్ళవాదం. కాని ఇది పొరపాటు. ఇటీవల కుల్మాన్, జెరెమియాసు మొదలైన ప్రోటస్టెంటు శాఖలకు చెందిన ఉద్దండ పండితులు ఈ యంశాన్ని కూలంకషంగా అధ్యయనంచేసి శ్రీసభలో తొలిరోజులలో నుండి శిశుజ్ఞానస్నానం అమలులో వుందని తేల్చారు. యూదులు అన్యమతాలనుండి తమ మతాలలో చేరినవాళ్ళ బిడ్డలకు జ్ఞానస్నానమిచ్చేవాళ్ళు. తమబిడ్డలకు సున్నతి చేయించేవాళ్ళు. ఈలాగే తొలిరోజుల్లో క్రైస్తవులు కూడ తమ బిడ్డలకు జ్ఞానస్నానం ఇప్పించేవాళ్లు. "చిన్నబిడ్డలను నా చెంతకు రానీకుండా ఆటంకపరచవద్దు" అన్న క్రీస్తు వాక్యం (మార్కు 10,14) శిశుజ్ఞానస్నానాన్ని సూచిస్తుందని టెర్టూలియను మొదలైన తొలిరోజుల్లోని వేదశాస్త్రులు వ్రాసారు. ఫిలిప్పినగరంలో కారాగారాధికారీ "అతని యింటివారందరూ" జ్ఞానస్నానం పొందారు- అచ 16,33. అలాగే కొరింతులో సమాజమందిరపు అధికారియైన క్రిస్పు "అతని యింటివారందరూ" జ్ఞానస్నానం పొందారు - 18,8. వీళ్ళల్లో శిశువులు కూడ వుంటారని పై పండితుల ఊహ.

రెండవ శతాబ్దంలో హిప్పోలీటస్ వ్రాసిన "అపోస్తలుల పారంపర్యబోధ" అనే గ్రంథం "మొదట శిశువులకు జ్ఞానస్నాన మీయాలి. మాటలాడలేనివాళ్ళ తరుపున వాళ్ళ తల్లిదండ్రులుకాని బంధువులుకాని మాటలాడాలి. అటుపిమ్మట పెద్దవాళ్ళయిన పురుషులకూ

కడన స్త్రీలకూ జ్ఞానస్నానమీయాలి" అని వాకొంటుంది. ఇదేకాలంలో ఇరనేయుస్ అనే వేదశాస్త్రి "క్రీస్తు అందరినీ రక్షించడానికి వచ్చాడు. అతని ద్వారా నూత్నపుట్టువు నొందినవాళ్ళ నందరినీ - అనగా శిశువులనూ బాలలనూ పెద్దవాళ్ళనూ వృద్ధులనూ - ఆ ప్రభువే రక్షిస్తాడు" అని వాకొన్నాడు. మూడవ శతాబ్దంలో ఓరిజన్ "శ్రీసభ శిశువులకు జ్ఞానస్నానాన్నిచ్చే సంప్రదాయాన్ని అపోస్తలుల నుండే గ్రహించింది. ఏ నరుడూ, ఒకరోజు ప్రాయంగల శిశువుకూడ, పాపాన్నుండి తప్పించుకోలేదు అని యోబుగ్రంథం చెప్తూంది" అని నుడివాడు. అదేకాలంలో సిప్రియన్ ఈ యంశాన్ని ప్రస్తావిస్తూ ఆనాడు కార్తేజ్ మహాసభ చేసిన నియమాన్ని పేర్కొన్నాడు. శిశువు పుట్టిన వెంటనే జ్ఞానస్నానం ఈయాలనీ, ఎన్మిదవ దినందాకా ఆగకూడదనీ ఈసభ 253లో నియమం చేసింది. కనుక తొలిరోజులనుండీ శిశుజ్ఞానస్నానం అమలులో ఉండేదని నిరూపించడానికి పై యుదాహరణలు చాలుకదా!

రెండవప్రశ్న యిది. జ్ఞానస్నానం పొందకుండా చనిపోయే బిడ్డలగతి ఏమౌతుంది? ఈ ప్రశ్నకు పూర్వం వేదశాస్త్రులు ఈలా జవాబు చెప్పారు. జ్ఞానస్నానం లేకుండా చనిపోయే బిడ్డలు "పసిబిడ్డలస్థలం" అనే చోటికి వెళ్తారు. అక్కడ వాళ్ళు దేవుణ్ణి చూడలేరుగాని ఒకవిధమైన సంతోషాన్ని మాత్రం అనుభవిస్తారు.

కాని ఇటీవల వేదశాస్త్రులు ఈ ప్రశ్నకు మరొకవిధంగా జవాబు చెప్తున్నారు. నరులను దేవద్రవ్యానుమానాల ద్వారా మాత్రమే రక్షించవలసిన అవసరం దేవునికి లేదు. కనుక అతడు ప్రత్యేకపరిస్థితుల్లో బిడ్డలను జ్ఞానస్నానం ద్వారాగాక ఇతరమార్గాల ద్వారా గూడ రక్షించవచ్చు. ఈ యితర మార్గాలు ఏమిటివి? 1) సంబంధ మార్గాలు. జ్ఞానస్నానం లేకుండానే చనిపోయిన శిశువు తన తల్లిదండ్రుల విశ్వాసంవల్లగాని తిరుసభ విశ్వాసంవల్లగాని రక్షణం పొందవచ్చు. వీళ్ళతో శిశువుకి సంబంధం వుంటుంది. ఇంకా ఈలాంటి శిశువులు తాము ప్రాత ఆదాముతోగల సంబంధంవల్ల జన్మపాపాన్ని తెచ్చుకొన్నట్లే క్రొత్త ఆదాముతోగల సంబంధంవల్ల ఆ పాపరాహిత్యాన్ని గూడ తెచ్చుకోవచ్చు. ఈ సంబంధాల్లో ఏదైనా బిడ్డను రక్షించవచ్చు.

2) ఆశజ్ఞానస్నాన మార్గాలు. భగవంతుడు ఈలాంటి శిశువులకు మరణసమయంలోగాని మరణానంతరంగాని గొప్ప వెలుగుని ప్రసాదించవచ్చు. ఆ వెలుగులో శిశువు జ్ఞానస్నానాన్ని కోరుకోవచ్చు. అప్పుడు రక్షణం కలుగుతుంది.

ఈ నూత్న బోధలను తిరుసభ అధికారపూర్వకంగా అంగీకరించనూలేదు, నిరాకరించనూలేదు. కనుక మన భావాలు కూడ ఈలాగే వుండాలి. అనగా ఈ మార్గాల ద్వారా బిడ్డలకు రక్షణం కలుగుతుందో లేదో మనకు రూఢిగా తెలియదు. మన తరుపున

మనం జ్ఞానస్నానం లేని బిడ్డలకుగూడ రక్షణం కలుగుతుందిలే అనుకొని శిశువులకు ఈ సంస్కారాన్ని ఇప్పించడంలో అశ్రద్ధ చేయకూడదు. ఇక, జ్ఞానస్నానం లేకుండా చనిపోయే అసంఖ్యాక శిశువుల కొరకు మనం ప్రార్థనం మాత్రంచేయాలి. మన ఈ ప్రార్థనలద్వారా, మంచి కోరికలద్వారా, వేదశాస్త్రులు పైన నుడివినట్లు, దేవుడు ఆ శిశువులను రక్షిస్తే రక్షించవచ్చు.

## 3. వేదసాక్షి మరణం

రక్షణానికి మామూలుగా జ్ఞానస్నానం అవసరం. కాని అది అన్ని పరిస్థితుల్లో అవసరం కాదు. ఉదాహరణకు వేదసాక్షిగా మరణించే భక్తునికి జ్ఞానస్నానం లేకపోయినా రక్షణం సిద్ధిస్తుంది. వేదసాక్షి మరణమంటే క్రైస్తవవిశ్వాసం కారణంగా శత్రువులు మనలను బాధించి చంపుతారు. మనం కూడ విశ్వాసంతోను ఓర్పుతోను ఆ మరణాన్ని అంగీకరిస్తాం. ఈలాంటి మరణం మనలను రక్షిస్తుంది.

ప్రభువు మనుష్యుల యెదుట నన్ను వొప్పుకొనేవాణ్ణి పరలోకంలోని తండ్రియెదుట నేనూ వొప్పుకొంటాను అన్నాడు - మత్త 10,32. ఇక్కడ "మనుష్యుల యెదుట క్రీస్తుని వొప్పుకోవడం" అంటే వేదహింసలకాలంలో క్రీస్తుని అంగీకరించడం అని భావం. ఇంకా అతడు నా నిమిత్తం తన ప్రాణాన్ని పోగొట్టుకొనేవాడు దాన్ని దక్కించుకొంటాడు అన్నాడు - 10, 39. వేదసాక్షులు ఈలాంటివాళ్ళే.

కనుకనే తిరుసభ తొలినాటినుండి వేదసాక్షులను పునీతులనుగా భావించి గౌరవిస్తూంది. క్రీస్తుకొరకు ప్రాణాలర్పించిన పావన పసిబిడ్డలను గూడ పునీతులుగా భావించి కొనియాడుతూంది. పితృపాదులు వేదసాక్షి మరణం జ్ఞానస్నానంలాంటిదన్నారు. అది మన పాపాలనూ అనిత్య శిక్షలను గూడ తొలగిస్తుందని బోధించారు. అగస్టీను భక్తుడు "మనం వేదసాక్షుల కొరకు ప్రార్థిస్తే వాళ్ళను అవమానపరచినట్లే ఔతుంది. కనుక వాళ్ళనే తమ వేదుదలద్వారా మనలను రక్షించాలని అడుగుకోవాలి. జ్ఞానస్నానపు తొట్టిలో మునిగినప్పుడు పాపాలు పరిహారమైనట్లే వేదసాక్షి మరణంద్వారా గూడ పరిహారమౌతాయి" అని నుడివాడు.

జ్ఞానస్నానపు నీళ్లు మనమీద పడినపుడు క్రీస్తు మరణం మనమీద సోకుతుంది. దానివల్ల మనకు పాపపరిహారం లభిస్తుంది. అలాగే వేదసాక్షి మరణంలోగూడ క్రీస్తుమరణం భక్తుని మీద సోకుతుంది. కనుక అతనికి గూడ పాపపరిహారం సిద్ధిస్తుంది. ఇక్కడ ఈ భక్తుడు తన పాపాల కొరకు పశ్చాత్తాపపడ్డం మాత్రం అవసరం. కాని క్రీస్తు కొరకు ప్రాణాలర్పించే వాడికి తన పాపాలకొరకు పశ్చాత్తాపపడేంత భక్తి వుండకుండా వుంటుందా?

తొలి మూడు శతాబ్దాల్లో క్రైస్తవులు చాలమంది వేదహింసల్లో వేదసాక్షులుగా మరణించారు. కాని నాల్గవ శతాబ్దంలో కాన్‌స్టంటయిను చక్రవర్తి క్రైస్తవుడు కావడంతో క్రైస్తవమతం రాజమత మయింది. ఆ మీదట వేదసాక్షి మరణాలు తగ్గిపోయాయి. ఈలాంటి మరణాలు ఇప్పుడు అరుదుగాగాని సంభవింపవు.

## 4. ఆశజ్ఞాన స్నానం

రక్షణానికి జ్ఞానస్నానం అవసరమైనా మరణం ఆసన్నమైన కొన్ని విషమపరిస్థితుల్లో దాన్ని పొందడానికి అవకాశం వుండకపోవచ్చు. ఆలాంటి పరిస్థితుల్లో దాన్ని పొందాలని ఆశిస్తే చాలు, రక్షణం కలుగుతుంది. అగస్టీను భక్తుడు ఈలా వ్రాసాడు. "జ్ఞానస్నానం లేకుండా చనిపోయేపుడు మనలను రక్షించేది ఒక్క వేదసాక్షి మరణమేకాదు. దేవుణ్ణి విశ్వసించి పాపాలకు పశ్చాత్తాపపడితే చాలు, మరణానికి ముందు జ్ఞానస్నానం పొందే అవకాశం లేనివాళ్లకుగూడ రక్షణం కలుగుతుంది."

ఈ యాశజ్ఞానస్నానం ఎవరికిబడితే వాళ్ళకు చెల్లదు. జ్ఞానస్నానాన్ని ఆశించికూడ ఆ భాగ్యానికి నోచుకోకముందే ఆకస్మిక మరణంవాత బడేవాళ్ళకు మాత్రమే ఇది చెల్లుతుంది. కనుక మామూలు పరిస్థితుల్లో జ్ఞానస్నానం అవసరం. అత్యవసర పరిస్థితుల్లో ఆశజ్ఞానస్నానం సరిపోతుంది.

క్రీస్తు సాన్నిధ్యం తిరుసభలో ఎల్లప్పుడూ వుంటుంది - మత్త 28,20. అతడు స్థాపించిన జ్ఞానస్నానం కూడ తిరుసభలో నెలకొని వుంటుంది. మరణావస్థలో వుండి దేవుణ్ణి విశ్వసించి ప్రేమించి పాపాలకు పశ్చాత్తాపపడే భక్తులమీద తిరుసభలో ఈ యాశజ్ఞానస్నానం సోకుతుంది. క్రీస్తు కూడ ఆ భక్తుని తన దగ్గరికి రాబట్టుకొంటాడు. అసలు తండ్రే ఆ భక్తుణ్ణి తన దగ్గరికి ఆకర్షింస్తుంటాడు - యోహా 6,44 ఈ విధంగా ఆశజ్ఞానస్నానం భక్తులను రక్షిస్తుంది.

కాని ఈ యాశజ్ఞానస్నానంవల్ల మన హృదయంమీది అక్షయమైనముద్ర పడదు. మనం క్రీస్తు యాజకత్వంలో పాల్గొనం, ఇతర సంస్కారాలను స్వీకరించడానికి అర్హులం కాము. కనుక భక్తుడు ఒకవేళ మరణావస్థ నుండి బయటపడితే మామూలు జ్ఞానస్నానాన్ని పుచ్చుకోవాలి.

## 5. ప్రోటస్టెంటు భావాలు

కట్టకడన జ్ఞానస్నానాన్ని గూర్చిన ప్రోటస్టెంటు శాఖీయుల భావాలనుగూడ సంగ్రహంగా తెలిసికొందాం. లూతరు భావాలు ఇవి. జ్ఞానస్నానంగాని, మరి యే యితర

సంస్కారం గాని, మన పాపాలను పరిహరించలేదు. ప్రభువు వాక్కునందలి విశ్వాసం మాత్రమే మన పాపాలను తొలగిస్తుంది. కనుక మనలను రక్షించేది విశ్వాసం మాత్రమే. ఐతే జ్ఞానస్నానంవల్ల ప్రయోజనమేమిటి? ఆ సంస్కారాన్ని పొందినపుడు అది మనలోని విశ్వాసాన్ని మేలుకొల్పుతుంది. మీకు రక్షణాన్ని దయచేస్తానన్న ప్రభువు వాక్కుని మనం విశ్వసించేలా చేస్తుంది. ఈ విశ్వాసంద్వారా మనకు రక్షణంలభిస్తుంది. కనుక విశ్వాసాన్ని మేలు కొల్పడం మాత్రమే జ్ఞానస్నానం ప్రయోజనం. అందుచేత పెద్దవాళ్లూ పిల్లలూ గూడ దాన్ని స్వీకరించాలి.

కాల్విను, స్వింగ్లి లూతరు సమకాలికులు, అతనితో పాటు తిరుగుబాటులో పాల్గొన్నవాళ్ళు. వీళ్ళుకూడ లూతరులాగే విడిపోయిన ప్రోటస్టెంటు శాఖలకు నాయకులయ్యారు. కాల్విను భావాల ప్రకారం, జ్ఞానస్నానం మనం దేవుని వరప్రసాదాన్ని పొందామనడానికి చిహ్నంగా వుంటుంది. కాని అది వరప్రసాదాన్ని ఈయలేదు. స్వింగ్లి భావాల ప్రకారం, జ్ఞానస్నానం మనలోని విశ్వాసాన్ని గూడ మేలుకొల్పదు. దానివల్ల మనకు పెద్ద లాభమేమీ లేదు. కాని మనం ఆ సంస్కారాన్ని పొందినపుడు ఇతరులు మనం ఆత్మ అనుగ్రహాన్ని పొందామని గుర్తిస్తారు. ఆ సంస్కారాన్ని పొందకముందే మన హృదయంలో విశ్వాసం వలన వరప్రసాదం నెలకొని వుంటుంది. ఈ వరప్రసాదానికి ఈ సంస్కారం బాహ్యమైన గుర్తుగా వుంటుంది. కనుక మనలోని వరప్రసాదానికి బాహ్యచిహ్నంగా వుండడం మాత్రమే దాని ప్రయోజనం.

బాప్టిస్టు శాఖవాళ్ళు చిన్నపిల్లల జ్ఞానస్నానాన్ని అంగీకరించరు. ఆంగ్లికను శాఖవాళ్ళ భావాలు ఇంచుమించు మన క్యాతలిక్ సమాజం భావాలతో సరిపోతాయి. వీళ్ళనే మన ప్రాంతంలో సి.ఎస్.ఐ. అంటాం.

## ప్రార్థనాభావాలు

1. జ్ఞానస్నానం ద్వారా క్రీస్తు సమాజంలో చేరుతాం. అతని మందకు చెందుతాం. ఈ సందర్భంలో మాప్సువెస్తియా తియొడోరెట్ ఈలా వ్రాసాడు. "జ్ఞానస్నానం వలన మీమీద ఓ ముద్రపడుతుంది. ఈ ముద్రవలన మీరు క్రీస్తు మందకు చెందిన గొర్రెలౌతారు. గొర్రెను కొనుక్కొనిరాగానే దానిమీద యజమానుని ముద్రవేస్తారు. అది అదే ముద్రగల ఇతర గొర్రెలు పండుకొనేకాడే పండుకొని, అవి మేసేకాడేమేస్తుంది. ఆ గొర్రెలన్నీ ఒకే యజమానునికి చెందుతాయి. అలాగే మీరుకూడ క్రీస్తు మందకు చెందుతారు."

2. సిరిల్ భక్తుడు ఈలా నుడివాడు. "జ్ఞానస్నానముద్ర ద్వారా మీరు క్రీస్తురాజు సైనికులౌతారు. రాజు కొలువులో చేరిన సైనికుల హస్తంమీద ఆ రాజుముద్రను పొడుస్తారు. ఆ సైనికులు ఆ రాజును సేవించేవాళ్ళని ఆ ముద్ర భావం. మీరిప్పుడు స్వర్గాధిపతియైన ప్రభువుని ఎన్నుకొన్నారు. కనుక మీరు ఆ రాజుని సేవించే సైనికులయ్యారు".

3. జ్ఞానస్నానానికి ముందు పిశాచపరిత్యాగం వుంటుంది. పూర్వం యిస్రాయేలీయులు ఐగుప్తునుండి బయలుదేరి వస్తుండగా ఐగుప్తీయులు వాళ్ళవెంటబడ్డారు. యిస్రాయేయులను మళ్ళా పట్టుకొనివెళ్ళి బానిసలనుగా వాడుకోవాలని వాళ్ళ కోరిక. కాని ప్రభువు యిస్రాయేలీయులను ఐగుప్తీయులకు చిక్కనీయలేదు. మన విషయంలో గూడ ఈలాగే జరుగుతుంది. జ్ఞానస్నానంద్వారా మనం పిశాచ సామ్రాజ్యం నుండి క్రీస్తు సామ్రాజ్యములో చేరతాం. కాని పిశాచం మనలను అంతసులభంగా వదలదు. మనలను మళ్ళాపట్టుకొని పోగోరుతుంది. అందుకే గురువు పిశాచ పరిత్యాగ ప్రార్థనల ద్వారా మనలనా దుష్టశక్తినుండి పూర్తిగా విడిపిస్తారు. ఈ సందర్భంలో గురువు నీవు పిశాచాన్నీ దాని క్రియలనూ ఆడంబరాలనూ పరిత్యజిస్తున్నావా అని ప్రశ్నిస్తారు. మనం ఔనని జవాబు చెప్తాం. ఇక్కడపిశాచక్రియలంటే పాపకార్యాలు. పిశాచాడంబరాలంటే మనలను పాపానికి పురికొల్పే లోకాడంబరాలు. మనం వీటన్నిటినీ పరిత్యజించి దైవరాజ్యంలో చేరాలి. క్రీస్తు నరులకు పాపవిమోచనం కలిగించాక గూడ ఈలోకం మీద పిశాచం ప్రభావం వుంటుంది. మనం కూడ ఈ దుష్ప్రభావానికి లోనవుతూంటాం. పై పిశాచ పరిత్యాగ ప్రమాణాలవల్లనూ, ఆప్రమాణాలను మళ్లామళ్ళా భక్తితో నూత్నీకరించుకోవడం వల్లనూ ఆ ప్రభావాన్నుండి కొంతవరకయినా తప్పించుకో గల్గుతాం. ఈ సందర్భంలో జ్ఞానస్నాన తంతులో గురువు చెప్పే ఓ ప్రార్థనం ఇది. "ఓ ప్రభూ! మీ దివ్యకుమారుని శ్రమలద్వారా, అతని పునరుత్థాన ఫలితాల ద్వారా, ఈ యభ్యర్థిని అంధకార శక్తినుండి విడిపించండి. క్రీస్తు వరంబలంవల్ల ఇతన్ని బలపరచండి. మీ నిత్య సంరక్షణం ద్వారా ఇతనిని ఈ జీవిత యాత్రలో కాచికాపాడండి". ఈలాంటి జపాలను మనం భక్తితో పునశ్చరణం చేసి కొంటూండాలి.

4. జ్ఞానస్నానం చాల గొప్పభాగ్యం. దాని ద్వారా క్రీస్తులోనికీ క్రీస్తుశరీరమైన శ్రీసభలోనికీ ఐక్యమౌతాం. దేవుని బిడ్డలమై దివ్యజీవితం జీవించడం మొదలిడతాం.

మనం ఎంత గొప్ప భక్తులమైనా జ్ఞానస్నాన పావిత్ర్యాన్ని మించిపోలేం. ఈలాంటి మహావరాన్ని మనం ఎప్పుడూ మరచిపోగూడదు. దాన్ని మళ్ళామళ్ళా భక్తితో జ్ఞప్తికి తెచ్చుకొని దేవునికి వందనాలర్పిస్తూండాలి.

పరిశుద్ధ వారంలో పెద్దశనివారం రాత్రివచ్చే పాస్కపూజలో జ్ఞానస్నాన ప్రమాణాలను నూత్నపరుస్తాం. విశ్వాసులందరూ ఈ పుణ్యకార్యంలో భక్తితో పాల్గొని తమ జ్ఞానస్నానాన్ని కృతజ్ఞతతో గుర్తుకు తెచ్చుకోవాలి. సంవత్సరమంతా శ్రద్ధాసక్తులతో పవిత్ర జీవితాన్ని జీవించి జ్ఞానస్నానాన్ని ఫలప్రదం చేసికొంటామని ప్రమాణం చేయాలి.

ఆదివారం ప్రభువు ఉత్థానాన్ని గుర్తుకి తెచ్చుకొనేదినం. ఆ దినం పూజలో విశ్వాసుల మీద తీర్థం చల్లుతారు. ఈ తీర్థం మన జ్ఞానస్నానజలానికి గుర్తుగా వుంటుంది. ఈ నీళ్ళు మనమీద పడినప్పుడు సిలువగుర్తు వేసికొంటాం. ఈ సందర్భంలో కూడ జ్ఞానస్నానాన్ని గుర్తుకు తెచ్చుకోవాలి.

ఇంకా కొన్ని గుళ్ళల్లో తలవాకిట తీర్థం పోసివుంచుతారు. గుళ్ళోకి వెళ్ళేవాళ్ళంతా ఆ తీర్థంతో సిల్వగుర్తు వేసికొంటారు. ఇది కూడ జ్ఞానస్నాన జలాన్ని జ్ఞప్తికి తెచ్చే సందర్భమే. ఈలాంటి భక్తికార్యాల ద్వారా మనం ఈ సంస్కారాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవాలి.

# 6. జ్ఞానస్నానం రెండు సంస్కారాలుగా విభజింపబడింది

తొలిరోజుల్లో జ్ఞానస్నానమూ భద్రమైన అభ్యంగనమూ రెండూ కలిసి ఒకే సంస్కారంగా ఉండేవి. నాల్గవ శతాబ్దంలో గాని ఇవి వేర్వేరు సంస్కారాలు అనే భావం స్పష్టం కాలేదు. మొదటి రోజుల్లో అభ్యర్థిమీద చేతులు చాచడం భద్రమైన అభ్యంగనంలో ముఖ్యకార్యం. కాని రాను రాను అభ్యంగనమే ముఖ్య కార్యమైంది. ఈ సంస్కారం ప్రధానంగా ఆత్మను దయచేసేది. ఇక్కడ మూడంశాలను పరిశీలిద్దాం.

## 1. బైబులు బోధలు

### 1. ఆత్మను గూర్చిన వాగ్దానం

బైబులు మొదటినుండి ఆత్మను గూర్చి చెప్తూనే వుంటుంది. మొదటలో ఆ గ్రంథం ఆత్మను దేవుని శ్వాసనుగా వర్ణిస్తుంది. ఈ శ్వాస సృష్టిని చేస్తుంది. ప్రాణాన్నిస్తుంది.

– ఆది 2,7. అటుతరువాత ఈ యాత్మ ప్రవక్తలను ప్రేరేపించేదిగా చెప్పబడింది. అలాగే న్యాయాధిపతులు రాజులు మొదలైన అధికారులను నడిపించేదిగా వర్ణింపబడింది. ఈ యధికారులూ ప్రవక్తలూ దేవునికి సాక్షులుగా ఉండేవాళ్ళు. కనుక ఆత్మ వాళ్ళకు నాయకత్వాన్ని దయచేసి వాళ్ళు దేవుని రక్షణ కార్యాలకు సాక్షులుగా వుండేలా చేసేది.

కడన బైబులు, మెస్సియా కాలంలో ఆత్మ సమృద్ధిగా అనుగ్రహింపబడుతుందని వాకొంటుంది. ఈ యాత్మ ప్రజలకు పావిత్ర్యాన్ని దయచేస్తుంది. నరుల్లోని రాతి గుండెను తీసివేసి దానిస్థానే మాంసపు గుండెను నెలకొల్పుతుంది – యెహె 36, 26–27. ఐతే మెస్సియా ఈ యాత్మను విశేషంగా పొందుతాడు. అతడు ఆత్మనుండి తెలివి, వివేకం, విజ్ఞానం, సదుపదేశం, దృఢత్వం, దైవభీతి, దైవభక్తి మొదలైన సప్తవరాలను స్వీకరిస్తాడు – యెష 11, 1–3. అతడు ఆత్మవలన అభిషేకం పొంది పేదలకు సువార్త బోధిస్తాడు 61, 1. లూకా 4,18. ఇంకా ఒక విశేషమేమిటంటే మెస్సియా కాలంలో ప్రజలందరు ఈ యాత్మను పొందుతారు. ప్రభువు ప్రజలందరి మీదా తన ఆత్మను కుమ్మరిస్తాడు – యోవేలు 2, 28–32. అచ 2, 1–18.

క్రీస్తు శిష్యులకు బోధించేపుడు ఈయాత్మ వాగ్దానాన్ని వాళ్ళకు చాలసార్లు జ్ఞప్తికి తెచ్చాడు. తాను వెళ్తేనేగాని ఆత్మ రాదనీ, తాను వెళ్ళి ఆ దివ్య శక్తిని పంపుతాననీ చెప్పాడు – యోహా 16, 7. ఉత్థాన మయ్యాక అతడు "నేను తండ్రి వాగ్దానం చేసిన ఆత్మను మీ మీదికి పంపుతాను. ఆ శక్తిని పొందిందాకా మీరు యెరూషలేము పట్టణంలోనే వుండండి" అని శిష్యులను ఆదేశించాడు – లూకా 24, 49. ఇంకా అతడు "ఆత్మ మీ మీదికి వచ్చినపుడు మీకు అద్భుతమైన శక్తి లభిస్తుంది.ఆ శక్తితో మీరు నేల నాలుగు చెరగులదాక నాకు సాక్షులై వుంటారు" అని సెలవిచ్చాడు – అచ 1,8.

## 2) పై వాగ్దానం నెరవేరడం

నూత్న వేదంలో పవిత్రాత్మ శిష్యులమీదికి దిగివచ్చినపుడు ఆత్మను గూర్చిన పై వాగ్దానాలన్నీ నెరవేరాయి. ఆత్మ గాలిలాగ, అగ్నిలాగ, నాలుకల్లాగ శిష్యులమీదికి దిగివచ్చింది. – అచ 2, 1–4. ఉత్థాన క్రీస్తు తండ్రి కుడిప్రక్కన ఆసీనుడై అతనినుండి ఆత్మను స్వీకరించాడు. అలా తాను స్వీకరించిన ఆత్మను పెంతెకోస్తుదినాన శిష్యులమీద కుమ్మరించాడు – 2, 33. పూర్వం యోవేలు ప్రవక్త మెస్సీయా కాలంలో ఈ యాత్మ అందరిమీదికీ దిగివస్తుందని ప్రకటించాడుకదా! పేత్రు ఈ ప్రవచనం భావాన్ని చక్కగా గ్రహించాడు. కనుకనే అతడు తన మొదటి ప్రసంగంలో "ఈ యాత్మ మీకూ, మీ పిల్లలకూ, దూరస్థులకీగూడ" అని చెప్పాడు – 2, 39.

ఆత్మ అందరికొరకూ ఉద్దేశింపబడింది. కనుక అపోస్తలు భక్తులమీద చేతులుచాచి వాళ్ళకు ఆత్మను ప్రసాదిస్తుండేవాళ్ళు. ఈ సందర్భంలో అపోస్తలుల చర్యల గ్రంథం రెండు ప్రధాన సంఘటనలను ఉదాహరిస్తుంది. ఫిలిప్పుసమరయలో బోధించి చాలమందికి జ్ఞానస్నాన మిచ్చాడు. తర్వాత పేతురు యోహాను వచ్చి ఈ భక్తులమీద చేతులు చాచగా వాళ్లు ఆత్మను పొందారు - 8,5. 14-17. ఈ సంఘటనలలో జ్ఞానస్నానమిచ్చింది ఫిలిప్పు, చేతులు చాచింది అపోస్తలులు. జ్ఞానస్నాన మీయడానికి చేతులు చాచడానికీ మధ్య కాలవ్యవధికూడ వుంది. ఆత్మ దిగి వచ్చింది ప్రధానంగా రెండవ కార్యం తర్వాత.

ఈలాంటిదే యెఫెసు సంఘటనంగూడ. అక్కడి భక్తులు పూర్వం స్నాపక యోహానునుండి జ్ఞానస్నానం పొందారు. అది చెల్లదని చెప్పి పౌలు వాళ్ళకు మళ్ళా క్రీస్తు పేరుమీదిగా జ్ఞానస్నానమిచ్చాడు. అటుతరువాత అతడు ఆ భక్తులమీద చేతులు చాచగా వాళ్ళంతా ఆత్మను పొందారు - 19, 1-7.

ఈ సంఘటనల్లో మనం ముఖ్యంగా రెండంశాలను గుర్తించాలి. మొదటిది, భక్తులకు నీటితో జ్ఞానస్నానమీయడం మాత్రమేగాక వాళ్ళమీదికి చేతులుకూడ చాచేవాళ్ళు. రెండవది, ఈలాచేతులు చాచేది ఎవరుపడితే వాళ్ళుకాదు, అపోస్తలులు. ఆత్మ వేంచేసివచ్చేది ఈ చేతులు చాచడం ద్వారానే. ఈ హస్తనిక్షేపణమే తర్వాత భద్రమైన అభ్యంగనంగా గుర్తింపబడింది. ఈ యంశం మీదట స్పష్టమౌతుంది.

## 2. పారంపర్యబోధ

పారంపర్య బోధను పరిశీలిస్తే మూడవ శతాబ్దం వరకు జ్ఞానస్నానమూ భద్రమైన అభ్యంగనమూ ఒకే సంస్కారంగా కనిపిస్తాయి. కాని జ్ఞానస్నానమిచ్చేది గురువైనా కడపట చేతులు చాచేకార్యం మాత్రం పీఠాధిపతే చేసేవాడు. ఆ ప్రక్రియవల్లనే ఆత్మ ప్రత్యేకవిధంగా వేంచేస్తుందని నాటి విశ్వాసులు భావించేవాళ్ళు.

4వ శతాబ్దంలో మార్పువచ్చింది. ఇవి రెండు సంస్కారాలనే భావం ప్రచారంలోకి వచ్చింది. గ్రీకు శ్రీసభలో ఈ రెండిటినీ కలిపి ఏక సంస్కారంగా గురువే జరిపేవాడు. కాని ఆ గురువు పీఠాధిపతి మంత్రించిన క్రిస్మా తైలాన్ని మాత్రమే వాడాలి. దీని ద్వారా ఈ సంస్కారానికి పీఠాధిపతితో సంబంధం వుందని సూచింపబడింది.

ల్యాటిన్ శ్రీసభలో గురువు జ్ఞానస్నాన మిచ్చేవాడు. పీఠాధిపతి భద్రమైన అభ్యంగనం ఇచ్చేవాడు. క్రమేణ వేదాంతులు ఈ రెండు సంస్కారాలకు వ్యత్యాసమేమిటా అని వితర్కించడం మొదలుపెట్టారు. 12వ శతాబ్దంలో భద్రమైన అభ్యంగనం కూడ ఏడు సంస్కారాల్లో ఒకటి అని నిర్ణయం చేసారు.

## 3. హస్త నిక్షేపణం నుండి అభ్యంగనానికి మార్పు

అభ్యర్థిమీద చేతులు చాచడమే ఈ సంస్కారంలోని ప్రధానమైన కార్యమని తొలి శతాబ్దాల్లోనివాళ్ళు భావించారు. తర్వాత అభ్యంగనమే ప్రధాన కార్యమని ఎంచారు. ఈ మార్పు ఏలా వచ్చిందో పరిశీలిద్దాం.

1. అపోస్తలుల కాలంలోను, రెండు మూడు శతాబ్దాల్లోను అభ్యర్థిమీద చేతులు చాచడం మాత్రమే వాడుకలో వుండేది. ఈ హస్తనిక్షేపణమనేది బైబుల్లో ఆశీర్వాదానికీ అధికారప్రదానానికీ చిహ్నంగా వుంటుంది. ఆశీర్వాదచిహ్నంగా అభ్యర్థులమీద చేతులు చాచేవాళ్ళు. క్రీస్తు చిన్నబిడ్డల మీద చేతులు చాచి వాళ్ళను దీవించినట్లుగా వింటున్నాం - మార్కు 10,16. రోగులమీద చేతులు చాచి వాళ్ళను స్వస్థపరచినట్లుగా చదువుతున్నాం - 6,5. ఈ యాశీర్వాద క్రియ ద్వారా భక్తులకు వర ప్రసాదమూ, దైవవరాలూ లభించేవి.

ఇక, అధికార చిహ్నంగా గూడ అభ్యర్థులమీద చేతులు చాచేవాళ్ళు. అపోస్తలులు ఏడ్గురు భక్తులమీద చేతులు చాచి వాళ్ళను డీకన్లనుగా నియమించారు - అచ 6,6. పౌలు తిమోతిమీద చేతులు చాచి అతన్ని బిషప్పునిగా నియమించాడు - 2 తిమో 1,6.

బహుశ ఆ తొలిరోజుల్లో ఈ సంస్కారంలో వాడబడిన హస్తనిక్షేపణ క్రియ, దైవవరప్రసాదాన్నీ ఆ వరప్రసాదానికి కారణమైన పవిత్రాత్మని సూచించి వుంటుంది.

2. నాల్గవ శతాబ్దంలో అభ్యర్థిని ఓలివుతైలంతో అభిషేకం చేయడమనేదికూడ ప్రచారంలోకి వచ్చింది. ఈ యాచారం మొదట గ్రీకు శ్రీసభలో వాడుకలోకి వచ్చింది. ఆ తిరుసభకు చెందిన దేశాల్లో దేహానికి బలాన్ని చేకూర్చడంకొరకు ఓలివు తైలాన్ని పులిమేవాళ్ళు. తైలాభ్యంగం ఆరోగ్యానికీ, బలానికీ, సంతోషానికీ, వరప్రసాదానికీ గూడ చిహ్నం. పూర్వ వేదంలో రాజులకూ ప్రధానయాజకులకూ అభ్యంగం చేసేవాళ్లు. క్రీస్తు అనగా అభ్యంగం పొందినవాడనే భావం - అచ 10,38. ఈ సంకేతం వల్లనే గ్రీకు శ్రీసభ ఓలివు తైలపు అభ్యంగాన్ని గూడ ఈ సంస్కారంలోకి ప్రవేశపెట్టింది. ఈ ప్రక్రియ దేవుని వరప్రసాదాన్ని సూచిస్తుందని భావించింది. గ్రీకు సంప్రదాయాన్ని చూచి ల్యాటిను శ్రీసభకూడ తర్వాత ఈ యాచారాన్ని స్వీకరించింది.

3. తొలిరోజుల్లో హస్తనిక్షేపణం ఒక్కటే వుండేది కనుక, దానివల్లనే ఆత్మను పొందుతామనే భావం ప్రచారంలో వుండేది. కాని నాల్గవ శతాబ్దం తర్వాత అభ్యంగం కూడ ప్రచారంలోకి వచ్చాక, ఈ క్రియవల్లనే ఆత్మను పొందుతామనే భావం బలపడింది. 13వ శతాబ్దంలో మహా వేదాంతియైన తోమాసు అక్వినాసుకూడ ఈ భావాన్నే సమర్థించాడు. ఆ మీదట క్రమేణ హస్తనిక్షేపణానికి విలువతగ్గి అభ్యంగానికి విలువ హెచ్చింది.

కాని 18వ శతాబ్దంలో బెనడిక్టు పోపుగారు అభ్యర్థినొసటిమీద క్రిస్మాతైలంతో సిలువగుర్తు వేసేప్పుడే అతని తలమీద కుడిచేతిని చాచి వుంచాలనికూడ నియమం చేసారు. ఇప్పటికీ ఈ నియమం చెల్లుతూంది. నేడు ఈ సంస్కారంలోని ప్రధానాంశం హస్తనిక్షేపణమేనని కొందరు వేదశాస్త్రులూ, కాదు అభ్యంగనమేనని మరికొందరూ వాదిస్తున్నారు. అధిక సంఖ్యాకులు మాత్రం ఈ రెండు కార్యాలూ ముఖ్యాంశాలేనని చెప్తున్నారు. క్రీస్తు సంస్కారాలను నెలకొల్పాడేగాని వాటినేలా నిర్వహించాలో స్వయంగా నిర్ణయించలేదు. ఆ నిర్వహణ విధానాన్ని శ్రీసభకే వదలివేసాడు. శ్రీసభ తొలిరోజుల్లో చేతులు చాచడానికి ప్రాముఖ్య మిచ్చినమాట నిజమే. కాని తర్వాత అభ్యంగనానికి ప్రాముఖ్యమిస్తే ఈయవచ్చు. సంస్కార నిర్వహణ విధానాన్ని ఎప్పుడుకూడ తిరుసభే నిర్ణయిస్తుంది.

4. ఇప్పుడు ఈ సంస్కారాన్ని జరిపే పద్ధతి యిది. పీఠాధిపతి అభ్యర్థి తలమీద చేతులుచాచి ప్రార్థిస్తారు. అతడు బుద్ధి, జ్ఞానం, దైవభయం మొదలైన ఏడు ఆత్మవరాలను పొందాలని జపిస్తారు. కాని ఈ చేతులు చాచడం కేవలం ప్రారంభసాంగ్యం.

తర్వాత పీఠాధిపతి తనబొటన వ్రేలిని క్రిస్మాతైలంలో ముంచి అభ్యర్థి నొసటిమీద సిలువగుర్తు వేస్తూ "నీవు పవిత్రాత్మ వరముద్రను స్వీకరించు" అని చెప్తారు. ఇదే అభ్యంగనం. ఈ సిలువగుర్తు వేసేప్పుడే బిషప్పుగారు అభ్యర్థి తలమీద తన చేతినిగూడ చాస్తారు. ఈ రెండు కార్యాలే ఈ సంస్కారంలోని ముఖ్యాంశాలు.

కడన పీఠాధిపతి అభ్యర్థి చెంపను మెల్లగాకొట్టి "నీకు సమాధానం కలుగుగాక" అని చెప్తారు. ఈ మెల్లగా కొట్టడమనేది మొదట ముద్దు రూపంలో వుండేది. ఆ ప్రక్రియ ఇప్పుడు కొట్టడంగా మారింది. దీని భావమేమిటో స్పష్టంగా తెలియదు.

క్రిస్మా తైలాన్ని ఓలివు నూనెతోను బాల్సం అనే పరిమళ ద్రవ్యంతోను తయారుచేస్తారు. మామూలుగా ఈ సంస్కారాన్ని జరిపించేది పీఠాధిపతి. అవసరమైనపుడు, అతని అనుమతిపై, మామూలు గురువులు కూడ దీన్ని జరిపించవచ్చు. పైన పేర్కొన్న చారిత్రకాంశాలను జాగ్రత్తగా గుర్తిస్తేనే కాని ఈ సంస్కారం సరిగా అర్థం కాదు.

## ప్రార్థనాభావాలు

1. పీఠాధిపతి అభ్యర్థి నొసటిమీద సిలువ గుర్తువేస్తూ "నీవు పవిత్రాత్మ వరముద్రను స్వీకరించు" అని చెప్తారని నుడివాం. ఈ ప్రార్థనం ద్వారానే అభ్యర్థిమీదికి ఆత్మ వేంచేస్తుంది. ఈ సంస్కారంలో అభ్యంగనంతో గూడిన సిలువగుర్తు అనే ముద్రవేస్తాం. ఈ ముద్ర ద్వారా ఆత్మ వరాన్ని పొందుతాం. ఏమిటి ఈ వరం?

ప్రభువు శిష్యులతో "ఆత్మ మీ మీదికి దిగివచ్చినపుడు మీరు శక్తిని పొందుతారు" అన్నాడు - అకా 1,8. ఈనాడు మనం కూడ ఈ సంస్కారం ద్వారా ఈ శక్తిని పొందుతాం. ఇదే ఆత్మవరం. ఈ వరంతో, ఈ శక్తితో, లోకంలో క్రీస్తుకి సాక్షులంగా మెలుగుతాం.

చాలమంది క్రైస్తవులు తాము క్రీస్తుకి సాక్షులమన్న సంగతిని గ్రహించనే గ్రహించరు. క్రీస్తుకి సాక్షులంగా మెలగడమంటే యేమిటి? ఆ ప్రభువుపట్ల భక్తి విశ్వాసాలను వ్యాప్తిచేయడం. అతన్ని లోకానికి ప్రకటించడం. కాని యెందరు విశ్వాసులు ఈ కార్యంలో పాల్గొంటారు? మన ప్రజలు తిరుసభ నుండి ఏవైనా సదుపాయాలు లభిస్తే వాటిని పొందటానికి లగెత్తుకొని వస్తారు. కాని ఆ సభకు ఏదైనా సేవలు చేయవలసి వచ్చినపుడూ, క్రీస్తుని బోధింపవలసి వచ్చినపుడూ, ఒక్కడూ ముందుకి రాడు. ఇది పద్ధతేనా?

2. జ్ఞానస్నానం తర్వాత భద్రమైన అభ్యంగనాన్ని పొందుతాం. జ్ఞానస్నానంలో ప్రారంభమైన పవిత్రకార్యం ఈ రెండవ సంస్కారం ద్వారా పరిపూర్ణమౌతుంది. పీఠాధిపతి ప్రార్థనచేయగా పవిత్రాత్మ భక్తులమీదికి దిగివస్తుంది. ఈ యాత్మ మనకు తెలివి వివేకం విజ్ఞానం దైవభీతి దైవభక్తి దృఢత్వం సదుపదేశం అనే సప్తవరాలను ప్రసాదిస్తుంది. ఈ యేడు వరాలు ఏడు ఆత్మశక్తులను సూచిస్తాయి. ఈ యేడింటి ద్వారా గూడ మనం క్రీస్తుకి సాక్షుల మౌతాం.

3. భద్రమైన అభ్యంగంలో పీఠాధిపతి అభ్యర్థి నొసటిమీద పరిమళ లేపనంతో సిలువగుర్తు వేస్తారు. ఈ లేపనాన్ని పీఠాధిపతి ప్రత్యేకంగా మంత్రిస్తారు. కనుక దానిలో ఆత్మ సాన్నిధ్యం వుంటుంది. కనుకనే సిరిల్ భక్తుడు ఈ లేపనాన్ని దివ్యసత్ప్రసాదంతో పోల్చాడు. "రొట్టెమీదికి క్రీస్తుని ఆహ్వానింపగా అది ప్రభువు దివ్యశరీరమౌతుంది. ఆలాగే ఈ పరిమళ ద్రవ్యంమీదికి ఆత్మను ఆహ్వానింపగా అది ఆత్మ సాన్నిధ్యంతో నిండిపోతుంది".

4. స్యూడో దయనీష్యన్ అనే భక్తుడు ఈలా చెప్పాడు. "భద్రమైన అభ్యంగనంలో వాడేపరిమళతైలాన్ని సువాసన గల మూలికలనుండి తయారుచేస్తారు. ఈ తైలం క్రీస్తు ఫరిమళాన్ని సూచిస్తుంది. ఈ దివ్యపరిమళం మన బుద్ధి శక్తిమీద, చిత్తశక్తిమీద సోకి వాటిని ఆనందపరుస్తుంది. మన కర్మేంద్రియాలు సువాసనను గ్రహించినట్లే మానసికేంద్రియాలైన బుద్ధిచిత్తశక్తులు కూడ క్రీస్తు దైవత్వమనే దివ్య పరిమళాన్ని గ్రహిస్తాయి."

# 7. భద్రమైన అభ్యంగనం మనలను క్రీస్తుకి సాక్షులనుగా చేస్తుంది

జ్ఞానస్నానంలోనే మనం ఆత్మను పొందుతాం. కాని ఈ యాత్మ మన వ్యక్తిగత పావిత్ర్యంకొరకు ఉద్దేశింపబడింది. మళ్ళా భద్రమైన అభ్యంగనంలో కూడ ఈయాత్మను పొందుతాం. ఈ సంస్కారం ద్వారానే ఆత్మ ఈ లోకంలో మనం క్రీస్తుకి సాక్షులంగా మెలిగేలా చేస్తుంది. శిష్యులకు పెంతెకోస్తు ఏలాంటిదో మనకు భద్రమైన అభ్యంగనం అలాంటిది. అది మన వ్యక్తిగతమైన పెంతెకోస్తు. దీనిద్వారా మనం మాటలతోను చేతలతోను క్రీస్తుని ఎల్లరికీ చాటి చెప్పేవాళ్ళమౌతాం. ఈ కడపటి అధ్యాయంలో మూడంశాలు పరిశీలిద్దాం.

## 1. ఆత్మ వాగ్దానం

ప్రభువు తన అనుచరులందరూ తన ద్వారా జీవాన్ని పొందుతారని నుడివాడు - యోహా 14,6. ఈ జీవం మనకు జ్ఞానస్నానం ద్వారాను ఆత్మద్వారాను లభిస్తుందని చెప్పాడు - 3,5. కనుక ఆత్మవలన మనకు జీవమూ వ్యక్తిగతమైన పావిత్ర్యమూ సిద్ధిస్తాయి. ఇది పూర్వవేదంలో యెహెజ్కేలు పేర్కొన్న ఆత్మ -36, 26-27.

కాని ప్రభువు మరొక అవసరాన్ని పురస్కరించుకొని గూడ శిష్యులకు ఆత్మను దయచేస్తానని వాగ్దానం చేసాడు. ఇదే ప్రేషితోద్యమం. శిష్యులు ప్రభువుని ఎల్లరికీ బోధించాలి. ఎల్లరియెదుట అతనికి సాక్షులుగా వుండాలి. దీనికిగూడ ఆత్మ అవసరం. వేదహింసల కాలంలో పవిత్రాత్మే శిష్యుల్లో వుండి మాటలాడుతుంది. శిష్యులద్వారా క్రీస్తుకి సాక్ష్యం పలుకుతుంది - మత్త 10, 17-20. ఇదే పూర్వవేదంలో ప్రవక్తలూ న్యాయాధిపతులూ పొందిన ఆత్మ. ఈవరం ద్వారా మనం క్రీస్తుకి సాక్షులమై అతన్ని ఎల్లరికీ ప్రకటిస్తాం - అచ 1,8.

## 2. పై వాగ్దానం నెరవేరి శిష్యులు సాక్షులు కావడం

శిష్యులను క్రీస్తుకి సాక్షులనుగా జేసే ఆత్మ పెంతెకోస్తునాడు అపోస్తలులమీదికి దిగివచ్చింది. ఆ యాత్మ నాలుకల రూపంలో దిగివచ్చి వాళ్ళకు క్రీస్తుని బోధించే శక్తిని ప్రసాదించింది - అచ 2, 1-4. ఈ యాత్మ శక్తితో అపోస్తలులు వెంటనే క్రీస్తుని గూర్చి బోధించడం మొదలుపెట్టారు. మొదటి రోజుననే 3000 మందికి జ్ఞానస్నానమిచ్చారు - 2,42. క్రీస్తు పేరుమీదిగా అనేక అద్భుతాలను చేసారు. ఈలా వాళ్ళు అతనికి సాక్షులయ్యారు

- 5,32. ఆత్మ దిగిరావడంవల్ల శిష్యులు క్రీస్తు రక్షణ సందేశాన్ని చక్కగా అర్థంచేసికొన్నారు. ఆసందేశాన్ని ధైర్యంతో బోధించారు. తమ కెదురైన ఆటంకాలనూ వేదహింసలనూగూడ ధైర్యంతో ఎదుర్కొన్నారు.

ఆత్మ దిగివచ్చాక అపోస్తలులు క్రీస్తుకి సాక్షులుగా మారిపోయారని చెప్పాం. పూర్వం క్రీస్తు జ్ఞానస్నానం పొందినపుడు కూడ ఈలాగే జరిగింది. ప్రభువు నరావతారమెత్తినపుడే ఆత్మ ద్వారా యాజకుడుగా అభిషేకం పొందాడు - లూకా 1,35. ఆత్మ అతన్ని మళ్ళా జ్ఞానస్నాన సమయంలో కూడ అభిషేకించింది - లూకా 3, 22. ఈ రెండవ యభిషేకంవల్ల అతడు ప్రవక్త అయ్యాడు. తండ్రికి సాక్షియై అతన్ని లోకానికి చాటిచెప్పేవా డయ్యాడు. అతడు పరిశుద్ధాత్మతో నిండినవాడై యోర్దాను నుండి తిరిగి వచ్చాడు. ఆత్మచేత నడిపింపబడినవాడై యెడారికి వెళ్ళాడు - 4, 1. అక్కడినుండి ఆత్మ బలంతోనే గలిలయకు మరలివచ్చాడు - 4,14. ఆత్మ అభిషేకంతోనే సువార్తను ప్రకటించడం మొదలుపెట్టాడు - 4, 17.

జ్ఞానస్నానంలో క్రీస్తు పొందిన ఈ ప్రవచనాత్మనే పెంతెకోస్తు దినాన శిష్యులు కూడ పొందారు. వాళ్ళు క్రీస్తు ప్రేషితోద్యమాన్ని కొనసాగించేవాళ్ళు. అతని తరపున, అతనికి బదులుగా దేవునికి సాక్షులుగా వుండేవాళ్ళు. యోహాను సువార్తలో క్రీస్తు "తండ్రి నన్ను పంపినట్లే నేనూ మిమ్ము పంపుతున్నాను" అని శిష్యులతో పల్కాడు - 20,21. కాని ఈ ప్రేషితోద్యమాన్ని కొనసాగించడానికి వాళ్ళకు ఆత్మశక్తి కావాలి. కనుకనే క్రీస్తు వెంటనే వాళ్ళ మీదికి ఆత్మను వూదాడు - 20, 23.

## 3. నేడు మనంకూడ ఆత్మను పొంది సాక్షుల మౌతాం

ప్రవక్తలూ, క్రీస్తూ, శిష్యులూ పొందిన ఆత్మనే నేడు మనంకూడ భద్రమైన అభ్యంగనంలో పొందుతాం. ఈ సంస్కారాన్ని పొందేప్పుడు వాడే ఓ ప్రార్థనం "ఓ ప్రభూ! నీవు అపోస్తులులకు పవిత్రాత్మను దయచేసావు. వారిద్వారాను, వారి అనుయాయుల ద్వారాను విశ్వాసులుకూడ ఆత్మను పొందాలని నిర్ణయించావు" అని చెప్తుంది.
జ్ఞానస్నానం ద్వారా మనం ఆత్మను పొందుతాం. కాని ఆ యాత్మ మన వ్యక్తిగత పావిత్ర్యం కొరకు ఉద్దేశింపబడింది - తీతు 3, 6-7. కాని మనకు ఈ యాత్మ చాలదు. జ్ఞానస్నానం ద్వారా మనం శ్రీసభలోనికి ఐక్యమౌతాం. ఆ మీదట మనం శ్రీసభ అభివృద్ధికి తోడ్పడాలి. కనుక మనకు సాంఘిక బాధ్యతలు కూడ వున్నాయి. మనమూ శ్రీసభ కూడ క్రీస్తుకి సాక్ష్యంగా వుండి ఆ ప్రభువుని లోకానికంతటికీ బోధింపవలసి వుంటుంది. ఇందు కొరకే మనం మళ్ళా భద్రమైన అభ్యంగనంలో కూడ ఆత్మను స్వీకరిస్తాం.

క్రీస్తు స్వయంగా తండ్రికి సాక్ష్యం పలికినవాడు. అతడు "సత్యానికి సాక్ష్యమీయడానికే నేను ఈలోకంలోకి వచ్చాను" అన్నాడు - యోహా 18, 37. ఇక్కడ "సత్యం" అంటే తండ్రి నిర్ణయించిన రక్షణ ప్రణాళిక. తండ్రి నిర్ణయించిన రక్షణ ప్రణాళిక ప్రకారం మానవులకు పాప విమోచనం కలిగించడానికి క్రీస్తు ఈ లోకంలోకి వచ్చాడు. కనుక అతడు తండ్రికి సాక్షి. ఇక, క్రీస్తు తండ్రికి సాక్షిగా వున్నట్లే నేడు మనంకూడ క్రీస్తుకి సాక్షులంగా వుండాలి. ఆత్మ అనుగ్రహంవల్ల మనకు ఈ సాక్ష్యభాగ్యం లభిస్తుంది. ఈ భాగ్యంవల్లనే మనం రక్షణ సందేశాన్ని లోతుగా అర్థంచేసికొంటాం. ధైర్యంతో క్రీస్తుని గూర్చి బోధిస్తాం. ఆటంకాలు కల్గినపుడు వెనుదీయకుండ ధైర్యంతో ముందుకి వెళ్తాంగూడ.

పౌలు తన బోధనూ తన జీవితాన్నీ సువాసనతో గూడిన పరిమళ ద్రవ్యంతో పోల్చాడు. రక్షింపబడేవాళ్ళకీ నాశం పొందేవాళ్ళకీ గూడ మేము క్రీస్తు సువవాసనగా వున్నాం" అని నుడివాడు - 2 కొ 2, 14-16. పితృపాదులు ఈ వాక్యం భద్రమైన అభ్యంగనాన్ని సూచిస్తుందని వ్యాఖ్యానించారు. ఏలాగంటే, ఈ సంస్కారంలో సువాసనతో గూడిన క్రిస్మా తైలాన్ని వాడతాంగదా! ఈనాడు భద్రమైన అభ్యంగనం పొందిన మనంకూడ మన జీవిత విధానం ద్వారాను, మన సువిశేష బోధలద్వారాను క్రీస్తుకి సాక్ష్యంగా వుండాలి. ఆ సాక్ష్యం దుర్వాసన లొలికే పాడుసాక్ష్యం కాకూడదు. సువాసన లొలికే మంచి సాక్ష్యం కావాలి.

ఈలా క్రీస్తుకి సాక్షులంగా వుండి అతని ప్రేషితోద్యమంలో పాల్గొనడానికి ఆత్మ మనకు వివిధ వరాలనిస్తుంది. బోధ చేయడం, ఆరోగ్యదానం, నాయకత్వం వహించడం మొదలైనవి ఈ వరాలు. పౌలు 1 కొ 12, 4-11లో ఈవరాలను పేర్కొన్నాడు. ఇవి వ్యక్తిగతమైన పావిత్ర్యం కొరకు కాక సమాజ లాభం కొరకు ఉద్దేశింపబడ్డాయి. -12, 7. వీటి ద్వారా మనం శ్రీసభను ఓ భవనంలా నిర్మించాలి - యెఫే 4, 12. ఈ వరాల సహాయంతో మనం మనకు చేతనైన ప్రేషితోద్యమంలో పాల్గొనాలి. నేడు సాంఘికసేవ చాల ముఖ్యమైంది. దీనిలో మళ్ళా చాల రకాలున్నాయి. పేద ప్రజలకు జరిగే అన్యాయాలను అర్థంచేసుకొని వాళ్ళకు కొంతవరకైనా న్యాయం కలిగేలాచేసి, కొంతవరకైనా ఆదుకొనేది సాంఘిక సేవ. గృహస్థులు ఎవరికి చేతనైనంత మట్టుకువాళ్ళు ఈ సేవలో తప్పక పాల్గొనాలి.

భద్రమైన అభ్యంగనం ద్వారా మనం క్రీస్తు తరుపున పోరాడే సైనికుల మౌతాం. జ్ఞానస్నానంవల్లనే మనం ప్రభువు సైన్యంలో చేరిపోతాం. భద్రమైన అభ్యంగనం ద్వారా అతని తరపున ధైర్యంగా పోరాడే బలాన్ని పొందుతాం. ఒకోసారి ఈ పోరాటంలో మన

ప్రాణాలు కూడ కోల్పోవలసి వస్తుంది. ఈలా ప్రాణాలు కోల్పోయినవాళ్లే వేదసాక్షులు. ఈ సంస్కారం వలన లభించిన బలంతోనే ఈ వేదసాక్షులు మరణం వరకు పోరాడగల్గారు. తోమాసు ఆక్వినాసు భక్తుని భావాల ప్రకారం, భద్రమైన అభ్యంగనాన్ని వస్తుతః గాని ఆశాపూర్వకంగా గాని స్వీకరించందే ఎవరూ వేదసాక్షిగా మరణించలేరు. నా నామం కొరకు సొంత బంధువులే మిమ్ము ద్వేషించి వధిస్తారని ప్రభువు ముందుగానే చెప్పాడు - మార్కు 13, 12-13. నేడు మనం ఈ సంస్కారాన్ని యోగ్యంగా స్వీకరించి అవసరమైనపుడు ప్రభువు సేవలో ప్రాణాలు త్యజించడానికి గూడ వెనుదీయకుండా వుండేంతటి బలాన్ని పొందాలి.

భద్రమైన అభ్యంగనం జ్ఞానస్నానాన్ని పరిపూర్ణం చేస్తుంది. ఆ సంస్కారంలో ప్రారంభమైన వ్యక్తిగత పావిత్ర్యం ఈ సంస్కారంలోని సాంఘిక పావిత్ర్యం ద్వారా - అనగా లోకం యెదుట క్రీస్తుకి సాక్ష్యం పల్కడం ద్వారా - పరిపూర్ణమౌతుంది. జ్ఞానస్నానంవల్ల బాలక్రైస్తవులమైతే, దీనివల్ల వయసు వచ్చిన క్రైస్తవుల మౌతాం. బాలలు తమ శ్రేయస్సుని తాము కాంక్షిస్తారు. పెద్దవాళ్ళు ఇతరుల శ్రేయస్సునిగూడ కాంక్షిస్తారు. కనుక భద్రమైన అభ్యంగనం ద్వారా మనం ఇతరుల శ్రేయస్సుని కోరేవాళ్ళంగాను, ఇతరులకు క్రీస్తుని చాటిచెప్పేవాళ్ళంగాను తయారుకావాలి.

జ్ఞానస్నానంవలె ఈ సంస్కారం కూడ మనమీద అక్షయమైన ముద్రను వేస్తుంది. జీవితాంతమూ ఆ ముద్ర మన హృదయంమీద వుండిపోతుంది. కనుక జ్ఞానస్నానం వలె దీన్నిగూడ ఒక్కసారి మాత్రమే స్వీకరించాలి. జ్ఞానస్నానం ద్వారా మనం ప్రధానంగా యాజక ప్రజలమౌతాం. భద్రమైన అభ్యంగనం ద్వారా ప్రవచనాత్మక ప్రజలమౌతాం. అనగా క్రీస్తుకి సాక్ష్యంపలికే వాళ్ళమౌతాం.

ఈ సంస్కారం ద్వారా మనం క్రైస్తవ సమాజంలో పరిపూర్ణ సభ్యులమౌతాం. ఆ సమాజానికి అధిపతీ, నాయకుడూ పీఠాధిపతి. కనుక దీన్ని మామూలుగా పీఠాధిపతే ఈయాలి. ఐనా అవసరమైనపుడు అతని అనుమతితో మామూలు గురువులు కూడ దీన్ని ఇస్తుంటారు.

శ్రీసభను గూర్చిన వాటికన్ చట్టం ఈలా బోధిస్తుంది. "భద్రమైన అభ్యంగం ద్వారా విశ్వాసులు శ్రీసభతో మరింత పరిపూర్ణంగా ఐక్యమౌతారు. ఆత్మ వాళ్ళకు ప్రత్యేకమైన బలాన్ని గూడ దయచేస్తుంది. కనుక వాళ్ళు క్రీస్తుకి సాక్షులై తమ మాటలద్వారాను చేతలద్వారాను క్రైస్తవ విశ్వాసాన్ని మరింత అధికంగా వ్యాప్తిచేయాలి. మరింత అదనంగా సమర్థించాలికూడ" -11.

యోవేలు ప్రవచనం ప్రకారం నూత్నవేదంలో అందరూ ఆత్మను పొంది ప్రవక్తలౌతారు -2, 28-32. ఆత్మ దిగివచ్చాక పేత్రుతాను యెరూషలేములో చేసిన మొదటి ప్రసంగంలో ఈ ప్రవక్త వాక్యాలను ఉదాహరించాడు - అచ 2, 17-18. అతడు ఆత్మవాగ్దానం అపోస్తలులకు మాత్రమే కాక విశ్వాసులమైన మనకుకూడ లభిస్తుందని చెప్పాడు - అచ 2, 38. ఈ వాక్యాలప్రకారం ఈనాడు మనంకూడ భద్రమైన అభ్యంగనంలో ఆత్మను పొంది ప్రవక్తలమౌతాం. ప్రవక్త అనగానే భవిష్యత్తునుగూర్చి చెప్పేవాడు అనుకొంటాం. ఇది పొరపాటు. ప్రవక్త ప్రధానంగా దేవుని తరపున మాటలాడేవాడు. దేవుని సందేశాన్ని ప్రజలకువిన్పించి అతనికి సాక్ష్యంగా నిల్చేవాడు. ఈ యర్థాన్ని తీసికొంటే మనమందరమూ ప్రవక్తలమే. ఈలా ప్రభువు ప్రవక్తలమయ్యే భాగ్యం ఈ ప్రత్యేక సంస్కారం ద్వారా పొందుతాం.

## ప్రార్థనాభావాలు

1. గృహస్థుల ప్రేషితోద్యమాన్ని గూర్చిన వాటికన్ చట్టం ఈలా చెప్తుంది. "మనకు శిరస్సయిన క్రీస్తునుండే గృహస్థులు ప్రేషితోద్యమంలో పాల్గొనేహక్కు పొందుతారు. జ్ఞానస్నానం ద్వారా వీళ్లు క్రీస్తు జ్ఞానశరీరమైన తిరుసభతో ఐక్యమౌతారు. భద్రమైన అభ్యంగనం ద్వారా ఆత్మనుండి బలాన్ని పొందుతారు. క్రీస్తే వీళ్ళకు ప్రేషితకార్యాన్ని ఒప్పగిస్తాడు. పై సంస్కారాల ద్వారా గృహస్థులు పవిత్ర ప్రజా, యాజకులూ ఐ ఆధ్యాత్మికమైన బలులర్పిస్తారు. లోకమంతటా క్రీస్తుకి సాక్ష్యంగా వుంటారు" -3.

   పై వాక్యాల ప్రకారం జ్ఞానస్నానమూ భద్రమైన అభ్యంగనమూ స్వీకరించిన వాళ్ళంతా ప్రేషితులౌతారు, కావాలి. కనుక మతసేవంతా గురువులూ మఠకన్యలూ చేసికొంటారులే అనుకొని గృహస్థులు మెదలకుండా వుండిపోకూడదు. తమకు చేతనైన సేవ తాముకూడ చేయాలి.

2. మనది హిందూమత ప్రాధాన్యంకల దేశం. క్రైస్తవులమైన మనం మైనారిటీ వర్గానిమి. మన పూర్వనాయకులైన గాంధీ నెహ్రూ మొదలైనవాళ్లు గొప్ప మతసహనం కలవాళ్ళు. ప్రస్తుతపు నేతలకు ఈ సహనం తక్కువ. హిందూ సమాజంలో ఆర్.ఎస్.ఎస్. లాంటి తీవ్రశాఖలున్నాయి. వీళ్లు హిందూ దేశం హిందూ మతస్థులకు మాత్రమే అనే భావాలను ప్రచారం చేస్తున్నారు. హింసకూ దౌర్జన్యానికీ పూనుకొని అన్యమతాల వాళ్ళను బాధించడం మొదలిడుతున్నారు. ఈ పరిస్థితులు తీవ్రరూపం తాల్చవచ్చుగూడ. ఈలాంటి వాతావరణలో మనం క్రీస్తుకీ, ఆ ప్రభువు నేర్పిన ప్రేమ శాంతి అహింసలకు సాక్షులంగా నిలువగలిగి వుండాలి.

# ప్రశ్నలు

## అధ్యాయం -1

1. క్రీస్తు యోర్దాను జ్ఞానస్నానం అతని మరణాన్ని ఏలా సూచిస్తుంది?
2. జ్ఞానస్నానాన్ని గూర్చిన పౌలు భావాలను మూడింటిని వివరించండి.
3. జ్ఞానస్నానంలో మనం క్రీస్తుతోపాటు ఏలా చనిపోతాం, ఏలా ఉత్థానమౌతాం?
4. యోహాను పేర్కొన్న జీవజలం జ్ఞానస్నానాన్ని ఏలా సూచిస్తుంది?

## అధ్యాయం - 2

1. వివిధ మతాల్లోని స్నానాలనూ, వాటి భావాలనూ వివరించండి.
2. జలం మరణాన్నీ జీవాన్నీ కూడ తెచ్చిపెడుతుందని బైబులు సంఘటనలనుండి నిరూపించండి.
3. క్రీస్తు జలాన్ని పాపపరిహారవస్తువుగా నిర్ణయించడంలో ఉద్దేశం ఏమిటి?
4. యూదమతంలోని జ్ఞానస్నాన పద్ధతులను వివరించండి.
5. జ్ఞానస్నానాన్ని ఈయడానికీ, పొందడానికీ ఎవరెవరు అర్హులు? ఎందుకు?
6. క్రీస్తు, క్రైస్తవుడు అనే పదాలకు అర్థమేమిటి?

## అధ్యాయం - 3

1. పితృపాదులు బోధల నుండి జ్ఞానస్నాన జలం మనలను కడిగి శుద్ధి చేస్తుందనే అంశాన్ని వివరించండి.
2. "మన చేప క్రీస్తు. ఆ చేప ననుసరించి మనం కూడ నీటిలో చిన్న చేపలంగా పుడతాం" అన్న టెర్టూలియన్ వాక్యాల భావం ఏమిటి?
3. జ్ఞానస్నాన జలానికీ జలప్రళయ జలానికీ పోలికలను తెలియజేయండి.
4. యూదుల సముద్రోత్తరణానికీ నూత్నవేద జ్ఞానస్నానానికీ గల సామ్యాలను వివరించండి.
5. జ్ఞానస్నానం ప్రసాదించే వెలుగు ఏలాంటిదో తెలియజేయండి.
6. పిశాచంతో పోరాడ్డానికి జ్ఞానస్నానం మనలను ఏలా సిద్ధం చేస్తుంది?

## అధ్యాయం - 4

1. "జ్ఞానస్నానం విశ్వాసాన్ని దయచేసే సంస్కారం" వివరించండి.
2. జ్ఞానస్నానం వలన మనం ఏలా శ్రీసభలో చేరతామో వివరించండి.
3. ఈ సంస్కారం వలన మనం ఏలా దత్తపుత్రులమౌతాం?
4. ఈ సంస్కారం ద్వారా మనం క్రీస్తు యాజకత్వంలో పాలుపొంది యాజకులమయ్యే తీరును వివరించండి.
5. జ్ఞానస్నానం మనకు పాపపరిహారాన్నీ శిక్షానిర్మూలనాన్నీ ఏలా సంపాదించి పెడుతుంది?

## అధ్యాయం - 5

1. చిన్న బిడ్డలకు జ్ఞానస్నానం ఎందుకీయాలి? జ్ఞానస్నానం లేకుండానే చనిపోయే బిడ్డలగతి యేమౌతుంది?
2. వేదసాక్షి మరణం జ్ఞానస్నానం లాంటిది ఏలా ఔతుంది?
3. ఆశజ్ఞానస్నానం అంటే యేమిటి?
4. జ్ఞానస్నానాన్ని గూర్చిన ప్రోటస్టెంటు శాఖలవాళ్ళ భావాలను సంగ్రహంగా వివరించండి.
5. ఈ సంస్కారాన్ని జ్ఞప్తికి తెచ్చే సందర్భాలు ఏమిటివి?

## అధ్యాయం - 6

1. ఆత్మ వాగ్దానాన్నీ, ఆ యాత్మ వేంచేయడాన్నీ గూర్చిన, బైబులు బోధలను వివరించండి.
2. భద్రమైన అభ్యంగనంలో హస్తనిక్షేపణంనుండి అభ్యంగనానికి ప్రాముఖ్యం ఈయడం అనే మార్పు ఏలా వచ్చిందో వివరించండి.

## అధ్యాయం - 7

1. అపోస్తలులు క్రీస్తుకి ఏలా సాక్షులయ్యారో వివరించండి.
2. భద్రమైన అభ్యంగనం మనలను క్రీస్తుకి ఏలా సాక్షులను చేస్తుంది?
3. జ్ఞానస్నానం భద్రమైన అభ్యంగనం అనే రెండు సంస్కారాలు దయచేసే వరప్రసాదాలకు వ్యత్యాసం ఏమిటి?

# జ్ఞానస్నానాన్ని గూర్చిన బైబులు అవలోకనాలు

## పూర్వవేదం

జలరాశిమీద ఆత్మ - ఆది 1, 2, 20
ఏదెను వనంలోని నాల్గునదులు - ఆది 2,10
జలప్రళయం, నోవా వోడ - అది 7,11-24
యిస్రాయేలీయులు రెల్లుసముద్రం దాటడం - నిర్గ 14, 21-29
యిస్రాయేలీయుల ఎన్నిక - నిర్గ 19, 5-6
యోర్దానులో నామాను స్నానం - 2-రాజు 5, 1-14
నూత్న హృదయం - యెహె 36, 26-27
పాపాలను తొలగించే నీటి బుగ్గ - జెకర్యా 13, 1
మెస్సీయా పొందే ఆత్మ - యెష 11, 1-3. 16,1
ఆత్మ అందరిమీదికి దిగివస్తుంది - యోవేలు 2, 28-32

## నూత్నవేదం

యోహాను జ్ఞానస్నానం - మత్త 3, 1-2. 11-12
క్రీస్తు జ్ఞానస్నానం - మత్త 3, 13-17
ఆత్మ మనచే క్రీస్తుకి సాక్ష్యం పలికిస్తుంది - మత్త 10, 17-20
క్రీస్తు సిలువమరణం అతని జ్ఞానస్నానం - లూకా 12,50
త్రీత్వం నామంలోనికి జ్ఞానస్నానం - మత్త 28,19
ఆత్మద్వారా నీటిద్వారా క్రొత్త పుట్టువు - యోహా 3, 2-5
క్రీస్తు లోకానికి వెలుగు - యోహా 8, 12. 12, 46
క్రీస్తు జీవజలమిస్తాడు - యోహా 4, 10. 7, 38-39
క్రీస్తు హృదయంనుండి కారిన నీళ్ళు - యోహా - 19, 34. 1 యోహా 5, 35.
ఆత్మనుగూర్చిన వాగ్దానం - యోహా 14,6
క్రీస్తు తండ్రికి సాక్షి - యోహా 18, 37
జ్ఞానస్నానం పొందితేనే రక్షణం - మార్కు 15, 15-16
ఆత్మ శక్తినిస్తుంది - అచ 1,8
పాపక్షమ - అచ 2, 38. 22, 16

ఆత్మ ఆగమనం - అచ 2, 1-4
యెరూషలేం భక్తుల జ్ఞానస్నానం - అచ 2, 38-42
సమరయుల జ్ఞానస్నానం - అచ 8,5. 14-17
ఇతియోపీయ ఉద్యోగి - అచ 8, 35-38
పౌలు జ్ఞానస్నానం - అచ 9, 17-18. 22,16
ఎఫెసీయుల జ్ఞానస్నానం - అచ 19, 1-7
కుటుంబ సమేతంగా జ్ఞానస్నానం- అచ 16, 14-15. 15, 33. 18,8
ఆత్మ అందరికిని - అచ 2, 38-39
శిష్యులు సాక్షులు - అచ 5,32
జ్ఞానస్నానం ద్వారా క్రీస్తు మరణోత్థానాల్లో
పాలుపొందుతాం - రోమా 6, 3-4, 8-9. కొలో 2, 12
క్రీస్తుని ధరిస్తాం - గల 3, 26-28
దత్తపుత్రుల మౌతాం - రోమా 8, 14-17. గల 4, 6-7
ఒకే విశ్వాసం, ఒకే జ్ఞానస్నానం - ఎఫే 4,5
వాక్యంతోగూడిన ఉదకస్నానం - ఎఫే 5, 26
ముద్ర - ఎఫె 1,13
వెలుగు - ఎఫె 5, 14
మనలను పవిత్రులను చేసే స్నానం - తీతు 3, 5-7
నిర్మలమైన ఉదకంతో స్నానం - హెబ్రే 10,22
ఆత్మవరాలు - 1కొ 12, 4-11
మేఘంలోను సముద్రంలోను జ్ఞానస్నానం - 1కొ 10, 1-5
క్రీస్తు శరీరంలో అవయవాలమౌతాం. 1కొ 12, 13
నూత్న సృష్టి - 2కొ 5,17. గల 6, 15
ఆత్మ ముద్ర, సంచకరువు - 2కొ 1, 21-22
మనం క్రీస్తు సువాసన - 2 కొ 2, 14-16
ఎన్నుకోబడిన జాతి, శ్రేష్ఠ యాజకులు - 1 పేత్రు 2,5. 9-10
నోవా వోడలో ఎన్మిది మంది - 1 పేత్రు 4, 19-21

# 5. పాపోచ్చారణం

## మనవిమాట

ఈ గ్రంథాన్ని పూర్వమే బైబులుబాష్యం 52-53 సంచికల్లో ప్రచురించాం. కొలది మార్పులతో ఆ రెండు సంచికలను ఇప్పుడు ఏక గ్రంథంగా ప్రచురించాం.

నేడు అందరికీ దైవభక్తీ పాపభీతి తక్కువైపోతున్నాయి. ప్రాపంచిక వ్యామోహాలు ఎక్కువై పోతున్నాయి. ఫలితంగా విశ్వాసులు పాపోచ్చారణ సంస్కారాన్ని విలువతో చూడ్డం లేదు. చాలమంది దాన్ని అట్టే వినియోగించుకోవడం లేదు. అది అపార్థాలకి గురౌతుంది కూడ. కనుక ప్రస్తుత గ్రంథంలో ఈ సంస్కారాన్ని విపులంగా వివరించాం. దీని పుట్టుపూర్వోత్తరాలూ, ప్రాముఖ్యమూ, దీన్ని ఉపయోగించుకోవలసిన తీరూ సవిస్తరంగా తెలియజేసాం. విశ్వాసులు తరచుగాను, భక్తితోను పాపోచ్చారణ సంస్కారంలో పాల్గొనడానికి ఈ పుస్తకం ఉపకరిస్తుందని ఆశిస్తున్నాం. నరుడు నిజాయితీతో పశ్చాత్తాపపడి హృదయశుద్ధిని పొందడం కంటె బైబులు భగవంతుడు అధికంగా కోరుకొనే దేముంటుంది?

"పాపసంకీర్తనం" (పాపాలను కీర్తించడం) అనేమాట ఎబ్బెట్టుగా వుంది. కనుక ఈ గ్రంథంలో సర్వత్ర "పాపోచ్చారణం" అనే పదాన్ని వాడాం. ఇది నాల్గవ ముద్రణం.

## విషయసూచిక

# 1. పాపోచ్చారణ సంస్కారం

ఇటీవలి కాలంలో పాపోచ్చారణ సంస్కారానికి ప్రసిద్ధి తగ్గిపోతూంది. నేడు చాలమంది దీన్ని శిక్షాత్మకమైన సంస్కారంగా భావిస్తున్నారు. విశ్వాసులు దీనిపట్ల అంతగా ఇష్టం చూపడం లేదు. కాని ఈ సంస్కారాన్ని అపార్థం చేసికోవడం వల్లనే ఈ యనిష్టభావం పుట్టింది. ఈ సంస్కారం ద్వారా మనం దేవుణ్ణి కలసికొంటాం. దీనిద్వారా మన సొంత క్రియలైన పశ్చాత్తాపం, పాపోచ్చారణం, ప్రాయశ్చిత్తం మొదలైనవి పవిత్రాలై వరప్రసాదాన్ని సాధిస్తాయి. ఈ యధ్యాయంలో ఆరంశాలు పరిశీలిద్దాం.

## 1. పరివర్తనం చెందాలి

సువిశేషం నరులను దేవుని చెంతకు తిరిగిరమ్మని ఆహ్వానిస్తుంది. దైవరాజ్యం సమీపించింది కనుక నరులందరూ పరివర్తనం చెందాలి అని చెప్తుంది - మత్త 4,17. క్రీస్తుతో దైవరాజ్యం రానేవచ్చింది. కనుక నరులందరూ పశ్చాత్తాప పడాలి. హృదయ శుద్ధిని పొంది ఆ ప్రభువుని అతడు కొనివచ్చిన దైవరాజ్యాన్ని అంగీకరించాలి.

ఈ పరివర్తనంలో మూడు అంశాలున్నాయి. మొదటిది, పాపాన్ని విడనాడాలని అభిలషించడం. పాపమంటే కేవలం పాపక్రియ మాత్రమే కాదు. పాపావస్థలో వుండిపోవడం గూడ. దేవునికి దూరం కావడం గూడ. కనుక మనం దేవుని ఎదుట మన పాపాన్ని ఒప్పుకోవాలి. ఆ ప్రభువు నుండి పాపవిముక్తినీ రక్షణాన్నీ పొందాలని అభిలషించాలి. పరిసయునితో పాటు దేవళానికి వెళ్ళిన సుంకరిలాగే మనం కూడ పాపవిమోచనం పొందాలని అభిలషించాలి - లూకా 18,9-14.

రెండవది, దేవుని చెంతకు తిరిగిరావాలని కోరుకోవడం. పాపమంటే దేవునిదగ్గరి నుండి వెళ్ళిపోవడం. అపమార్గం పట్టడం. అతనిమీద తిరుగుబాటు చేయడం. అతనితో సఖ్యసంబంధాలు త్రెంచుకోవడం. కనుక పాపియైనవాడు పశ్చాత్తాపం ద్వారా దేవుని చెంతకు తిరిగిరావాలి. అతనితో అన్యోన్యతను పెంపొందించుకోవాలి. నేను మా నాన్న దగ్గరికి తిరిగి వెళ్ళి నా తప్పును ఒప్పుకొంటాను అనుకొన్న దుడుకు చిన్నవాడిలాగ మనం కూడ మళ్ళీ దేవుని చెంతకు తిరిగిపోవడానికి సంసిద్ధులం కావాలి. యూదులు తమ పాపాలకు శిక్షగా ప్రవాసంలో జిక్కి బాధపడుతూన్నప్పుడు ప్రవక్తలు వాళ్ళను ప్రబోధించారు. యెరూషలేమునకు తిరిగిపోయి దేవళంలో ఆ ప్రభువు తేజస్సును మళ్ళా దర్శించాలని ప్రోత్సహించారు. ప్రేమతో నిబంధనం చేసికొన్న ఆ దేవునితో మళ్ళా రాజీ

కుదుర్చుకోవాలని హెచ్చరించారు. ఈలాగే పాపులమైన మనం కూడ ప్రభువు సన్నిధిలోకి వెళ్ళి అతనితో రాజీ కుదుర్చుకోవాలి.

మూడవది, దైవరాజ్యాన్ని పొందాలని కోరుకోవడం. క్రీస్తు తండ్రి రాజ్యాన్ని స్థాపించడానికి వచ్చాడు. కనుక మనం ఈ లోకరాజ్యాన్ని పిశాచరాజ్యాన్నీ వదలుకొని క్రీస్తు రాజ్యాన్ని స్వీకరించాలి. క్రీస్తురాజ్యం ప్రధానంగా మన హృదయంలో నెలకొంటుంది. ఆ క్రీస్తుని మన హృదయ సింహాసనం మీద ఆసీనుణ్ణి చేసికోవాలి. దైవరాజ్యం పూర్తిగా లోకాంతంలో గాని సిద్ధింపదు. కాని మనం ఇప్పటినుండే ఆ రాజ్యాన్ని మన హృదయంలో నెలకొల్పుకొనే ప్రయత్నం చేయాలి.

ఈలా పాపాన్ని విడనాడాలనీ, దేవుని దగ్గరికి తిరిగి రావాలనీ, దైవరాజ్యాన్ని పొందాలనీ కోరుకోవడమే పరివర్తనం చెందడమౌతుంది.

## 2. పరివర్తనం కేవలం మన కృషి మాత్రమే కాదు

పరివర్తనమనేది కేవలం మన కృషివల్ల సిద్ధించేది మాత్రమే కాదు. అది ప్రభువు దయచేసే వరం కూడ, వరప్రసాద ఫలితం కూడ. ప్రవక్తల బోధల ప్రకారం పరివర్తనమంటే నూత్న హృదయాన్ని పొందడం. అనగా మన వ్యక్తిత్వమూ ఆలోచనలూ అభిలాషలూ క్రియలూ నైతిక జీవితమూ అన్నీ కూడ మంచికి మారడం. ప్రభువు పూర్వపు పాపహృదయాన్ని తొలగించి క్రొత్త హృదయాన్ని ప్రసాదించటం వల్ల మనకు ఈ నూత్నత్వం సిద్ధిస్తుంది - యెహె 36,26. పౌలు కూడ పరివర్తనాన్ని క్రొత్తపుట్టువు అనీ క్రొత్తసృష్టి అనీ పేర్కొన్నాడు. ఎవడైనా క్రీస్తులో వుంటే అతడు నూత్న సృష్టి ఔతాడు. ఇక పాపజీవితం నశించి క్రొత్త జీవితం నెలకొంటుంది - 2కొరి 5,17. కాని అది మన కృషి ద్వారా కాక దేవుని వరప్రసాదం ద్వారా లభించే భాగ్యం. అసలు పశ్చాత్తాపపడాలనే కోరిక కూడ వరప్రసాదం వల్లనే లభిస్తుంది.

ఐనా దేవుడు ఎప్పుడు మన సహకారాన్ని గూడ అర్థిస్తాడు. కనుక పాపోచ్చారణ సంస్కారంలో నరునికృషి చాల వుంది. పశ్చాత్తాపం, పాపోచ్చారణం, ప్రాయశ్చిత్తం అనే మూడు క్రియలు ఈ సంస్కారంలో మనం దేవునికి అర్పించేవి. వీటిని గూర్చి రాబోయే అధ్యాయాల్లో విపులంగా పరిశీలిస్తాం. ఈ మూడు క్రియలకు గురువు చెప్పే క్షమాపణ ప్రార్థనను చేర్చగా ఈ సంస్కారం పూర్తవుతుంది. ఈ క్షమాపణం గురువు ద్వారా దేవుడే యిస్తాడు. ఈవిధంగా నరుని కృషీ భగవంతుని క్షమాభిక్షా రెండూ కలసి పాపోచ్చారణ సంస్కారాన్ని ఫలభరితం చేస్తాయి. కనుక పాపోచ్చారణ మనేది కేవలం యాంత్రికమైన

క్రియ అనుకోగూడదు. కేవలం శ్రీసభ చట్టాలకు లొంగి చేసే క్రియ అని అనుకోగూడదు. అది మన సహకారంతో, దేవుడే మన హృదయాన్ని పునీతం చేసే పవిత్రకార్యం.

## 3. క్రీస్తుద్వారా పాపపరిహారం

తండ్రి క్రీస్తు ద్వారా మన పాపాలను పరిహరిస్తాడు. క్రీస్తు ద్వారా మనం తండ్రిని కలసికొంటాం. "క్రీస్తు ద్వారా మనం జీవం పొందడానికే దేవుడు తన ఏకైక కుమారుణ్ణి ఈ లోకంలోకి పంపాడు. ఈలా పంపడం ద్వారా దేవునికి మన మీదగల ప్రేమ వ్యక్తమౌతుంది. మనం దేవుణ్ణి ప్రేమించామని కాదు, అతడే మనలను ప్రేమించి మన పాపాలను విమోచించడానికి క్రీస్తుని పంపాడు. ప్రేమ అంటే యీలా వుండాలి - 1యోహా 4,9-10.

మానుష క్రీస్తు మన పాపాలకు విమోచనం చేసాడు. క్రీస్తు పాటుల ద్వారా మరణం ద్వారా మనకు విమోచనం కలిగింది. తండ్రి ప్రేమ మనకు లభించింది. దేవుని ప్రేమ అనేది మన మంచితనం మీద ఆధారపడి వుండదు. మనం చెడ్డవాళ్ళమైనా అతడు మనలను అంగీకరిస్తాడు, ప్రేమిస్తాడు. "మనం పాపులంగా వున్నప్పుడు క్రీస్తు మనకోసం చనిపోయాడు అంటే దేవునికి మనమీదగల ప్రేమ రుజువౌతుంది గదా!" - రోమా 5,8. అసలు దేవుడు మనం తన దగ్గరికి తిరిగివచ్చిందాకా ఆగడు. అతడు మనలను క్రీస్తుద్వారా పూర్వమే మన్నించాడు. పూర్వమే అంగీకరించాడు. దేవుడు తన కుమారుని ద్వారా పూర్వమే దయచేసిన మన్నింపు ఇప్పుడు పాపోచ్చారణ సంస్కారంలో మనకు వస్తుతః సంక్రమిస్తుంది. ఈ సంస్కారంలో మనం ఆ మన్నింపుని అనుభవానికి తెచ్చుకొంటాం, అర్థం చేసికొంటాం.

క్రీస్తు మన పాపాలను తొలగించేవాడని చెప్తుంది సువిశేషం. స్నాపక యోహాను క్రీస్తుని చూపించి "ఇదిగో లోకం పాపాలను తొలగించే దేవుని గొర్రెపిల్ల" అన్నాడు - యోహా 1,29. ప్రభువు తాను పాపులకోసం వచ్చానని స్వయంగా చెప్పుకొన్నాడు - మత్త 9,13. అతడు వ్యాధిగ్రస్తులకు ఆరోగ్యం దయచేసే అద్భుతాలను చాలా చేసాడు. వాటన్నిటిలోను ఆత్మారోగ్యం కూడ సూచింపబడింది - మత్త 6,2-6. ఈ యారోగ్యాన్నే మనం ఈ సంస్కారంలో పొందేది.

పాపప్రభావం విశేషంగా అది తెచ్చిపెట్టిన మరణంలో కన్పిస్తుంది. కనుకనే క్రీస్తు తాను స్వయంగా మరణించి పాపాన్ని జయించాడు. మనకు విమోచనం దయచేసాడు. అతని మరణం ద్వారా మనకు విముక్తి కలిగింది. ఆ విముక్తినే మనం ఇప్పుడు ఈ సంస్కారంలో పొందుతాం.

క్రీస్తు తన మరణోత్థానాల ద్వారా జీవమిచ్చే ఆత్మడయ్యాడు - 1కొరి 15,45. ఇప్పుడు మన వరప్రసాదమంతా, రక్షణమంతా, జీవమంతా క్రీస్తుద్వారానే. పూర్వం యావే ప్రభువు పూర్వవేద ప్రజలను దాస్యాన్నుండి విమోచించి ఓ సమాజంగా ఏర్పరచాడు. అలాగే ఇప్పుడు క్రీస్తు కూడ మనలను పాపదాస్యం నుండి విమోచించి ఓ సమాజంగా ఏర్పరచాడు. ఈ సమాజమే శ్రీసభ. ఈ శ్రీసభ ద్వారానే అతని రక్షణం మనకు సంక్రమిస్తుంది.

తొలిరోజుల్లో ఆరాధనా సమాజం నుండి పాపులను బహిష్కరించేవాళ్లు. వాళ్లు దివ్యపూజలో పాల్గొనగూడదు. తమ పాపాలకు తగినంతగా పశ్చాత్తాపపడిన పిదప వాళ్ళకు క్రైస్తవ సమాజంలోకి పునఃప్రవేశం లభించేది. అప్పుడు వాళ్ళకు పునస్సమాధానం కలిగేది. ఆమీద పూజలో పాల్గొని దివ్యసత్ప్రసాదం పుచ్చుకొనేవాళ్ళు. ఈ బహిష్కరణ క్రియ ద్వారా క్రైస్తవులు తమ పాపం ఎంత ఘోరమైందో అర్థం చేసికొనేవాళ్ళు. ఆ కార్యం ద్వారా క్రీస్తు పాటుల్లోను, మరణ భూస్థాపనాల్లోను, అవమానంలోను పాలుపొందేవాళ్లు. అలాగే పునస్సమాధానం ద్వారా వాళ్ళు రక్షణ భాగ్యాన్ని చవిజూచేవాళ్లు. ఆ క్రియద్వారా క్రీస్తు ఉత్థానంలోను అతడు ప్రసాదించే జీవంలోను పాలుపొందేవాళ్లు. శ్రీసభలో ఇప్పుడు బహిష్కరణం - పునస్సమాధానం అనే తంతు లేదు. ఐనా ఇప్పుడు కూడా పాపోచ్చారణం ద్వారా మనం క్రీస్తు మరణోత్థానాల్లో పాలుపొందుతాం.

క్రీస్తు ఈ భూమిమీద సంచరించినపుడు రకరకాల మాటల ద్వారా, రకరకాల సంజ్ఞల ద్వారా వ్యాధులు నయం చేసాడు, పాపాలు మన్నించాడు. అలాగే ఇపుడు ఉత్థానుడై యున్న ప్రభువు రకరకాల సంజ్ఞలతో గూడిన పలు సంస్కారాల ద్వారా మనకు తన రక్షణాన్ని దయచేస్తాడు. ఈ సంస్కారాల్లో పాపోచ్చారణం కూడా ఒకటి. అన్ని సంస్కారాల్లోలాగే దీనిలో గూడ మనం దేవుని ప్రతినిధియైన గురువు దగ్గరికి వెళ్లి పాపపరిహారం పొందుతాం. ఆ గురువు ద్వారా ప్రభువే మన పాపాలు మన్నిస్తాడు.

## 4. ఆత్మద్వారా పాపపరిహారం

ప్రతి సంస్కారంలోను ఆత్మద్వారా క్రీస్తు మనలను పవిత్రపరుస్తాడు. ఆత్మ పితసుతలను ఐక్యపరచే ప్రేమశక్తి. అలాగే ఆ యాత్మ నరులను దేవునితో ఐక్యపరుస్తుంది. నరుల్లో వాళ్లల్లోవాళ్లకు ఐక్యతా ప్రేమా ప్రసాదిస్తుంది. ఆత్మ పూర్వం జలాల మీద అల్లల్లాడుతూ ప్రథమసృష్టి చేసింది. మళ్లా నజరేతూరి కన్యమీదికి దిగివచ్చి నూత్న సృష్టిని చేసింది. జ్ఞానస్నాన సమయంలో క్రీస్తుని అభిషేకించి అతనిచే రక్షణోద్యమాన్ని నడిపించింది. క్రీస్తు మరణోత్థానాలతో ఆత్మ ఈ భూమి మీది నరులందరి మీదా కుమ్మరింపబడింది.

ఉత్థానక్రీస్తు తండ్రి నుండి ఆత్మను పొంది ఆ దివ్యశక్తిని మనందరి మీదా కుమ్మరించాడు. నేడు మనకు జీవమూ పవిత్రతా ఐక్యతా సిద్ధించేది ఆత్మద్వారానే. ఆ యాత్ముడు ఇప్పుడు నరులందరినీ క్రీస్తు పేరుమీదిగా ఐక్యం చేసి ఒక్క సమాజంగా ఏర్పరుస్తాడు. ఆ సమాజమే శ్రీసభ. పూర్వం బాబెలు గోపురం కట్టినపుడు ప్రజలు విడిపోయారు - ఆది 11,8-9. కానీ ఇప్పుడీయాత్మ ద్వారా జనులు ఐక్యమౌతారు. అన్ని సంస్కారాల్లోను ఆత్మ పనిచేస్తుంది. ఉదాహరణకు పూజలో గురువు ఆత్మను ఆవాహనం చేసి పీఠం మీది అప్పరసాలను ఆశీర్వదించి వాటిని క్రీస్తు శరీర రక్తాలనుగా మార్చమని ప్రార్థిస్తాడు. అలాగే జరుగుతుంది. పాపోచ్చారణ సంస్కారంలో గూడ పనిచేసేది ఆత్మే. ఆ సంస్కారం ద్వారా దేవునితోను తోడి ప్రజలతోను మనకు పునస్సమాధానం కలిగించేది ఆత్మే.

పశ్చాత్తాపపడాలనే కోరికను మొదట మన హృదయంలో పుట్టించేది ఆత్మడే. ఆ దివ్యశక్తి ద్వారానే మనం మన తప్పిదాలను పరితాపం చెందుతాం. ఈ పరితాపం ద్వారా మన హృదయాలను మార్చి మనకు క్రొత్త యెడదను దయచేసేది కూడా ఆత్మే. కనుకనే ప్రభువు "నేను మీకు క్రొత్త హృదయాన్నీ క్రొత్త ఆత్మనూ ప్రసాదిస్తాను" అన్నాడు - యెహె 36,26. ఈలా క్రొత్త గుండెను పొందడం ద్వారా నరుడు శారీరకేచ్ఛలను జయించి ఆత్మ ప్రబోధం ప్రకారం జీవించడం మొదలిడతాడు. ప్రేమ, ఆనందం, శాంతి, సహనం, దయ మొదలైన ఆత్మ ఫలాలను సాధిస్తాడు - గల 5,22-23.

విశ్వాసులు పాపోచ్చారణ సంస్కారంలో తమ హృదయాన్ని ఆత్మకు అర్పించుకోవాలి. ఆ హృదయాన్ని మార్చమని ఆ దైవవ్యక్తిని అడుక్కోవాలి. హృదయంలోని గాయాలను మాన్పమనీ, పిశాచ ప్రభావం నుండి విముక్తి దయచేయమనీ, పిశాచ శోధనలను జయించే శక్తిని దయచేయమనీ, దేవునితోను తోడి నరులతోను ఐక్యమై ప్రేమజీవితం జీవించే భాగ్యాన్ని ప్రసాదించమనీ ఆత్మను వేడుకోవాలి. ఆ దివ్యాత్మ ద్వారా భక్తులు తప్పకుండా హృదయశుద్ధిని పొందుతారు.

## 5. శ్రీసభద్వారా పాపపరిహారం

దేవుడే నేరుగా మన పాపాలు పరిహరించవచ్చు కదా. వాటిని గురువుతో చెప్పుకోవడం దేనికి అని చాలమంది అడుగుతూంటారు. గురువును ఓ ప్రత్యేక వ్యక్తినిగాగాక క్రైస్తవ సమాజమైన శ్రీసభకు ప్రాతినిధ్యం వహించేవాణ్ణిగా తీసికోవాలి. క్రీస్తు సమాజంతో మనకు అవినాభావ సంబంధముందని గుర్తించాలి. మన పాపంలో సామూహిక గుణంకూడ వుంటుంది. మనం పాపంద్వారా దేవుణ్ణి మాత్రమే కాదు తోడిజనాన్ని గూడ బాధిస్తాం. దేవుడు నరుణ్ణి తనకు పోలికగా మాత్రమే సృజింపలేదు. అతడు ఓ సమాజంలో జీవించాలని

కూడ ఉద్దేశించాడు. ఆ సమాజమే శ్రీసభ. కనుక మనం పాపం చేసినప్పుడు దేవునికి ఎంతద్రోహం చేస్తామో శ్రీసభకు గూడ అంతద్రోహం చేస్తాం. ఇక పాపోచ్చారణం ద్వారా దేవునితో రాజీపడినట్లే శ్రీసభతోగూడా రాజీపడతాం. ఈ భావాన్ని సూచిస్తూ శ్రీసభ ప్రతినిధియైన గురువు నెదుట మన పాపాలను ఒప్పుకొని పశ్చాత్తాపపడతాం.

ఇంకా పశ్చాత్తాపమూ పరివర్తనమూ అనేవి కేవలం మన కృషివల్ల సిద్ధించేవి మాత్రమే కాదు. శ్రీసభ కూడ తన ప్రార్థనతో, తన భక్తితో ఈ వరాలను మనకు సంపాదించి పెడుతుంది. ఎందరో భక్తిమంతుల ప్రార్థనా ఫలితంగా మనకు పశ్చాత్తాపం పుడుతుంది. ఇందువల్ల గూడ మనం శ్రీసభ ప్రతినిధి యెదుట మన దోషాలను ఒప్పుకొంటాం.

మన పశ్చాత్తాపం శ్రీసభలోని ఇతర సభ్యులకు గూడ మేలు చేస్తుంది. మన పరివర్తనం ద్వారా వాళ్ళ హృదయాలు కూడా మారతాయి. వాళ్లుకూడ దేవునివద్దకు తిరిగివస్తారు. ఫలితంగా నరుల హృదయాల్లో దైవరాజ్యం నెలకొని విస్తరిల్లుతుంది. దేవుడు తాను కోరుకొన్నట్లుగా ఈ లోకాన్నంతటినీ రక్షింపగల్గుతాడు. శ్రీసభ ప్రతినిధియైన గురువు నెదుట మన పాపాలను ఉచ్చరించినపుడు మనం ఆ సభకు మేలు చేస్తున్నామని సూచిస్తాం.

అసలు మనంచేసే పాపోచ్చారణాన్ని వ్యక్తిగతమైన సంస్కారంగా భావించకూడదు. ప్రతివ్యక్తి పాపోచ్చారణమూ శ్రీసభ అంతటి పాపోచ్చారణంకూడ. మన పాపోచ్చారణం ద్వారా క్రీస్తు వధువైన శ్రీసభ మరింత పవిత్రురాలు ఔతుంది. ఆమె ఏ కలంకమూ లేకుండా నిర్దోషంగా నిర్మలంగా తన వరుడైన క్రీస్తుముందు నిలబడ్డానికి యోగ్యురాలు అవుతుంది - ఎఫె 5,27. ఈ శ్రీసభ తన బిడ్డలమైన మన పాపాలవల్ల ఇంకా పూర్ణశోభను పొందలేకుండా వుంది. ఆమె తన బిడ్డలమైన మనం పాపంతో నిండివుండడాన్ని చూచి దుఃఖిస్తుంది. మనలను పశ్చాత్తాపపడమని హెచ్చరిస్తుంది. తన ప్రార్థనలతో మనకు పశ్చాత్తాప భాగ్యాన్ని సంపాదించిపెడుతుంది. మనం దేవుని వద్దకు మరలివచ్చినపుడు తాను ఎంతో ఆనందిస్తుంది. కనుక మన పాపోచ్చారణం ద్వారా శ్రీసభ అంతా పవిత్రమౌతుంది. శ్రీసభ అంతా దేవునితో పునస్సమాధానం కలిగించుకొని అతని సన్నిధిలోకి రాగలుగుతుంది. ఫలితంగా ఆ సభ జ్ఞానస్నానం పొందని అన్యమతస్థులకు గూడ పవిత్రురాలుగా కన్పిస్తుంది. వాళ్లూ ఆ సభలో చేరాలని అభిలషిస్తారు.

1973లో వెలువడిన నూత్న పాపోచ్చారణ విధి ఈలా చెప్తుంది. "నరులు తరచుగా చెడ్డపనుల్లో ఒకరికొకరు సహాయం చేసికొంటారు. అలాగే పరివర్తనం చెందినపుడు గూడ వాళ్లు ఒకరికొకరు సహాయం చేసికొంటారు. వాళ్లు క్రీస్తు అనుగ్రహం ద్వారా పాపాన్నుండి విముక్తి పొంది, మంచి హృదయం కల ఇతర జనులతో గూడ కలసి, న్యాయాన్నీ శాంతినీ స్థాపిస్తారు" - 5.

కనుక మనం గురువుతో పాపాలు ఎందుకు చెప్పాలి అన్న ప్రశ్నకు సమాధానం ఇది. అతన్ని ఓ వ్యక్తినిగా గాక శ్రీసభ ప్రతినిధిగా గుర్తించాలి. ఆ శ్రీసభ యెదుట, దాని ప్రతినిధియైన గురువు నెదుట మన పాపాలు చెప్పుకోవాలి. ఎందుకంటే మన పాపాల ద్వారా ఆ శ్రీసభను బాధిస్తాంగనుకనూ, ఆ శ్రీసభ తన ప్రార్థనల ద్వారా మనకు పశ్చాత్తాప వరాన్ని సంపాదించి పెడుతుంది కనుకనూ, ఆ శ్రీసభలో మనంకూడ భాగం కనుకనూ.

ఈ సందర్భంలో తిరుసభ ప్రతినిధులుగా వుండి పాప పరిహారాన్ని దయచేసే గురువులను గూర్చి గూడ ఒకటిరెండు మాటలు చెప్పాలి. గురువులు కూడ పాపులే. వాళ్లూ పరివర్తనం చెందాలి. వాళ్ళు తమ యోగ్యత ద్వారా గాదు, గురుపట్ట సమయంలో ఆత్మ ప్రసాదించిన దివ్యశక్తి ద్వారా ఈనాడు నరుల పాపాలను పరిహరింపగల్గుతున్నారు. గురువు ఓ మంత్రదండంతో మాంత్రికంగా, యాంత్రికంగా విశ్వాసుల పాపాలు పరిహరించడు. ప్రభువు శ్రీసభలో ఏర్పాటు చేసిన యాజక పరిచర్య ద్వారా అతనికా దివ్యశక్తి లభిస్తుంది. అదే శక్తిద్వారా గురువు తాను గూడ ఇతర గురువుల నుండి పాపపరిహారం పొందుతుండాలి. పూర్వం పేత్రు పడిపోయి లేచిన తర్వాత మందకు కాపరి అయ్యాడు. వినయంతో గూడిన పశ్చాత్తాపం అతన్ని ఆ పదవికి తయారుచేసింది. ఆ పేత్రు లాగే నేటిగురువులు కూడ చాలసార్లు పడిపోతూంటారు. ఐనా వాళ్లు ఆ పేత్రులాగే పశ్చాత్తాపపడి హృదయశుద్ధిని పొంది పాపపరిహార పదవిని మరింతయోగ్యంగా నిర్వహిస్తూంటారు. తమలాగే తోడినరులు కూడ బలహీనపు ప్రాణులని అనుభవపూర్వకంగా అర్థం చేసికొంటారు. వాళ్ళపట్ల సానుభూతిని చూపుతారు. కనుక పాపపరిహారాన్ని దయచేసే గురువు వీళ్లు పాపులు అన్నట్లుగా విశ్వాసులను చిన్నచూపు చూడగూడదు. ఆ పాపుల్లో తానూ ఒకణ్ణి అనుకొంటుండాలి. విశ్వాసుల కష్టాలు శోధనలు బలహీనతలు మొదలైనవాటిపట్ల కొండంత సానుభూతి చూపుతూండాలి. ఇక విశ్వాసులు తమతరపున తాము గురువులో శ్రీసభ ప్రతినిధినీ క్రీస్తుప్రతినిధినీ గుర్తించాలి. అతనిలోని ఆత్మశక్తిని అంగీకరించాలి. ఈ విశ్వాసమే లేకపోతే మనం పాపోచ్చారణం చేయలేం.

## 6. పాపోచ్చారణం దివ్యారాధనంలో ఓ భాగం

పాపోచ్చారణ సంస్కారం ద్వారా మనం దివ్యారాధనంలో పాల్గొంటాం. క్రైస్తవులు మొట్టమొదట జ్ఞానస్నానం ద్వారా దివ్యారాధనంలో పాల్గొంటారు. జ్ఞానస్నానం పొందిన ప్రజలు పూజలో పాల్గొని దేవుణ్ణి కొలుస్తారు. కాని జ్ఞానస్నానం స్వీకరించినవాళ్లు కూడ ఘోరపాపాలు చేయవచ్చు. జ్ఞానస్నానం పాపాలను మన్నిస్తుంది గాని ఆ సంస్కారాన్ని

ఒక్కసారి మాత్రమే పొందవచ్చు. కాని ఆ సంస్కారాన్ని పొందిన తరువాత పాపం చేసిన వాళ్ళకి మన్నింపు ఏలా లభిస్తుంది? పాపోచ్చారణం ద్వారానే. కనుకనే శ్రీసభ ఈ పాపోచ్చారణాన్ని గూడ సంస్కారాల్లో చేర్చింది.

ఇక, ఈ పాపోచ్చారణం ద్వారా గూడ మనం దేవుణ్ణి ఆరాధిస్తాం. శ్రీసభ కృషి అంతాగూడ దేవుణ్ణి ఆరాధించడానికే. శ్రీసభలోని దివ్యశక్తి అంతాగూడ ఈ యారాధనం నుండే లభిస్తుంది. పాపోచ్చారణం ఈ యారాధనంలో ఒక భాగం. దానిద్వారా మనం దేవుని దయనూ కరుణనూ లోకానికి వెల్లడిచేస్తాం. అలాంటి కరుణగల భగవంతుణ్ణి లోకంముందు స్తుతించి కీర్తిస్తాం. ఇతరులు కూడ ఆ కరుణగల దేవుని సన్నిధిలోకి రావాలని హెచ్చరిస్తాం.

వాటికన్ మహాసభ "పాపోచ్చారణం చేసేవాళ్ళకు శ్రీసభతో పునస్సమాధానం కలుగుతుంది. ఏ శ్రీసభనైతే వాళ్లు పూర్వం తమ పాపాలద్వారా నొప్పించారో, ఏ శ్రీసభ వాళ్ళ పరివర్తనం కొరకు తన ప్రార్థనలు అర్పిస్తుందో, ఆ పవిత్ర సమాజంతో పాపోచ్చారణం చేసేవాళ్ళకు పునర్మైత్రి కలుగుతుంది" అని చెప్తుంది. కనుక పాపోచ్చారణం పాపి వ్యక్తిగతమైన క్రియ కాదు. శ్రీసభతో సంబంధించింది. శ్రీసభ ఆరాధనంలో బహిరంగంగా పాలు పొందేది. దానిద్వారా మనం మన విశ్వాసాన్ని బహిరంగంగా ప్రకటిస్తాం.

పాపోచ్చారణంలో మనం ఉత్థాన క్రీస్తుని కలసికొంటాం. ఉత్థానప్రభువు శాంతి సమాధానాలకూ సంతోషానందాలకూ నిలయమైనవాడు. ఉత్థానానంతరం అతడు శిష్యులకు దర్శనమిచ్చినపుడెల్ల "మీకు సమాధానం కలగాలి" అని చెప్తుండేవాడు. కనుక ఈ సంస్కారాన్ని పొందినపుడు మన హృదయంలో శాంతీ సంతోషమూ నెలకొనాలి. మనం విచారంతో గాదు, సంతోషంతో దీనిలో పాల్గొనాలి. ఒక్క పాపి పరివర్తనం చెందితే పరలోకంలో గూడ ఆనందం కలుగుతుందని చెప్తుంది లూకా సువార్త 15:7.

## ప్రార్థనా భావాలు

1. మనకు పరివర్తనం కలిగించేది దేవుడేనని చెప్తూ అగస్తీను భక్తుడు ఈ క్రింది వుపమానం చెప్పాడు. పావురం గోపురం చుట్టూ తిరుగుతూ దానిలో ఎక్కడైనా రంధ్రం కన్పిస్తుందేమోనని జాగ్రత్తగా పరిశీలించి చూస్తుంది. ఎక్కడైనా బెజ్జం కన్పించగానే సంతోషంతో దానిలోదూరి గూడుకట్టుకొంటుంది. అలాగే భగవంతుడు కూడ పాపి హృదయం చుట్టూ తిరుగుతూ అతని మనసులోకి ఏలా ప్రవేశించాలా అని జాగ్రత్తగా పరిశీలించి చూస్తాడు. చివరికి ఏలాగో ఓలాగు అతని యెడదలోకి ప్రవేశించి పరివర్తనం పుట్టిస్తాడు.

2. విశ్వాసులు జ్ఞానస్నానం పొందిన పిదప పాపాలు చేయకపోతే పాపోచ్చారణం అవసరమే లేదు. జ్ఞానస్నానమొక్కటే సరిపోయేది. కాని నరులు బలహీనపు ప్రాణులు. పిడికెడు మట్టిముద్ద నుండి పుట్టినవాళ్ళు. మన బలహీనతలు ఆ ప్రభువుకి కూడ తెలుసు - కీర్త 103,14. అతడు కరుణా సముద్రుడు కూడ - ఎఫె 2,4. కనుక అతడు జ్ఞానస్నానం తర్వాత పాపాలు కట్టుకొని పిశాచానికి దాసులయ్యేవాళ్ళ నుద్దేశించి ఓ ప్రత్యేక సంస్కారాన్ని నెలకొల్పాడు. అదే పాపోచ్చారణం. ఈ పుణ్యక్రియలో ప్రభువు సిలువమరణం మనమీద సోకి మన పాపాలు పరిహారమౌతాయి. కనుక ఈ సంస్కారానికి మనం దేవునికి సదా కృతజ్ఞులమై యుండాలి.

3. ఒక భక్తుడు ఈలా చెప్పాడు. మనం పాపం చేసేప్పుడు పిశాచం మనలను ప్రోత్సహిస్తుంది. ఆ ప్రోత్సాహం వలన మనం సిగ్గూసెరము లేకుండ కానిపనులు చేస్తాం. కాని అదే పిశాచం మనం పాపోచ్చారణం చేసేపుడు సిగ్గును పుట్టిస్తుంది. ఈలాంటి పాపాలను మనలాగే నరుడైన గురువుకి ఏలా చెప్తాం అనే సంకోచాన్ని కల్గిస్తుంది. కనుక భక్తుడైనవాడు పిశాచం ప్రోత్సహించినపుడు పాపాలు చేయనూకూడదు, పిశాచం నిరుత్సాహ పరచినప్పుడు పాపాలు ఒప్పుకోవడం మాననూ కూడదు.

4. యెహెజ్కేలు ప్రవచనంలో ప్రభువు "నేను పాపి నాశం కావాలని కోరుకోను. అతడు పరివర్తనం చెంది మళ్లా బ్రతకాలని నా కోరిక" అంటాడు - 33,11. ఇది చాల గొప్ప వాక్యం. బైబులు భగవంతుడు స్వయంగా జీవమయుడు. మనకు కూడ జీవాన్ని దయచేసేవాడు. కాని పాపం ద్వారా మనం ఈ జీవాన్ని చంపుకొంటాం. పరివర్తనం చెందినపుడు మళ్లా ఈ జీవం మనలో నెలకొంటుంది. కనుక పరివర్తనం ద్వారా మనం దేవుని జీవాన్ని పొందుతూండాలి.

# 2. పాపం

పాపమంత ఘోరమైంది మరొకటి లేదు. మనకృషి అంతా కూడ పాపాన్నుండి విముక్తి పొందడానికే. కనుక పాపాన్ని గూర్చి మనకు స్పష్టమైన భావాలు వుండాలి. ఇక్కడ నాలుగంశాలను ప్రస్తావిద్దాం.

## 1. పాపాన్ని గూర్చిన బైబులు బోధలు

1. మొదట పూర్వవేద భావాలను పరిశీలిద్దాం. బైబులు బోధల ప్రకారం పాపమంటే ప్రధానంగా దేవుణ్ణి ధిక్కరించడం. అతనిమీద తిరుగుబాటు చేయడం. దేవుడు

మంచి చెడ్డలు ఎరిగించే చెట్టు పండ్లు తినవద్దన్నా తిన్నాడు ఆదాము. అనగా అతడు తన మంచి చెడ్డలను తానే నిర్ణయించుకోగోరాడు. దేవునికి లొంగి వుండటానికీ, అతనిమీద ఆధారపడి జీవించటానికీ నిరాకరించాడు. తాను కేవలం సృష్టిప్రాణి ఐకూడ సృష్టికర్తను ధిక్కరించాడు. ఆ దేవాధి దేవునిముందు తన స్వాతంత్ర్యాన్ని చాటుకోబోయాడు. తానూ దేవుడంతటివాడు కావాలనుకొన్నాడు - ఆది 3,5. అందుకే దేవుడు అతన్ని అంత నిశితంగా శిక్షించింది. బైబులు ప్రారంభంలో ఆదికాండం వర్ణించే ఈ యాదాము పాపం కేవలం అతని పాపం మాత్రమే కాదు. అతడు మన కందరికీ శిరస్సు. అతని తప్పు మనందరి పాపాలకీ సంకేతంగా వుంటుంది. మనంచేసే ప్రతిపాపంలో కూడ దేవుణ్ణి ధిక్కరిస్తాం. అతనిమీద తిరుగుబాటు చేస్తాం. కుండ తన్ను చేసిన కుమ్మరి మీద ఎదురు తిరిగినట్లుగా దేవునిమీద ఎదురు తిరుగుతాం - యెష 29,16.

2. దేవుడు యిస్రాయేలీయులతో ప్రేమతో నిబంధనం చేసికొన్నాడు. ఈ నిబంధనం ప్రకారం ప్రభువు ఆ జనులకు దేవుడయ్యాడు. వాళ్లు అతన్ని కొల్చే భక్త సమాజమయ్యారు. పాపమనేది ఈ నిబంధనానికి వ్యతిరేకంగా పోతుంది. ఆ దేవునికి మాటయిచ్చి మీరినట్లవుతుంది. ఈ భావాన్ని స్పష్టం చేయడానికి బైబులు రకరకాల ఉపమానాలు వాడుతుంది. నిబంధనం ద్వారా యావే ప్రభువు భర్తలాంటివాడయితే యిస్రాయేలీయులు అతని వధువులాంటి వాళ్లు అయ్యారు. కాని పాపం ద్వారా యిస్రాయేలీయులు భర్తకు ద్రోహం చేసి వ్యభిచారం చేసిన భార్యలాంటివాళ్ళు అయ్యారు - యెహెజ్కేలు 16,23-26. ఇంకా నిబంధనం ద్వారా యావే ప్రభువు ఓ తండ్రిలాంటివాడయితే యిస్రాయేలు ప్రజలు అతని కుమారునిలాంటివాళ్ళయ్యారు. కాని పాపంద్వారా యిస్రాయేలీయులు తండ్రిమాట వినని తనయుల్లాంటి వాళ్ళయ్యారు. ఎద్లూ గాడిదలే తమ యజమానుణ్ణి గుర్తిస్తాయి. కాని యిస్రాయేలీయులు దేవుణ్ణి గుర్తించడంలేదు - యెష 1,2-3.

3. పాపంవల్ల నరుల హృదయాలు మొద్దుబారతాయి. కండ్లు మసకలు కమ్ముతాయి. చెవులు విన్పించవు. అనగా నరుడు దేవుణ్ణి లక్ష్యం చేయడు - యెష 6,10. నరుల హృదయాలకు సున్నతి జరిగితేనేగాని వాళ్ళు పాపంనుండి వైదొలగరు. కనుకనే యిర్మియా ప్రవక్త యిస్రాయేలీయులు తమ హృదయాలకు సున్నతి చేయించుకోవాలని కోరాడు-9,25. పాపానికి ప్రాయశ్చిత్తం చేసికోవాలంటే ప్రజలు మళ్లా తండ్రివంటివాడైన దేవుని యొద్దకు మరలి రావాలి. ఈలా తిరిగి రావడమే పరివర్తనం.

4. యిస్రాయేలు పాపం వ్యక్తిగతమైంది మాత్రమే కాదు, సామూహికమైందికూడ. ప్రభువు ప్రజలను వ్యక్తిగతంగాకాదు, ఒక జాతిగా ఎన్నుకొన్నాడు. వారి పాపంగూడ

వ్యక్తిగతమైంది కాక జాతిగతమైంది. ప్రభువు వాళ్ళను రక్షించేప్పుడు కూడ వ్యక్తిగతంగాకాక సామూహికంగా రక్షిస్తాడు. నూత్నవేదంలో మన పాపానికిగూడ ఈ సామూహిక లక్షణం వర్తిస్తుంది.

5. ధనికులు సాంఘికన్యాయాన్ని మీరి పేదజనులను పీడించేవాళ్ళు. ఈ యన్యాయాన్ని ప్రవక్తలు నిశితంగా ఖండించారు. హృదయశుద్ధిలేని ఆరాధనలవల్లా ఉపవాసాలవల్లా భగవంతునికి ప్రీతిగలగదు. కనుకనే "అక్కరలోవున్న తోడి జనాన్ని ఆదుకొంటే, అదే నాకు నచ్చిన ఉపవాసం" అన్నాడు యెషయా ప్రవచనంలో ప్రభువు - 58,6-7. ఆమోసు సాంఘిక అన్యాయాలను ఖండిస్తూ

"నీతి ఓ నదిలాగ పొంగిపారాలి
న్యాయం ఓ జీవనదిలాగ ప్రవహించాలి"

అని పల్కాడు - 5,24.

6. పాపం నరునికి చావు తెచ్చిపెడుతుంది. పాపం చేయకముందు ఆదాముకి మరణంలేదు. పాపఫలితంగా అతడు చావవలసి వచ్చింది. సొలోమోను జ్ఞానగ్రంథకర్త ఈలా వ్రాసాడు. "దేవుడు నరుణ్ణి అమరుణ్ణిగా సృజించాడు. తన్నులాగే నరుణ్ణిగూడ శాశ్వతుణ్ణిగా చేసాడు. కాని పిశాచం అసూయవలన మరణం ఈ లోకంలోకి ప్రవేశించింది. పిశాచం పక్షాన చేరినవాళ్లు ఆ మరణాన్ని అనుభవించి తీరతారు" -2,23-24. పాపం తెచ్చిపెట్టే ఈ చావు భౌతికమైందీ, ఆధ్యాత్మికమైందీ కూడ. జీవమిచ్చేవాడు భగవంతుడొక్కడే. కనుకపాపంద్వారా భగవంతుణ్ణి ధిక్కరించేవాడికి మరణమేగాని జీవనప్రాప్తి లేదు.

7. పూర్వవేద భావాల సంగ్రహం ఇది. పాపమనగా దేవుణ్ణి ధిక్కరించడం. భక్తునికీ దేవునికీ వ్యక్తిగతమైన సంబంధం వుంటుంది. పాపం ద్వారా ఈ సంబంధం తెగిపోతుంది. "నేను నీకే ద్రోహంగా పాపం చేసాను" అన్నాడు కీర్తనకారుడు - 51,4. ఈ చిన్నవాక్యంలో పాపాన్ని గూర్చిన పూర్వవేద బోధ అంతా యిమిడి వుంది. దేవునికీ భక్తునికీ మధ్యవుండే తండ్రీ బిడ్డా సంబంధం తెగిపోవడమే పాపం.

8. ఇక నూత్నవేద భావాలను పరిశీలిద్దాం. మెస్సీయా విజయం చేసే కాలం కరుణాపూరితమైంది. ఈ కాలంలో భగవంతుడు తన ప్రజలపట్ల విశేషకరుణ చూపుతాడు. తాను వాళ్ళతో క్రొత్తగా నిబంధనం చేసికొంటాడు. వాళ్ల పాపాలను ఇక స్మరించుకొనే స్మరించుకోడు - యిర్మీ 31,31-34. ఇంకా ఈ కాలంలో ప్రభువు తన ప్రజలకు నూత్నహృదయాన్ని దయచేస్తాడు - వాళ్ళలోని రాతి గుండెను తొలగించి దాని స్థానే మాంసపు గుండెను నెలకొల్పుతాడు. అనగా వాళ్ళను తిరుగుబాటుదారుల నుండి విధేయులనుగా మారుస్తాడు - యెహె 36,26.

9. మెస్సియా కాలం వచ్చింది. ప్రభువు ప్రత్యక్షమయ్యాడు. అతడు వచ్చింది ప్రధానంగా పాపపరిహారం చేసేందుకే. కనుకనే అతడు జన్మింపక పూర్వమే దేవదూత యోసేపుతో "నీవు అతనికి యేసు అని పెట్టాలి. అతడు ప్రజలను పాపం నుండి విమోచిస్తాడు" అని చెప్పాడు - మత్త 1,21. "యేసు" అనే పేరుకి రక్షకుడనే అర్థం,

క్రీస్తు బోధల ప్రకారం పాపం ప్రధానంగా హృదయగతమైంది. అంతరంగములోని భావాలను బట్టి నరుడు పవిత్రుడు గాని అపవిత్రుడు గాని ఔతాడు. దురాలోచనలు వ్యభిచారాలు దొంగతనాలు నరహత్యలు మొదలైనవన్నీ హృదయంనుండే పుట్టుకవస్తున్నాయి. ఇవే నరుణ్ణి మైలపరచేది - మార్కు 7,20-23. నరుడు శరీరంతో గాకుండ కేవలం హృదయంతో గూడ వ్యభిచారం చేయవచ్చు - మత్త 5,28. కనుక ఉపవాసం, ప్రార్థనం, దానం చేయడం మొదలైన ధర్మక్రియలన్నిటిలోను హృదయశుద్ధి ప్రధానం. డంబత్వం దేవునికి ప్రియపడదు.

పాపం ద్వారా నరుడు దేవుని నుండి వైదొలగిపోతాడు. పశ్చాత్తాపమంటే నరుడు మళ్లా ఆ దేవుని దగ్గరికి తిరిగిరావడం. తండ్రివద్దకు తిరిగివచ్చిన దుడుకు చిన్నవాడు మనకాదర్శం. అతనిలాగే మనంకూడ పరలోకంలోని తండ్రి చెంతకు తిరిగి రావాలి - లూకా 15,21.

క్రీస్తు ఒక్క పాపాన్ని అతిఘనంగా యెంచాడు. అది ప్రజలు తన్ను విశ్వసించక పోవడం, తన్ను తండ్రి పంపిన మెస్సీయానుగా అంగీకరించకపోవడం - యోహా 8,24. రక్షణాన్ని కొనివచ్చే ప్రభువుని విశ్వసించకపోతే నరునికి రక్షణం ఏలా కలుగుతుంది? ఈలాంటిదే పరిశుద్ధాత్మను గూర్చిన వాక్యం గూడ. "మానవులుచేసే ప్రతిపాపమూ క్షమింపబడుతుందిగాని పవిత్రాత్మను దూషిస్తే మాత్రం క్షమాపణం లేదు" - మత్త 12,31-32. పవిత్రాత్మకు వ్యతిరేకంగా మాట్లాడ్డమంటే బుద్ధిపూర్వకంగా దేవుణ్ణి నిరాకరించడం. అతన్ని నమ్మకపోవడం, పశ్చాత్తాపపడకపోవడం. సహజంగానే అలాంటివాడికి రక్షణం వుండదు.

10. ఇక పౌలు భావాలను పరిశీలిస్తే అతడు ప్రపంచమంతా పాపంతో నిండివున్నట్లుగా భావించాడు. "అందరూ దేవుని నుండి వైదొలగినవాళ్ళే. అందరూ దుర్మార్గపు పనులు చేసేవాళ్ళే. మంచిని చేసేవాడు ఒక్కడూ లేడు" - రోమా 3,12. యూదులు యూదులు కాని అన్యజాతివాళ్ళూ అందరూ పాపానికి లొంగిపోయారు - 3,9. ఈ పాపం నుండి నరులను ఉద్ధరించేవాడెవడు? ప్రభువైన క్రీస్తు ఒక్కడే - 7,24-25.

11. అలాగే యోహాను భావాలను పరిశీలిస్తే అతడు పాపాన్ని అంధకారంగా యెంచాడు. 'దేవుడు జ్యోతిర్మయుడు. అతనిలో అంధకారం ఎంతమాత్రమూ లేదు'

- 1యోహా 1,5. కాని తన సోదరుని ద్వేషించే పాపి అంధకారంలో సంచరిస్తాడు - 1యోహా 2,11. లోకంలో వెలుగు అవతరించినా పాపులైన నరులు ఆ వెలుగుకంటే చీకటినే యెక్కువగా ప్రేమించారు. పాపి వెలుగును ద్వేషిస్తాడు. వెలుగు దగ్గరికివస్తే తన తప్పుడు పనులు బయటపడతాయి కనుక అతడు వెలుగు చెంతకు రాడు - యోహా 3,19-20. పాపాత్ముడు పిశాచానికి బానిస ఔతాడు-8,24. ఈ బానిసాన్ని తొలగించి దాని కర్తయైన పిశాచాన్ని కూలద్రోసేవాడు ప్రభువొక్కడే-12,31.

12. పూర్వవేదం పాపాన్ని దేవుణ్ణి ధిక్కరించడంగా భావించిందని చెప్పాం. పాపి తన దేవుడైన ప్రభువుని నిరాకరిస్తాడన్నాం. నూత్న వేదంకూడ ఈ భావాన్నే బోధిస్తుంది. కాని నూత్నవేదం అదనంగా క్రీస్తు మన పాపాలను తొలగిస్తాడని చెప్తుంది. ఆప్రభువు సిలువమీద నెత్తురోడ్చి లోకంలోని నరులు చేసే పాపాలన్నిటికి శాంతి చేసాడు - 1యోహా 2,2.

## 2. పాపాన్ని అట్టే లెక్కచేయక పోవడం

పాపం అన్నింటికంటే దుష్టమైందనీ, దేవుడు పాపాన్ని లాగ మరి దేన్ని అసహ్యించుకోడనీ చెప్పాం. ఐనా ఆధునిక ప్రపంచం పాపాన్ని అట్టే లెక్కచేయడంలేదు. నరులు మంచినీళ్ళు తాగినంత సులభంగా పాపం చేస్తుంటారు. అలా పాపం చేసికూడ ఏ చింతా లేకుండ వుండిపోతారు.

నేటిమానవుడు పాపాన్ని లెక్కచేయకపోవడానికి కారణమేమిటి? నేడు నరులకు అసలు భగవంతునిపట్లనే భక్తి సన్నగిల్లిపోతూంది. ప్రపంచ వ్యాపారాల్లో మునిగితేలుతూ ప్రజలు దేవుణ్ణి పట్టించుకోవడంలేదు. ఆధ్యాత్మిక విలువలకు గౌరవమీయడం లేదు. దేవుణ్ణి పట్టించుకోని నరుడు పాపాన్ని మాత్రం ఎందుకు పట్టించుకుంటాడు? కాని క్రైస్తవులమైన మనకు ఈ మనస్తత్వం తగదు. మన ప్రభువు ప్రధానంగా పాపాన్ని ఏవగించుకొనేవాడు, పాపాన్ని తొలగించేవాడు. "మనం పాపులమై యుండగా క్రీస్తు మనకొరకు మరణించాడు. దీన్నిబట్టే దేవునికిమనమీదవున్న ప్రేమను అర్థంచేసికోవచ్చు" - రోమా 5,8. ఎవడో తన ప్రక్కయింటి బిడ్డను చంపివేసాడు. కాని ఆ బిడ్డ తల్లిదండ్రులు ఆ హంతకుని క్షమించి అతన్ని ఆదరంతో చూచారు. కనుక ఆ హంతకుడు తన నేరాన్ని మాటిమాటికి జ్ఞప్తికితెచ్చుకొని పశ్చాత్తాపపడేవాడు. ఈ యుపమానమే మనకీ వర్తిస్తుంది. మనం మన పాపంతో క్రీస్తుని సిలువవేసినవాళ్ళం. ఐనా తండ్రి నుండి క్షమాపణం పొందినా, మన తరపున మనం మాత్రం మన నేరాన్ని మరచిపోగూడదు. అనగా మనం ఏనాటికీ మన పాపాలను విస్మరించగూడదు.

## 3. పాపంలోని సామూహిక గుణం

ప్రసాదు చేసిన పాపం ప్రసాదుని బాధిస్తుంది. కాని అతని పాపం సమాజాన్ని గూడ బాధిస్తుంది. కనుక పాపంలో వ్యక్తిగతమైన గుణం మాత్రమే కాక సామూహిక గుణంకూడ వుంది. అసలు ఆది తల్లిదండ్రులు చేసిన తొలి పాపంలోనే ఈ శక్తి కనిపిస్తుంది. ఆదిదంపతుల పాపం వాళ్ళను మాత్రమేకాక మనలనుగూడ నాశం చేసిందికదా! మనమంతా పాపపు నరజాతికి చెందినవాళ్లం. మనపాపాలతో ఒకరినొకరం బాధించేవాళ్ళం. తొలి జన్మపాపానికి మన సొంతపాపాలను గూడ చేర్చి లోకాన్ని పాపభూయిష్ఠం చేసేవాళ్లం. కనుకనే పౌలు ఈ లోకం పాపంలో మునిగి తేలుతున్నట్లుగా భావించాడు. ఈ పాపభారాన్ని తప్పించుకోవడానికి ప్రపంచం ప్రసవవేదన పడుతున్నదని చెప్పాడు - రోమా 8,19-22.

లోకంలో సామూహిక పాపమనేది కూడ వుందని చెప్పాం. దీనికే "లోకపు పాపం" అని పేరు - యోహా 1,29. దీనివల్ల మానవతా విలువలూ నైతిక విలువలూ నాశమై పోతున్నాయి. ఉదాహరణకు నేడు లోకం లైంగిక భావాలను విరివిగా ప్రచారం చేస్తూంది. ఈలాంటి వాతావరణంలో మన యువతీయువకులు విశుద్ధ జీవితం ఏలా జీవించగల్గుతారు? ఎక్కడ జూచిన అవినీతి తాండవిస్తూంది. ఈలాంటి పరిస్థితుల్లో మంచి ఉద్యోగికి కూడ దుర్బుద్ధి పుడుతుంది. సంపన్నదేశాలు పేదదేశాలనూ, ధనికవర్గాలు పేదప్రజలనూ పీడించి పిప్పి చేస్తున్నాయి. అలాంటప్పుడు పేదలు తిరుగుబాటు చేయకుండా ఏలా వుంటారు? అసలు మనమందరమూ అన్యాయానికి దోపిడికి పాల్పడే వాళ్ళమే. మనలో ప్రతివాడూ ఆయా వస్తువులను దొంగిలిస్తాడు, సొంతానికి వాడుకొంటాడు, దాచి పెట్టుకొంటాడు, దుర్వినియోగం చేస్తాడు, నాశం చేస్తాడు. ఈ పాపాలన్నీ సమాజంమీద సోకుతాయి.

అసలు పూర్తిగా వ్యక్తిగతమైన పాపమనేది లేనేలేదు. మనంచేసే ప్రతి పాపంకూడ కొంతవరకైనా తోడి జనాన్ని బాధిస్తుంది. ఉదాహరణకు, మన హృదయంలో వుండే ద్వేషభావాలు కేవలం మన వ్యక్తిగతమైన పాపాలు అనుకొంటాం. ఐనా వాటిద్వారా మనం మన చుట్టుపట్లవుండే సమాజానికి హాని తలపెడుతున్నాం. కనుక మన ద్వేషభావాల ప్రభావం సమాజం మీద కూడ వుంటుంది. ప్రతిపాపమూ ఈలాగే. మనం గుర్తించినా గుర్తించకపోయినా మానవజాతి అంతా ఒక్కసమాజం, ఒక్క దేహం. ఈ సమాజంలో ఒకరి పాపం మరొకరిమీద సోకుతుంది. ఒకరి పుణ్యం గూడ మరొకరి మీద సోకుతుంది.

మనం చేసే ప్రతి పాపము తోడి జనంలో వసించే క్రీస్తుని మళ్లా సిలువ వేస్తుంది. ఈ తోడి జనమే శ్రీసభ. కనుక పాపియైనవాడు శ్రీసభద్వారా దేవునినుండి మన్నింపు

పొందాలి. అందుకే మన పాపోచ్చారణం వ్యక్తిగతమైంది కాదు, శ్రీసభ ద్వారా జరిగేది. కనుక మన పాపంలో సామూహిక గుణం కూడ వుందని గుర్తించాలి. అనగా మన పాపం వ్యక్తిగతంగా మనలను బాధించేది మాత్రమేకాదు మన నాటి సమాజాన్ని గూడ బాధించేదని గమనిస్తే చాలు.

## 4. చావైనపాపమూ స్వల్పపాపమూ

అన్నిపాపాలు ఘోరమైనవి కావు. విశ్వాసులకు పాపాల్లో వుండే తారతమ్యం కొంతవరకైనా తెలిసివుండాలి. మనపాపాలు చావైనవి స్వల్పమైనవి అని రెండు రకాలుగా వుంటాయి. చావైనపాపంలో మూడంశాలుండాలి. మొదటిది, మనం చేసిన కార్యం ఘనమైనదిగా వుండాలి. రెండవది, మనం చేసేది పాపకార్యమని మనకుబాగా తెలిసివుండాలి. మూడవది, ఒకరి నిర్బంధం వలనగాక మనంతట మనమే స్వేచ్ఛగా ఆ పని చేసి వుండాలి.

చావైన పాపం చేసినపుడు సృష్టికర్తనుండి వైదొలుతాం. సృష్టివస్తువులవైపు మనసు త్రిప్పుకొంటాం. స్వల్పపాపం చేసినపుడు సృష్టివస్తువులవైపు మనసు త్రిప్పుకొంటాం గాని సృష్టికర్త నుండి మాత్రం పూర్తిగా వైదొలగం. కనుక స్వల్పపాపంలో దేవుడూ సృష్టివస్తువులూ రెండూ కావాలని కోరుకొంటాం.

బైబులు పాపాన్ని పేర్కొంటుందిగాని చావైన పాపానికీ స్వల్పపాపానికీవుండే వ్యత్యాసాన్ని ఎక్కడా వివరించదు. ఐనా కొన్నిపాపాలు మనలను దైవరాజ్యంనుండి వైదొలగిస్తాయని చెప్తుంది-1కొరి 6,9-10. మత్త 25,41-46. ఇవే చావైన పాపాలు. యాకోబు జాబు మనమందరమూ చాల తప్పులు చేస్తామని చెప్తుంది-3,2. ఇవే స్వల్పపాపాలు.

చావైన పాపంలో దేవుణ్ణి నిరాకరిస్తాం. అతని ఆజ్ఞ మీరతాం. అతన్ని ప్రేమించం. కనుక ఈ పాపం చాలా ఘోరమైంది. స్వల్పపాపంలో ఐతే దేవుని ఆజ్ఞలను మీరినా అతన్ని ప్రేమిస్తూనే వుంటాం. సంసార జీవితంలో భార్య భర్తనుండి పూర్తిగా విడిపోవడంలాంటిది చావైన పాపం. ఈ పాపంలో మనకు దేవునితోవుండే సంబంధం తెగిపోతుంది. సంసార జీవితంలో భార్యాభర్తలు తగవులాడి ఎడమొగం పెడమొగంగా వుండడంలాంటిది స్వల్పపాపం. ఈ పాపంలో మనకు దేవునితో వుండే సంబంధం తెగిపోదు.

చావైన పాపమనేది దేవునితో పూర్తిగా తెగత్రెంపులు చేసికోవడమని చెప్పాం. మనం అకస్మాత్తుగా ఒక్కక్షణంలో చావైన పాపం చేయం. చాలాకాలం హృదయాన్ని

సృష్టివస్తువులవైపు పోనిస్తూంటాం. ఫలితంగా అది ఓ క్షణాన పూర్తిగా సృష్టివస్తువులకు అంటిపెట్టుకొంటుంది. సృష్టికర్తను పూర్తిగా నిరాకరిస్తుంది. అనగా చావైన పాపానికి ముందుగా చాలా స్వల్పపాపాలు కట్టుకొని వుంటాం. అలాగే చావైన పాపానికి పశ్చాత్తాపపడ్డమనేదిగూడ దిఢీలున ఒక్కక్షణంలో జరుగదు. నరుడు నిదానంగా, అడుగుతర్వాత అడుగు వేసికొంటూగాని సృష్టి వస్తువులనుండి సృష్టికర్తవద్దకు తిరిగాడు.

సామాన్యంగా చావైనపాపం చేయడం అంత సులభం కాదు. విశేషంగా భక్తితో జీవించేవాళ్లు అరుదుగా గాని చావైన పాపం కట్టుకోరు. పాపావకాశం తటస్థించినపుడు కూడ వరప్రసాద బలం వాళ్ళను ఆదుకొంటుంది. కనుక మామూలుగా చావైన పాపాలు మన మనుకొన్న దానికంటె తక్కువగానే వుంటాయి.

ఇక, స్వల్పపాపం చిన్నదైనా గూడ అదీ పాపమే. దేవుడు దాన్ని గూడ అసహ్యించుకొంటాడు. కనుక మనం సులువుగా ఈ పాపానికి లొంగకూడదు. దీనివల్ల మనలోని దైవప్రేమా వరప్రసాదమూ సన్నగిల్లిపోతాయి. చాల నీటి బొట్లు పెద్ద వెల్లువగా తయారైనట్లు చాల స్వల్పపాపాలు చావైన పాపానికి దారితీస్తాయి. మాటిమాటికీ సులువుగా స్వల్పపాపాల్లో పడిపోయే క్రైస్తవుని చిత్తశుద్ధిని శంకింపవలసి వుంటుంది.

నేడు నైతికశాస్త్రవేత్తలు పైనచెప్పిన చావైన పాపమూ స్వల్పపాపమూ మాత్రమేగాక "చావును తెచ్చిపెట్టేది" అనే మూడవ రకం పాపం గూడ వుంటుందని చెప్తున్నారు. ఈ పాపాన్ని నరుడు చనిపోయే సమయంలో చేస్తాడు. చనిపోయే గడియలో కొందరు నరులు దేవుణ్ణి బుద్ధిపూర్వకంగా నిరాకరిస్తాడు. ఇక పశ్చాత్తాపపడరు, మనసు మార్చుకోరు. ఈ నిర్ణయంవల్ల వాళ్లు ఆధ్యాత్మికమైన చావును తెచ్చిపెట్టుకొంటారు. ఇక వాళ్ళకు మోక్షప్రాప్తి గాని దైవదర్శనంగాని వుండవు. అయినా ఈ మూడవరకం పాపాన్ని గూర్చి వేదశాస్త్రుల్లో ఏకాభిప్రాయం గోచరించదు.

## ప్రార్థనా భావాలు

1. పాపమంటే దేవుని ఆజ్ఞలను మీరడమా లేక ఆ దేవుని ప్రేమను నిరాకరించడమా? కొంతమంది దేవుని కట్టడలను మీరడమే పాపమనుకొంటారు. ఈ భావం కలవాళ్లు దేవుణ్ణి అట్టే స్మరించుకోరు. దేవుని ఆజ్ఞలను మాత్రం స్మరించుకొంటారు. పూర్వవేదపు యూదులు ఈలాగే చేసారు. కాని ఇది ఉత్తమపద్ధతి కాదు. పాపమంటే ప్రధానంగా దేవుని ప్రేమను ధిక్కరించడం. ఓ తండ్రిలాంటివాడైన ఆ ప్రభువుని ద్వేషించడం. కనుక మనం పాపాన్ని గూర్చి తలంచేపుడు దేవుని కట్టడలను మీరాము అనుకోవడం కంటె అతని ప్రేమను త్రోసిపుచ్చాము అనుకోవడం

మెరుగు. క్రీస్తుని ఎరుగనని బొంకినందుకు పేత్రు వెలుపలికి వెళ్ళి వెక్కివెక్కి యేడ్చాడు. - లూకా 22,62. దూర దేశాలనుండి తిరిగివచ్చిన దుడుకుచిన్నవాడు "తండ్రీ! నేను నీకు ద్రోహం చేసాను. ఇకమీదట నీ కుమారుణ్ణి అనిపించు కోవడానికి తగను" అని విన్నవించుకొన్నాడు - లూకా 15,21. పాపాన్ని అర్థం చేసుకోవడానికి ఇవి మంచి ఉదాహరణలు.

2. పాపంలో నరుడు భగవంతుని నుండి వైదొలగి సృష్టివస్తువుల వైపు వెళ్తాడని చెప్పాం. కాని ఈ సృష్టివస్తువులన్నిటిలోను నరునికి తానంటేనే ఎక్కువ ఇష్టం. కనుక పాపంలో ఎప్పుడు గూడ స్వార్థమనేది వుంటుంది. నరుడు తనను తాను అతిగా ప్రేమించుకొని భగవంతుణ్ణి నిరాకరిస్తాడు. ఈ భావాన్నే అగస్టీను భక్తుడు ఈలా చెప్పాడు. "యెరూషలేము బాబిలోను అని రెండు పట్టణాలున్నాయి. యెరూషలేము దేవుని నగరం. స్వర్గంలోనిది. బాబిలోను పిశాచనగరం. భూమిమీదిది. భూలోక పట్టణమైన బాబిలోనును నిర్మించేవాళ్ళు తమ్ముతాము ప్రేమించుకొని దేవుణ్ణి ద్వేషిస్తారు. పరలోక పట్టణమైన యెరూషలేమును నిర్మించేవాళ్ళు తమ్ముతాము ద్వేషించుకొని దేవుణ్ణి ప్రేమిస్తారు." కనుక మనలను మనం ప్రేమించుకొని దేవుణ్ణి నిరాకరించడం పాపం.

3. చాలమంది క్రైస్తవులు పాపాన్ని లెక్కచేయరు, పశ్చాత్తాపపడరు. అతి సులువుగా పాపం చేస్తారు. ఈలాంటివాళ్ళకు బైబులు భగవంతుడు అసలు అనుభవానికి రాలేదనే చెప్పాలి. ఆ ప్రభువు మహాపవిత్రుడు. పాపాన్ని సంపూర్ణంగా అసహ్యించుకొనేవాడు. అతన్ని కొలిచేభక్తులమైన మనంకూడ పవిత్రంగా జీవించాలని కోరుకొనేవాడు - లేవీ 19,2. అర్చ్యశిష్టులకు పాపచింతనం అత్యధికంగా వుండేది. వాళ్ళు తాము పాపులమనీ, ఆపాపంవల్లనే పవిత్రుడైన భగవంతుడికి యిష్టులం కాలేకపోతున్నామనీ తలంచి బాధపడేవాళ్ళు. తమ పాపాలకు రేయింబవళ్ళు పశ్చాత్తాపపడేవాళ్ళు. చావైన పాపంచేయడం కంటె చనిపోవడం మేలని యెంచేవాళ్ళు. ఈ పాపచింతనం కొద్దోగొప్పో లేకపోతే మనం యథార్థమైన క్రైస్తవులం కానేకాదు.

4. పాపంవల్ల దేవుని ఆగ్రహానికి గురౌతామని చెప్తుంది బైబులు - ఎఫె 2,3. దేవుడు మనలను అసహ్యించుకోకపోయినా మనలోని పాపాన్ని మాత్రం తప్పక అసహ్యించుకొంటాడు. కనుక మనకు పాపంమీద ఏవగింపు రోతా పుట్టాలి.

5. చాలమంది తప్పుజేసికూడ తోడి నరుల యెదుట ఆ తప్పుని ఒప్పుకోరు. అలాగే కొందరు దేవుని యెదుట కూడ తమ తప్పుని ఒప్పుకోరు. ఇది చాల చెడ్డపద్ధతి. దావీదు బత్షెబాతో పాపం చేసాడు. నాతాను ప్రవక్త అతన్ని మొగంవాచేలా చీవాట్లు పెట్టాడు. వెంటనే దావీదు బుద్ధితెచ్చుకొని నేను ప్రభువుని ధిక్కరించి పాపం చేసాను అని పల్కి పశ్చాత్తాపపడ్డారు - 2సమూ 12,13. మనం పాపాన్ని ఒప్పుకోవలసిన తీరు ఇది.

6. మన తరపున మనం పాపులైన తోడినరులను ఏలాంటి పరిస్థితుల్లోను అసహ్యించుకోగూడదు. వాళ్ళను సానుభూతితో అర్థం చేసుకోవటం నేర్చుకోవాలి. వాళ్ళలోని పాపగుణాలే మనలో గూడ వున్నాయి. కనుకనే అసిస్సీ ఫ్రాన్సిస్ భక్తుడు ఓ పర్యాయం ఉరికంబమెక్కిన ఓ దోషిని జూచి "దేవుని అనుగ్రహమేగనక లేకపోతే నేడు ఫ్రాన్సిస్ గూడ ఇదే స్థానంలో ఉండేవాడే" అని పల్కాడు.

# 3. పశ్చాత్తాపం

నరుడు దేవుణ్ణి ధిక్కరించి పాపం చేస్తుంటాడు. కాని ప్రభువు అనుగ్రహం అతని కండ్లు తెరిపిస్తుంది. అతడు పశ్చాత్తాపపడతాడు. భగవంతుడు కోరుకొనేది కూడ నరుడు పశ్చాత్తాపపడాలనే. ఈ యధ్యాయంలో పశ్చాత్తాపాన్ని పరిశీలించి చూద్దాం. ఇక్కడ మూడంశాలు ప్రస్తావిద్దాం.

## 1. పశ్చాత్తాపాన్ని గూర్చిన బైబులు బోధలు

1. పాపంద్వారా నరుడు దేవుణ్ణి ధిక్కరిస్తాడనీ దేవుని నుండి దూరంగా వైదొలగిపోతాడనీ చెప్పాం. పశ్చాత్తాపం ద్వారా అతడు నరులతో ప్రేమతో నిబంధనం చేసికొన్న దేవుని దగ్గరికి మళ్ళా తిరిగివస్తాడు. పూర్వం తాను ఏతండ్రి యింటినుండి వెళ్ళిపోయాడో ఆ యనురాగపు తండ్రి యింటికి తిరిగి వచ్చి అతనితో రాజీపడతాడు. దుడుకుచిన్నవాడు ఇందుకు చక్కని నిదర్శనం. ఆ దుడుకుచిన్నవాడిలాగే పాపి గూడ తండ్రియైన దేవుని దగ్గరికి మరలివచ్చి తన పాపాన్ని ఒప్పుకొంటే అది మంచి పశ్చాత్తాపమౌతుంది. కీర్తనకారుడు కూడ "దేవా! నా పాపాన్ని నీయెదుట ఒప్పుకొన్నాను. నేను నా దోషాన్ని కప్పిపెట్టుకోలేదు. నేను నా పాపాలను దేవునికి విన్నవించుకొంటాను అనుకొన్నాను. కనుక నీవు నా యపరాధాలను మన్నించావు" అని పల్కాడు - 32,5.

2. యూదులు తమ పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొనేపుడు కొన్ని బాహ్య క్రియలద్వారా పశ్చాత్తాపాన్ని వెలిబుచ్చేవాళ్ళు. అవి ఉపవాసముండడం, గోనెపట్ట

కట్టుకోవడం, తలమీద బూడిద చల్లుకోవడం, బట్టలు చించుకోవడం, పెద్దగా యేడ్వడం మొదలైనవి. వాళ్లు ఈ క్రియలను సామూహిక ఆరాధనల్లో ప్రదర్శించేవాళ్ళు. కాని ప్రవక్తలు ఇటువంటి బాహ్యక్రియలకు అంతగా విలువనీయలేదు. ఆ భక్తులు హృదయగతమైన పశ్చాత్తాపం ఉత్తమమైందని బోధించారు. యోవేలు ప్రవక్త "మీరు పూర్ణహృదయంతో నావద్దకు తిరిగి రండి. మీబట్టలను మాత్రమే చించుకొంటే చాలదు. మీ హృదయాలనుగూడ చించుకోవాలి" అన్నాడు - 2,13. ప్రభువు దహనబలులవలన సంతృప్తిచెందదనీ పశ్చాత్తాపతప్తమైన హృదయమే ఉత్తమమైన బలి అనీ వాకొన్నాడు కీర్తనకారుడు - 51,16-17. హృదయానికి సున్నతి జరగాలి అన్నాడు యిర్మీయా - 9,25. అనగా నిజమైన పశ్చాత్తాపం కర్మకాండలో గాదు హృదయంలో వుంటుందని భావం.

3. నరుడు తనంతట తాను పరివర్తనం చెందలేడు. భగవంతుని వద్దకు తిరిగిరాలేడు. ప్రభువే పాపిని కరుణించి తన వరప్రసాదంతో అతన్ని తనవద్దకు రాబట్టుకొంటాడు. కనుకనే యిర్మీయా ప్రవచనంలో ప్రజలు "ప్రభూ! నీవు మమ్ము నీ చెంతకు రాబట్టుకొంటే మేము నీ దగ్గరికి తిరిగి వస్తాం" అన్నారు - 31,18. యెహెజ్కేలు ప్రవక్త ప్రభువు తన ఆత్మద్వారా నరుల హృదయాలను మారుస్తాడని చెప్పాడు. "నేను మీకు క్రొత్త హృదయాన్ని ప్రసాదిస్తాను. క్రొత్త యాత్మను మీలో నెలకొల్పుతాను. మీలో నుండి రాతిగుండెను తీసివేసి దానిస్థానే మాంసపు గుండెను నెలకొల్పుతాను. నాయాత్మను మీ మీదికి పంపి మీరు నా యాజ్ఞలనూ విధులనూ పాటించేలా చేస్తాను. నేను మీ పితరుల కిచ్చిన గడ్డమీద మీరు వసిస్తారు. మీరు నా ప్రజలౌతారు, నేను మీ దేవుడనౌతాను" - 36,26-28. ఇవి పూర్వవేదంలోని అతిప్రశస్త వాక్యాల్లో చేర్చదగినవి. ప్రభువు నరుల హృదయాలను మార్చందే వాళ్ళంతట వాళ్ళకు పశ్చాత్తాపం పుట్టదని ఈ వాక్యాల భావం. 51వ కీర్తనను వ్రాసిన భక్తుడు కూడ "ప్రభూ! నాలో నిర్మల హృదయాన్ని సృజించు" అని ప్రార్థించాడు - 51,10. అనగా హృదయశుద్ధి అనేది మనవల్ల అయ్యే పనికాదు. దేవుడే దాన్ని వరంగా ప్రసాదించాలి. ఓ నూత్న సృష్టిగా దయచేయాలి.

4. నిజమైన పశ్చాత్తాపానికి గుర్తు సాంఘిక అన్యాయాలను మానుకోవడం. నరుడు పరపీడనాన్ని విడనాడాలి. అప్పుడు అతడు నిజంగా పశ్చాత్తాపపడినట్లు. కనుకనే యెషయా

"దరిద్రులను పీడించే బంధాలను తొలగిస్తే
వాళ్ళ మెడమీది అన్యాయపు కాడిని తొలగిస్తే
వాళ్ళకు స్వాతంత్ర్యం ప్రసాదిస్తే

అదే నాకు నచ్చిన ఉపవాసం,
మీ భోజనాన్ని పేదలకు గూడ వడ్డిస్తే
దిక్కులేని వారికి ఆశ్రయమిస్తే
దీనులకు బట్టలు కట్టబెడితే
అక్కరలో ఉన్న తోడిజనాన్ని ఆదుకొంటే
అదే నాకు నచ్చిన వుపవాసం"

అన్నాడు - 58,6-7

5. ఇక నూత్నవేదాన్ని తీసికొంటే, స్నాపక యోహాను హృదయపరివర్తనం చెంది పాపక్షమాపణ పొందాలని బోధించాడు - మార్కు 1,4. ఈ హృదయ పరివర్తనమనేది పూర్వవేదంలోని భావమే. పాపి దేవుని దగ్గరికి తిరిగిరావడమే హృదయపరివర్తనమని గూడ చెప్పాం. క్రీస్తు వచ్చినపుడు అతడు కూడ పై యోహాను వాక్యంతోనే తన బోధను ప్రారంభించాడు. దైవరాజ్యం సమీపించింది కనుక ప్రజలు హృదయపరివర్తనం చెందాలి అని బోధించాడు - మార్కు 1,15. దైవరాజ్యమంటే క్రీస్తే. కనుక ప్రజలు హృదయం మార్చుకొని మెస్సీయాయైన తన్నంగీకరించి రక్షణం పొందాలని క్రీస్తు భావం. అతడు ముఖ్యంగా హృదయ పరివర్తన చెందడానికి పాపులను పిలువవచ్చినవాడు - లూకా 5,32.

క్రీస్తు భావాల ప్రకారం పశ్చాత్తాపమనేది ప్రధానంగా హృదయగతమైంది. దుష్టత్వం హృదయంలో వుంటుంది - మత్త 15,18-20. అలాగే పశ్చాత్తాపం కూడ హృదయంలో వుంటుంది. పరితాపంద్వారా హృదయాన్ని నిర్మలం చేసికొన్నవాళ్లు దేవుణ్ణి దర్శిస్తారు - మత్త 5,8. మంచి చెట్టుకి మంచిపండ్లు కాచినట్లే మంచిహృదయంనుండి మంచికార్యాలు వెలువడతాయి - 12,33. కనుక మన వుపవాసం, ప్రార్థనం, దానం మొదలైన భక్తిక్రియల్లో కూడ చిత్తశుద్ధి వుండాలి - 6,1-18.

చిత్తశుద్ధితోను పశ్చాత్తాప భావంతోను దేవుణ్ణి మన పాపాలు క్షమించమని అడిగితే అతడు మనలను తప్పక మన్నిస్తాడు. సుంకరి దేవా! పాపినైన నన్ను కరుణించు అని మనవిచేసాడు - లూకా 18,13. క్రీస్తు పాదాలు కడిగిన పాపాత్మురాలు ప్రేమభావంతో పశ్చాత్తాపపడింది కనుక ఆమె పాపాలు క్షమించబడ్డాయి - 7,47. దుడుకుచిన్నవాడు పాపులందరికంటె గూడ అధికమైన భక్తిభావంతో తండ్రీ! నేను నీకూ దేవునికీ ద్రోహం చేసాను. ఇక నీ కుమారుణ్ణి అనిపించుకోవడానికి తగను" అని పల్కాడు. ఈ వ్యక్తులందరూ మన పశ్చాత్తాపానికి ఆదర్శంగా వుంటారు.

6. పాపపరిహారానికీ ఆత్మకీ సంబంధం వుంది. మన పాపాలకు హృదయంలో పశ్చాత్తాపం పుట్టించేదీ, ఆ పశ్చాత్తాపం ద్వారా మనం దేవునివద్ద నుండి మన్నింపుపొందేలా

చేసేదీ ఆత్మే. ఈ యాత్మను ఉత్థానక్రీస్తే మనకు దయచేస్తాడు. అతడు శిష్యులమీదికి పవిత్రాత్మను ఊది వాళ్ళకు పాపాన్ని మన్నించే అధికారాన్ని ప్రసాదిస్తాడు. కనుక పాపోచ్చారణమనే సంస్కారం ఆత్మద్వారా గాని పనిచేయదు - యోహా 20,22-23.

7. క్రీస్తు తర్వాత శిష్యులు కూడ పశ్చాత్తాపాన్ని బోధించారు. క్రీస్తు పశ్చాత్తాపపడి దైవవరాన్ని పొందాలని చెప్పాడు. కాని శిష్యులు బోధించినపుడు ప్రజలు పశ్చాత్తాపపడి క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందాలని చెప్పారు - అచ 2,38. క్రీస్తుతో దైవరాజ్యం రానే వచ్చింది. ప్రజలు ఆ దైవరాజ్యంలో చేరే మార్గం జ్ఞానస్నానాన్ని పొందడమే. ఈ జ్ఞానస్నానం ద్వారా వాళ్ళకి పాపపరిహారమూ ఆత్మప్రాప్తీ కలుగుతుంది.

పూర్వవేదంలో భక్తులు తమ జాతితో ప్రేమభావంతో నిబంధనం చేసికొన్న యావే ప్రభువుని తలంచుకొని పశ్చాత్తాపపడ్డారు. ఈ ప్రభువు నూత్నవేదంలో క్రీస్తు ద్వారా మన పాపాలను పరిహరిస్తాడు. కనుక మనపట్లగల ప్రేమచే సిలువ మీద ప్రాణాలర్పించిన క్రీస్తుని తలంచుకొని నూత్నవేదం లోని భక్తులు పశ్చాత్తాపపడాలి. "అతడు నన్ను ప్రేమించి నా కొరకు ప్రాణత్యాగం చేసికొన్నాడు" అన్న పౌలు భావం మనకు ప్రేరణం కలిగించాలి - గల 2,20. పేత్రులాగే మనం కూడ దేవుని యెదుట హృదయం విప్పి బోరున యేడ్వాలి - లూకా 22,62.

## 2. రెండు ముఖ్యమైన వేదవాక్యాలు

నూత్నవేదంలో రెండు సందర్భాల్లో ప్రభువు పాపపరిహారాన్ని గూర్చి మాట్లాడాడు. నేడు మనం పాటించే పాపోచ్చారణానికి ఇవే ఆధార వాక్యాలు. కనుక ఇక్కడ ఈ రెండు వాక్యాల భావాన్ని సంగ్రహంగా పరిశీలించి చూద్దాం.

1. క్రీస్తు పండ్రెండుమంది శిష్యులకూ పాపాలను మన్నించే అధికారం దయచేసాడు. "భూలోకంలో మీరు ఏమి బంధిస్తారో అవి పరలోకంలోను బంధింపబడతాయి. భూలోకంలో మీరు ఏవి విప్పుతారో అవి పరలోకంలోను విప్పబడతాయి" - మత్త 18,18. ఇదే భావం మత్తయి 16,19లో కూడ కన్పిస్తుంది. "బంధించడమూ" "విప్పడమూ" అనేవి యూదుల రబ్బయిలువాడే పారిభాషిక పదాలు. ధర్మశాస్త్రాన్నీ మతాచరణాన్నీ పురస్కరించుకొని రబ్బయిలు యూదసమాజంలో కొన్ని కార్యాలను నిషేధించేవాళ్ళు. యూదులు వీటిని చేయకూడదు. దీనికే "బంధించడం" అని పేరు. అలాగే రబ్బయిలు కొన్ని కార్యాలను అనుమతించేవాళ్లు. యూదులు వీటిని చేయవచ్చు. దీనికే "విప్పడం" అని పేరు. ఈ లోకంలో రబ్బయిలు జారీచేసిన నిషేధాలుకాని అనుమతులుకాని పరలోకంలో దేవుని యెదుటకూడ చెల్లుతాయని యూదుల భావం.

ఇక, ఇక్కడ క్రీస్తు యూదుల సంప్రదాయాన్ని మనసులో పెట్టుకొని మాట్లాడాడు. ఆ యూదుల రబ్బయిలు యూదసమాజంలోలాగే, పండ్రెండుమంది శిష్యులు కూడ క్రైస్తవసమాజంలో కొందరి పాపాలను బంధిస్తారు. అనగా ఆ పాపాలకు మన్నింపు వుండదు. కొందరి పాపాలను విప్పుతారు. అనగా ఆ పాపాలకు మన్నింపు వుంటుంది. పాపాలను మన్నించడంలో గాని మన్నింపకపోవడంలోగాని శిష్యులకు పూర్తి అధికారం వుంది. ఇక శిష్యుల అధికారాన్ని వాళ్ళ అనుయాయులైన పోపుగారు మేత్రాణులు గురువులు మొదలైన వాళ్ళంతా పొందుతారు. నేటి మన పాపోచ్చారణ సంస్కారానికి ఇది ఓ ఆధారవాక్యం.

యూదరబ్బయిలు పై నిషేధాలతో కొందరిని యూద సమాజంనుండి బహిష్కరించేవాళ్లు. పై అనుమతులతో వాళ్లను మళ్ళా యూదసమాజంలోకి రానిచ్చేవాళ్ళు. ఈలాగే తొలి క్రైస్తవ సమాజంలో పోపుగార్లు మేత్రాణులు మొదలైన అధికారుల పాపులైన క్రైస్తవులను ఆరాధన సమాజం నుండి బహిష్కరించారు. వాళ్లు పూజలో పాల్గొనగూడదు, సత్ప్రసాదం పుచ్చుకోగూడదు. ఈ పోపులు తమ పాపాలకు పశ్చాత్తాపపడి ప్రాయశ్చిత్తం చేసికొన్నాక ఆరాధన సమాజంలోనికి పునఃప్రవేశించవచ్చు. అప్పుడు ఆ విశ్వాసులు పూజలో పాల్గొని సత్ప్రసాదం పుచ్చుకొనేవాళ్లు. ఈలా బహిష్కరణమూ పునఃప్రవేశమూ అనేవి యూదసమాజానికీ తొలినాటి క్రైస్తవ సమాజానికీ గూడ వర్తించేవి. ఇప్పటి క్రైస్తవ సమాజంలో ఇవిలేవు.

2. ఉత్థాన క్రీస్తు శిష్యులతో "మీకు సమాధానం కలగాలి. తండ్రి నన్ను పంపినట్లే నేనూ మిమ్ము పంపుతున్నాను" అని చెప్పాడు. అలా చెప్పి వారి మీద తన శ్వాసను ఊది "పవిత్రాత్మను పొందండి. మీరు ఎవరి పాపాలు క్షమిస్తారో అవి క్షమింపబడతాయి. ఎవరి పాపాలు క్షమింపరో అవి క్షమించబడవు" అని పల్కాడు - యోహా 20,21-23. నేటి మన పాపోచ్చారణ సంస్కారానికి ఇదికూడ ఓ ఆధారవాక్యం.

ఈ వాక్యం భావం ఇది. తండ్రి క్రీస్తుని ఉత్థానంచేసి అతనిద్వారా నరుల పాపాలను మన్నించాడు. ఈ మన్నింపు వల్లనే నరులకు సమాధానం కలిగింది. పాపాలను పరిహరించడానికే క్రీస్తు విచ్చేసాడు - 1యోహా 3,5. క్రీస్తు తన తరపున తాను శిష్యులద్వారా ఈ పాపపరిహారమనే కార్యాన్ని కొనసాగించుకొంటూ పోతాడు. కనుక తండ్రి తన్ను పంపితే, తన తరపున తాను శిష్యులను పంపుతున్నాడు. తండ్రి క్రీస్తులో వుండి నరులపాపాలను క్షమిస్తాడు. అలాగే యిప్పుడు క్రీస్తు శిష్యుల్లో వుండి ప్రజల పాపాలను క్షమిస్తాడు. ప్రభువు శిష్యులమీదికి పవిత్రాత్మను ఊదాడు. పాపపరిహారం జరిగేదీ నూత్నజీవం నెలకొనేదీ ఈయాత్మ ద్వారానే. కనుక శిష్యులు ఆత్మసాన్నిధ్యంతో నరుల పాపాలను మన్నించి వాళ్ళకు క్రొత్త జీవాన్ని దయచేస్తారు. ఆత్మద్వారా పాపపరిహారం

జరుగుతుంది. ఇక శిష్యులు పొందిన పాపపరిహారాధికారాన్నే వాళ్ళ అనుయాయులైన పోపుగార్లు మేత్రాణులు గురువులు మొదలైన వాళ్లుకూడ పొందుతారు.

## 3. ప్రోటస్టెంటులు చెప్పే అర్థం

పైన మనం పేర్కొన్న వేదవాక్యాలు రెండూ పాపోచ్చారణ సంస్కారానికి ఆధారమని చెప్పాం. ఈ వాక్యాలను ఆధారంగా తీసికొని తొలిశతాబ్దాల నుండి క్రైస్తవ సమాజం ఈ సంస్కారాన్ని కొనసాగించుకొంటూ వస్తూంది. కాని 16వ శతాబ్దంలో చీలిపోయిన ప్రోటస్టెంటు క్రైస్తవులు పాపోచ్చారణ సంస్కారాన్ని అంగీకరించరు. మరివాళ్ళు పై వాక్యాలకి ఏలా అర్థం చెప్తారు?

ప్రోటస్టెంటు నాయకుల భావాల ప్రకారం "మీరెవరి పాపాలను క్షమిస్తారో అవి క్షమింపబడతాయి" అంటే పాపోచ్చారణ సంస్కారాన్ని జరిపించాలని భావం కాదు. పాప పరిహారాన్ని గూర్చి ప్రజలకు బోధించాలని భావం. ఇక్కడ క్రీస్తు ఉద్దేశించింది సంస్కారంగాదు, సువిశేషబోధ మాత్రమే. ఇందుకు ఆధారంగా లూకా సువార్తలో "ఆయన పేరిట హృదయ పరివర్తనమూ పాపక్షమాపణమూ ప్రకటింపబడతాయి" అనే వాక్యం వుంది - 24,47.

ఈ వాదానికి మన సమాధానం ఇది. క్రీస్తు మన పాపాలను పరిహరిస్తాడని మనం ప్రజలకు బోధ చేయాలని లూకా సువిశేషం చెప్పినమాటనిజమే. మనం ఈ బోధ తప్పకచేయాలి. కాని కొందరు అధికారులు ఒక సంస్కారం ద్వారా ప్రజల పాపాలను పరిహరిస్తారని గూడ యోహాను సువిశేషం ప్రత్యేకంగా పేర్కొంటుంది. దీనికి అనుగుణంగానే తొలి శతాబ్దాల నుండి క్రైస్తవసమాజం పాపోచ్చారణ సంస్కారాన్ని నిర్వహిస్తూ వచ్చింది. కేవలం 16వ శతాబ్దంలో వచ్చినవాళ్లు అంతకు పూర్వంనుండీ వాడుకలోనున్న ఈ సంస్కారాన్ని కాదంటే కుదరదు. ప్రోటస్టెంటులు వాదించినట్లు క్రీస్తు పాపోచ్చారణ సంస్కారాన్ని కాక పాపపరిహార బోధను మాత్రమే ఉద్దేశించినట్లయితే "మీరు ఎవరి పాపాలు క్షమించరో అవి క్షమించబడవు" అనే పై యోహాను వాక్యానికి అర్థమేమిటి? పాపాలు క్షమించబడవు అని మనం సువిశేష బోధలో చెప్తామా? కనుక యోహాను 20,21-23ను పాపోచ్చారణ సంస్కారంగా అర్థంజేసికోవాలిగాని కేవలం సువిశేష బోధగా అర్థంచేసికోగూడదు.

ఈ సందర్భంలో పాపోచ్చారణ సంస్కారాన్ని అర్థం చేసికొనే తీరులో ప్రోటస్టెంటులకూ మనకూ వుండే ప్రముఖ వ్యత్యాసాలనుగూడా గమనించాలి.

1. మన దృష్టిలో శ్రీసభ అధికారపూర్వకంగా పాపోచ్చారణ సంస్కారాన్ని నిర్వహిస్తుంది. శ్రీసభ దేవుని కృపతో అధికారపూర్వకంగా మన పాపాలను మన్నిస్తుంది. ప్రోటస్టెంటులు ఈలాంటి అధికారాన్ని దేన్ని అంగీకరించరు. వాళ్ళ భావాలప్రకారం వాక్యాన్ని ప్రకటించినపుడు పాపి హృదయంలో విశ్వాసం జనిస్తుంది. ఈ విశ్వాసమే అతని పాపాలను మన్నిస్తుంది. అంతేగాని ఎవరూ అధికారపూర్వకంగా ఎవరి పాపాలనూ మన్నించరు.

2. మన దృష్టిలో పాపోచ్చారణ సంస్కారం పాపి పాపాలను హరిస్తుంది. పాపి పశ్చాత్తాపమూ, పాపోచ్చారణమూ, ప్రాయశ్చిత్తం చెల్లించడం అనేక్రియలుకూడ అతని పాపపరిహారానికి తోడ్పడతాయి. ప్రోటస్టెంటుల దృష్టిలో పాపోచ్చారణ సంస్కారం పాపి పాపాలను మన్నించదు. అసలు అది సంస్కారమే కాదు. వాక్యాన్ని ప్రకటించినపుడు పాపి హృదయంలో విశ్వాసం పుడుతుంది. ఈవిశ్వాసమే అతనికి పాపపరిహారం చేసిపెడుతుంది. పాపి పశ్చాత్తాపము మొదలైన క్రియలు పాపాన్ని ఎంతమాత్రం పరిహరించలేవు.

3. మన దృష్టిలో పాపాలను మన్నించేది గురువు. ఆ గురువు కూడ పీఠాధిపతినుండి అధికారం పొందివుండాలి. ప్రోటస్టెంటుల దృష్టిలో ఒక్క గురువేకాదు ఎవరైనా పాపపరిహారక్రియలో తోడ్పడవచ్చు. గృహస్థులు స్త్రీలు పిల్లలు మొదలైన వాళ్ళు కూడా ఈలా తోడ్పడవచ్చు.

## ప్రార్థనా భావాలు

1. మనం ఒకోసారి పెద్దపాపాలు చేస్తాం. ఆ మీదట దేవుడు మన పాపాలను క్షమిస్తాడోలేదో అని శంకిస్తాం. నిరాశ చెందుతాం. ఆత్మహత్యకు కూడ పాల్పడతాం. పూర్వం యూదా ఈలాగే చేసాడు - మత్త 26,3-5. కాని ఇది పొరపాటు. దేవుడు క్షమించని పాపాలు మనమేమీ చేయలేం. పశ్చాత్తాపపడితే చాలు ఎంత పెద్ద తప్పుకైనా పరిహారం వుంటుంది.

2. రక్షణాన్ని పొందాలంటే పశ్చాత్తాపం అవసరం. "నీవు పాపిని హెచ్చరించినా అతడు పరివర్తనం చెందకపోతే ఇక అతడు పాపిగానే చనిపోతాడు" అని పల్కాడు ప్రభువు యెహెజ్కేలు ప్రవచనంలో - 33,9. కనుక పశ్చాత్తాపం లేందే మోక్షప్రాప్తి లేదు.

3. సువిశేషం పరివర్తనం చెందిన భక్తులను చాలామందిని పేర్కొంటుంది. వాళ్ళంతా పశ్చాత్తాపంలో మనకు ఆదర్శంగా వుంటారు. ఉదాహరణకు పేత్రు - లూకా

26,62, సుంకరి - 18,13, జక్కయ - 19,8-9, పాపాత్మురాలు - 7,47, దుడుకు చిన్నవాడు-15,21, మంచి దొంగ -23,42-43.

4. సొలోమోనురాజు దేవాలయాన్ని నిర్మించి దానికి ప్రతిష్ట చేయించినపుడు గొప్ప ప్రార్థన చేసాడు. ప్రజలు ఆ దేవళానికి వచ్చి ప్రభువుని స్తుతించి క్షమాపణం అడుగుకొంటే ప్రభువు వాళ్ళ తప్పిదాలను మన్నించాలని ప్రార్థించాడు - 1రాజు 8,33-34. ఆ రాజు ఆశించినట్లే మనం దేవళంలోనికి వెళ్ళి మన తప్పిదాలను మన్నించమని ఆ ప్రభువుకి మొరపెట్టుకోవాలి.

# 4. పాపోచ్చారణ చరిత్ర

ఇప్పుడు మన క్యాతలిక్ సమాజంలో వ్యక్తిగతంగా గురువుతో పాపోచ్చారణం చేస్తాం. ప్రోటస్టెంటు సమాజాల్లో ఈ సంప్రదాయం వుండదు. అందువల్ల మనవాళ్లు పాపోచ్చారణమనేది శ్రీసభ చరిత్రలో మొదటినుండి వుందా అని అడుగుతుంటారు. కనుక పాపోచ్చారణ చరిత్రను క్షుణ్ణంగా తెలిసికొని వుండడం అవసరం. ఈ సంస్కారం చరిత్రలో మూడు దశలున్నాయి. మొదటిది 1-6 శతాబ్దాల వరకు. రెండవది 6నుండి 8వ శతాబ్దం వరకు. మూడవది 9వ శతాబ్దం నుండి ప్రస్తుతకాలం వరకు. ఇక ఈ దశలను క్రమంగా పరిశీలిద్దాం.

## 1. మొదటిదశ : బహిరంగ పాపోచ్చారణం

మొదటి శతాబ్దానికి చెందిన హెర్మసు అనే రచయిత పాపాన్నీ పశ్చాత్తాపాన్నీ పేర్కొన్నాడు. అతని భావాల ప్రకారం శ్రీసభను ఓ గోపురంలా నిర్మిస్తారు. పుణ్యాత్ములు ఈ గోపురాన్ని కట్టడానికి వుపయోగపడే రాళ్ళలాంటివాళ్ళు. ఈ కట్టడానికి పనికిరావని విసర్జించిన రాళ్ళలాంటివాళ్ళు పాపాత్ములు. ఐనా ఆ పాపాత్ములు పశ్చాత్తాపపడితే తాముగూడ గోపురాన్ని కట్టడానికి పనికివచ్చేరాళ్లు ఔతారు.

మొదటి శతాబ్దానికే చెందిన డిడాకే అనే గ్రంథం పాపోచ్చారణాన్ని పేర్కొంటుంది. ఈ క్రియద్వారా నరుడు ప్రార్థన చేసికోవడానికి, దివ్యసత్రప్రసాదాన్ని స్వీకరించడానికీ యోగ్యుడవుతాడని ఆ గ్రంథం చెప్తుంది.

ఇదే కాలానికి చెందిన వేదసాక్షి స్మిర్నా పోలికార్పు ఈ సంస్కారాన్ని గూర్చి వ్రాస్తూ పెద్దలు కరుణతో పాపాలు మన్నించాలనీ వాళ్ళుకూడ పాపభారం కలవాళ్లే కనుక ఇతరుల పాపాలను సానుభూతితో అర్థంచేసికోవాలనీ నుడివాడు.

వేదసాక్షియైన అంటియోకయ ఇన్యాసివారు 107 ప్రాంతానికి చెందినవాడు. అతడు పాపోచ్చారణం వలన దేవునితోను స్థానిక పీఠాధిపతితోను పునస్సమాధానం కలుగుతుందని వ్రాసాడు.

200 ప్రాంతంలో టెర్టూలియను అనే వేదశాస్త్రి ఈ పుణ్యక్రియను గూర్చి వ్రాస్తూ పాపోచ్చారణమనేది పాపిహృదయానికి సంబంధించిన క్రియయైనా అతడు దాన్ని బహిర్గతంగా వ్యక్తం చేయాలనీ అప్పుడు శ్రీసభ తన ప్రార్థనతోను సానుభూతితోను అతనికి సహాయం చేయగల్గుతుందనీ వాకొన్నాడు.

210లో అలెగ్జాండ్రియా క్లెమెంటు కొందరు భక్తులు పాపులను పాపోచ్చారణానికి సిద్ధం చేస్తున్నారని వ్రాసాడు. వాళ్లు తమ ప్రార్థనలద్వారాను సలహాలద్వారాను పాపులకు సహాయపడుతున్నారని చెప్పాడు. పాపాలను ఆలించే గురువు కూడ ఈ సహాయుల్లాగే మెలగాలని సూచించాడు.

253లో ఓరిజన్ అనే వేదశాస్త్రి పాపోచ్చారణాన్ని గూర్చి మాట్లాడుతూ విశ్వాసులందరూ కలసి పాపిని పాపాలు ఒప్పుకోవడానికి సిద్ధంచేయాలనీ, కడన పీఠాధిపతి అతని పాపాలను మన్నిస్తాడనీ చెప్పాడు. అతడు పీఠాధిపతిని పాపికి చికిత్సచేసే వైద్యునితో పోల్చాడు.

నాల్గవ శతాబ్దంలో భక్తుడు ఆంబ్రోసు పాపోచ్చారణమూ పాపక్షమాపణమూ ఆత్మద్వారా జరిగే క్రియలని వాకొన్నాడు.

ఐదవ శతాబ్దానికల్లా బహిరంగమైన పాపోచ్చారణ విధి బాగా ప్రచారంలోకి వచ్చింది. ఈ విధిలో చాలా అంశాలున్నాయి. 1. నరహత్య, వ్యభిచారం, మతపరిత్యాగం మొదలైన పెద్దపాపాలు చేసినవాళ్ళ జాబితాను సిద్ధం చేసేవాళ్ళు. వాళ్లు మొదట గురువుకి వ్యక్తిగతంగా పాపోచ్చారణ చేసేవాళ్లు. తరువాత తపస్సుకాలంలో వచ్చే విబూది బుధవారంనాడు పీఠాధిపతి గురువు విశ్వాసులు మొదలైనవాళ్ళందరి ముందు ఆ పాపులు పాపాత్ములబృందంలో చేరేవాళ్లు, 2. పీఠాధిపతి అందరిముందు ఆరాధన సమాజంనుండి వాళ్ళను బహిష్కరించేవాడు. ఇకవాళ్ళు పూజలో పాల్గొనగూడదు. దివ్యసత్ప్రసాదం పుచ్చుకోగూడదు. పాపంద్వారా శ్రీసభకు ద్రోహం చేసారు కనుక వాళ్ళను శ్రీసభనుండి వెలివేయడం జరిగేది. 3. ఆ పాపులు తపస్సు కాలమంతా తమ పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికోవాలి. ప్రార్థన చేసికోవడం, దానధర్మాలు చేయడం, ఉపవాసముండడం, సొంతంగా నిర్ణయించుకొన్న హింసీకరణ కర్మలను పాటించడం మొదలైనవి ఈ ప్రాయశ్చిత్తంలో భాగాలు. ఈ తపస్సుకాలంలో శ్రీసభ సభ్యులు వాళ్ళను మందలిస్తుండేవాళ్లు. వాళ్ళకు హితోక్తులు బుద్ధిమతులు చెప్తుండేవాళ్లు. తమ సదాదర్శంతోను ప్రార్థనలతోను వాళ్ళను

ఆదుకొంటూండేవాళ్ళు కూడ. 4. పాటులవారంలో వచ్చే పెద్ద బేస్తవారంనాడు ఈ పాపుల బృందాన్ని ప్రదక్షిణంతో దేవాలయంలోకి తీసికొనివచ్చేవాళ్ళు. పూజలో సువిశేష పఠనం ముగిసాక పీఠాధిపతి వాళ్ళకు దేవునితోను, తోడి విశ్వాసులతోను పునస్సమాధానం కలిగించేవాడు. అతడు దేవుడు వాళ్ళ పాపాలను మన్నించాలని విశ్వాసులందరి తరపున ప్రార్థనం చేసేవాడు. పాపుల పరిహారాన్ని పొంది పూజలో దివ్యసత్ర్పసాదాన్ని స్వీకరించేవాళ్ళు. ఇది బహిరంగమూ సామూహికమూ ఐన పాపోచ్చారణ విధి.

ఈ తంతుతో శ్రీసభ పాత్ర బాగా గోచరమయ్యేది. పాపులు శ్రీసభతో సమాధానపడితేనేగాని దేవునితో సమాధానపడరనే భావం స్పష్టమయ్యేది. పీఠాధిపతి ప్రముఖపాత్రను నిర్వహించేవాడు. పాపపరిహారాన్ని సంపాదించిపెట్టేది ప్రధానంగా పవిత్రాత్మ అనే భావంకూడ వ్యక్తమౌతుండేది.

ఈ బహిరంగ విధిలో పాల్గొనడానికి మామూలుగా పాపులు వాళ్ళంతట వాళ్ళే ముందుకి వచ్చేవాళ్లు. కాని గురువులూ మిత్రులూ పాపులను ప్రోత్సహించి వాళ్ళను ఈతంతులో పాల్గొనేలా చేయడంగూడ కొంతవరకు వుండేది. ఈ తంతులో పాపులు మొదట తమ పాపాలను వ్యక్తిగతంగాను రహస్యంగాను గురువుకి విన్నవించుకొనేవాళ్లు. గురువులు ఆ పాపాలను వెల్లడి చేయకూడదనే కట్టడకూడ వుండేది. ఈ యాజ్ఞను మీరిన కొందరు గురువులను 5వ శతాబ్దంలో పెద్దలియో పాపుగారు నిశితంగా మందలించారు కూడ. కొన్ని పర్యాయాలు పాపులు తామే స్వయంగా తమ పాపాలను బహిరంగంగా ఒప్పుకోవడం గూడ జరిగేది.

పాపులు ఈలాంటి బహిరంగ పాపోచ్చారణ విధిలో తమ జీవితంలో ఒక్కసారి లేక రెండుసార్లు మాత్రమే పాల్గొనేవాళ్ళు. అందుకే కొందరు పాపులు తమ జీవితాంతంలో మాత్రమే ఈ వీధిలో పాల్గొనేవాళ్లు. ఈలా ఓసారి బహిరంగమైన తంతులో పాల్గొన్నాక మళ్ళా పాపాలు చేస్తే ఇక వాటికి పరిహారం వుండదనే భావం గూడ ఆనాడు ప్రచారంలో వుండేది. ఇంకా, పెద్దపాపాలుచేసి ఇతరులకు దురాదర్శం చూపించినవాళ్లు మాత్రమే ఈ తంతులో పాల్గొనేవాళ్లు.

## 2. రెండవదశ - వ్యక్తిగతమైన పాపోచ్చారణం

కాలక్రమేణ పై బహిరంగ పాపోచ్చారణవిధి అడుగంటిపోయింది. దానిస్థానే వ్యక్తిగతమైన పాపోచ్చారణం ప్రచారంలోకి వచ్చింది. దీన్ని మొదట 6వ శతాబ్దంలో ఐర్లండులోని సన్యాసమఠాలు ప్రారంభించాయి. అక్కడినుండి ఈ విధానం ఇంగ్లండుకీ యూరపుకీ ప్రాకింది. ఎన్మిది తొమ్మిది శతాబ్దాలకల్లా ల్యాటిన్ శ్రీసభ అంతటా ఈ పద్ధతి

అమలులోకి వచ్చింది. ఈదశలో ఏపాపానికి యెంత ప్రాయశ్చిత్తం చెల్లించాలో సూచించే పుస్తకాలు వాడుకలో వుండేవి. వాటిప్రకారం గురువులు పాపులకు ప్రాయశ్చిత్తం విధించేవాళ్లు. ఈకాలంలో ల్యాటిను శ్రీసభలో పాపులు గురువులు దొరకనప్పుడు గృహస్థులకు కూడ పాపోచ్చారణం చెప్పేవాళ్లు. ఈ సంప్రదాయం 16వ శతాబ్దంలో ట్రెంటు మహాసభ జరిగిందాకాగూడ అడపాదడపా వాడుకలో వుండేది. భక్తిపరులైన గృహస్థులకు పాపోచ్చారణం చేయడమనేది గ్రీకు శ్రీసభలో రెండవ శతాబ్దంనుండే ప్రచారంలో వుండేది. అలెగ్జాండ్రియా క్లెమెంటు ఈ వుదంతాన్ని పేర్కొన్నాడు.

## 3. మూడవదశ - ప్రస్తుత పాపోచ్చారణ విధానం

పై రెండవదశలోని వ్యక్తిగతమైన పాపోచ్చారణ విధానమే 9వ శతాబ్దానికల్లా స్థిరపడి శ్రీసభ అంతటా అమలులోకి వచ్చింది. ఈదశలో గురువులు పుస్తకాలు నియమించే పద్ధతిని బట్టికాక, తాము సొంతంగానే ప్రాయశ్చిత్తాన్ని నిర్ణయించేవాళ్లు. పాపులు ఆ ప్రాయశ్చిత్తాన్ని చెల్లించేవాళ్ళు. పాపోచ్చారణం రహస్యమూ వ్యక్తిగతమూ ఐన విధిగా మారిపోయింది. గురువు పాపినిగాని అతని పాపాలనుగాని వెల్లడి చేయకూడదనే కఠిన నియమం కూడ అమలులోకి వచ్చింది.

ఈ విధానమే తరువాతి శతాబ్దాల్లోకూడ కొనసాగుతూ వచ్చింది. 1215లో ల్యాటరన్ మహాసభ ఈ వ్యక్తిగతమైన పాపోచ్చారణను శ్రీసభ కంతటికీ వర్తింపజేస్తూ శాసనం చేసింది. పైగా ప్రతి క్రైస్తవుడూ తన పెద్ద పాపాలకు సంవత్సరానికి ఒక్కసారైనా పాపోచ్చారణం చేయాలనీ, గురువులు పాపోచ్చారణ రహస్యాలను వెల్లడి చేయకూడదనీ కట్టడలు కూడ చేసింది.

16వ శతాబ్దంలో లూతరు మొదలైన ప్రోటస్టెంటు నాయకులు పాపాలను గురువుతో చెప్పనక్కరలేదనీ, పాపి వ్యక్తిగతంగా దేవుని యెదుట పశ్చాత్తాపపడితే చాలుననీ ప్రచారం చేయడం మొదలుపెట్టారు. ట్రెంటుమహాసభ ఈ ప్రోటస్టెంటు వాదాన్ని ఖండించింది. శ్రీసభలో పూర్వం నుండి ఆచారంలో వున్నట్లుగా పాపులు తమ పాపాలను గురువునెదుట ఒప్పుకోవాలని ఆజ్ఞాపించింది. ఈ ట్రెంటు మహాసభ ఆజ్ఞ మన క్యాతలిక్ సమాజంలో ఈనాటికీ చెల్లుతుంది.

తొలిదశలోని బహిరంగ విధిలో లాగ నేటి వ్యక్తిగతమైన పాపోచ్చారణ విధిలో శ్రీసభపాత్ర అంత ప్రస్ఫుటంగా గోచరించదు. ఐనా ఇది వ్యక్తిగతమైన విధి కనుక విశ్వాసులకు బాగా ఉపయోగపడుతుంది. ఈ విధిని విశ్వాసులు ఎన్నిసార్లు అవసరమైతే

అన్నిసార్లు వాడుకోవచ్చు. ఇంకా చావైన పాపాలకే గాక స్వల్పపాపాలకుగూడ దీన్ని వినియోగించుకోవచ్చు. ఇవి ఈ విధిలోని సౌకర్యాలు. తొమ్మిదవ శతాబ్దం నుండి నేటివరకు- అనగా 11 శతాబ్దాల కాలం- గురువుతో వ్యక్తిగతంగాను రహస్యంగాను చేసే ఈ పాపోచ్చారణం ఎందుకు అని నేడెవరైనా ప్రశ్నిస్తే అది వెర్రి ప్రశ్నెఔతుంది. బహిరంగమైన రూపంలోగాని వ్యక్తిగతమైన రూపంలోగాని పాపోచ్చారణం తొలిశతాబ్దం నుండీ శ్రీసభలో వాడుకలో వుందని పైవివరణంలో నిరూపించాం. కనుక నేడీ సంస్కారాన్ని నిరాకరిస్తే కుదరదు.

## 4. ప్రస్తుత కాలానికి తగినట్లుగా

పాపోచ్చారణంలో దేవుడు మనకు న్యాయాధిపతియై తీర్పు చెప్తాడు అనే భావం ట్రెంటుసభ ముగిసాక 16-19 శతాబ్దాల్లో బాగా ప్రచారంలోకివచ్చింది. అప్పటినుండి వేదాంతులు పాపోచ్చారణం ఓ న్యాయస్థానంలాంటిదని బోధిస్తూవచ్చారు. పాపి దోషిగా దేవునిముందు నిల్చి తన దోషాలను తెలియజేసుకొంటాడని, దేవుడు ఓ న్యాయాధిపతిగా అతనికి తీర్పుజెప్పి ప్రాయశ్చిత్తం విధిస్తాడనీ చెప్తూవచ్చారు. పాపోచ్చారణంలో దేవుడు న్యాయాధిపతిగా పనిచేసేమాట నిజమే. ఐనా ఇది అంత శ్రేయస్కరమైన భావం కాదు. ఈ సంస్కారంలో ముఖ్యమైన విషయం, దేవుడు కరుణతో క్రీస్తుద్వారా మన పాపాలను మన్నించడం, పాపి దేవునితోను శ్రీసభతోను రాజీపడ్డం.

కనుక వాటికన్ మహాసభ పాపోచ్చారణం ఓ న్యాయస్థానం లాంటిదన్న పూర్వభావాన్ని తొలగించి ఈలా బోధించింది. "పాపోచ్చారణ సంస్కారంలో పాలుపొందేవాళ్ళు దేవుని కరుణవల్ల తమ పాపాలకు మన్నింపు పొందుతారు. పైగా వాళ్ళు శ్రీసభతోగూడ రాజీపడతారు. ఆ శ్రీసభకూడ తన ప్రేమద్వారా, ప్రార్థనలద్వారా, సదాదర్శంద్వారా ఆపాపులకు పరివర్తనం కలిగిస్తుంది." ఈ వాక్యాల్లో కరుణాళువైన దేవుడు మన పాపాలను మన్నిస్తాడు, మనం శ్రీసభతో మళ్లా సమాధానపడతాము అనే రెండు భావాలు వున్నాయి. ఈ సంస్కారాన్ని గూర్చిన యథార్థమైన భావాలు ఇవే.

వాటికన్ మహాసభ ప్రాయశ్చిత్తవిధిని ప్రస్తుతకాలానికి తగినట్లుగా సంస్కరించాలనీ, దాన్ని మరింత అర్థవంతంగా కన్పించేలా చేయాలనీ ఆజ్ఞయిచ్చింది. ఈ యాజ్ఞననుసరించి 1973లో క్రొత్తవిధిని తయారుచేసారు. ప్రస్తుతం శ్రీసభలో అమలులోవుంది ఈ క్రొత్తవిధే. ఈ నూత్నవిధిని ఈ పుస్తకంలోని చిట్టచివరి అధ్యాయంలో సవిస్తరంగా వివరిస్తాం.

# 5. మనస్తాపం

పాపాలకు మనస్తాపపడ్డం, పాపోచ్చారణం, పాపపరిహారం చెల్లించడం అనే మూడు పాపోచ్చారణంలో పాపి చేయవలసిన పనులు. ఈ మూడు ప్రక్రియలు క్రమంగా మూడధ్యాయాల్లో పరిశీలిద్దాం. ప్రస్తుతాధ్యాయంలో మనస్తాపాన్ని గూర్చి విచారిద్దాం. పాపోచ్చారణ విధిలోకెల్లా అతి ప్రధానమైన కార్యం యిదే. ఇక్కడ మూడంశాలను ప్రస్తావిద్దాం.

## 1. మనస్తాపం

త్రెంటు మహాసభ బోధల ప్రకారం మనస్తాపమంటే మన పాపాలకొరకు పూర్ణంగా పశ్చాత్తాపపడి, పాపాన్ని అసహ్యించుకొని, ఇకమీదట అలాంటి పాపాన్ని చేయనని నిశ్చయించుకోవడం. ఈ వాక్యంలో మూడు భావాలున్నాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

1) పూర్ణపశ్చాత్తాపం. పాపంద్వారా మనం భగవంతునికి ద్రోహం చేస్తాం. కనుక మన హృదయంలో పశ్చాత్తాపపడాలి. దేవుని ఆజ్ఞలు మీరామని కాదు, తండ్రిలాంటి దేవునికి ద్రోహం చేసాంకదా అని పశ్చాత్తాపపడాలి. ఈ పశ్చాత్తాపం ప్రధానంగా మనమనసులో వుంటుంది. కనుక ఎవరైనా ఎప్పుడైనా పశ్చాత్తాపపడవచ్చు. అది దుఃఖించడం, కన్నీరుగార్చడం ఏడ్వడం మొదలైన మనోధర్మాలస్థాయికి (Feelings) చేరుకోనక్కరలేదు. కొందరిలో ఆ దశకు కూడ చేరుకుంటుంది. అలా అయితే మరీ మంచిదే.

పశ్చాత్తాప మనేది రెండు విధాలుగా కలగవచ్చు. కొందరు దేవుడు మన పాపాలకు మనలను నరకయాతనలతో శిక్షిస్తాడు అనుకొని భయపడతారు. అతన్ని ఓ పోలీసువాణ్ణి చూచిన చూపున చూస్తారు. అతడు మన పాపాలకు మనలను బంధించి నరకంలోబెట్టి బాధిస్తాడేమోనని భయపడి పశ్చాత్తాపపడతారు. కాని ఈలాంటి పశ్చాత్తాపం మంచిదికాదు. ఇది భయమనస్తత్వానికి దారితీస్తుంది. మరికొందరు దేవుణ్ణి ప్రేమగల తండ్రిలాంటివాణ్ణిగా భావిస్తారు. పాపంద్వారా ఆ తండ్రి హృదయాన్ని నొప్పించాంకదా అని బాధపడి పశ్చాత్తాపపడతారు. అతని అనురాగాన్ని కరుణను కాదని పాడుపని చేసాంకదా అని పరితపిస్తారు. ఇది ఉత్తమమయిన మనస్తాపం.

ఐనా దేవుని ప్రేమనూ కరుణనూ తలంచుకొన్నప్పుడు మనసు కరగనివాళ్లు నరకయాతనలను తలంచుకొని పశ్చాత్తాపపడవచ్చు. అలాంటివాళ్ళకు ప్రేమకాకపోయినా, కనీసం భయమైనా పరివర్తనం పుట్టిస్తుంది. అది చాలు.

2) పాపాన్ని అసహ్యించుకోవడం. మనపాపాలు దేవునికి అప్రియం కలిగిస్తాయి. కనుక మనం వాటిని అసహ్యించుకోవాలి. ఈ యసహ్యాభావం మనం చేసిన చావైన పాపాలన్నిటికీ, స్వల్పపాపాలకీ గూడ వర్తించాలి.

మామూలుగా మనం కొన్ని మూల పాపాలవల్ల చాల చిల్లరమల్లర పాపాలు చేస్తూంటాం. ఉదాహరణకు అహంకారం అనే మూలపాపంవల్ల చాలరకాల పాపాలు చేస్తాం. అలాగే స్వార్థం, సోమరితనం అనే మూలపాపాలవల్లా కానిపనులు ఏవేవో చేస్తాం. ఇక మనం పశ్చాత్తాపపడేపుడు ఈ మూల పాపాలకు ఎక్కువగా పశ్చాత్తాపపడాలి. మన మూలపాపాలేమిటివో మనకు తెలిసివుండాలి కూడ.

పాపమంత చెడ్డది మరొకటి లేదు. అంత చెడ్డదైన పాపానికి పాల్పడ్డాం గనుక మనం అనుభవించే పశ్చాత్తాపం గూడ చాల లోతుగా వుండాలి.

కొంతమంది పాపోచ్చారణానికి తయారయ్యేపుడు మోక్షవాకిలి మొదలైన జపపుస్తకాల్లో నుండి ఏవేవో అచ్చుజపాలు వల్లెవేస్తుంటారు. అంతకంటె ఉత్తమమైన పద్ధతి, మనసులో పశ్చాత్తాపపడి హృదయంలో నుండి పశ్చాత్తాపభావాలను వెలిబుచ్చడం.

3) మళ్ళా అలాంటి పాపాన్ని చేయమని నిశ్చయించుకోవడం. ఓమారు మన పాపాలకు యథార్థంగా పశ్చాత్తాపపడితే మళ్ళా అలాంటి పాపాలు చేయకూడదని సంకల్పించుకొంటాం గదా? మన తరపున మనం ఆ పాపాలను మళ్లా చేయకూడదని మనసులో గట్టిగా ప్రమాణం చేసికోవాలి. ఒకవేళ బలహీనతలవల్ల మళ్ళా అదే పాపంలో పడిపోతే మనకు చిత్తశుద్ధి లోపించినట్లుకాదు.

గట్టి ప్రమాణం అంటే మన పాపాలవల్ల ఇతరులకు కల్గిన నష్టాలను మనం కొంతవరకైనా తీర్చే ప్రయత్నం చేయాలి. జక్కయ అలా చేసాడు. కనుకనే అతనిది చిత్తశుద్ధి గల మనస్తాపమైంది - లూకా 19,8. ఇంకా గట్టి ప్రతిజ్ఞ అంటే మనం పాపావకాశాలను తొలగించుకోవడానికిగూడ సిద్ధంగా వుండాలి. ఉదాహరణకు కొందరు స్నేహితులు కాని కొన్ని పుస్తకాల పఠనంకాని మన అపవిత్ర జీవితానికి కారణమైనప్పుడు మనం ఆ స్నేహితులనూ ఆ పుస్తకాలనూ పరిత్యజించాలి.

మనం పశ్చాత్తాపపడేపుడు క్రీస్తుసిలువను భరిస్తాం. అతని పాటుల్లో పాలు పొందుతాం. కాని ఆ పశ్చాత్తాపం ముగిసాక క్రీస్తు ఉత్థానంలో పాలుపొంది సంతోషిస్తాం. నిజమైన మనస్తాపం తప్పకుండా ఆనందాన్ని తెచ్చిపెడుతుంది. లూకా సువిశేషం 15వ అధ్యాయంలో మూడు కథలున్నాయి. అవి తప్పిపోయిన గొర్రె, జారిపోయిన నాణెం, దేశాలవెంటబోయిన కుమారుడు. తప్పిపోయిన గొర్రె దొరికాక దాని కాపరి ఆనందించాడు- 15,5. జారిపోయిన నాణెం దొరికాక పేదరాలు ఆనందించింది-15,9. దేశాల

వెంటబోయిన కుమారుడు ఇంటికి తిరిగివచ్చాక తండ్రి ఆనందించాడు-15,23. ఈ యానందాన్నే చక్కగా పశ్చాత్తాపపడినపుడు మనమూ అనుభవిస్తాం.

ఇక, మనం పాపోచ్చరణానికి వెళ్ళినపుడు మాత్రమే పశ్చాత్తాపపడితే చాలదు. మనస్తాపక్రియ ఒక్క నిమిషంలో ముగిసేది కాదు. అది మన జీవితమంతటికీ వర్తించేది. అనగా మనం రోజురోజు తేపతేపకు మన పాపాలు తలంచుకొని పశ్చాత్తాపపడుతూనే వుండాలి. అసలు మనకు పశ్చాత్తాప మనస్తత్వం అలవడాలి.

"నా పాపాలు నాకు తెలుసు

నా దోషాలు ఎప్పుడూ నా కన్నుల యెదుటనే వుంటాయి"

అన్నాడు కీర్తనకారుడు-51,3. ఈ భక్తునిలాగే మనంకూడ మాటిమాటికి పశ్చాత్తాపపడ్డం అలవాటు చేసికోవాలి. మనం పవిత్రులమయ్యేకొద్దీ ఈ పశ్చాత్తాప భావం ఇంకా పెరగాలి. పునీతుల్లో ఈ భావం చాల ప్రచురంగా వుండేది. పౌలులాంటి మహాభక్తుడు తన పాపాలకు జీవితాంతమూ పశ్చాత్తాపపడుతూ వచ్చాడు - 1తిమో 1,15-16.

మనం వారాంతంలో చేసే పాపోచ్చారణం మన అనుదిన పశ్చాత్తాపక్రియలను పవిత్రం చేస్తుంది. ఇది వాటి సంఖ్యనింకా అధికం చేస్తుంది. ఈ భావాలనుబట్టి భక్తులు పాపోచ్చారణానికి వెళ్ళినపుడు మాత్రమే పశ్చాత్తాపపడితే చాలదని అర్థం చేసికోవాలి.

## 2. తోడిజనాన్ని మన్నించాలి

దేవుడు మన పాపాలను మన్నించడానికి ఎప్పుడూ సంసిద్ధంగా వుంటాడు. మన హృదయం కూడ అందుకు సిద్ధంగా వుండాలి. మనం తోడిజనాన్ని మన్నిస్తేనేగాని దేవుడు మనలను మన్నించడు. అతడు పరలోకజపంలో " మాకు అప్పుపడినవాళ్ళను మేము మన్నించినట్లే మా యప్పులను మీరు మన్నించండి" అని ప్రార్థించమని చెప్పాడు. మీరు ఇతరుల తప్పిదాలను క్షమించకపోతే పరలోకంలోని తండ్రి మీ తప్పిదాలను గూడ క్షమించడు" అని రూఢిగా నుడివాడు - మత్త 6,12-14.

ఆ తండ్రి మంచివాళ్ళకీ చెడ్డవాళ్ళకీ గూడ తన సూర్యరశ్మినీ వర్షాన్నీ ప్రసాదిస్తూంటాడు. అలాగే మనం మనమిత్రులకూ శత్రువులకూ గూడ మేలుచేయడం నేర్చుకోవాలి. అప్పుడే మనం ఆ దేవుడిలాంటివాళ్ళమయ్యేది - మత్త 5,44-45.

శత్రువులను క్షమించాలనే భావం సువిశేషాల్లో చాలతావుల్లో కన్పిస్తుంది. తోడిజనం పట్ల దయాగుణంతో ప్రవర్తించేవాళ్ళు ధన్యులు. దేవుడు వాళ్ళకు దయజూపిస్తాడు - మత్త 5,7. మనం ఇతరులకు ఏ కొలతన కొలిస్తే దేవుడు కూడ మనకు అదే కొలత కొలుస్తాడు - 7,2. పూర్వవేదంలోని తండ్రిలాగే నూత్నవేదంలోని క్రీస్తు ప్రధానంగా

కోరేది బలులు కాదు, దయాగుణం - 9,13. తోడినరుణ్ణి హృదయపూర్వకంగా క్షమింపనివాడికి, క్షమింపనొల్లని దుష్టసేవకునికి పడిన శిక్షేపడుతుంది - 18,35. ఇవన్నీ కూడ బలమైన అలోకనాలు. క్షమాపణం దేవుని లక్షణం. ఆ దేవునికి పోలికగావున్న నరుడుకూడ ఆ లక్షణాన్ని అలవర్చుకోవాలి. మనం తోడినరుణ్ణి మన్నిస్తే ఆ మన్నింపు దేవుడు మనలను మన్నించాడు అన్నదానికి గుర్తుగా వుంటుంది.

పాపంద్వారా దేవునినుండి వైదొలగుతామనీ పాపోచ్చారణం ద్వారా ఆ దేవునితో మళ్లా సమాధానపడతామనీ చెప్పాం. కాని మనం మన శత్రువులనుండి వైదొలగితే దేవునితో ఏలా సమాధానపడతాం? తోడినరులకు దూరమైనవాడు భగవంతునికి ఏలా దగ్గరౌతాడు? కనుక మనం పాపోచ్చారణం చేసేపుడూ, సొంతంగా పాపాలకు పశ్చాత్తాపపడి దేవుణ్ణి మన్నింపు దయచేయమని అడుగుకొనేపుడూ, మన పగవాళ్ళను గూడ గుర్తుకి తెచ్చుకోవాలి. వాళ్ళకు మనమీద వైరమున్నా మనకు వాళ్ళమీద వైరమున్నా, మనం వాళ్ళను క్షమించాలి.

కొంతమంది మేము శత్రువుని క్షమిస్తాంగాని అతడు మాకుచేసిన అపకారాన్ని మర్చిపోలేము అంటారు. ఆ యపకారాన్ని మనం మర్చిపోనక్కరలేదు. కాని అతనిపట్ల ద్వేషభావాన్ని మాత్రం అణచుకోవాలి. అవసరమొచ్చినపుడు ఇతరులకు చేసినట్లే అతనికిగూడ సహాయం చేయడానికి సిద్ధంగా వుండాలి.

చాలమంది క్రైస్తవుల్లో ఈ శత్రుక్షమాపణం లోపిస్తూ వుంటుంది. అలాంటివాళ్ళు ఈ విషయంలో విశేష శ్రద్ధచూపాలి. పగవాణ్ణి క్షమించందే మనం క్రీస్తు శిష్యులం కాలేం.

శత్రువుని క్షమించినవాడు భగవంతుని క్షమాగుణాన్ని బాగా అర్థంచేసికో గల్గుతాడు. అందుచేత మనం ఇతరులనూ క్షమించాలి, ఇతరులూ మనలను క్షమించాలి. ఈ మన్నింపు ద్వారా అందరమూ భగవంతుని క్షమాపణాన్ని అనుభవానికి తెచ్చుకోగల్గుతాం.

## 3. చిన్నపిల్లలకు పశ్చాత్తాపపడే విధానం నేర్పడం

చిన్నపిల్లలకు పశ్చాత్తాపపడే విధానం నేర్పడం ఏలా? కొందరు తల్లిదండ్రులు దేవుడు ఓ పోలీసులాంటివాడనీ, అతడు మనలను పట్టుకొని శిక్షిస్తాడనీ తమ బిడ్డలకు నేర్పుతారు. నరకమనేది ఒకటుందనీ, మాట విననివాళ్ళను దేవుడు ఆ నరకంలోబెట్టి బాధిస్తాడనీ చెప్తారు. చిన్ననాడు ఈలాంటి భావాలను జీర్ణం జేసికొన్న బిడ్డలు పెద్దయ్యాక ఆ దేవుణ్ణి తలంచుకొని భయపడిపోతారు. ఇక అతన్ని అట్టే ప్రేమించలేరు. కనుక ఇది మంచిపద్ధతి కాదు.

తల్లిదండ్రులూ ఉపాధ్యాయులూ మొదలైన పెద్దలు తమ పిల్లలకు దేవుడు ఓ తండ్రిలాంటివాడని బోధించాలి. ఆ తండ్రి బిడ్డణ్ణి స్వయంగా ప్రేమిస్తున్నాడని నేర్పాలి.

ఓమారు బిడ్డడు దేవుణ్ణి ప్రేమగల తండ్రిగా అర్థం చేసికొన్న పిమ్మట వాడికి దేవుని ఆజ్ఞలను గూర్చి తెలియజేయవచ్చు. రోజువారి జీవితంలో ఎలా ప్రవర్తిస్తే ఆ దేవుని ఆజ్ఞలను మీరి అతన్ని బాధపెడతామో, ఏలా ప్రవర్తిస్తే అతని మాట విని అతన్ని సంతోషపెడతామో తెలియజేయాలి. పిల్లవాడు పోకిరిపనులు చేసినప్పుడు దేవుని ఆజ్ఞలను మీరాడు కనుక పశ్చాత్తాపపడాలని కూడా తెలియజేయాలి.

ఆయా సందర్భాల్లో కుటుంబసభ్యులు ఒకరినొకరు క్షమించుకొంటూంటారు. పసిబిడ్డడు ఈ క్షమాపణను అర్థం చేసికొనేలా చూడాలి. మనం పరస్పరం క్షమించుకొన్నట్లే పరలోకంలోని తండ్రి కూడా మనలను క్షమిస్తాడని నేర్పాలి. క్రమేణ వాడికి దేవుడు మనలను క్షమించేతీరు అనుభవానికి వస్తుంది. చిన్నపిల్లలకు సువిశేషం నుండి దుడుకు చిన్నవాడి కథ, క్షమింపనొల్లని సేవకుని కథ, మంచి సమరయుని కథ మొదలైనవి బోధిస్తే మంచి ఫలితం కలుగుతుంది.

## ప్రార్థనా భావాలు

1. పాపం విషంలాంటిది. కనుక దాన్ని మన హృదయంలో దీర్ఘకాలం ఉండనీయగూడదు. పాపోచ్చారణం ద్వారా ఆ విషాన్ని ఎంత త్వరగా కక్కేసుకొంటే అంతమంచిది. పాపంద్వారా మనం పిశాచానికి దాసులమైపోతాం. మంచిని జేసే శక్తి సన్నగిల్లుతుంది. బలహీనులమైపోతాం. కనుక మనం పాపావస్థలో దీర్ఘకాలం ఉండిపోగూడదు. వీలయినంత త్వరగా మళ్లా దేవుని దగ్గరికి తిరిగి రావాలి. కొంతమంది చాలనాళ్ళదాకా పాపోచ్చారణం చేయకుండా అలాగే జాప్యం చేస్తుంటారు. ఏదో పెద్ద పండుగ కొరకు వేచివుంటారు. ఇది మంచి పద్ధతి కానేకాదు. పాపవ్యాధిని ఎంతత్వరగా వదిలించుకొంటే అంత మేలు కదా? పాపరోగం తొలగిపోగానే ప్రభు వరప్రసాదం మళ్లా మన మీద పనిచేసి మనకు నూత్నబలమూ శక్తీ ప్రసాదిస్తుంది.

2. దేవుడు మనలను శిక్షిస్తాడు, మనకు నరకం ప్రాప్తిస్తుంది, మోక్షాన్ని పోగొట్టుకొంటాం అనుకొని పశ్చాత్తాపపడితే అది అంత శ్రేష్ఠమైన మనస్తాపం కాదని చెప్పాం. ఐనా కొంతమంది కఠిన మనస్కులుంటారు. దేవుని ప్రేమ, దేవుని కరుణ మొదలైన భావాలు వాళ్ళ హృదయాలను అట్టే కదిలింపలేవు. అలాంటివాళ్లు దైవశిక్షకూ నరకదండనకూ భయపడి పశ్చాత్తాపపడవచ్చు. పూర్వం యోనా ప్రవక్త నినివే పౌరులు పశ్చాత్తాపపడకపోతే దేవుడు వాళ్ళను శిక్షిస్తాడని బోధించాడు. ఆ శిక్షకు భయపడి ఆ ప్రజలు పశ్చాత్తాపపడ్డారు. దేవుడు వాళ్ళ పరితాపాన్ని అంగీకరించాడు – యోనా 3,10. కనుక ఇదిగూడ యోగ్యమైన పశ్చాత్తాపమే. అందుకే భక్తుడు

గ్రెగోరీ నీసా ఈలా వ్రాసాడు. "దేవుడు అందరూ రక్షణ పొందాలనే కోరుకొంటాడు. అతడు మామూలుగా ప్రేమమార్గంద్వారా నరులను రక్షిస్తాడు. కాని కొందరికి భయమార్గానగాని రక్షణం సిద్ధించదు. అలాంటివాళ్ళు నరక యాతనలను తలంచుకొని భయపడి పాపం నుండి వైదొలగుతారు".

3. అగస్టీను భక్తుడు ఈలా చెప్పాడు. "దేవుడు నీ పాపాలను క్షమించాలంటే నీవు వాటిని అతని ముందు ఒప్పుకోవాలి. పాపానికి శిక్షేమో తప్పదు. దేవుడు నిన్ను శిక్షించకుండా వుండాలంటే నీ పాపాలకు నీకు నీవే శిక్ష విధించుకోవాలి. నీ పాపాలకు నీవే న్యాయాధిపతివి కావాలి. అంతేగాని నీవు నీ పాపాలను సమర్థిస్తూ కూర్చోగూడదు. కనుక నీకు నీవు న్యాయధిపతివికా. నీవు నీ మనసనే న్యాయస్థానం మీదనే కూర్చో. నీకు నీవే దోషివని తీర్పు చెప్పుకో". ఈలా మనకు మనమే హృదయంలో పరితాపం చెందడం ఉత్తమమైన పశ్చాత్తాపమౌతుంది.

4. పాపంలో వేర్పాటు ధోరణివుంది. అది నరుణ్ణి పవిత్రుడైన భగవంతుని నుండి వేరుచేస్తుంది. ఈ వేర్పాటు ద్వారా అతనికి పెద్ద గాయం తగిలినట్లవుతుంది. అసలు అతని వునికే దెబ్బతింటుంది. దేవునినుండి విడివడిన మానవుడు తోడినరుల నుండి గూడ విడిపోతాడు. తోడినరునికి శత్రువై అతనికి హాని చేస్తాడు. ఇంకా అతడు చరాచరరూపమైన విశ్వజగత్తు నుండి కూడ వేరుపడతాడు. విశ్వాన్ని తన స్వార్థానికి వాడుకోజూస్తాడు. పాపం యిన్ని అనర్థాలకు దారితీస్తుంది. కనుక పాపి పశ్చాత్తాపం ద్వారా అవస్యంగా దేవునితో రాజీపడాలి. లేకపోతే అతని పాపం "లోకం పాపం"తో కలసి ప్రపంచాన్ని దురితభూయిష్ఠం చేస్తుంది.

# 6. పాపోచ్చారణం

మనం మన పాపాలకు పశ్చాత్తాపపడిన పిదప పాపోచ్చారణం చేయాలి. అనగా దేవుని యెదుట వినయంతో మన పాపాలను ఒప్పుకోవాలి. ఈ యధ్యాయంలో ఏడంశాలను పరిశీలిద్దాం.

## 1. పాపోచ్చారణం ద్వారా భగవంతుణ్ణి కీర్తిస్తాం

పాపాలకు పశ్చాత్తాపపడమంటే భగవంతుని ప్రేమనూ కరుణనూ ఆంతరంగికంగా అనుభవానికి తెచ్చుకోవడమే. ఈ యాంతరంగికానుభవాన్ని మాటలద్వారా బయటికి చూపించాలి. అదే పాపోచ్చారణం. ఈ క్రియద్వారా భగవంతుని కరుణను ఎల్లరికినీ ప్రకటనం చేస్తాం. అతని దయను కీర్తిస్తాం. నీతిమంతులు కొరకుగాక

పాపాత్ములకొరకు, ఆరోగ్యవంతులకొరకు గాక రోగులకొరకు, ఆ తండ్రి తన కుమారుణ్ణి పంపాడు. ఆ క్రీస్తు సిలువపై మరణించి మన పాపాలకు విముక్తి దయచేసాడు. కనుక మనం ఈ సంస్కారంలో తండ్రి దయను కొనియాడతాం. దేవుని దగ్గరికివచ్చి మీరు గూడ పాపపరిహారం పొందండని ఇతరులను కూడ ఆహ్వానిస్తాం.

కావున పాపోచ్చారణం చేయడమంటే ఒట్టినే పాపాలను ఏకరువుపెట్టి రావడంగాదు. ఆ సంస్కారంద్వారా మనం ప్రభువును కరుణను కీర్తిస్తాం. అతని న్యాయాన్నీ తీర్పునీ అంగీకరిస్తాం. కనుక పాపోచ్చారణమంటే భగవత్ సంకీర్తనం. మన పాపం భగవంతుణ్ణి అవమానపరచినట్లే మన పాపోచ్చారణం ఆ ప్రభుని కీర్తిస్తుంది.

## 2. మానసిక లాభాలు

పాపోచ్చారణంవల్ల చాలా మానసిక లాభాలను గడిస్తాం. కొన్నిటిని పరిశీలిద్దాం.

భగవంతుడు వెలుగు. అతనిలో చీకటి వుండదు 1యోహా 1,5. కాని పాపి అంధకారమయుడు. అతనికి వెలుగు నచ్చదు, కనుకనే వెలుగు చెంతకు రాడు – యోహా 3,20. అతడు తన పాపాలను కప్పిపుచ్చుకొంటాడు. తన రహస్యపాపాలనే గాక బహిరంగ పాపాలను గూడ దాచిపెట్టుకోగోరతాడు. కాని మనం వినయంతో దేవుని యెదుటా శ్రీసభ యెదుటా మన పాపాలను ఒప్పుకొన్నపుడు మనలోని చీకటిని పారదోలుతాం. అప్పుడు భగవంతుని ప్రేమా, సత్యమూ, ప్రకాశమూ, మన హృదయాల్లో చోటు చేసికొంటాయి. మన పాపాలను ఒప్పుకొన్నాం గనుక మన వేషధారితనమూ నటనా అంతరిస్తాయి. అంధకారమయులమైన మనం జ్యోతిర్మయ మానవులంగా తయారౌతాం.

పాపం చేసిన నరునికి ఆ పాపాన్ని ఒప్పుకోవాలనే తపన వుంటుంది. అలా వొప్పుకోవడంవల్ల హృదయభారం తగ్గి మనసు తేలికపడుతుంది. అందుకే ప్రాచీన కాలంలో పాపులు గురువు దొరకనప్పుడు గృహస్థులకు గూడ పాపోచ్చారణం చేసేవాళ్ళని చెప్పాం. ఏలాగో వోలాగు హృదయభారాన్ని వదిలించుకోవాలికదా! గృహస్థులకు చేసిన పాపోచ్చారణం సంస్కారంకాదు. ఐనా ఈ ప్రక్రియలో నరుడు తోడి నరుని ద్వారా భగవంతుణ్ణి చేరే ప్రయత్నం చేస్తున్నాడు అని భావించాలి.

పశ్చాత్తాపపడిన పాపి తన పశ్చాత్తాపాన్ని మాటలద్వారా ఇతరులకు తెలియజేయగోరుతాడు. పాపోచ్చారణం వల్ల ఈ యవసరం తీరుతుంది. పైగా పాపోచ్చారణంలో గురువు పాపిని ఆదరంతో అంగీకరిస్తాడు. దీనిద్వారా పాపికి ఊరటా సంతృప్తీ కలుగుతాయి. అతనికి తన పాపాలు తొలగిపోయాయనే నమ్మకం కలుగుతుంది. అందుకే ఒకోసారి పాపోచ్చారణానంతరం మన హృదయంలో ఓ విధమైన ఆనందమూ ఉత్సాహమూ పుట్టుకవస్తాయి.

తన పాపాలను కప్పిపెట్టుకొనే నరునుకి మనశ్శాంతి వుండదు. కుమ్మరి ఆవంలోని నిప్పులాగ పాపభారం లోలోపల గనగన మండుతుంటుంది. కాని ఓమారు నరుడు తన తప్పులను బయటకి చెప్పుకోగానే ఎంతో వుపశాంతి వూరటా చేకూరతాయి. దీనితో భక్తుని హృదయంలో దాగివున్న శక్తి వెలికివస్తుంది. వ్యక్తిగా అతడు పెరుగుతాడు. కనుక హృదయం విప్పడం ద్వారా గొప్ప మానసికారోగ్యం చేకూరుతుంది. అందుకే చాలామంది నిత్యజీవితంలో పాపోచ్చారణ పద్ధతిలో కాకపోయినా ఏదోరూపంలో ఎవరికో వొకరికి హృదయం విప్పుకొంటూంటారు.

ఇంకా పాపభీతివల్ల బాధపడేవాళ్ళకి ఆరోగ్యం చెడిపోవచ్చు. భయవిచారాదులు వాళ్ళను క్రుంగదీయవచ్చు. వాళ్ళు తోడిజనంతో వొద్దికగా జీవించలేకపోవచ్చు. ఇతరులతో వ్యహరించేపుడు ఔను అనే మనస్తత్వంకంటె లేదు అనే మనస్తత్వాన్నే ఎక్కువగా ప్రదర్శించవచ్చు. అలాంటప్పుడు పాపోచ్చారణం ఈ యనిష్టగుణాలను చాలవరకు సవరించి వాళ్ళకు మానసికారోగ్యం చేకూర్చి పెడుతుంది.

మన పాపాలను తోడినరుడైన గురువుతో చెప్పుకోడానికి మనమేమి సిగ్గుపడనక్కరలేదు. అవమానానికి గురికానక్కరలేదు. అది మనలను కించపరిచే కార్యంకాదు. మనం స్వాతంత్ర్యంగల నరులం, బాధ్యత తెలిసినవాళ్ళం. కనుక మన తప్పుడు పనులకు పూర్తిగా మనమే బాధ్యులం. అలాంటప్పుడు మన తప్పులను మనం ఒప్పుకొని పశ్చాత్తాపపడితే, తక్కువవాళ్ళం కాముగదా గొప్పవాళ్ళమే ఔతాం. కనుక మనం స్వేచ్ఛాపూర్వకంగానే తోడినరుని యెదుట మన పాపాలను ఒప్పుకోవచ్చు. ఆ తోడినరుడు కూడ మన దోషాలను తెలిసికొని మనలను చిన్నచూపు చూచేవాడుకాదు. అవహేళనం చేసేవాడూకాదు. అతడు దేవుని కరుణనూ అనుగ్రహాన్ని మనకు సంపాదించిపెట్టేవాడు. పాపోచ్చారణంలో గురువు మనలను అంగీకరిస్తాడు. కనుక మనమీద మనకే నమ్మకంపుట్టి మనలను మనమే అంగీకరించుకొంటాం. మనలోని పాపశంకా, పాపభీతి తొలగిపోతాయి. ఇవన్నీ పాపోచ్చారణంవల్ల కలిగే మానసిక లాభాలు.

## 3. పాపోచ్చారణంలో తెలియజేయవలసిన అంశాలు

త్రెంటు మహాసభ బోధల ప్రకారం మనం ఆత్మ శోధలు చేసికొన్నపుడు గుర్తుకివచ్చిన చావైన పాపాలన్నిటినీ సంఖ్యాపూర్వకంగా గురువుతో చెప్పాలి. ఇంకా ఆ పాపాలను ఘనమైన వాటినిగా గాని స్వల్పమైనవాటినిగా గాని మార్చే పరిస్థితులు ఏమైన వుంటే వాటిని గూడ గురువుకి తెలియజేయాలి.

మనకు గుర్తుకు వచ్చిన చావైన పాపాలను చెప్తేచాలు. గుర్తున్నంతవరకు వాటి సంఖ్యను గూడ – అనగ ఏ పెద్ద పాపాన్ని ఎన్నిసార్లు చేసింది – తెలియజేయాలి. ఐనా

ఈ సంఖ్యను గూర్చి తల బ్రద్దలు చేసికోనక్కరలేదు. దేవుడు కరుణామయుడు. అతనికి మన హృదయం తెలుసు. పైగా నేడు కొందరు వేదశాస్త్రులు పాపం ఒక క్రియగాదు, ఒక దశ అని చెప్తున్నారు. మనం ఏ పాపం ఎన్నిసార్లు చేసామని ఆలోచించడంకంటె పాపదశలో వున్నామని అర్థంచేసికోవడం ముఖ్యమని బోధిస్తున్నారు.

మన పాపాన్ని ఘనమైన దాన్నిగా మార్చే పరిస్థితులు కూడా వుంటాయి. ఉదాహరణకు మామూలు దొంగతనం వేరు, గుడిసొమ్మును దొంగిలించడం వేరు. గుడిసొమ్మును దొంగిలించినపుడు దేవద్రోహమనే పాపాన్ని అధికంగా కట్టుకొంటాం. పెండ్లి కాని వ్యక్తితో కంటె పెండ్లయిన వ్యక్తితో పాపం చేయడం పెద్ద తప్పు. ఈలా మన పాపాన్ని ఘనమైనదాన్నిగా మార్చే సందర్భాలున్నాయి. వాటిని పాపోచ్చారణంలో తెలియజేయాలి. ఐనా ఇక్కడ కూడ మనం ఆందోళనం చెందకూడదు. గురువు నెదుట తన పాపాలను చెప్పేపుడు వ్యక్తి తన బలహీనతలను దాచిపెట్టుకోకుండా వుంటే చాలు.

కొందరు తమ బాల్యపాపాలనుగూర్చి కలవరపడుతూంటారు. అవి యిప్పుడు గుర్తుకి రావడం లేదనీ, వాటిని దేవుడు మన్నించాడో లేదోననీ ఆందోళనం చెందుతూంటారు. బాల్యంలో ఏది పాపమో ఏది కాదో మనకు అంత రూఢిగా తెలియదు. పాపమని తెలియక చేసిన క్రియ పాపం కాదు. కనుక బాల్యపాపాల్లో చాలా అసలు పాపాలేకావు. మనం పాపమని తెలియక ఓ చెడ్డపని చేస్తాం. తర్వాత మనకు జ్ఞానం పెరిగి మతవిషయాలను క్షుణ్ణంగా నేర్చుకొన్న పిదప పూర్వం మనం చేసిన ఆ చెడ్డపని పాపమే గదా అన్పిస్తుంది. ఐనా ఆ చెడ్డపని చేసినపుడు అది పాపమని మనకు తెలియదు కనుక, అది పాపం కాజాలదు.

ఫలితాంశ మేమిటంటే, పాపాలను చెప్పుకొనే వ్యక్తి గురువు నెదుట తన హృదయాన్ని విప్పితే చాలు. దేవుని కరుణమీద ఆధారపడితే చాలు, అతడు మన్నింపు పొందుతాడు.

## 4. భక్తి కొరకు చేసే పాపోచ్చారణం

పాపోచ్చారణం ఆవశ్యకమైంది, భక్తికొరకు చేసేది అని రెండు రకాలుగా వుంటుంది. చావైన పాపాలను పోగొట్టుకోవడానికి చేసే పాపోచ్చారణం ఆవశ్యకమైంది. ఇది లేకపోతే పాపక్షమాపణం లేదు. కేవలం స్వల్ప పాపాలను మాత్రమే పోగొట్టుకోవడానికి చేసే పాపోచ్చారణం భక్తికొరకు చేసేది. దీన్ని చేయకపోయినా ఆ స్వల్పపాపాలకు మన్నింపు పొందవచ్చు. ఎందుకంటే, పశ్చాత్తాపం ఉపవాసం దానం జపం మొదలైనవి కూడ మన స్వల్పపాపాలను మన్నిస్తాయి. ఐనా ఈ స్వల్పపాపాల కొరకు గూడ పాపోచ్చారణం చేయడం

మంచిదే. ఎందుకు? జ్ఞానస్నానాన్ని పుచ్చుకోవడం వలన మనం శారీరక వ్యామోహాలను జయించి పరిశుద్ధ జీవితం జీవించవలసిన బాధ్యత వుంది. ఈ బాధ్యతను తీర్చుకోవడానికి పాపోచ్చారణం ఉపయోగపడుతుంది. దీనివల్ల మనం అల్పపాపాలను గూడ తొలగించుకొని మరింత పరిశుద్ధులమౌతాం. ఈ సంస్కారం ద్వారా క్రీస్తు మరణం మన మీద సోకి మనలను మరింతగా శుద్ధి చేస్తుంది. మనలోని స్వార్థం క్రమేణ అంతరిస్తుంది. కేవలం మన ప్రయత్నంవల్లనే మనం పునీతులం కాలేము, సంస్కారాలు ప్రసాదించే వరప్రసాదం వల్ల పవిత్రులమౌతామని అర్థం చేసికొంటాం. ఈ పాపోచ్చారణం ద్వారా మన బలహీనతలు బాగా అనుభవానికి వచ్చి వినయం అలవడుతుంది. మన దురభ్యాసాలను సవరించుకోగల్గుతాం. మామూలుగా మన ఆధ్యాత్మిక జీవితంలో ప్రదర్శించే పట్టీపట్టనితనాన్ని సవరించుకొంటాం. భావిజీవితాన్ని తీర్చిదిద్దుకోవడానికి వలసిన హితోపదేశాన్ని పొందుతాం. వరప్రసాద సమృద్ధి కల్గుతుంది. ఇన్ని మంచి ఫలితాలున్నాయి కనుకనే ఈ పాపోచ్చారణం అవస్యం పాటింపదగింది.

మనం అధికంగా పవిత్రులమయ్యేకొలదీ మన పాపాలు కూడ మనకు అధికంగానే తెలిసివస్తాయి. కనుక వాటిని ఎక్కువగా వదిలించుకోగోరుతాం. కావున పవిత్ర జీవితం మీద దృష్టికలవాళ్ళకి ఈ పాపోచ్చారణం ఎక్కువ అవసరమనిపిస్తుంది.

పాపోచ్చారణంలో మనం కేవలం స్వల్పపాపాల జాబితాలను ఏకరువు పెడితేనే చాలదు. వాటికి ఆధారాలైన మూల పాపాలను - అనగా గర్వం స్వార్థం కామం సోమరితనం - మొదలైన వాటిని గూడ ఒప్పుకోవాలి. ఒకమారు మనలోని మూలపాపాలను అంగీకరిస్తే ఇక మనం మంచికి మారడం మొదలుపెడతాం.

మామూలుగా మనం చేసిన చెడ్డపనులు మాత్రమే పాపాలనుకొంటాం. మనంచేయవలసిన మంచిపనులను చేయకుండా వదలివేస్తే అవికూడా పాపాలే ఔతాయి. ఉదాహరణకు మనకుండిగూడ తోడి బీదలకు సహాయం చేయకపోతే పాపం. మనం పేదలకు అన్యాయం చేసినపుడు మాత్రమే కాదు, వాళ్ళకు న్యాయం జరిగించకుండా మెదలకుండా వున్నపుడు గూడ తప్పే. కనుక ఈలంటి పాపాలను గూడ గురువుతో చెప్పాలి.

కొందరు ఈ స్వల్పపాపాలతోపాటు పూర్వం పాపోచ్చారణంలో చెప్పి మన్నింపు పొందిన చావైన పాపాలు ఒకటి రెండు కూడా మళ్ళా చెప్తూంటారు. ఈ పద్ధతి మంచిదే. దీనివల్ల మనకు వినయమూ భక్తీ పెరుగుతాయి. దేవుని కరుణను అధికంగా స్మరించుకొంటాం.

ఈ సందర్భంలోనే యావజ్జీవిత పాపోచ్చారణాన్ని గూర్చి కూడ ఒకటిరెండు మాటలు చెప్పాలి. ఇది చాలా భక్తిగల క్రియ. భక్తుడు ఇగ్నేష్యస్ లొయోలా తన తపోభ్యాసాల్లో

దీన్ని సిఫార్సు చేసాడు. ఈ ప్రక్రియలో ఈవరకే మన్నింపబడిన మన పూర్వ పాపాల్లో ముఖ్యమైనవాటిని మళ్ళా ఓసారి పాపోచ్చారణంలో చెప్పుకొంటాం. దీనిద్వారా మనలో పశ్చాత్తాపం పెరుగుతుంది. పూర్వ పాపాలవలన కలిగిన గాయాలు బాగా మానతాయి. భావిజీవితానికి వలసిన వరప్రసాదం అధికంగా లభిస్తుంది. కాని ఈలాంటి పాపోచ్చారణం చేయమని విశ్వాసుల నెవరు నిర్బంధం చేయకూడదు. వాళ్ళంతట వాళ్ళే స్వేచ్ఛగా దాన్ని చేసికోవాలి.

భక్తికొరకు చేసే పాపోచ్చారణంవల్ల విశేషంగా రెండు లాభాలున్నాయి. మొదటిది, మనకు రావలసిన అనిత్య శిక్షను కొంతవరకు తొలగించుకొంటాం. పాపోచ్చారణం వల్ల నిత్యశిక్షయైన నరకాన్ని మాత్రమే తప్పించుకొంటాం. అనిత్యశిక్షను - అనగా మన పాపాలకుగాను కొన్ని బాధలు అనుభవించడం-తప్పించుకోలేం. దాన్ని ఈ లోకంలోనో ఉత్తరించే స్థలంలోనో అనుభవించి తీరాలి. భక్తికొరకు చేసే పాపోచ్చారణం ద్వారా ఈ యనిత్య శిక్ష కొంతవరకు తీరుతుంది.

రెండవది, పాపం పరిహారమయ్యాక గూడ మనకు చెడ్డను చెయ్యాలనే కోరిక వుంటుంది. మంచిని చేయాలంటే బద్ధకింపుగా వుంటుంది. సృష్టివస్తువులమీదికి మనసు బలంగాపోతుంది. ఈ మనస్తత్వాన్నే వేదశాస్త్రులు "పాపావశేషం" అంటారు. ఇక, ఈ పాపోచ్చారణం ద్వారా మనం ఈ మనస్తత్వాన్ని జయించి భక్తిని పెంపొందించుకోవచ్చు. ఇన్ని సత్ఫలితాలున్నాయి కనుక అవకాశమున్నపుడెల్లా ఈ పుణ్యక్రియలో పాల్గొనడం లాభదాయకం.

## 5. ఆత్మశోధనం

పాపోచ్చారణం చేయకముందు విశ్వాసులు జాగ్రత్తగా ఆత్మశోధనం చేసికోవాలి. జపపుస్తకాల్లో రకరకాల ఆత్మశోధనలు కన్పిస్తాయి. వాటిల్లో వేటినైనా వాడుకోవచ్చు. మామూలుగా ఈ యాత్మశోధనంలో ఒక నియమిత పద్ధతి ననుసరిస్తే బాగుంటుంది. ఉదాహరణకు దేవునిపట్ల తోడినరుల పట్ల మనపట్ల మనం నిర్వర్తించవలసిన బాధ్యతలను పరిశీలించి చూచుకోవడం ఒక పద్ధతి.

ఇక ఆత్మశోధనంలో ప్రధానమైంది ప్రేమాజ్ఞ. అనగా మనం దైవప్రేమనుగాని సోదరప్రేమనుగాని ఎంతవరకు పాటించామా అని పరిశీలించి చూచుకోవాలి. ఇంకా కేవలం ఆయా పాపక్రియలను చేసామా లేదా అనిమాత్రమే పరిశీలించి చూచుకొంటేనే చాలదు. హృదయంలోని కోరికలను గూడ పరీక్షించి చూచుకోవాలి. ఉదాహరణకు వ్యభిచారం చేసినప్పుడు మాత్రమే గాదు, చేయాలని బుద్ధిపూర్వకంగా కోరుకొన్నపుడు గూడ పాపమే ఔతుంది - మత్త 5,27-28.

ఆత్మశోధనమంటే కేవలం మన తప్పుల జాబితాను సిద్ధం చేసికోవడం మాత్రమే కాదు. మన హృదయంవైపు మనం చూచుకొంటూ, మనతో మనం సంభాషించుకొంటూ కూర్చోవడం అసలే కాదు. ఆత్మశోధనంలో మనం పరిశుద్ధుడైన దేవుని ముందు నిలబడతాం. జ్ఞానస్నానంలో అతడు మనలను పరిశుద్ధ జీవితం జీవించమని ఆదేశించాడు. ఆ కరుణగల దేవుని ఆదేశాన్ని మనం ఎంతవరకు పాటించామా అని ఆలోచించి చూచుకోవాలి. కనుక ఈ ప్రక్రియలో మనం మనకోసం సిలువపై చనిపోయిన క్రీస్తువైపు చూడాలి గాని కేవలం మనవైపే చూచుకొంటూ కాలం వెళ్ళబుచ్చగూడదు.

ఆత్మశోధనం చేసికొనేపుడు మనమేమి పాపం చేసాములే అని చులకన భావం చూపకూడదు. ప్రపంచంలోకెల్లా మనమే ఘోరపాపుల మనుకొని నిరుత్సాహపడనూ కూడదు. దేవుని యెదుటా శ్రీసభ యెదుటా నమ్మకంతో మనలను మనం పరిశీలించి చూచుకోవాలి. అది చాలు. మనం పవిత్రులమయ్యేకొద్దీ మన ఆత్మశోధనం నిశితమౌతుంది. పవిత్రాత్ముడు మనలను మనం నూత్నదృక్కోణాలనుండి పరిశీలించి చూచుకొనే భాగ్యాన్ని దయచేస్తాడు. అధిక చిత్తశుద్ధితో పరీక్షించి చూచుకొనే వరాన్ని గూడ ప్రసాదిస్తాడు.

ఆత్మశోధనంలో మనం బాహ్యక్రియలనే గాదు, ఆ క్రియలు వెలువడ్డానికి కారణమైన మన అంతరంగిక దృక్పథాలను గూడ పరిశీలించుకోవాలి. ఉదాహరణకు నేను ఉదయ సాయంకాల ప్రార్థనలు చెప్పలేదు అనుకొంటే చాలదు. నేను దేవుణ్ణి అట్టే పట్టించుకోలేదు కనుక ఈ ప్రార్థనలు చెప్పలేదు అనుకోవాలి. నేను పాడుచూపులు చూచాను అనుకొంటే చాలదు. నేను కామవాంఛకు లొంగిపోయాను గనుక పాడు చూపులు చూచాను అనుకోవాలి. తర్వాత పాపోచ్చారణంలో ఈ దృక్పథాలు కూడ వివరించి చెప్పి మనలను మనం తగ్గించుకోవడం మంచిది. మనం చేయవలసి గూడ చేయకుండా వదలివేసిన కార్యాలను గూడ ఇక్కడే జ్ఞప్తికి తెచ్చుకోవాలి.

మామూలుగా ఆత్మశోధనను కృతజ్ఞతా ప్రార్థనంతో ప్రారంభించడం మెరుగు. దానివల్ల దేవుడు మనకు ఎన్నివరాలు దయచేసినా మనం అతన్ని సేవించడంలో ఎంతో అశ్రద్ధ చూపుతున్నాం అనే భావం కలిగి పశ్చాత్తాపం బలపడుతుంది. ఇంకా బైబులు గ్రంథాన్ని చదవుకొని ఆత్మశోధనం చేసికోవడం మంచిది. దైవవాక్కు గొప్ప వెలుగు. అది మన హృదయంలోని చీకటిని పటాపంచలు చేస్తుంది.

## 6. ఎంత తరచుగా పాపోచ్చారణం చేయాలి?

ఏడాదికి ఒక్కసారైనా పాపోచ్చారణం చేయాలన్నది 1125 నాటి ఆజ్ఞ. ఇంత గొప్ప వరప్రసాద సాధనాన్ని విశ్వాసులు తప్పక వినియోగించుకోవాలని ఈ యాజ్ఞ భావం. కాని పవిత్రులు కాగోరే విశ్వాసులు ఏడాదికి ఒక్కసారి పాపోచ్చారణం చేస్తే చాలదు.

జ్ఞానస్నానం అభిలషించే భక్తిమంతమైన జీవితం జీవింపగోరేవాళ్ళంతా, చావైన పాపం లేకపోయినా గూడ, తరచుగా పాపోచ్చారణ చేయడం మంచిది. మన హృదయం పవిత్రం కావాలంటే ఈ సంస్కారం అత్యవసరం. ఈ సంస్కారం ద్వారా మన పాపాలు పరిహారం కావడం మాత్రమే కాదు ఆత్మశోధనం పశ్చాత్తాపం మొదలైన మన పరివర్తన క్రియలు కూడ పునీతమౌతాయి.

పాపోచ్చారణానికీ దివ్యసత్ప్రసాద స్వీకరణానికీ దగ్గరి సంబంధం వుంది. మంచి పాపోచ్చారణం ద్వారా మనం దివ్య సత్ప్రసాదాన్ని యోగ్యంగా స్వీకరిస్తాం. "ప్రతివాడూ తన్ను తాను పరిశీలించుకొని ఈ రొట్టెను తిని ఈ పానీయాన్ని సేవించాలి" అన్నాడు పౌలు – 2కొరి 11,28. అందుకే శ్రీసభ చావైన పాపంలో వున్నవాళ్ళు పాపోచ్చారణం చేయందే దివ్యసత్ప్రసాదాన్ని పుచ్చుకోగూడదని నియమం చేసింది. కాని చావైన పాపం లేనపుడు సత్ప్రసాద స్వీకరణానికిముందు తప్పకుండా పాపోచ్చారణం చేయవలసిన అవసరం లేదు.

1980లో శ్రీసభ చేసిన శాసనం ప్రకారం, మఠజీవితం జీవించేవాళ్ళంతా 15 రోజుల కొకసారి ఈ సంస్కారంలో పాల్గొనాలి. ఈ నియమాన్ని ఖండితంగా పాటించనక్కరలేదు. ఐనా మఠజీవితం జీవించేవాళ్ళు పవిత్రులుగా వుండాలి కనుక తరచుగా దీనిలో పాల్గొని ఇతరులకు కూడ మంచి ఆదర్శం చూపించాలి. ఇక విశ్వాసులు కూడ దీనిలో తరచుగా పాల్గొంటే విశేష లాభాలు కలుగుతాయి. గృహస్థులు మామూలుగా రెండు వారాల కొకసారైనా పాపోచ్చారణం చేయాలి అని నియమం పెట్టుకోవడం మంచిది.

తపస్సు కాలానికీ పాపోచ్చారణానికీ గూడ దగ్గరి సంబంధం వుంది. తపస్సుకాలంలోని విబూది బుధవారం నుండి శ్రీసభ తన బిడ్డలు పశ్చాత్తాపపడాలని పూజపఠనాల్లో మాటిమాటికీ హెచ్చరిస్తూంటుంది. కనుక ఈ కాలంలో విశ్వాసులు చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడి తమ పాపాలకు మన్నింపు పొందడం ముదావహం.

ప్రస్తుతం విశ్వాసులు పాపోచ్చారణ సంస్కారాన్ని చాల అశ్రద్ధచేస్తున్నారు. చాలమంది పాపోచ్చారణం చేయడమే లేదు. ఇది విచారింపదగిన విషయం. మనమట్టుకు మనం విశ్వాసులు భక్తిమంతమైన మంచి పాపోచ్చారణం చేసేలా చూడాలి. ఒకమారు ప్రజలు భక్తితో పాపోచ్చారణం చేయడానికి అలవాటుపడితే, తరచుగా పాపోచ్చారణం చేయడమనేది దానంతట అదే వస్తుంది.

నేడు చాలమంది పాపోచ్చారణాన్ని నిర్లక్ష్యం చేస్తున్నారని చెప్పాం. లక్ష్యంచేసే వాళ్ళల్లోగూడ చాలమంది దేవుని పట్లగల భక్తి ప్రేమలవల్ల గాక భయంవల్ల దీనిలో పాల్గొంటున్నారు. వీళ్ళు ఈ సంస్కారాన్ని యాంత్రికంగా పాపాలను పరిహరించే తంతుగా

భావిస్తారు. అసలు వీళ్ల పాపమంటే ఏవోకొన్ని ఆజ్ఞలను మీరడమనుకొంటారేగాని, తండ్రిలాంటి దేవునితో వుండే ప్రేమ సంబంధాన్ని త్రెంచుకోవడం అని భావించరు.

మన ప్రజల్లో కొందరు చావైన పాపం లేకపోయినా సరే సత్రప్రసాదాన్ని స్వీకరింపకముందు పాపోచ్చారణం చేయాలని అనుకొంటారు. కాని కొందరు దీనికి కేవలం వ్యతిరేకధోరణిలో ఆలోచిస్తారు. వీళ్ళు ఎప్పుడూ సత్రప్రసాదం స్వీకరిస్తూనే వుంటారు. కాని పాపోచ్చారణం మాత్రం పట్టించుకోరు. ఇవి రెండూ తప్పుడు పద్ధతులే.

పాపోచ్చారణంద్వారా పూర్తిగా పరివర్తనం చెందలేకపోతూంటాం. ఇంకా మన పాపాలద్వారా ఎవరికి కష్టమూనష్టమూ కలిగించామో ఆ తోడి ప్రజలతో మళ్ళా సమాధానపడలేక పోతూంటాం. ఇందువల్ల గూడ కొందరికి ఈ సంస్కారంపట్ల నమ్మకం తొలగిపోతూంది. ఇదేమో సులువుగా పాపాలను వదిలించుకొనే తంతులావుందే అని వీళ్ళు దీనిపట్ల విశ్వాసం కోల్పోతూన్నారు. అసలు దీనివల్ల ఫలితం దక్కదేమోనని అనుమానపడుతూన్నారు.

పూర్వమే చెప్పినట్లు ఆధునికయుగం పాపభీతి కోల్పోయింది. తిని త్రాగి లైంగిక సుఖాలు అనుభవించడం, ఒకరితో ఒకరు పోటీకి దిగడం, పేదల నోళ్ళుగొట్టి అన్యాయంగా సొమ్ము జేసికోవడం మొదలైనవి నేటి మానవునికి ప్రీతికరమైన చర్యలు. ఈలాంటి నాగరికతకు అలవాటుపడిన క్రైస్తవులు చాలమంది పాపాన్ని లెక్కచేయరు. పాపాన్ని లెక్కచేయని క్రైస్తవుడు పాపోచ్చారణాన్ని మాత్రం ఎందుకు పట్టించుకొంటాడు? ఇంకా ఇటీవలి కాలంలో కొందరు గురువులకి పాపోచ్చారణం చేయడం అవసరమా అనే శంకను వెలిబుచ్చుతూ వచ్చారు. వీళ్ళనుజూచి భక్తిగల క్రైస్తవులుకూడ ఈ పుణ్యకార్యాన్ని అశ్రద్ధ చేయడం మొదలెట్టారు. ఇన్ని కారణాలవల్ల ఈ సంస్కారం నేడు అనాదరణకు గురవుతుంది.

ఫలితంగా నేడు చాలమందికి పాపోచ్చారణంపట్ల భక్తి సన్నగిల్లిపోయింది. కొందరు దాన్ని యాంత్రికంగా పాపాలను పరిహరించే తంతు అని భావిస్తుంటే, మరికొందరు అది శక్తిని కోల్పోయిన, అనవసరమైన సంస్కారం అని యెంచుతూన్నారు. కాని యివన్నీ తప్పుడు భావాలేనని ముందే వివరించి చెప్పాం. పాపం ఘోరమైంది. దేవునికి యెంతో అప్రియం కలిగించేది. దాన్ని వదిలించుకోవాలంటే భక్తిగల పాపోచ్చారణం అవసరం. ఈ సంస్కారం వ్యక్తిగతమైందీ, సామూహికమైందీ గూడ. దీనిద్వారా మనం దేవునితోను తోడిప్రజలతోను గూడ రాజీపడతాం. ఇది దేవుని యెదుట చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడ్డంద్వారా పనిచేస్తుందేగాని యాంత్రికంగా పనిచేయదు. ఈ సంస్కారం తొలినాళ్ళనుండి శ్రీసభలో వాడుకలో వుందని చెప్పాం. నేడు మనం దాన్ని అపార్థంచేసికొని అశ్రద్ధ చేస్తున్నామంటే తప్పు మనదే. ఇవి నిర్దుష్టమైన భావాలు. ఈలాంటి భావాలద్వారా

మనం ఈ సంస్కారానికి పునరుజ్జీవనం కలిగించాలి. విశ్వాసులు ఈ పుణ్యకార్యంలో భక్తితోను, తరచుగాను గూడ పాల్గొనేలా చేయాలి.

## 7. చిన్నబిడ్డల పాపోచ్చారణం

మామూలుగా చిన్నబిడ్డలకు చావైన పాపాలంటూ వుండవు. ఐనా వాళ్లుకూడ చక్కగా పాపోచ్చారణం చేస్తే మంచి ఫలితం పొందుతారు. ఐనా మనం వాళ్ళను నిర్బంధం చేయకూడదు.

కుటుంబంలో తల్లిదండ్రులు తమ్ము ప్రేమించినట్లు దేవుడుకూడ తమ్ము ప్రేమిస్తాడని చిన్నపిల్లలకు అర్థంకావాలి. ఇంకా యింటిలో అమ్మా నాన్న తమ్ము క్షమించినట్లు దేవుడు కూడ తమ్ము క్షమిస్తాడని వాళ్ళకు బోధపడాలి. పిల్లలకు ఈ తెలివిని పుట్టించవలసింది ఇంటిలో తల్లిదండ్రులూ, బడిలో ఉపాధ్యాయులూ.

బిడ్డడు మొదటిసారి పాపోచ్చారణం చేసేపుడు తల్లిదండ్రులు చాల శ్రద్ధ చూపాలి. ఆ యనుభవం వాడికి భయాన్ని కాక ఆనందాన్ని కలిగించేలా వుండాలి. దేవుడు వాడికి ఓ పోలీసువాడిలా కాక నాన్నలా కన్పించాలి.

పిల్లలు మొదటిసారి పాపోచ్చారణంచేసి తర్వాత దివ్యసత్ర్పసాదం స్వీకరిస్తారు. కాని ఇటీవల కొందరు ఈ పద్ధతిని విమర్శించారు. ఈ చిన్నప్రాయంలో బాలలు చావైన పాపాలు చేయడం అరుదు కనుక వాళ్ళచేత పాపోచ్చారణం చేయించడం మంచిది కాదన్నారు. అలా చేయిస్తే వాళ్ళకు జీవితాంతమూ ఈ సంస్కారంమీద అనిష్టభావం కలుగవచ్చునని వాదించారు. కనుక కొన్ని ప్రాంతాల్లో బాలలకు మొదట దివ్యసత్ర్పసాద మిచ్చారు. కొన్నియేండ్లు కడచి వాళ్లు కొంచెం పెరిగి పెద్దయ్యాక పాపోచ్చారణం చేయించారు. ఈ పద్ధతి ఇటీవల యూరపులో కొన్నితావుల్లో ప్రయోగాత్మకంగా జరిగింది. కాని 1973లో శ్రీసభ ఈ ప్రయోగాన్ని రద్దుచేసింది.

పాపోచ్చారణం చేయాలంటే చావైన పాపం తప్పకుండా వుండనక్కరలేదనీ స్వల్పపాపాలు చాలుననీ ముందే చెప్పాం. కనుక పెద్దపాపాలులేని చిన్నబిడ్డలు కూడ దీనిలో పాల్గొని ఫలితాన్ని పొందవచ్చు. దీనిద్వారా వాళ్ళ ఆధ్యాత్మిక జీవితం పెంపుజెందుతుంది. వాళ్లు దేవుణ్ణి ఆరాధించి కీర్తిస్తారు. పిల్లలు పాపోచ్చారణాన్ని శిక్షగా భావింపనక్కరలేదు. ప్రభువు కరుణను అనుభవానికి తెచ్చుకొనేదాన్నిగా భావించవచ్చు.

కనుక తల్లిదండ్రులూ ఉపాధ్యాయులూ కూడ పాపోచ్చారణం ద్వారా దేవుణ్ణీ తోడిప్రజలనూ అధికంగా ప్రేమిస్తామని చిన్నపిల్లలకు నేర్పించాలి. పిల్లలకు సువిశేషంలోని దుడుకు చిన్నవాడి కథను వివరించి చెప్పాలి. దాన్ని బళ్ళో పిల్లలచేత గూడ నటనజేయించి

చూపిస్తే ఇంకా మంచిది. దేవుడు ఓ తండ్రిలా మన తప్పిదాలను మన్నిస్తాడు అని ఈ కథ చక్కగా నిరూపిస్తుంది.

## ప్రార్థనా భావాలు

1. అగస్టీను భక్తుడు ఈలా చెప్పాడు. "క్రీస్తు గొప్ప వెలుగు. ఆ ప్రభువు మనతోవుంటే మన హృదయం వెలుగుతో నిండిపోతుంది. అతడు మనలను విడనాడితే మన యెడద చీకటితో నిండిపోతుంది". తాను జగత్తునకు జ్యోతిననీ తన్ననుసరించేవాడు అంధకారంలో నడవడనీ సెలవిచ్చాడు ప్రభువు – యోహా 8,12. ఇక, మనం చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడి పాపోచ్చారణం చేసేపుడు క్రీస్తుజ్యోతి మనమీద ప్రసరిస్తుంది. ఆ తేజస్సు మనలోని పాపాంధకారాన్ని పటాపంచలు చేస్తుంది.

2. రెండవ శతాబ్దపు వేదశాస్త్రియైన టెర్టూలియను ఈలా నుడివాడు. "ఓడ మునిగినవాళ్ళు తెప్పబట్టుకొని ఒడ్డుజేరతారు. అలాగే పాపసముద్రంలో మునిగినవాళ్లు పాపోచ్చారణం అనే తెప్పతో దైవకృప అనే తీరాన్ని చేరుతారు". కనుక నీళ్ళల్లో మునిగిపోయేవాళ్ళను తెప్పలాగ పాపంలో మునిగిపోయే మనలను ఈ సంస్కారం రక్షిస్తుంది. ఈలాంటి సదుపాయాన్ని మనం వాడుకోకపోతే అది కేవలం మన మూర్ఖత్వమే ఔతుంది.

3. 1973లో వెలువడిన నూత్న పాపోచ్చారణ విధి ఈలా చెప్తుంది. "ఈ సంస్కారంలో తండ్రి తన యింటికి తిరిగి వచ్చిన దుడుకు చిన్నవాణ్ణి ఆదరంతో అంగీకరిస్తాడు. క్రీస్తు తప్పిపోయిన గొర్రెను భుజాలమీద మోసికొని తిరుగా మందలోనికి తీసికొనివస్తాడు. పరిశుద్ధాత్ముడు హృదయమందిరాన్ని మరింత పునీతంచేసి తాను ఆ మందిరంలో అధికంగా నివసిస్తాడు". ఈలా ముగ్గురు దైవవ్యక్తుల మన్ననుపొందేది పాపోచ్చారణం. కనుక మనం దానిలో ఆశతోను భక్తితోను పాల్గొనాలి.

4. జెరోముగారు ఈ వుపమానం చెప్పారు. "రోగి తన వ్రణాన్ని వైద్యునకు చూపించడానికి సిగ్గుపడి దాచిపెట్టుకొంటే వైద్యుడు ఆ పుండును మాన్పలేడు. అలాగే పాపోచ్చారణంలో మన పాపాలను గురువుతో చెప్పుకోవడానికి సిగ్గుపడి వాటిని కప్పిపెట్టుకొంటే ఇక వాటికి మన్నింపు లభించదు". కొందరు ఈ సిగ్గువల్లా బిడియంవల్లా తమ పాపాలను సరిగా చెప్పరు. ఇక్కడ పిశాచ ప్రేరణం కూడ కొంత వుంటేవుండవచ్చు. ఈలాంటి వాళ్ళంతా ఈ లోపాన్ని అవశ్యం సవరించుకోవాలి.

5. నూత్న పాపోచ్చారణ విధి ప్రకారం పాపోచ్చారణాన్ని వినే గురువు పాపి హృదయంలోని పాపాలను అర్థం చేసికోవాలి. పాపి ఆ పాపాలకు నివారించుకోవడానికి అనువైన మార్గాలను సూచించాలి. గురువు ఈ సంస్కారంలో న్యాయాధిపతిగా పనిచేస్తాడు.

వేదశాస్త్రాన్ని చదువుకొని వుండడంద్వారాను, భక్తితో ప్రార్థనం చేసికొని వుండడంద్వారాను, అతడు న్యాయాధిపతిగా తాను నిర్వహించే బాధ్యతలను చక్కగా అర్థంచేసికోవాలి. పైగాపవిత్రాత్మ అపవిత్రాత్మ నరుల హృదయాల్లో పనిచేసే తీరుగూడ అతనికి క్షుణ్ణంగా తెలిసివుండాలి. ఈ వివేచనం పవిత్రాత్మ అనుగ్రహంవల్ల అతనికి సిద్ధిస్తుంది-10. కనుక గురువు తన తరపున తాను భక్తిశ్రద్ధలతో మెలుగుతూ విశ్వాసులు ఈ సంస్కారంద్వారా సత్ఫలితాన్ని పొందేలా చూడాలి.

# 7. ప్రాయశ్చిత్తం

పశ్చాత్తాపమూ పాపోచ్చారణాల తర్వాత ప్రాయశ్చిత్తం వస్తుంది. మనం ప్రాయశ్చిత్తాన్ని ఎందుకు చెల్లించాలో బాగా అర్థం చేసికొని వుండాలి. ఈ యధ్యాయంలో నాల్గంశాలు పరిశీలిద్దాం.

## 1. ప్రాయశ్చిత్త భావం

మన పాపాలకు గురువు విధించే అపరాధాన్ని చెల్లించడమే ప్రాయశ్చిత్తం. మనమే గనుక మన పాపాలకు చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడితే, ఆ పాపాలద్వారా మనం మనసునొప్పించిన దేవునికి పరిహారం చెల్లిస్తాం. అదేప్రాయశ్చిత్తం. పాపోచ్చారణంలో ప్రాయశ్చిత్తం అతి ముఖ్యమైన అంశం కాదు. కాని అవసరమైంది.

మన పాపంవల్ల భగవంతుడు కోపపడతాడనీ, ఆ కోపాన్ని తొలగించడానికి ప్రాయశ్చిత్తాన్ని చెల్లించాలనీ భావించకూడదు. యథార్థంగా భగవంతుడు మన పాపాలకు కోపపడడూ, బాధపడడూ. "మనం పాపులమై యుండగానే క్రీస్తు మనకొరకు చనిపోయాడు అంటే దేవునికి మనపట్ల ప్రేమ వుందని అనుకోవాలి" - రోమా 5,8. నిజానికి ప్రాయశ్చిత్తం ద్వారా జరిగేదేమిటంటే, మన జీవితాన్ని చక్కదిద్దుకొంటాం. మన రోగానికి చికిత్స చేసికొంటాం.

మన పశ్చాత్తాపంద్వారా పాపోచ్చారణంద్వారా మనపాపాలకు మన్నింపు పొందుతాం. మనకు రక్షణం లభిస్తుంది. ఇపుడు ప్రాయశ్చిత్త కర్మద్వారా పూర్వపు పాపజీవితాన్నుండి వైదొలగి క్రొత్త జీవితానికి పూనుకొంటాం.

ప్రాయశ్చిత్తాన్ని చెల్లించడం ద్వారా ఏమి సాధిస్తాం? పాపోచ్చారణం ద్వారా నిత్యశిక్ష (నరకశిక్ష) తొలగుతుందేగాని అనిత్యశిక్ష తొలగదని చెప్పాం. అనిత్యశిక్ష అంటే మనం చేసిన పాపానికి కొన్ని బాధలు అనుభవించడం అనికూడ చెప్పాం. ఈ యనిత్యశిక్షను ఈ భూమిమీదగాని లేక ఉత్తరించే స్థలంలోగాని తీర్చుకొన్న పిదపనే మనకు మోక్షప్రాప్తి

కలిగేది. ఇప్పుడు ఈ ప్రాయశ్చిత్తాన్ని చెల్లించడం ద్వారా ఈ యనిత్యశిక్షను తొలగించుకోవచ్చు. ఇంకా, పాపపరిహారం లభించాకగూడ దాని అవశేషాలు మిగిలివుంటాయని చెప్పాం. సృష్టివస్తువులకు అంటిపెట్టుకోవడం, చెడ్డను చేయాలని కోరుకోవడం, తన్నుతాను విపరీతంగా ప్రేమించుకోవడం మొదలైనవి ఈ యవశేషాలు. ప్రాయశ్చిత్తక్రియ ఈ యవశేషాలను తొలగించుకోవడానికి గూడా సాయపడుతుంది. తొలిరోజుల్లో పాపులు తపస్సు కాలమంతా ప్రాయశ్చిత్తం చెల్లించిన తర్వాతనే పెద్ద గురువారంనాడు తమపాపాలకు మన్నింపుపొందేవాళ్ళు. కనుక పూర్వులు మొదట ప్రాయశ్చిత్తం చెల్లించి తర్వాత మన్నింపు పొందారు. కాని యిప్పుడు పాపోచ్చారణంలో గురువు మొదట మన్నింపు దయచేస్తాడు. తర్వాతనే విశ్వాసులు ప్రాయశ్చిత్తం చెల్లిస్తారు. ఇది తేలికపని. కనుక ఈ కార్యాన్ని మనం చిత్తశుద్ధితో నిర్వహించాలి.

ఓ చిన్న కుఱ్ఱవాడు తల్లి హెచ్చరించినా వినకుండా యింటిలోని బల్లను అటూయిటూ కదిలించి దానిమీది అలంకరణవస్తువును క్రింద పడవేసాడు. అది ముక్కలు ముక్కలైంది. తల్లి పిల్లవాడి ఆగడానికి ఎంతో చింతించింది. కడన తానూ పిల్లవాడూ కలసి ఆ పగిలిపోయిన ముక్కలను ఏరి అవతల పారవేసి ఇల్లు శుభ్రం చేసికొన్నారు. పాపోచ్చారణంలో మనం చెల్లించే ప్రాయశ్చిత్తం కూడ ఈలాగే వుంటుంది. క్రీస్తు మన మానవ కుటుంబంలో పుట్టి మనకోసం చనిపోయి మన పాపాలకు ఇదివరకే ప్రాయశ్చిత్తం చేసాడు. ఇప్పుడు మన ప్రాయశ్చిత్తం దానంతట అది కాక, క్రీస్తు ప్రాయశ్చిత్తంతో కలసి పరిహారాన్ని సాధించి పెడుతుంది. ఆ ప్రభువు మన సహకారాన్ని కోరుకొంటాడు. కరుణతో మన ప్రాయశ్చిత్తాన్ని తనదానితోకలుపుకొని మనకు వరప్రసాదాన్ని దయచేస్తాడు.

ప్రాయశ్చిత్తాన్ని గూర్చి చెప్పేపుడు ఒక్కసంగతిని గుర్తుంచుకోవాలి. అది నష్టపరిహారం చెల్లించడం. మనం ఇతరుల సొత్తు దొంగిలిస్తాం. అన్యాయంగా ఇతరులకు వస్తునష్టం కలిగిస్తాం. అలాంటప్పుడు మనం వాళ్ళ నష్టాన్ని తీర్చాలి. అలా తీర్చకపోతే మనకు చిత్తశుద్ధి వుందని రుజువుకాదు. జక్కయ ఇందుకు మంచి ఉదాహరణం - లూకా 19,8.

## 2. క్రీస్తు పరిహారంతో కలిసే మన పరిహారం

క్రీస్తు సిలువమీద చనిపోయి మనపాపాలకు ప్రాయశ్చిత్తంచేసాడు. మనం చెల్లించే ప్రాయశ్చిత్తం ఈ క్రీస్తుప్రాయశ్చిత్తంతో కలసే పని చేస్తుంది అని చెప్పాం. పాపోచ్చారణంలో మనం దోషం చేసామని ఒప్పుకొంటాంగదా? ఎప్పుడుకూడా దోషానికి శిక్షననుభవించాలి. మనపుణ్యమాఅంటూ మన తరపున క్రీస్తు పూర్వమే శిక్షననుభవించాడు. ఇప్పుడు మనం కూడ బుద్ధితెచ్చుకొని కొద్దిపాటి శిక్షనైనా అనుభవించడానికి సమ్మతిస్తాం.

ఈలా మనం ఒప్పుకొన్న శిక్షను క్రీస్తు శిక్షతో చేర్చి అనుభవిస్తాం. గురువువిధించే అపరాధాన్ని తీర్చడమంటే యిదే. ఈ ప్రక్రియ ద్వారా క్రీస్తుపాటులూ మరణమూ మనమీద సోకి మనకు వరప్రసాదాన్ని ఆర్జించిపెడతాయి. "మా శరీరంలో క్రీస్తు మరణం ప్రత్యక్షమౌతుంది" అన్నాడు పౌలు - 2కొ 4,11. కనుక జ్ఞానస్నానం పొందిన క్రైస్తవులు అనుభవించే బాధలన్నీ క్రీస్తు మరణాన్నీ తమలో ప్రత్యక్షం చేసికోవడమే ఔతుంది.

ఇంకా పౌలు "క్రీస్తు తన శరీరమైన శ్రీసభకొరకు పడిన బాధలలో కొదవగా వున్నవానిని నేను నా శ్రమలద్వారా తీరుస్తున్నాను" అన్నాడు - కొలో 1,24. క్రీస్తు శ్రమలు స్వయంగా మన పాపాలను మన్నించగలవు. అయినా అతడు కరుణాళువు గనుక మనశ్రమలనుగూడ తనశ్రమలతో కలుపుకొనే మనలను రక్షిస్తాడు. కనుక మనప్రాయశ్చిత్తం క్రీస్తు శ్రమలతో కలుస్తుంది. ఇంకా, మన ప్రాయశ్చిత్తం మన వ్యక్తిగతమైంది మాత్రమే కాదు. అది శ్రీసభ కంతటికీ ఉపకరిస్తుంది. శ్రీసభ మాలిన్యాన్ని తొలగించి ఆతల్లిని అధిక పవిత్రురాలిని చేస్తుంది.

తొలి శతాబ్దాల్లో పాపాలకు పెద్ద ప్రాయశ్చిత్తం విధించేవాళ్ళు. ఉపవాసాలు, ప్రార్థనలు, దానధర్మాలు, స్వీయదేహాన్ని దెబ్బలతో హింసించుకోవడం మొదలైనవి ఈ యపరాధాలు. ఈశిక్షలను విశ్వాసులు వారాలూ నెలలూ సంవత్సరాలూ కూడ పాటింపవలసి వుండేది. కాని ఇప్పటికాలంలో ప్రాయశ్చిత్త శిక్షను పూర్తిగా తగ్గించారు. ఇప్పుడు రెండుమూడు జపాలుచెప్పి అపరాధాన్ని ఒక్కనిమిషంలోముగిస్తాం అంతే. కాని భక్తుడైన క్రైస్తవుడు గురువు విధించే చిన్న అపరాధాన్ని తీర్చడంతోనే సంతృప్తి చెందకూడదు. తన పాపాలకు తానే స్వయంగాగూడ ఏదైనదండనం విధించుకొని దాన్ని తీర్చాలి. ఉదాహరణకు మన జీవితంలో సంభవించే వ్యాధిబాధలూ కష్టాలూ ఇబ్బందులూ మొదలైనవాటినన్నిటినీ ప్రాయశ్చిత్తంగా స్వీకరించి మంచి మనస్సుతో సహించవచ్చు. ఈలా మనం బుద్ధిపూర్వకంగా అనుభవించే కష్టాలుకూడ క్రీస్తు శ్రమలతో ఐక్యమై మనకు వరప్రసాదాన్ని ఆర్జించిపెడతాయి. మన అనిత్యశిక్షను తగ్గిస్తాయి.

పాపోచ్చారణంలో గురువు మన పాపాలకు మన్నింపు దయచేసేపుడు ఈ క్రింది జపం చెప్తారు. "నీవు చేసే మంచి పనులూ నీవనుభవించే శ్రమలుకూడ క్రీస్తు అనుభవించిన శ్రమల భాగ్యంవల్లా, మరియమాతా పునీతులూ ఆర్జించిన పుణ్యాల ఫలితంవల్లా నీకు పాపపరిహారాన్నీ, వరప్రసాదాభివృద్ధినీ, మోక్షభాగ్యాన్నీ సంపాదించి పెట్టుగాక." కనుక మన సత్కార్యాలూ మన శ్రమలూకూడ క్రీస్తు శ్రమలతోను పునీతుల పుణ్యాలతోను ఏకమై మనకు వరప్రసాదాన్ని ఆర్జించి పెడతాయి. అందుకేమనం జీవితంలోనిఇబ్బందులన్నిటినీ ప్రాయశ్చిత్తంగా అంగీకరించాలి. పాపోచ్చారణం అనే సంస్కారాన్ని కేవలం గుళ్ళోనే

ముగించక మన దైనందిన జీవితంలోగూడ కొనసాగించుకోవాలి. క్రీస్తుశ్రమలు మన అనుదిన జీవితంలోని బాధలతో ఐక్యమై మనలను పునీతులను జేస్తాయి.

## 3. ప్రార్థనం, ఉపవాసం, దానధర్మాలు

మామూలుగా పాపోచ్చారణంలో గురువు విధించే ప్రాయశ్చిత్త కర్మలు మూడురకాలుగా వుంటాయి. వాటిని గురించి ఒకటిరెండు మాటలు చెప్పాలి.

1. తరచుగ గురువు మన పాపాలను పరిహారంగా రెండుమూడు పరలోక జపాలనో మంగళవార్త జపాలనో చెప్పమని ఆదేశిస్తారు. ఈ జపాలను యాంత్రికంగా ఉచ్చరించి వెళ్ళిపోతే చాలదు. మనం చేసిన అంత పెద్ద పాపాలకి యాంత్రికంగా వల్లెవేసే మూడు మంగళవార్త జపాలు ఏలా సరిపోతాయి? కనుక గురువు విధించిన ప్రార్థనలను మనం భక్తితో చెప్పుకోవాలి. గురువు అపరాధంగా విధించిన జపాలు చెప్పి ముగించిన పిదప కొన్ని కృతజ్ఞతా ప్రార్థనలు చెప్పుకోవడం గూడ మంచిది. వీటిద్వారా మన భక్తి బలపడుతుంది. ఇంకా మన నిత్యజీవితంలోని సమస్యలనూ బాధలనూ కూడ మన పాపాలకు ప్రాయశ్చిత్తంగా దేవునికి అర్పించుకోవాలి. మన బాధ్యతలను సంతృప్తికరంగా నిర్వర్తిస్తామని ప్రమాణంకూడ చేయాలి.

2. అరుదుగా గురువు ఉపవాసాన్ని ప్రాయశ్చిత్తంగా విధించవచ్చు. లేదా మనంతట మనమే పూర్తి వుపవాసాన్ని గాని పాక్షికమైన ఉపవాసాన్ని గాని పాటించి మన పాపలకు శిక్ష చెల్లించుకోవచ్చు. ఉపవాసం ప్రాచీన కాలం నుండి శ్రీసభలో వాడుకలో వుందే. దానిద్వారా మన పాపపు శరీరం అదుపులోకి వస్తుంది. మన జంతు ప్రవృత్తిని గూఢ వశంలోకి తెచ్చుకోవచ్చు. ఇంకా ప్రాచీన క్రైస్తవులు ఉపవాసముండి కొన్ని భోజనపదార్థాలను తినకుండా మానుకొనేవాళ్ళు. వాటి వెలను పేదలకు దానంగా యిచ్చేవాళ్ళు. - యెషయా 58,6-7 ఈ సంగతిని జ్ఞప్తికి తెస్తుంది. మనంకూడ ఈ కార్యం చేయగలిగితే మంచిది.

3. అప్పుడప్పుడు గురువు మన పాపాలకు శిక్షగా కొద్దిపాటి దానధర్మాలు చేయమని చెప్పడం కూడ కద్దు. లేదా మనమే మన పాపాలకు శిక్షగా మనకు చేతనైన దానాలు చేయవచ్చు. క్రీస్తు తాను స్వయంగా ధనవంతుడై యుండి మనకోసం పేదవాడుగా జన్మించాడు - 2కొ 8,19. అతడు ఇతరుల కొరకు జీవించాడు. ప్రాణత్యాగం చేసాడు. ఆ ప్రభువుని ఆదర్శంగా పెట్టుకొని మనం పేదలకు దానం చేయవచ్చు. పేదవాళ్లూ అక్కరలో వున్నవాళ్లూ ప్రతిచోటా మనకు తగులుతూనేవుంటారు. దానధర్మాలద్వారా పాపాలనూ వాటి శిక్షనూ తొలగించుకోవచ్చుననే భావం లూకా సువిశేషంలో చాలా

తావుల్లో కన్పిస్తుంది. ఉదాహరణకు కొర్నేలి పేదలకు దానధర్మాలు చేసిన భక్తుడు - అచ 10,1-2.

## 4. ఆంతరంగికమైన ఆరోగ్యం

జీవితంలో మనకు చాలా బాధలు ఎదురౌతాయి. ఈ బాధలవల్ల మనం హైన్యభావాలవంటి మనస్తత్వాలు, కోపంవంటి మనోభావాలు, త్రాగుడు వంటి దురభ్యాసాలు అలవర్చుకోవచ్చు. మామూలుగా ఈ బాధలు మన పూర్వ జీవితంలో జరిగిన కొన్ని విషమ సంఘటనలను ఆధారంగా జేసికొని ఉద్భవిస్తాయి. ఈ పూర్వ సంఘటనలు చాలవరకు మన బాల్యప్రాయానికి సంబంధించినవి. మనం నాలుగైదేండ్ల ప్రాయంలో వున్నపుడు కొన్ని బాధాకరమైన సంఘటనలు జరిగివుంటాయి. వాటి స్మృతులు మన అజ్ఞాత మనస్సులో గూడుకట్టుకొని వుంటాయి. ఆ పూర్వ సంఘటనలను మనమిప్పుడు గుర్తుకి తెచ్చుకోలేకపోయినా బాధాకరమైన వాటి స్మృతులు మాత్రం మన అజ్ఞాత మనస్సుమీద పనిచేస్తూనే వుంటాయి. అవి పిలకలు వేస్తూంటాయి. వీటివల్లనే ఇప్పుడు మన జీవితంలో హైన్యభావాలవంటి బాధలు ఏర్పడతాయి. అనగా ఆనాటి బాల్యస్మృతులవల్ల ఇప్పుడు కానిపనులు చేస్తాం. కనుక ఇవి వ్యాధుల్లాంటివి. ఉదాహరణకు రాజు చిన్నపిల్లవాడుగా వున్నపుడు ఎవరో పెద్దవాళ్ళు ఏడ్పించి జడిపించారు. ఆ సంఘటనం ఇప్పుడతనికి గుర్తుకి లేదు. కాని దాని స్మృతి మాత్రం అతని అజ్ఞాత మనసులోవుండి బాధపెడుతుంది. అందుకే అతడు సులభంగా జనం దగ్గరికి రాడు. ఒంటరిగా వుండిపోతూంటాడు. పిరికివాడిలా కన్పిస్తాడు.

ఈ బాల్యస్మృతులు మనలను విశేషంగా మూడు రంగాల్లో బాధిస్తూంటాయి.

1. మన మనోధర్మాలు విషమించి మనలను బాధిస్తాయి. దీనివల్ల మనకు విపరీతమైన సిగ్గూ బిడియమూ విచారమూ ఒంటరిపాటూ హైన్యభావాలు ఏర్పడతాయి.

2. మన మానసిక గుణాలుకూడ ప్రకోపించి మనలను పాపంవైపు నడిపిస్తాయి. ఈ కారణంవల్ల కోపమూ ద్వేషమూ వైరమూ పగా అసూయా కామమూ మొదలైన దుర్గుణాలు మన హృదయంలో మోతాదుకు మించి చోటు చేసికొంటాయి.

3. కొన్ని దురభ్యాసాలు కూడ మనలను నిర్బంధిస్తాయి. ఇందువల్ల మనం మద్యపానప్రీతి, ముష్టిమైథునం మొదలైన దురభ్యాసాలకు అలవాటుపడతాం. ఇక ఆ చెడు అలవాట్లు మనలను వదలవు. అవి మనలను నిర్బంధపెడతాయి.

ఈ రోగాలను వదిలించుకోవాలంటే మనం రెండు పనులు చేయాలి. మొదటిది, నమ్మకంతో ప్రభువుని ప్రార్థన చేసికోవాలి. అతడు మనకు రక్షకుడు, ఆరోగ్యదాత. కనుక ఆ ప్రభువు మనలను కరుణించి ఈ రోగాలను కుదుర్చుతాడు.

రెండవది, పాపోచ్చారణంలో ఈ బాధలను గురువుకి వివరించి చెప్పాలి. అతని సలహాలను పాటించాలి. పాపోచ్చారణ సంస్కారం ఈ యాంతరంగికమైన వ్యాధులను గూడ నయం జేస్తుంది. ఇంకా మనం చెల్లించే ప్రాయశ్చిత్తాన్ని గూడ భక్తితో చెల్లించాలి. దానికిగూడ ఈ బాధలను తొలగించే శక్తి వుంటుంది.

## ప్రార్థనా భావాలు

1. మనం గుర్రాలను అదుపులో వుంచుకోవడానికి వాటి నోటిలో కళ్ళెం పెడతాం. ఎద్దుముక్కులో త్రాడు గుచ్చుతాం. ప్రాయశ్చిత్త క్రియకూడ పాపపు మానవులమైన మనకు ఓ కళ్ళెంలాను ముకుదాడులాను ఉపయోగపడుతుంది. దాని ద్వారా మన పాశవిక గుణాలు అదుపులోకి వస్తాయి. మనం భవిష్యత్తులో మళ్ళా పాపం చేయకుండా జాగ్రత్తపడతాం. ప్రాయశ్చిత్తం మన పాపపు గాయాలను మాన్పి నయం చేస్తుంది. భావి పాపం నుండి మనలను కాపాడుతుంది కనుక దాన్ని భక్తితో చెల్లించాలి.

2. శ్రీసభ అర్పించే ఓ కృతజ్ఞతా ప్రార్థన యిది. "ఓ ప్రభూ! నీవు అద్భుతంగా నరుణ్ణి సృజించావు. అంతకంటే అద్భుతంగానే అతన్ని పాపాన్నుండి పునరుద్ధరించావు నీవు నరుణ్ణి అతని పాపానికి అతన్ని వదలివేయవు. అతన్ని కరుణతో వెదుక్కొంటూ వస్తావు. నీవు నీ కుమారుణ్ణి ఈలోకం లోకి పంపావు. అతడు తన మరణంద్వారా మా పాపాన్నీ మరణాన్నీ నాశం చేసాడు. తన వుత్థానంద్వారా మాకు జీవాన్నీ ఆనందాన్నీ ప్రసాదించాడు. ఇంకా నీవు నీ యాత్మనుగూడ మా హృదయాల్లోకి పంపావు. ఆ యాత్ముడు మమ్ము నీ బిడ్డలనుగాజేసి నీ రాజ్యానికి వారసులను జేస్తాడు. ఈ భాగ్యాలన్నీ చాలవో అన్నట్లు పాపోచ్చారణ సంస్కారంద్వారా నీవు మా హృదయాలను శుద్ధిచేసి మమ్ము పాపదాస్యంనుండి తప్పిస్తూంటావు. దానిద్వారా మేము రోజు రోజుకీ నీ ప్రియకుమారుని పోలికను అధికాధికంగా పొందుతూంటాం. ఇట్టి నీ కృపను తలంచుకొని నీకు వందనాలు అర్పిస్తున్నాం". ఈ ప్రార్థనంలో మన రక్షణ చరిత్ర అంతా యిమిడి వుంది. విశ్వాసులు అపరాధాన్ని చెల్లించాక ఈలాంటి ప్రార్థనను భక్తితో జపించవచ్చు.

3. ఇంకో ప్రార్థనం ఇది. "మన ప్రభువు తప్పిపోయిన వాళ్ళను వెదక్కుంటూ వస్తాడు. చెల్లాచెదరైనవాళ్ళను మళ్లా మందలోనికి చేరుస్తాడు. గాయపడిన వాళ్ళకు కట్లుకడతాడు. దుర్బలులకు బలాన్ని ప్రసాదిస్తాడు. అలాంటి ప్రభువుని మనకు సాయం చేయమని వేడుకొందాం."

4. మరో ప్రార్థనం ఇది. "ప్రభూ! నీవు మమ్ము శిక్షించేపుడు నీ న్యాయాన్ని కనపరుస్తావు. మమ్ము క్షమించేపుడు నీ కరుణను చూపెడతావు. నీవు మమ్ము శిక్షించేపుడు గూడ మమ్ము నరకయాతనలకు గురిచేయవు. మమ్ము శిక్షించకుండా వదలివేసేపుడు మా పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికోవడానికి చాలినంత వ్యవధిని దయచేస్తావు. ఈలాంటి కరుణగల దేవుడివైన నీకు నమస్కారాలు."

5. పాపోచ్చారణ సంస్కారంలో గురువు న్యాయాధిపతిగా వ్యవహరించేమాట నిజమే. అతడు క్రీస్తు తరపునా శ్రీసభ తరపునా న్యాయాధిపతిగా నిల్చి పాపి పాపానికి తీర్పుజెప్తాడు. ఐనా అతడు కటువుగాగాని, పాపికి భయం పుట్టించేలాగాని ప్రవర్తించగూడదు. చాల మృదువుగాను దయతోను మెలగాలి. అసలు అతడు న్యాయాధిపతిగాకంటె, దయగల వైద్యుడుగా చూపట్టాలి. వైద్యుడు రోగానికిమల్లె గురువు పాపరోగానికి చికిత్సచేసేవాడు. క్రీస్తు స్వయంగా ఈ వుపమానం వాడుకొన్నాడు-మత్త 9,12. కనుక గురువు పాపిపాపం ఇంత గొప్పది అని గణిస్తున్నట్లుగా చూపట్టగూడదు. దేవుని దయ మంచితనం పితృత్వం ఈలా వుంటాయి అని చాటి చెప్తున్నట్లుగా చూపట్టాలి. క్రీస్తు పాపులపట్ల ఎంతో కరుణతో మెలిగాడు. ఆ తీరే గురువుకి గూడ తగుతుంది. అతడెప్పుడు గూడ దయామయుడైన దేవుడికి ప్రతినిధిగా వుండేవాడు.

# 8. పాపోచ్చారణ విధి

ఈ చివరి అధ్యాయంలో 1973లో తయారై ఇటీవలే ప్రచారంలోనికి వచ్చిన నూత్న పాపోచ్చారణ విధిని పరిశీలిద్దాం. ఈ విధిలో మళ్ళా మూడు రకాలున్నాయి. కాని మనం మామూలుగా వాడుకొనేది మొదటిరకం విధిని. కనుక యిక్కడ మొదటిరకం విధిని మాత్రమే పరిశీలిద్దాం. దీనిలో ఆరంశాలు విశేషంగా గమనింపదగ్గవి.

## 1. విశ్వాసిని ఆహ్వానించడం

గురువూ విశ్వాసీ ఇద్దరూ పాపోచ్చారణ సంస్కారానికి తయారుకావాలి. గురువు తనకు వెలుగునూ ప్రేమనూ దయచేయమని పరిశుద్ధాత్మను అడుగుకోవాలి. విశ్వాసి తన పాపాలకు మన్నింపు దయచేయమని దేవుణ్ణి వేడుకోవాలి.

తర్వాత గురువు విశ్వాసిని ఆహ్వానిస్తారు. ఇద్దరూసిలువ గుర్తు వేసికొంటారు. గురువు విశ్వాసిని ఆదరంతో అంగీకరించి ఆ సందర్భానికి తగిన భక్తిమంతమైన ప్రార్థనం చెప్తారు. ఉదాహరణకు "అందరి హృదయాలకు వెలుగును ప్రసాదించే ప్రభువు నీవు నీ

పాపాలను గుర్తించేలా చేయును గాక. నీవు అతని కరుణను నమ్మేలా చేయును గాక" అనే ప్రార్థన చెప్తారు. లేదా "ప్రభువు నీ హృదయంలో వుండి నీవు నిజమైన పశ్చాత్తాపంతో నీ పాపాలను ఒప్పుకొనే భాగ్యం దయచేయునుగాక" అనే జనం చెప్తారు.

గురువు ఆహ్వానం ద్వారా ప్రార్థనంద్వారా విశ్వాసికి నమ్మకమూ ధైర్యమూ కలగాలి. గురువు వాలకం కరుణగల పరలోకపు తండ్రినీ, మంచి మేపరియైన క్రీస్తునీ తలపించేలా వుండాలి. "క్రీస్తు కరుణా ప్రేమా ప్రత్యక్షమయ్యాయి" అన్నాడు పౌలు - తీతు 3,3. గురువులో ఈ గుణం కన్పించాలి. ఈ నియమం ఒక్క పాపోచ్చారణాన్ని వినే సమయానికి మాత్రమేకాదు, అతని జీవితానికంతటికీ వర్తించాలి.

## 2. దివ్యగ్రంథ పఠనం

విశ్వాసి ఏదైనా వేదవాక్యాన్ని చదివి కొద్దిసేపు మననం చేసికోవడం మంచిది. అప్పటికప్పుడు కాలవ్యవధి లేకపోతే అతడు ముందుగానే వేదవాక్యాన్ని చదువుకొని వుండడం మేలు. లేదా గురువు ఏదైనా వేదవాక్యాన్ని అప్పటికప్పుడు నోటితో చెప్పవచ్చుగూడ. వాక్యపఠనం ద్వారా క్రైస్తవుడు వెలుగును పొంది తన పాపాలను తెలిసికొంటాడు. దేవుని కరుణను గుర్తించి భక్తితో పశ్చాత్తాపపడతాడు.

ఈ సందర్భానికి తగిన కొన్ని వేదవాక్యాలు ఇవి. "యోహాను చెరలో బంధింపబడ్డాక యేసు గలిలయ సీమకు వెళ్ళి సువార్తను ప్రకటించాడు. కాలం ఆసన్నమైంది, దైవరాజ్యం సమీపించింది, కనుక పశ్చాత్తాపపడి సువార్తను విశ్వసించండి అని బోధించాడు" - మార్కు 1,14-15. "మనం పాపులమై యుండగా క్రీస్తు మనకొరకు చనిపోయాడు అంటే దేవుడు మనలను ప్రేమిస్తున్నాడు అని రుజువౌతుంది" - రోమా 5,8. "నేను పాపులను పిలవడానికి వచ్చాను గాని నీతిమంతులను పిలవడానికీ రాలేదు" - మత్త 9,13.

ఈ వాక్యపఠనం అనేది ప్రస్తుత నూత్న విధిలో ప్రముఖమైన అంశం. ఈ పఠనంద్వారా ప్రభువే మనతో మాటలాడతాడు. ఇంకా వాక్యం మనకు చిత్తశుద్ధిని దయచేస్తుంది. "మనకు పాపం లేదు అనుకొంటే మనలను మనమే వంచించు కొన్నట్లవుతుంది. మనలో సత్యముండదుకూడ" - 1యో1,8. కొంచెం కాలం పట్టినా మన విశ్వాసులు ఈ పఠనాభ్యాసాన్ని పెంపొందించుకోవడం లాభదాయకం.

## 3. పాపోచ్చారణమూ, ప్రాయశ్చిత్తాన్ని విధించడమూ

తర్వాత విశ్వాసి పాపోచ్చారణం చేయడమూ గురువు ఉపదేశం చేయడమూ జరుగుతుంది. అన్యాయం దొంగతనం మొదలైన విషయాలు వచ్చినప్పుడు గురువు

నష్టపరిహారం చెల్లించమని విశ్వాసికి తెలియజేస్తారు. తరువాత గురువు విశ్వాసికి ప్రాయశ్చిత్తం విధిస్తారు. ఇది ప్రార్థనగా గాని, ఉపవాసంగాగాని, దానంగాగాని సేవగాగాని వుండవచ్చు. ఈ చివరిరకం అపరాధం పాపంలో వుండే సామూహిక గుణాన్ని సూచిస్తుంది.

పశ్చాత్తాప హృదయుడు తాను మొదట చదివిన బైబులు వాక్యాలనుండే ప్రేరణంపొంది పాపాలను చెప్పుకొంటే బాగుంటుంది. గురువు యిచ్చే సలహాగాని అపరాధంగాని భక్తుని అవసరాలకు తగినట్లుగా వుంటే మంచి ఫలితమిస్తుంది. ఈనాడు అందరిలోను సామాజికస్పృహ పెరిగిపోయింది. విశేషంగా పేదసాదలకు అన్యాయాలు జరగడాన్ని అందరూ గర్హిస్తూన్నారు. కనుక ఈ కాలంలో గురువు తోడిప్రజలకు సేవచేయమనీ కరుణకార్యాలు చేపట్టమనీ విశ్వాసులకు అపరాధం విధిస్తే బాగుంటుంది.

## 4. భక్తుని పశ్చాత్తాప ప్రార్థన

గురువు ప్రాయశ్చిత్తాన్ని విధించిన తరువాత భక్తుడు ప్రభువు తన్ను మన్నించాలనీ, భవిష్యత్తులో క్రొత్తజీవితం జీవించడానికి తనకు తోడ్పడాలని ప్రార్థిస్తాడు. అతడు బైబులు వాక్యాలనే పశ్చాత్తాప ప్రార్థనగా వాడుకోవచ్చు. ఉదాహరణకు ఈ క్రింది జపాలు ఉపకరిస్తాయి.

ప్రభూ! నా దోషాలనుండి నన్ను శుద్ధిచేయి
నా పాపాన్ని కడుగు
నేను నా తప్పిదాన్ని ఒప్పుకొంటున్నాను
నా పాపం నిత్యం నా యెదుట కన్పిస్తూనే వుంది"

కీర్త 51,2-3. ఇంకా "ప్రభూ! నీవు పాపాత్ములకు స్నేహితుడవు అని పిలిపించుకోగోరావు. రక్షణనొసగే నీ మరణోత్థానాల ద్వారా నా పాపాలనుండి నన్ను శుద్ధిచేయి" అని ప్రార్థించవచ్చు. ఈలా మనకు నచ్చిన బైబులు వాక్యాలను వేటినైనా ప్రార్థనగా మల్చుకోవచ్చు.

## 5. మన్నింపు ప్రార్థనం

తరువాత గురువు భక్తుని మీదికి చేయిచాచి, అతని పాపాలకు క్షమాపణాన్ని దయచేసే మన్నింపు ప్రార్థనను జపిస్తారు. ప్రస్తుత నూత్న విధిలో ఈ ప్రార్థనం ఈలా వుంటుంది. "కరుణామయుడైన తండ్రి తన కుమారుని మరణోత్థానాల ద్వారా లోకాన్ని తనతో సమాధానపరచుకొన్నాడు. పాపపరిహారానికి నరులమీద పవిత్రాత్మను కుమ్మరించాడు.

ఆ తండ్రి యిప్పుడు శ్రీసభ పరిచర్యద్వారా నీకు పాపపరిహారాన్నీ శాంతినీ దయచేయునుగాక. పిత పుత్ర పవిత్రాత్మల పేరుమీదుగా నేను నీ పాపాలను మన్నిస్తున్నాను."

భక్తులు ఈ ప్రార్థనను భక్తితో ధ్యానం చేసికోవాలి. దీనిలో చాల భావాలున్నాయి. 1. పాపవిమోచనమనేది కరుణాళువైన తండ్రి అనుగ్రహించే వరం. అతడు మన తప్పులను మన్నించి మనలను మళ్లా తన బిడ్డలనుగా జేసికొంటాడు. 2. క్రీస్తు మరణోత్థానాల ద్వారా మనకు పాపవిమోచనం కలుగుతుంది. మన పాపాలకు పరిహారం చేసే రక్షకుడు అతడే. 3. ఆత్మద్వారాగూడ మనకు పాపపరిహారం కలుగుతుంది. మనహృదయంలో పశ్చాత్తాపం పుట్టించేదీ, మనం దేవునినుండి మన్నింపు పొందేలా చేసేదీ ఆ పవిత్రాత్మడే. మనలను దేవునితోను తోడిప్రజలతోను సమాధాన పరిచేదికూడ అతడే. ఈలా పాపోచ్చారణంలో ముగ్గురు దైవవ్యక్తులూ మన హృదయంలో పనిచేస్తారు. 4. ఇక, మనకు ఈ పాపపరిహారం శ్రీసభ ద్వారా లభిస్తుంది. మన పాపాలద్వారా మనం శ్రీసభను అనగా క్రైస్తవ సమాజాన్ని బాధిస్తాం. ఇప్పుడు శ్రీసభ తన ప్రతినిధియైన గురువు ద్వారా మనకు మన్నింపు దయచేస్తుంది. పాపంలో సామూహిక గుణం వుంటుందని ముందే చెప్పాం. 5. ఈ పాపపరిహారం మనకొక్కరికే కాదు, లోకానికంతటికీ కూడ. తండ్రి క్రీస్తుద్వారా లోకాన్నంతటినీ తనతో సమాధానపరచుకొన్నాడు. ఈ పాపోచ్చారణంలో మనం మన్నింపుపొందితే దానివలన లోకానికి కూడ కొంతవరకు సమాధానం కలుగుతుంది. ఒకవ్యక్తి పశ్చాత్తాపం లోకానికంతటికీ మేలు చేకూర్చిపెడుతుంది ఈ "లోకసమాధానం" అనేది కేవలం మనుష్యలోకానికేగాక సకల సృష్టికీ వర్తిస్తుంది. 6. కడన, పాపోచ్చారణ ఫలితం శాంతి. మెస్సియా కొనివచ్చే భౌతిక, ఆధ్యాత్మిక భాగ్యాలన్నిటినీ కలిపి బైబులు "షలోం" అని పిలుస్తుంది. అదే శాంతి. ఇక్కడ మనం ఈ పాపోచ్చారణ ద్వారా దేవునితోను తోడి ప్రజలతోను సమాధానపడ్డంవల్ల మనకు ఈ శాంతి లభిస్తుంది.

ప్రస్తుత విధిలో గురువు మన్నింపు ప్రార్థనను చెప్పేపుడు భక్తుని తలమీద చేయి చాస్తారు. బైబులు సంప్రదాయం ప్రకారం చేతులు చాచడమనే సంజ్ఞ దేవుని దీవెనను పొందడానికి చిహ్నంగా వుంటుంది. విశేషంగా ఈ సంజ్ఞ ఆత్మను పొందడానికి గుర్తు. ఈ సంస్కారంలో ఆత్ముడు మన హృదయంలోకి ప్రవేశించి మన పాపాలు మన్నిస్తాడు. కనుక ఇక్కడ గురువు ఈలా చేయి చాచడం అర్థయుక్తమైన సంజ్ఞ.

## 6. కృతజ్ఞతా వందనం, వీడ్కోలు

గురువునుండి మన్నింపు పొందినపిమ్మట భక్తుడు దేవుని కరుణను స్తుతించాలి. అతడు ఈ స్తుతిని వేదవాక్యాల్లోనే వెలిబుచ్చడం మంచిది. ఈ సందర్భానికి తగిన

వేదవాక్యాలు ఈలా వుండవచ్చు. "ప్రభువు మంచివాడు కనుక అతన్ని స్తుతిద్దాం" "సమాధానంతో వెళ్ళి నిన్ను రక్షించిన ప్రభువు అద్భుతకార్యాలను లోకానికి వెల్లడిచేయి" - మార్కు 5,19.

కడన గురువు విశ్వాసిని సమాధానంతో వెళ్ళమని చెప్తారు. విశ్వాసి తాను పొందిన హృదయ పరివర్తనాన్ని రోజువారి జీవితంలో కొనసాగించుకోవాలి. విశేషంగా అతడు ప్రేమజీవితం జీవించాలి.

దేవుడు తన పాపాలను మన్నించి తనకు రక్షణం దయచేసాడు గనుక భక్తుడు తానూ రోజువారి జీవితంలో తోడివారిని మన్నిస్తూండాలి. "మీరు ఒకరిపట్ల ఒకరు దయతోను జాలితోను ప్రవర్తించండి. దేవుడు క్రీస్తుద్వారా మిమ్ముక్షమించినట్లే మీరు ఒకరినొకరు క్షమించండి" - ఎఫె 4,32. విశ్వాసులు నిత్యజీవితంలో ఈ క్షమాగుణాన్ని ప్రదర్శింపవలసిన సందర్భాలు ఎన్నయినా తగులుతాయి.

ఇక, మనం చేసిన పాపోచ్చారణం మనలను ప్రేషిత సేవకు పురికొల్పాలి గూడ. ప్రభువు మన పాపాలను మన్నించి మనకు ఆనందాన్నీ శాంతినీ దయచేస్తాడు. అలాంటి ప్రభువుని మనం ఇతరులకు గూడ ప్రకటించాలి. మనకు చేతనైన పద్ధతిలో మనం అతన్ని ఇతరులకు ఎరుకపరచాలి. కనుకనే నిన్ను "రక్షించిన దేవుని అద్భుత కార్యాలను లోకానికి వెల్లడిచేయి" అనే వేదవాక్యాన్ని ఇక్కడ స్మరించుకోవడం జరుగుతూంది.

పాపోచ్చారణ సంస్కారానికి వెళ్ళాలంటే కొంతమందికి బాధగా వుంటుంది. ఆ సంస్కారంలో పాల్గొనాలంటే ఏదో శిక్ష ననుభవించినట్లుగా వుంటుంది. కాని ఈలా భావించడం పొరపాటు. ఈ క్రియద్వారా పాపపరిహారాన్ని పొందుతాం గనుక యిది యథార్థంగా మనకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తుంది. ఇంకా, దీనివలన తోడినరులపట్ల మనకు గల అనిష్టభావాలు తొలగిపోతాయి. ప్రేమభావాలు ఏర్పడతాయి. కనుక విశ్వాసులు భక్తి విశ్వాసాలతో ఈ సంస్కారాన్ని స్వీకరిస్తూండాలి.

## ప్రార్థనా భావాలు

1. ఇటీవల ప్రచారంలోకి వచ్చిన నూత్న పాపోచ్చారణ విధిలో వాక్యపఠనానికి చాల ప్రాముఖ్యం ఇచ్చారు. భక్తుడు పాపోచ్చారణం చేసికోకముందు దైవవాక్యాన్ని పఠించి భక్తితో ధ్యానం చేసికోవాలి. హృదయపరివర్తనానికి తోడ్పడే వాక్యాలను ఎన్నుకొని మరీ చదువుకోవాలి. ఈలాంటి వాక్యాల జాబితాను ఈ గ్రంథాంతంలో "బైబులు అవలోకనాలు" అనే మకుటం క్రింద పొందుపరచాం.

దివ్యవాక్యానికి మన హృదయాన్ని మార్చే అద్భుతశక్తి వుంటుంది. అది మన దోషాలను ఎత్తి చూపిస్తుంది. ఓ న్యాయాధిపతియై మనకు తీర్పు చెప్తుంది - హెబ్రే 4,12. కనుక పాపోచ్చారణం చేసే భక్తుడు వాక్యపు వెలుగులో తన్నుతాను పరిశీలించి చూచుకోవాలి. వాక్యప్రభావంవల్ల సత్యానికిలొంగి తన తప్పులను పూర్తిగా అంగీకరించాలి. వాక్యపు శక్తితోనే పరివర్తనం చెందాలి. కనుక భక్తుడు కనీసం రెండుమూడు నిమిషాలైనాసరే వాక్యాన్ని చదువుకొని మననం చేసికొనిగాని పాపోచ్చారణం చేయకూడదు. భక్తసమాజం పాపోచ్చారణం చేసేప్పుడు గురువు ప్రారంభంలోనే వాక్యాన్ని చదివి వివరణం చెప్తే మంచి ఫలితం కలుగుతుంది.

2. ప్రతి సంస్కారంలోను క్రీస్తు పాస్క పరమరహస్యం పని చేస్తుంది. క్రీస్తు సిలువమీద చనిపోయి, ఉత్థానమై, పాపపరిహారంచేసి తండ్రియొద్దకు వెడలిపోయాడు. అదే అతని పాస్కరహస్యం. ఈ పరమరహస్యం పాపోచ్చారణంలో కూడ పనిచేస్తుంది. ఆ ప్రభువు మరణోత్థానాలవలన మన పాపాలకు మన్నింపు కలుగుతుంది. అతని వరప్రసాదం మనలను భావిపాపాలనుండికూడ కాపాడుతుంది. ఇంకా ఆ వరప్రసాదం మనం భక్తితో జీవించేలానూ, క్రీస్తు రెండవరాకడ కొరకు నమ్మకంతో వేచివుండేలానూ చేస్తుంది. కనుక మనం ఉత్థాన క్రీస్తు పాస్కరహస్యాన్ని నమ్మి పాపోచ్చారణం చేయాలి. ప్రభువు కరణవల్లనే మనకు పాపవిముక్తి కలుగుతుందని పూర్ణంగా విశ్వసించాలి.

3. చాలమంది పాపోచ్చారణ క్రియ యోగ్యంగా దివ్య సత్ప్రసాదాన్ని పుచ్చుకోవడానికి మాత్రమే తోడ్పడుతుందని భావిస్తారు. ఇది పొరపాటు. ఈ సంస్కారంవల్ల మనం హృదయశుద్ధినిపొంది భక్తితో దివ్యసత్ప్రసాదాన్ని స్వీకరిస్తాం. నిజమే. కాని ఈ సంస్కారం ఫలితం అంతమాత్రమే కాదు.

పాపోచ్చారణం ద్వారా శ్రీసభలోని క్రైస్తవులతో సమాధానపడతాం గూడ. పూర్వం పాపం ద్వారా క్రైస్తవ సమాజం నుండి విడిపోయాం. ఇప్పుడు ఈసంస్కారంద్వారా మళ్ళా ఈ సమాజంలోనికి, ఈ మందలోనికి తిరిగివస్తాం. తోడి నరులందరినీ మన అక్కచెల్లెళ్లనుగాను అన్నదమ్ములనుగాను అంగీకరిస్తాం. ఇతరులకీ మనకీ ఒక్కడే తండ్రి, పితయైన సర్వేశ్వరుడు. కనుక తోడినరులతో రాజీపడి వాళ్ళ అపరాధాలను క్షమిస్తాం. దేవుడు మన తప్పిదాలను క్షమించినట్లే మనంగూడతోడినరుల తప్పిదాలను క్షమిస్తాం. ఈలా మన్నించకపోతే దేవుని

మన్నింపు మనమీద పనిచేసినట్లుకాదు. ఇంకా తోడినరులను ప్రేమభావంతో చూస్తాం. వాళ్ళ అక్కరలో మనకు చేతనైన సహాయం చేస్తాం. వాళ్ళను మన స్వార్థానికి వాడుకోవడం మానివేస్తాం. నే నొక్కడనే గాదు, నేనూ తోడి జనులూ అందరమూ కలసి దైవప్రజలం ఔతాం అన్నట్లుగా జీవిస్తాం. ఎప్పుడుగూడ పాపోచ్చారణ సంస్కారం మనలను తోడిప్రజలతో ఐక్యపరుస్తుంది. అది కేవలం వ్యక్తిగతమైన క్రియకాదు. కనుక భక్తులు ఈ సంస్కారంలోని సామూహిక గుణాన్ని చక్కగా అర్థం చేసికోవాలి.

# ప్రశ్నలు

## అధ్యాయం - 1

1. పరివర్తనంలోని ముఖ్యాంశాలను వివరించండి
2. పరివర్తనంలోని దేవుని కృషియేమిటి, మన సహకారమేమిటి?
3. క్రీస్తు ద్వారా పాపపరిహారం ఏలా జరుగుతుందో వివరించండి.
4. ఆత్మకూ పాపపరిహారానికీ వున్న సంబంధ మేమిటో తెలియజేయండి.
5. మన పాపాలను గురువుతో ఎందుకు చెప్పాలి?

## అధ్యాయం - 2

1. పాపాన్ని గూర్చిన పూర్వ నూత్నవేద భావాలను సంగ్రహంగా పేర్కొనండి.
2. "ఆధునిక ప్రపంచం పాపాన్ని అట్టే లెక్కచేయడం లేదు" - వివరించండి.
3. పాపంలో వుండే సామూహిక గుణాన్ని వివరించండి.
4. చావైన పాపానికీ స్వల్పపాపానికీ వుండే ప్రధాన వ్యత్యాసాలు ఏమిటివి?
5. చావైన పాపానికీ "చావును తెచ్చి పెట్టే పాపానికీ" వ్యత్యాసం ఏమిటి?

## అధ్యాయం - 3

1. పశ్చాత్తాపాన్ని గూర్చిన పూర్వ, నూత్నవేద భావాలను సంగ్రహంగా పేర్కొనండి.
2. మత్తయి 18,18 మరియు యోహాను 20,21-23 వాక్యాల భావాన్ని వివరించి అవి నేటి మన పాపోచ్చారణ సంస్కారానికి ఆధారవాక్యాలని నిరూపించండి.
3. ఈ వాక్యాలకు ప్రోటస్టెంటులు చెప్పే అర్థం ఏమిటి? ఆ యర్థం సబబు కాదని నిరూపించడం ఏలా?

## అధ్యాయం - 4

1. పాపోచ్చారణ చరిత్రలోని మొదటి దశను వివరించండి.
2. రెండు మూడవ దశలను వివరించండి.
3. పాపోచ్చారణ సంస్కారం ఎందుకని అడిగే ప్రోటస్టెంటులకు జవాబు చెప్పడం ఏలా?

## అధ్యాయం - 5

1. ట్రెంటు మహాసభ బోధల ప్రకారం మనస్తాపంలో వుండవలసిన మూడంశాలను వివరించండి.
2. "పాపోచ్చరణానికి వెళ్ళినపుడు మాత్రమే పశ్చాత్తాపపడితే చాలదు" - వివరించండి.
3. మనం తోడి జనాన్ని ఎందుకు మన్నించాలి?
4. చిన్న పిల్లలకు పశ్చాత్తాపపడే విధానం నేర్పడం ఏలా?

## అధ్యాయం - 6

1. పాపోచ్చారణం వలన సిద్ధించే మానసిక లాభాలను పేర్కొనండి.
2. పాపోచ్చారణంలో మనం చావైన పాపాలను సంఖ్యాపూర్వకంగాను, ఇంకా వాటిని ఘనమైనవాటినిగా గాని స్వల్పమైనవాటినిగాగాని మార్చే పరిస్థితులేమైనా వుంటే ఆ పరిస్థితుల సమేతంగాను, గురువుకి తెలియజేసికోవాలి అంటే యేమిటి?
3. భక్తి కొరకు చేసే పాపోచ్చారణం వలన కలిగే ఫలితాలను పేర్కొనండి.
4. ఆత్మశోధనాన్ని ఏలా చేసికోవాలి?
5. ప్రస్తుతం విశ్వాసులకు పాపోచ్చారణ సంస్కారంపట్ల భక్తి సన్నగిల్లిపోతూంది. ఈ యనర్థాన్ని చక్కదిద్దడం ఏలా?

## అధ్యాయం - 7

1. మన పాపాలకు ప్రాయశ్చిత్తం చెల్లించడంలో భావమేమిటి?
2. మన ప్రాయశ్చిత్తం క్రీస్తు పరిహారంతో కలసి మనకు ఏలా వరప్రసాదాన్ని ఆర్జించిపెడుతుందో వివరించండి.
3. ప్రార్థనం, ఉపవాసం, దానధర్మాలద్వారా ప్రాయశ్చిత్తాన్ని చెల్లించడం ఏలా?

## 8. సామాన్య ప్రశ్నలు

1. నేటి క్రైస్తవులకు పాపోచ్చారణ సంస్కారం పట్ల భక్తి శ్రద్ధలు ఎందుకు సన్నగిల్లిపోయాయి? ఈ యనర్థాన్ని చక్కదిద్దడం ఏలా?
2. పశ్చాత్తాప విషయంలో మీకు వ్యక్తిగతంగా నచ్చిన వేదవాక్యాలను పేర్కొనండి.
3. గురువుకి పాపోచ్చారణ చేయడంలో వున్న అనిష్టతను తెలియజేయండి. ఆ గుణాన్ని జయించడం ఏలా? ఈ సంస్కారాన్ని అనిష్టమైనదాన్నుండి ఇష్టమైనదాన్నిగా మార్చడం ఎలా?
4. తప్పిపోయిన కుమారుని కథ సహాయంతో చిన్నపిల్లలకు పాపాన్నీ పశ్చాత్తాపాన్నీ గూర్చి యేలా బోధిస్తారో చెప్పండి.
5. పెద్దవాళ్ళే అయిన పామరజనానికి పాపాన్నీ పశ్చాత్తాపాన్నీ ఏలా బోధిస్తారో తెలియజేయండి.
6. ఒకోసారి మన తప్పిదాలను ఇతరులకు చెప్పుకోవాలనిపిస్తుంది. దీని అర్థంఏమిటి?
7. రాజారావు మంచిపాపోచ్చారణమే చేస్తుంటాడు. కాని అతడు తన దురభ్యాసాలను సవరించుకోలేక నిరుత్సాహపడుతుంటాడు. అతనికి నీవేమి సలహా యిస్తావు?
8. పాపోచ్చారణమంటే పాపి కేవలం వ్యక్తిగతంగా దేవునితో సమాధానపడే క్రియ మాత్రమే కాదు, క్రైస్తవ సమాజమైన శ్రీసభతో గూడ సమాధానపడే క్రియ అని ప్రజలకు ఏలా బోధిస్తావు?

# బైబులు అవలోకనాలు

## పాపమూ పశ్చాత్తాపమూ

1. ఆదాము పాపం - ఆది 3,1-7
2. కయిను హేబెలును చంపడం - ఆది 4,8-12
3. యిస్రాయేలీయులు దూడను కొల్వడం - నిర్గ 32,1-6
4. ఆజ్ఞలను పాటిస్తే జీవం, మీరితే మరణం - ద్వితీ 30,15-20
5. దావీదు పాపం - 2సమూ 12,1-13
6. యిస్రాయేలీయులు తమ పాపాలను ఒప్పుకోవడం - నెహెమ్యా 9,1-20
7. విజ్ఞానం పాపుల హృదయాల్లోకి ప్రవేశించదు - సొలోమోను జ్ఞాన 1,4-5

8. మనం ఇతరులను మన్నిస్తే దేవుడు మనలను మన్నిస్తాడు - సీరా జ్ఞాన 28,1-7
9. తనయుల తండ్రిమీద తిరగబడ్డం - యెష 1,2-6
10. సాంఘిక అన్యాయాలు - యెష 1,15-18. 58,6-11
11. దేవుని ద్రాక్షాతోట మంచిపండ్లు పండలేదు - యెష 5,1-7
12. బాధామయ సేవకుడు మన పాపాల కొరకు శ్రమలు అనుభవించడం - యెష 53,1-12
13. పాపి దేవుని దగ్గరికొస్తే మన్నింపు - యెష 55,6-11
14. మన పాపాలే మనలను దేవునినుండి దూరపరుస్తాయి - యెష 59,1-4. 9-15
15. నా ప్రజలు రెండు నేరాలు చేసారు - యిర్మీ 2,1-13
16. ప్రజలు నా మాట వినలేదు - యిర్మీ 7,21-26
17. పాపి నాశంకావాలని నాకోరిక కాదు - యెహె 18,20-32
18. మాంసపు గుండెల నిచ్చే దేవుడు - యెహె 36,24-28
19. పూర్ణ హృదయంతో నాయొద్దకు మరలిరండి - యోవేలు 2,12-19
20. నీతి, దయ, వినయం ముఖ్యం - మీకా 6,6-8
21. దానియేలు పశ్చాత్తాప ప్రార్థనం - దాని 9,3-19
22. ప్రభువు కరుణ - కీర్త 103,10-14
23. నీకే ద్రోహంగా పాపం చేసాను - కీర్త 51,1-17
24. ప్రభువు సంపూర్ణంగా రక్షించేవాడు - కీర్త 130
25. పరలోకరాజ్యం సమీపించింది కనుక పశ్చాత్తాపం - మత్త 3,1-6
26. హృదయ పరివర్తనం చెందండి - మత్త 4,12-17
27. ధన్యవచనాలు - మత్త 5,3-12
28. పక్షవాత రోగికి స్వస్థత - మత్త 9,1-8
29. నీతిమంతుల కోసంగాదు, పాపులకోసం - మత్త 9,9-13
30. తోడివారిని మన్నించాలి - మత్త 18,21-35. 6,14-15
31. ఆమె అధికంగా ప్రేమించింది కనుక - లూకా 7,36-50
32. ఒక్క పాపి పరివర్తనం చెందితే - లూకా 15,1-10
33. దుడుకు చిన్నవాడు - లూకా 15,11-32
34. సుంకరీ పరిసయుడూ - 18,9-14

35. జక్కయ పరివర్తనం - లూకా 19,1-10
36. పేత్రు బోరున యేడ్చాడు - లూకా 22,54-62
37. మంచిదొంగ పశ్చాత్తాపం - లూకా 23,39-43
38. వ్యభిచారంలో పట్టుబడిన స్త్రీ - యోహా 8,1-11
39. పాపం చీకటి - యోహా 3,19-21
40. మీరెవరి పాపాలను మన్నిస్తే వాళ్ళ పాపాలు - యోహా 20,19-23. మత్త 18,18
41. క్రీస్తు అందరినీ నీతిమంతులను చేసాడు - రోమా 3,22-26
42. పాపం వేతనం మరణం - రోమా 6,20-23
43. నేను చేయగోరని చెడ్డనే చేస్తున్నాను - రోమా 7,14-25
44. క్రీస్తుద్వారా తండ్రి మనలను తనతో సఖ్యపరచుకొన్నాడు - 2కొ 5,17-21
45. చీకటి వెలుగూ - యెఫె 5,8-17
46. ఆత్మ శరీరాల వైరుధ్యం - గల 5,1-21
47. నాలుక దుష్టావయవం - యాకో 3,2-12
48. మన విమోచనం వెండిబంగారాలతో కాదు - 1పేత్రు 1,18-20
49. క్రీస్తే మన పాపాలకు శాంతి - 1యోహా 1,8-2,2
50. సోదరద్వేషం చీకటి - 1యోహా 2,7-11
51. నులివెచ్చని జీవితం జీవిస్తే శిక్ష - దర్శ 3,14-21

# 6. కీర్తనామృతం

## మనవిమాట

కీర్తనల గ్రంథం పూర్వవేదానికి గుండెకాయలాంటిది. కీర్తనలు దైవానుభూతితో నిండివుండి ఎంతో భక్తిమంతంగా వుంటాయి. కాని కొంత వివరణంలేందే ఈ ప్రాచీన గీతాలు నేటి కాలపు ప్రజలకు సులువుగా బోధపడవు. వీటికి వ్యాఖ్య అవసరం.

ప్రస్తుత గ్రంథంలో భక్తిగల కీర్తనలు 21 ఎన్నుకొని వాటిమీద సులువైన పద్ధతిలో విపులవ్యాఖ్య చెప్పాం. పాఠకులు ఈ కీర్తనల్లోని ఒక్కో చరణాన్నీ నిదానంగా చదువుకొని దానిమీద ఈయబడిన వ్యాఖ్యను జాగ్రత్తగా పఠించాలి. అప్పుడు కీర్తనల్లోని భావాలు బోధపడతాయి. అటుపిమ్మట కీర్తనాంతంలో వచ్చే ప్రార్థనాభావాల సహాయంతో జపం చేసికోవాలి. ఈ కృషివల్ల వేదవాక్యం జీర్ణమై దైవానుభూతి కలుగుతుంది. ఈ పుస్తకాన్ని పూర్వమే బైబులు భాష్యం 73-76 సంచికల్లో ప్రచురించాం. ఇది మూడవ ముద్రణం.

## విషయసూచిక

# కీర్తలన గ్రంథం

## 1. పేరు

కీర్తనకు హీబ్రూ భాషలో మిజ్మోర్ అనీ, గ్రీకు భాషలో ప్సాల్మోస్ అనీ పేరు. వాద్యం మీటుతూ పాడేపాట అని ఈ పదాలకు అర్థం. ఇవి ప్రధానంగా దేవుణ్ణి కీర్తిస్తూ పాడే పాటలు. కనుకనే కీర్తనల గ్రంథానికి హీబ్రూ భాషలో "సేఫెర్ టెహెల్లిం" - స్తుతిగ్రంథం అని పేరు.

యిస్రాయేలు ప్రజల భక్తీ దైవానుభూతీ ఈ గ్రంథంలో ప్రచురంగా కన్పిస్తుంది. జగత్ సృష్టి, ఎన్నిక, పాపం, రక్షణం, విశ్వాసం, స్తుతి, కృతజ్ఞత, మొదలుగా గల ప్రధానమైన బైబులు భావాలన్నీ ఈ గ్రంథంలో ప్రార్థనా రూపంలో కన్పిస్తాయి.

## 2. గ్రంథ చరిత్ర

ఇప్పుడీ గ్రంథంలో 150 కీర్తనలున్నాయి. కాని తొలిరోజుల్లో ఈ పుస్తకం ఐదు భిన్న భాగాలుగా ప్రచారంలో వుండేది. ఆ వివరం యిది.

| | | |
|---|---|---|
| 1-41 | కీర్తనలు, | మొదటి పుస్తకం |
| 41-72 | ,, | రెండవ పుస్తకం |
| 73 - 89 | ,, | మూడవ పుస్తకం |
| 90 - 106 | ,, | నాల్గవ పుస్తకం |
| 107 - 150 | ,, | ఐదవ పుస్తకం |

ఈ యైదు పుస్తకాలు ఆదిపంచకంలోని ఐదు గ్రంథాలకు పోలికగా వుండేవి. క్రీస్తుపూర్వం నాల్గవ శతాబ్దంలో ఈ యైదింటిని కలిపి ఏక గ్రంథం చేసారు.

## 3. రచనాకాలం

కీర్తనలను క్రీ.పూ. 10వ శతాబ్దం నుండి రెండవ శతాబ్దం వరకు వ్రాస్తూ వచ్చారు. కనుక ఈ గ్రంథ రచన 800 ఏండ్ల పొడుగున కొనసాగింది. మొదటలో దావీదు రాజు కొన్ని కీర్తనలు కట్టాడు. కొన్నిటిని సేకరించాడు. అధిక భాగం కీర్తనలను రాజుల కాలంలోనే వ్రాసారు. బాబిలోనియా ప్రవాసానంతరంగూడ కొన్నిటిని రచించారు.

## 4. హీబ్రూ కవిత్వం

మొదటి కీర్తనం వచనంలో వుంది. తతిమ్మావన్నీ పద్యరూపంలో వున్నాయి. కాని మన భాషల్లోలాగ హీబ్రూ భాషలో ఖండితమైన ఛందోనియమాలు లేవు. తరచుగా చెప్పిన భావాన్నే రెండుసార్లు చెప్పి, రెండు పాదాల మధ్య సమానమైన తూగును పాటించేవాళ్ళు. వీటినే సమాంతర పాదాలు అంటారు. ఉదాహరణకు

"నీ వాక్యం నా పాదాలకు దీపం

నా త్రోవకు వెలుగు" - కీర్త 119, 105.

ఇక్కడ మొదటి పాదమూ రెండవ పాదమూగూడ భిన్నపదాలతో ఒకే భావాన్ని చెప్తాయి. రెండు పాదాలకూ ఓ విధమైన తూగు వుంది. హీబ్రూ కవిత్వంలో ఈ యానురూప్య పద్ధతి ప్రచురంగా గోచరిస్తుంది.

## 5. దేవాలయ ప్రాముఖ్యం

కొందరు భక్తులు వ్యక్తిగతంగా కొన్ని కీర్తనలు వ్రాసికొని వుంటారు. కాని అధికశాతం కీర్తనలను యెరూషలేం దేవాలయంలో ఆరాధన సమయంలో పాడ్డానికే వ్రాసారు. అన్ని కీర్తనలను చివరకు దేవాలయంలోనే పదిలపరచారు. కీర్తనల గ్రంథం దేవాలయంలో నిర్వహించిన ఆరాధనలోను, అక్కడ అర్పించిన బలుల్లోను భక్తులకు భగవంతుడు అనుభవానికి వచ్చిన తీరును వర్ణిస్తుంది. కనుక దేవాలయాన్ని లెక్కలోకి తీసికోందే కీర్తనలను అర్థం చేసికోలేం. వాటి వునికీ మనకీగూడ దేవాలయంతో ముడిపడి వుంది.

ఈ పాటలను విశేషంగా రెండవ దేవాలయారాధనంలో వాడారు. యూదులు పాస్కపండుగను గుడారాల పండుగను పెంతెకోస్తు పండుగను చేసికోవడానికి ఏటేట యెరూషలేం యాత్ర చేసేవాళ్ళు. ఆ వుత్సవాల్లోనే ఈ కీర్తనలను ఎక్కువగా పాడేవాళ్ళు. దేవాలయంలో వీటిని గానం చేయటానికి లేవీయుల బృందం ప్రత్యేకంగా వుండేది.

కీర్తనల గ్రంథం మొదట యూదుల పాటల పుస్తకం. తర్వాత క్రైస్తవ సమాజం గూడ దాన్ని తన పాటల పుస్తకం చేసికొంది.

## 6. కీర్తనకారుల భగవదనుభూతి

చాల కీర్తనలు గొప్ప భగవదనుభూతిని తెలియజేస్తాయి. హీబ్రూ కవులకు గాఢమైన విశ్వాసం వుండేది. వాళ్ళు ఆయా అవసరాల్లో ఆపదల్లో భగవంతుడు తమ్ము ఆదుకొన్న తీరునూ ఆ ప్రభువు కరుణనూ పదేపదే మననం చేసికొని గాఢమైన భగవదనుభూతిని పొందారు. ఆ యనుభూతినే పాటలుగా వ్రాసారు. తర్వాత ఆ పాటలను భక్తులు ఎన్నోసార్లు దేవళంలో పాడుతూ వచ్చారు. కీర్తనకారులు అనుభూతులు కొన్ని :

ప్రభూ! దప్పిగొనిన దుప్పి సెలయేటి నీటికొరకువలె
నా హృదయం నీ కొరకు తపిస్తూంది-42,1
స్వర్గంలో మాత్రం నీవు దప్ప నాకిం కెవరున్నారు?
ఈభూమిమీద నీవుదప్ప మరొకటి నాకు రుచించదు - 73, 25
ప్రభువే నాకు కాపరి, యిక యే కొదవా లేదు - 23,1
భూమికి ఆకాశం ఎంత ఎత్తుగా వుంటుందో
ప్రభువుపట్ల భయభక్తులు చూపేవారి యెడల
అతనిప్రేమ అంత మిక్కుటంగా వుంటుంది - 103,11
తల్లిదండ్రులు నన్ను విడనాడినా
ప్రభువు నన్ను చేరదీసి పరామర్శిస్తాడు - 27,10

నేడు మనం కూడ ఈ పాటలనుండి భగవదనుభూతిని సాధించే విధానం నేర్చుకోవచ్చు. ఈ దృష్టితో జూస్తే ఈ గీతాలు చాల విలువైనవి.

## 7. కీర్తనలు, క్రైస్తవ ప్రార్థనం

నూత్నవేదంలో పూర్వవేదం నుండి 360 ఉద్ధరణలు ఉన్నాయి. వీటిల్లో మూడవ వంతును కీర్తనల గ్రంథం నుండే ఉదాహరించారు. ఈ యుదాహరణలు తరచుగా క్రీస్తును సూచిస్తుంటాయి. కీర్తనల్లో మెస్సియాను గూర్చిన గీతాలు నేరుగా క్రీస్తుకే అన్వయిస్తాయి. మిగతా కీర్తనలుగూడ చాలవరకు క్రీస్తుని సూచిస్తాయి. క్రీస్తుకి అన్వయించందే ఈ గీతాలకు ఫలసిద్ధి లేదు. పైగా క్రీస్తు స్వయంగా వీటిని జపించాడు కూడ. ఉదాహరణకు "నా దేవా నా దేవా నన్నేల చేయి విడిచావు" అనే 22, 1 కీర్తన వాక్యాన్ని ప్రభువు సిలువమీద

జపించాడు - మత్త 27, 46. ఈలా క్రీస్తుతో సంబంధం కలిగివుండడంవల్ల ఇవి క్రైస్తవ ప్రార్థనలయ్యాయి. మరియమాత క్రీస్తుశిష్యులు వీటిని జపించారు - కొలో 3,17. తొలినాటి వేదసాక్షులు పునీతులు వీటిని ప్రార్థించారు. అగస్టీను మొదలైన పితృపాదులు వీటిపై వ్యాఖ్యలు వ్రాసారు. క్రమేణ యూదులు జపగ్రంథం క్రైస్తవులకుగూడ జపగ్రంథమైంది. ప్రాచీన క్రైస్తవుల ప్రార్థనా గ్రంథాల్లో అధికభాగం కీర్తనలే ఉండేవి. నేడు గురువులు మఠకన్యలు జపించే డివైన్ ఆఫీసులో అధికశాతం ప్రార్థనలు కీర్తనలే. పూజబలి ప్రార్థనల్లో గూడ చాల కీర్తనలు వస్తాయి.

కీర్తనల గ్రంథానికి క్రైస్తవులు ఇంత ప్రాముఖ్యం ఈయడం దేనికి? ఆ గీతాల్లోని భక్తిభావాలను బట్టే. అవి దేవునికీ నరునికీ మధ్య నడచిన పవిత్ర సంభాషణలు. తరతరాల పొడుగునా నరులు భగవంతునిపట్ల చూపుతూ వచ్చిన వివిధ భక్తిభావాలు ఈ కీర్తనల్లో ఎక్కడో వోతావులో కన్పిస్తూనే వుంటాయి. కనుక క్రైస్తవ భక్తులు ఈ గీతాలతో పరిచయం కలిగించుకొని వీటిని తమ ప్రార్థనల్లో తరచుగా వాడుకొంటూండాలి.

కీర్తనలను భక్తితో జపించడానికి నియమం ఇది. ఏదైనా వో కీర్తనను జపించేప్పుడు దాని రచయిత భక్తిభావాన్ని మన భక్తిభావం చేసికోవాలి. అగస్టీను భక్తుని మాటల్లో చెప్పాలంటే "కీర్తనకారుడు జపిస్తే మనమూ జపించాలి. అతడు దుఃఖిస్తే మనమూ దుఃఖించాలి. అతడు సంతోషిస్తే మనమూ సంతోషించాలి. అతడు దేవుణ్ణి నమ్మితే మనమూ నమ్మాలి. అతడు భయాన్ని వ్యక్తంచేస్తే మనమూ భయాన్ని వ్యక్తం చేయాలి". ఈ యగస్టీనే భోజనాన్ని నోటితో రుచిచూస్తాం, కీర్తననైతే హృదయంతో రుచిచూస్తాం అన్నాడు. తేనె తేనెపట్టులో దొరుకుతుంది, భక్తిమాధుర్యం పవిత్ర గీతాల్లో దొరుకుతుంది అని వాకొన్నాడు బెర్నార్డ్ భక్తుడు. క్రైస్తవులు కీర్తనలు జపించినపుడెల్లా వాళ్ళ హృదయాలు పవిత్రాత్మ చేతుల్లో వీణలాంటి వౌతాయని నుడివాడు ఎఫ్రేము భక్తుడు. కనుక ఈ గీతాలను మనం తరచుగా ప్రార్థన చేసికొంటూండాలి.

## 8. వర్గీకరణం

కీర్తనలను వాటిల్లో కన్పించే రచనావిధానాన్ని బట్టీ, ఇతివృత్తాన్నిబట్టీ రెండు రకాలుగా విభజించారు.

మొదట, రచనా విధానాన్ని బట్టి వాటిని మూడు వర్గాలుగా విభజించారు. అవి 1. Hymns – స్తుతిగీతాలు 2. Supplications (Laments) — విలాపగీతాలు. 3. Thanksgivings — కృతజ్ఞతా గీతాలు.

అటుపిమ్మట, ఇతివృత్తాన్ని బట్టి వాటిని చాల రకాలుగా విభజించారు. 1. Wisdom Psalms — జ్ఞానకీర్తనలు 2. Confidence Fsalms — విశ్వాస కీర్తనలు 3. Pilgrim Psalms — యాత్రిక కీర్తనలు 4. Royal Palms — రాజ కీర్తనలు 5. Messianic Psalms — మెస్సీయాకీర్తనలు 6. Prophetic Psalms — ప్రవచనాత్మక కీర్తనలు మొ. ఈ వర్గాల కీర్తనలన్నీ ఈ పుస్తకంలో వస్తాయి.

# కీర్తన -1

# రెండు త్రోవలు

1. దుష్టుల సలహాలను పాటింపనివాడును
దుర్మార్గుల దుష్కార్యములలో పాల్గొననివాడును
ప్రభుని వేళాకోళముచేయువారితో చేతులు కలపనివాడును
ఐన నరుడు ధన్యుడు

2. అతడు ప్రభువు ధర్మశాస్త్రమును
ఆనందముతో పారాయణము చేయుచు
రేయింబవళ్లు మననము చేసికొనుచుండును

3. అతడు ఏటియొడ్డున నాటగా
సకాలమున పండ్లనిచ్చుచు
ఆకులు వాడకయుండు చెట్టువంటివాడు
అతడు తాను చేపట్టిన కార్యములన్నిటను విజయము బడయును

4. కాని దుర్మార్గు లిట్టివారు కారు
వారు కళ్లమున గాలి కెగిరిపోవు పొట్టువంటివారు

5. దుష్టులు దేవుని తీర్పునకు తట్టుకొని నిలువజాలరు
పుణ్యపురుషుల బృందమున చేరజాలరు

6. సాధుపురుషుల మార్గమును ప్రభు వాదరించును
దుష్టుల మార్గము నాశమునకు గురియగును.

## 1. పరిచయం

కొన్ని కీర్తనలకు జ్ఞానకీర్తనలని పేరు. ఈ మొదటి కీర్తన జ్ఞానవర్గానకి చెందింది. ఈ రకం కీర్తనలు జ్ఞానం, దైవభీతి, ధర్మశాస్త్రం, పాపం పుణ్యం, దైవశిక్ష, దేవుని దీవెన

మొదలైన నైతికాంశాలను ప్రస్తావిస్తాయి. 1, 119, 127- 128, 133, 139 మొదలైనవి ఈ వర్గానికి చెందిన కీర్తనలు. హిబ్రూ రచయితలు కీర్తనల నన్నింటినీ పద్యాలుగా వ్రాసారు. ఈ మొదటి కీర్తనం వొక్కటే వచనంలో వుంది.

ఈ కీర్తనం కీర్తనల గ్రంథంలోని నైతిక బోధలన్నిటికీ పరిచయ ప్రాయంగా ఉంటుంది. కనుకనే కీర్తనల గ్రంథానికి దీన్ని ప్రారంభ కీర్తనగా అమర్చారు.

ఈ కీర్తనం సజ్జనుల మార్గం, దుర్జనుల మార్గం అని రెండు త్రోవలను పేర్కొంటుంది. బుద్ధిమంతులు సజ్జనుల మార్గంలో నడవాలని సూచిస్తుంది. ఈ రెండు త్రోవల లక్షణాలు ఇవి.

| **సజ్జనుల మార్గం** | **దుర్జనుల మార్గం** |
|---|---|
| ధర్మశాస్త్ర పారాయణం | ధర్మశాస్త్ర అనాదరణం |
| పండ్లు పండే చెట్టులాంటిది | గాలికి ఎగిరిపోయే పొట్టు లాంటిది |
| ప్రభువు ఈ త్రోవను ఆదరిస్తాడు | ఇది నాశమౌతుంది |
| ఇది జీవనదాయకం | ఇది వినాశప్రదం |

ఈ కీర్తనలో "త్రోవ" అంటే జీవితవిధానం.

## 2. విభజనం

ఈ కీర్తనలోని భావాలనుబట్టి దీని చరణాలను ఈ క్రింది విధంగా విభజించవచ్చు.

1-3 జీవన మార్గం

4-5 వినాశ మార్గం

6 ఇరు త్రోవలు విడిపోవడం.

## 3. వివరణం

చరణం 1. ఈ మొదటి చరణం సజ్జనులు ఏయే దుష్కార్యాలు చేయరో చెప్తుంది. వాళ్ళు దుష్టుల సలహాలు పాటించరు. దుర్మార్గుల దుష్కార్యాల్లో పాల్గొనరు. ప్రభుని వేళాకోళం చేసేవాళ్ళ ముఠాలో చేరరు. యిస్రాయేలు ప్రజల్లో నాస్తికులు లేరు. అంతా దేవుణ్ణి అంగీకరించారు. కాని వాళ్ళల్లో కొందరు ఆరాధన మొదలైన దైవసంబంధకార్యాలను చిన్నచూపు చూచి వేళాకోళం చేసారు. సజ్జనులు ఈలాంటి వాళ్ళతో కలవరు.

2. ఈ రెండవ చరణం సజ్జనులుచేసే సత్కార్యాలను పేర్కొంటుంది. వాళ్లు మోషే ధర్మశాస్త్రాన్ని ఆనందంతో పఠిస్తారు. ఇక్కడ ధర్మశాస్త్రమంటే పూర్వవేదమంతా గూడాను. ఇది దైవచిత్తాన్ని తెలియజేస్తుంది. భక్తులకు నిత్యజీవితంలో దారి జూపుతుంది.

ధర్మగ్రంథాన్ని చదువుకొని దైవచిత్తాన్ని తెలిసికొని దాన్ని నిత్యజీవితంలో పాటించడాన్నే యూదులు ప్రధాన భక్తిగా ఎంచేవాళ్లు. భక్తులు నిర్బంధానికి గురైగాక స్వేచ్ఛగాను ఆనందంతోను పవిత్రగ్రంథాన్ని చదువుకొన్నారు. అది వాళ్ళకు భారం కాలేదు, సంతోషదాయకమైంది. పూర్వులు వేదగ్రంథాలను కంఠతః నేర్చుకొనేవాళ్లు. వాటి వాక్యాలను మెల్లని స్వరంతో నోటితో ఉచ్చరిస్తూ ధ్యానం చేసికొనేవాళ్లు. ఈ యభ్యాసాన్నే ఈ కీర్తనం "మననం" అని పేర్కొంటుంది.

3. మామూలుగా బెట్టవలనా, అప్పుడప్పుడు తోలే "షిరాకో" అనే వేడిగాలివలనా పాలస్తీనా దేశంలో చెట్లు వాడిపోయేవి. కాని ఏటి యొడ్డునా కాల్వల గట్టునా పెరిగే చెట్లు ఆలా వాడిపోక ఋతువురాగానే పండ్లు కాస్తుండేవి. సజ్జనులు కూడ ఈ చెట్లలా ఫలిస్తారు. చెట్టు నీటివలన ఫలిస్తుంది. సత్పురుషులు ధర్మశాస్త్ర పారాయణం వలన సిద్ధించే వరప్రసాదంద్వారా ఫలిస్తారు. సజ్జనులు చేసే సత్కార్యాలే వాళ్ళు ఫలించే ఫలాలు - మత్త 7, 16-18.

ధర్మశాస్త్ర మననంద్వారా దేవునితో ఐక్యమై దైవబలాన్ని పొందుతూంటారుగాన, సజ్జనులు తాము చేపట్టిన కార్యాలన్నిటిలోను విజయాన్ని సాధిస్తారు.

4. కవి మొదటి మూడు చరణాల్లోను సజ్జనులమార్గాన్ని వర్ణించాడు. ఇక దుర్జనుల మార్గాన్ని గూర్చి చెప్తున్నాడు. దుర్మార్గులు సన్మార్గుల్లాగ విజయాలు సాధించరు. కళ్ళంలోని పొట్టులాగ ఎగిరిపోతారు. కళ్ళంలో గింజలను తూర్పారబట్టినపుడు ధాన్యం అక్కడే పడుతుంది. తాలు, పొట్టు గాలికి ఎగిరిపోయి దూరంగా పడతాయి. దుష్టులు ఈ పొట్టులాగ కొట్టుకొని పోతారు. మంచివాళ్ళు మాత్రం గట్టి ధాన్యంలాగ నిలుస్తారు.

5. ఈ చరణం పేర్కొనే దేవుని తీర్పు మనం చనిపోయాక పరలోకంలో జరిగేదికాదు. మనం బ్రతికి వుండగానే, ఈ లోకంలోనే, జరిగేది. దేవుడు ప్రతినిత్యమూ మనమంచి చెడ్డలను ఎంచుతూనే ఉంటాడు, మనకు తీర్పు తీరుస్తూనే ఉంటాడు - మత్త 3,12. ఈ తీర్పులో మంచివాళ్ళు దేవుని ముందు నిలబడగల్గుతారు. కాని దుర్మార్గులు అతని ముందు నిలువలేరు. ప్రభువు వాళ్ళ దుష్కార్యాలకు వాళ్ళను ఖండిస్తాడు. తన సన్నిధి నుండి గెంటివేస్తాడు.

ఇంకా, మంచివాళ్లు దేవాలయంలో గుమికూడిన పుణ్యపురుషుల బృందంలోచేరి దేవుణ్ణి స్తుతిస్తారు. కాని దుర్మార్గులు ఈ భక్త బృందంలో చేరలేరు, దేవుణ్ణి ఆరాధించలేరు. వాళ్ళకు ఆ భాగ్యం అబ్బదు.

6. మంచిమార్గంలోపోయే సాధుపురుషులను దేవుడు ఆదరిస్తాడు. వాళ్ళకు ప్రభువు దీవెనలు లభిస్తాయి. చెడ్డ మార్గంలో పోయే దుష్టులను దేవుడు నాశం చేస్తాడు.

వాళ్లు దైవశాపానికి గురౌతారు. కనుక ఉత్తములు ఎల్లప్పుడు మంచి త్రోవలో నడవాలి. వేదగ్రంథ పఠనం వలన తెలియవచ్చే దైవచిత్తమే ఈ మంచి త్రోవ.

## 4. ప్రార్థనా భావాలు

1. ధర్మగ్రంథ పఠనంవలన దైవచిత్తం తెలుస్తుంది. ఈ దైవచిత్తానికి లొంగివుండడాన్నే యూదులు ప్రధాన భక్తిగా గణించేవాళ్లు. నరుడు ధర్మగ్రంథాన్ని ధ్యానం చేసికొని, దైవచిత్తాన్ని అర్థంజేసికొని, ఆ చిత్తానికి లొంగి జీవించాలని ఈ మొదటి కీర్తన బోధిస్తుంది. నేటి మన జీవితానికీ ఈ సూత్రం అక్షరాల వర్తిస్తుంది. క్రైస్తవ భక్తుడు రోజూ ఓ పావుగంట కాలమైనా బైబులు గ్రంథం చదువుకొని ప్రార్థన చేసికోవాలి. ఆ ప్రార్థనలో దైవచిత్తాన్ని అర్థం చేసికోవాలి. ఆ దివ్యచిత్తం ప్రకారం జీవించాలి. ఇదే అతడు నడువవలసిన బాట.

2. మత్తయి 7, 13–14 రెండు త్రోవలను పేర్కొంటుంది. మొదటిది ఇరుకైన త్రోవ. కొద్దిమంది మాత్రమే ఈ బాటవెంట ప్రయాణం చేస్తారు. కాని యిది జీవానికి చేరుస్తుంది. రెండవది విశాలమైన త్రోవ. అధిక సంఖ్యాకులు దీనిలో పయనిస్తారు. కాని యిది వినాశానికి కొనిపోతుంది. భక్తిమంతులు ఇరుకు త్రోవలో పోవాలి. ఈ కీర్తన బోధించేది కూడ ఈ రెండు మార్గాలను గూర్చే. కావుననే దీనికి "రెండు త్రోవలు" అని పేరు.

3. కీర్తనకారుడు ఈ కీర్తనలో మోషే ధర్మశాస్త్రాన్ని పాటించమని చెప్పాడు. నూత్న వేదంలో క్రీస్తు బోధలే మన ధర్మశాస్త్ర మౌతాయి. ఆ బోధలు మన హృదయంలో నూరంతలుగా పంట పండాలి. కాని ఈలా పండాలంటే, మన హృదయాలు సారవంతమైన నేలలా ఉండాలి – మత్త 13,8.

4. మనం పోవలసిన త్రోవ క్రీస్తే. అతడు ధర్మశాస్త్రంలోని ఆజ్ఞలనూ తండ్రిచిత్తాన్ని పూర్తిగా పాటించాడు. పూర్వవేద ప్రజలకు మోషే మార్గం, మార్గదర్శకుడు. నేడు మనకు క్రీస్తు మార్గం, మార్గదర్శకుడు – యోహా 14,6. కనుక మనం నిరంతరం క్రీస్తనే త్రోవలో నడవాలి. ఇంకా, యీ క్రీస్తు మంచి ఫలాలు ఫలించే చెట్టుకూడ. మనం ఆ చెట్టు ఫలాలు భుజిస్తాం – దర్శ 22, 1–2.

5. సజ్జనుడు ధర్మశాస్త్ర పఠనంద్వారా మంచి చెట్టులాగ ఫలిస్తాడని చెప్తుంది ఈ కీర్తన. యిర్మీయా ప్రవచనం 17, 5–8 కూడ ఇదే భావాన్ని పేర్కొంటుంది. ఈ వాక్యాలను భక్తితో ధ్యానం చేసికొంటే వాక్యభక్తి పెరుగుతుంది.

"ప్రభువు ఈలా అంటున్నాడు
నన్ను విడనాడి నరుని నమ్మేవాడు,
నరమాత్రుని మీద ఆధారపడేవాడు,
శాపగ్రస్తుడు
అతడు ఎడారిలో ఎదిగే తుప్పులాంటివాడు
అతనికి ఏలాంటి మేలూ కలుగదు
ఆ తుప్ప ఎండివున్న మరుభూమిలో,
ఏమీ పెరగని చౌటిపఱ్రలో పెరుగుతుంది
కాని నన్ను నమ్మి నాపై ఆధారపడేవాణ్ణి
నేను దీవిస్తాను
అతడు ఏటి వొడ్డున ఎదుగుతూ
నీటి చెంతకు వేళ్ళు చాచే చెట్టులాంటివాడు
అది బెట్టకు భయపడదు
దాని యాకులు పచ్చగా ఉంటాయి
వానలు కురువకున్నా దానికి చింతలేదు
అది యెల్లపుడు పండ్లు కాస్తూంటుంది".

6. ఈ మొదటి కీర్తనలాగే 119వ కీర్తనకూడ జ్ఞాన కీర్తనం. దీనిలాగే అది కూడ ధర్మశాస్త్రాన్ని భక్తితో పారాయణం జేసికోవాలని చెప్తుంది. మనకు వాక్యభక్తి అవడ్డానికి ప్రస్తుతానికి దానిలోని ఈ క్రింది చరణాలను పరిశీలిద్దాం.
– 11, 18, 73, 92, 99 – 100, 103, 105, 162, 127, 148.

"నేను నీకు ద్రోహంగా పాపం చేయకుండా ఉండడానికై
నీ వాక్యాన్ని నా హృదయంలో నిల్పుకొన్నాను
నీవు నా కన్నులు తెరిచావంటే
నేను నీ ధర్మశాస్త్రంలోని అద్భుత విషయాలు గ్రహిస్తాను
నన్ను పుట్టించి సంరక్షించే ప్రభూ!
నీ యాజ్ఞలను నేర్చుకొనే వివేకం నాకు ప్రసాదించు
నీ ధర్మశాస్త్రం నాకు ఆనందాన్ని యిచ్చివుండకపోతే
నాకు సంభవించిన శ్రమల్లో నేను నాశమైపోయేవాణ్ణి
నీ శాసనాలను ధ్యానించుకోవడంవల్ల

నా వుపదేశకు లందరికంటె నే నెక్కువ గ్రహించాను
నీ వుపదేశాలను పాటించడం వలన
నేను వృద్ధులకంటె యెక్కువ జ్ఞానం ఆర్జించాను
నీ వాక్యాలు నా నోటికి తీయగా ఉన్నాయి
తేనెకంటె మధురంగా ఉన్నాయి
నీ వాక్యం నా పాదాలకు దీపం
నా త్రోవకు వెలుగు
నేను నీ వాక్యాలను జూచి
పెన్నిధిని గనుగొన్న పేదలాగ ఆనందిస్తాను
బంగారంకంటె, మేలిమి బంగారంకంటె యెక్కువగా
నేను నీ కట్టడలను ఆశిస్తాను
నేను రేయెల్ల మేల్కొని ఉండి
నీ వాక్యాలను ధ్యానించుకొంటాను.

## కీర్తన - 23

## మంచి కాపరి

1. ప్రభువే నాకు కాపరి, ఇక యే కొదవయు లేదు

2. అతడు నన్ను పచ్చిక పట్టులలో మిశ్రమింపజేయును
శాంతికరమైన జలముల యొద్దకు నడిపించుకొనిపోవును

3. నా బడలికలను తొలగించును
తాను వాగ్దానము చేసినట్లే
నన్ను ధర్మమార్గమున నడిపించును

4. గాఢాంధకారపు లోయగుండ పయనించునపుడును
నే నెట్టి యపాయమునకును జంకను
ప్రభూ! నీవు నాకు తోడుగా నుందువు
నీ బడితయు నీ కోలయు నన్ను కాపాడుచుండును

5. నా శత్రువులు చూచుచుండగా
నీవు నాకు విందు చేయుదువు
పరిమళ తైలముతో నాకు అభ్యంగము చేయుదువు
నా పానపాత్రము అంచులవరకు నిండి పొరలుచున్నది

6. నేను జీవించినన్నాళ్లు
నీ కరుణయు ఉపకారమును నా వెంట వచ్చును
నేను కలకాలము ప్రభుమందిరమున వసింతును

# 1. పరిచయం

ఇది విశ్వాస కీర్తనలు అనే వర్గానికి చెందింది. ఈ కీర్తనల్లో భక్తులు తమకు దేవునిమీద మొక్కవోని నమ్మకముందని నిరూపిస్తూంటారు. ఈ గీతాల్లో దేవుడు దేవళంలో వుండి ఆర్తుల మొర వినడం, అతని నమ్మదగినతనం, భక్త వాత్సల్యం, నరుడు శాంతిని భద్రతను అనుభవించడం మొదలైన విషయాలు వస్తాయి. 11, 121, 131 మొదలైనవి ఈ కోవకు చెందిన గీతాలు.

భక్తుడు ఈ గీతంలో దేవునికి రెండుపమానాలు వాడాడు. అతడు తన మందను నడిపించే మంచి కాపరి, తన అతిథికి విందుచేసే ఆతిథ్యకారుడు. ఈ రెండుపమానాలు రచయితకు గల గొప్ప భగవదనుభూతిని తెలియజేస్తాయి.

రచయిత ఈ గేయం వ్రాసిన సందర్భాన్ని గూడ కొంతవరకు ఊహించుకోవచ్చు. బహుశః శత్రువులు అతని మీద నిందలు మోపివుంటారు. అతడు విగ్రహారాధనం మొదలైన నేరాలు చేసాడని అభియోగం తెచ్చివుంటారు. అతనికి మరణశిక్ష విధించాలని పట్టుబట్టి ఉంటారు. కాని కీర్తనకారుడు తన దైవభక్తిని నిరూపించుకొని ఈ నిందల నుండి తప్పించుకొన్నాడు. ఆ పిమ్మట అతడు దేవునిపట్ల తనకున్న నమ్మకాన్నీ భక్తివిశ్వాసాలనూ వివరిస్తూ కీర్తన వ్రాసాడు. యెరూషలేం దేవళంలో భక్త సమాజం ముందట తన పాటనుపాడి విన్పించాడు. ప్రభువునకు కృతజ్ఞతాంజలి అర్పించుకొన్నాడు. బలి ముగిసాక మిత్రులతో గలసి దేవళంలో నైవేద్యం సాపడ్డాడు. ఈలా పుట్టింది ఈ 23వ కీర్తన. ఈ పాట అన్నిటికంటె అదనంగా భక్తుని హృదయంలోని ప్రశాంత భావాన్ని వెల్లడి చేస్తుంది.

ఇది రత్నంలాంటి కీర్తన. బహుశః బైబుల్లోని కీర్తనలన్నిటిలోను శ్రేష్ఠమైంది. దీనికి వచ్చిన ప్రాచుర్యం మరే కీర్తనకు రాలేదు. శతాబ్దాల పొడుగునా బైబులు భక్తులు అన్నిటికంటె యెక్కువగా ఈ కీర్తనను ధ్యానం చేసికొన్నారు. ఇది యెందరో పుణ్యశీలురకు

హృదయ శాంతిని దయచేసింది. భక్తి విశ్వాసాలు పుట్టించింది. నేడు మనంకూడ ఈ గీతాన్ని శ్రద్ధతో మననం చేసికొని గొప్ప దైవానుభూతిని పొందవచ్చు.

## 2. విభజనం

ఈ కీర్తనలో రెండు భాగాలున్నాయి. అవి

1-4 ప్రభువు మంచి కాపరి

5 - 6 అతడు ఆతిథ్యకారుడు

## 3. వివరణం

### 1) కాపరి

1. కీర్తనకారుడు ఈ మొదటి ఉపమానంలో దేవుణ్ణి మంచి కాపరినిగాను తన్ను గొర్రెనుగాను వర్ణిస్తున్నాడు. పూర్వవేదంలో దేవుడు కాపరియై యిస్రాయేలనే మందను ఎడారిగుండా నడిపించుకొనిపోయాడు. ప్రజలు కనాను మండలంలో స్థిరపడిన పిదప కొన్నాళ్ళు రాజులు కాపరులై వాళ్ళను పరిపాలించారు. కాని యీ రాజులు అయోగ్యులు కాగా ప్రభువు తానే మళ్లావాళ్ళకు కాపరినౌతానని వాగ్దానం చేసాడు. తన ప్రతినిధియైన మెస్సీయా కాపరియై వాళ్లను పరిపాలిస్తాడని గూడ చెప్పాడు. కనుకనే ఆ మెస్సియా నేను మంచి కాపరినని చెప్పుకొన్నాడు. కాపరి అనేది పూర్వవేదంలో మాటిమాటికి తగిలే భావం. కాపరి శబ్దం యూదులకు ఎంతో ప్రీతిపాత్రమైంది. రక్షకుడు, రాజు, నాయకుడు అని ఈ పదానికి అర్థాలు.

ప్రభువనే కాపరి మేపే గొర్రె కీర్తనకారుడు. కనుక అతనికి ఏ కొదవా లేదు. ఏ కొరతాలేక సురక్షితంగా జీవిస్తాడు.

2. కీర్తనకారుడు తన్ను గొర్రెనుగా భావించుకొని చెప్తున్నాడు. మంచి కాపరియైన ప్రభువు అతన్ని పచ్చికబీళ్లల్లోనికి తోలుకొనిపోతాడు. పాలస్తీనా దేశం మన దేశంలాగే ఉష్ణదేశం. తరచుగా బెట్టగా ఉంటుంది. కాపరులు మందలను కొండల్లోనికి కొన్నిమైళ్లు దూరంతోలుకొనిపోతేనే గాని పచ్చిక పట్టులు తగలవు. అక్కడ మంద కడుపునిండ మేస్తుంది. మధ్యాహ్నపు టెండలో కాపరి గొర్రెలను చెట్ల నీడన పండుకోబెడతాడు. అవి కాసేపు విశ్రమిస్తాయి.

కొంతకాలం మేసాక అతడు గొర్రెలను ఏ మడుగు దగ్గరికో తోలుకొనిపోతాడు. అవి నీళ్ళు త్రాగి విశ్రాంతి పొందుతాయి.

ఈ మొదటి భాగంలో చాల పాదాలకు గొర్రెపరంగాను కీర్తనకారుని పరంగానుకూడ అర్థం చెప్పవచ్చు. గొర్రెపరంగా తీసికొంటే, అది గడ్డిమేసి, నీళ్ళుత్రాగి శాంతిని పొందుతుంది. కీర్తనకారుని పరంగా తీసికొంటే, అతడు యెరూషలేం దేవళంలోనికి వచ్చి ప్రభువుని దర్శించి శాంతిని పొందుతాడు. దేవాలయం శాంతికి నిలయం. కీర్తనకారుడు స్వయంగా దేవాలయంలో ఈ కీర్తనను ఆలాపించి ఉంటాడని చెప్పాం.

3. గొర్రెలు చక్కగామేసి, నీళ్లు తాగి నీడపట్టున విశ్రమించి సేదతీర్చుకొంటాయి. కీర్తనకారుని పరంగా తీసుకొంటే అతడు దేవాలయంలో నైవేద్యం ఆరగించి బడలికలు తీర్చుకొంటాడు.

ప్రభువు వాగ్దానం చేసాడు. అనగా రక్షిస్తానని మాట యిచ్చాడు. ఆ మాట ప్రకారం అతడు గొర్రెలను వంకరటింకర త్రోవల్లో కాక తిన్నని త్రోవలో నడిపిస్తాడు. కీర్తనకారుని పరంగా తీసికొంటే, ప్రభువు అతన్ని ధర్మమార్గంలో నడిపిస్తాడు. ఇక్కడ ధర్మమార్గమంటే మోషే ధర్మశాస్త్రం ఆదేశించే మార్గం. అనగా కీర్తనకారుడు ధర్మశాస్త్రంలోని కట్టడల ప్రకారం జీవించేలా ప్రభువు తోడ్పడ్డాడని భావం. శత్రువులు నిందించినట్లుగా అతడు విగ్రహాలను కొల్చి అధర్మ మార్గంలో నడవలేదు. విరోధులు అతనిమీద మోపిన నిందలన్నీ తొలగిపోయాయి.

4. గాఢాంధకారపు లోయ అంటే అపాయాలకు నిలయమైన తావు. గొర్రెలు మేసి సాయంకాలం ఇంటికి వచ్చేపుడు అపాయకరమైన లోయల గుండా రావాలి. అక్కడ తోడేళ్లు పులులు దుమ్ములగొండెలు మొదలైన వన్యమృగాలు కాచుకొని ఉంటాయి. అవి మందమీద బడి ఏ గొర్రెనో ఎత్తుకొనిపోతాయి. కనుక ఈ లోయగుండా వచ్చేపుడు కాపరి గొర్రెలను జాగ్రత్తగా సంరక్షిస్తాడు. తాను వాటికి తోడుగా, అండగా దండగా ఉంటాడు.

ఇక్కడ బడితె, కోల అనే పదాల విశేషార్థాన్ని గమనించాలి. ఆనాటి పాలస్తీనా కాపరులు గొర్రెలను పొలానికి తోలుకొని పోయేపుడు రెండు కర్రలను తీసికొని పోయేవాళ్లు. ఒక కర్ర కురచగా, లావుగా ఉంటుంది. దాన్ని నడుంమీద గుదికొయ్యలా కట్టుకొని పోయేవాళ్లు. తోడేలు మొదలైన క్రూర మృగాలు తారసిల్లినపుడు దానితో వాటిని చావబాదేవాళ్లు. ఇదే "బడిత". మరొక సన్నని కర్రను గూడ చేతబట్టుకొని పోయేవాళ్లు. దానితో గొర్రెలను అదిలించేవాళ్లు. ఇదే "కోల". ఈ బడితతోను కోలతోను కాపరి గొర్రెలను సురక్షితంగా ఇంటికి తోలుకొని వచ్చేవాడు.

ఈ చరణాన్నే కీర్తనకారుని పరంగా తీసికొంటే అతడు పూర్వం ఎన్నో అపాయకరమైన త్రోవల్లో నడచాడు. శత్రువులు అతనిమీద నిందలు మోపి పీడించారు. ఐనా అతడు ఏ ప్రమాదానికీ జంకడు. ప్రభువే అతని తోడుగా ఉంటాడు.

## 2) ఆతిథ్యకారుడు

కీర్తనకారుడు మొదటి భాగంలో ప్రభువుని మంచి కాపరిగా వర్ణించాడు. ఈ వుపమానం ద్వారా దేవునిమీద తనకున్న నమ్మకాన్నీ భక్తినీ విశదం చేసాడు. ఇక, రెండవ భాగంలో ప్రభువుని ఆతిథ్యకారుణ్ణిగాను తన్ను అతని యింటికి (దేవళానికి) వచ్చిన గేస్టునిగాను వర్ణిస్తున్నాడు. మొదటి ఉపమానం కంటె గూడ అధికంగా ఈ రెండవ ఉపమానం రచయిత హృదయంలోని గాఢమైన దైవానుభూతిని వెల్లడి చేస్తుంది.

5. ప్రభువు కీర్తనకారునికి విందు చేసాడు. ఆ భక్తుడు యెరూషలేం దేవళంలో బలి అర్పించాడు. బలి ముగిసాక అతడూ అతని స్నేహితులూ కలసి దేవళంలోని నైవేద్యాన్ని సాపడ్డారు. ఈ నైవేద్యాన్నే ప్రభువు సిద్ధం చేసిన విందునుగా భావించాడు భక్తుడు. ఈ బలిభోజనం ద్వారా భగవంతునికీ భక్తునికీ దగ్గరి సంబంధం ఏర్పడుతుంది. సీనాయి కొండదగ్గర నిబంధనం చేసికొన్న పిదప మోషే అహరోనులు కొండమీది కెక్కిపోయి దేవుని సన్నిధిలో భోజనం చేసారు - నిర్గ 24, 9-11.

యూదులు విందుల్లో పరిమళ తైలాలు పూసేవాళ్ళు. సీమోను ఇంటిలో విందారగించే క్రీస్తు పాదాలకు ఓ స్త్రీ అత్తరు పూసిందని వింటున్నాం - లూకా 7, 46. ఇక్కడ దేవుడు కీర్తనకారుడి శిరస్సుకి పరిమళ తైలం పూసాడు. అనగా అతని పట్ల ఎంతో ఆదరాభిమానాలు చూపాడని భావం. ఇంకా, ఆ ప్రభువు కీర్తనకారుని పానపాత్రం నిండా ద్రాక్షసారాయం పోసాడు. అనగా దేవుడతనికి అన్నపానీయాలు సమృద్ధిగా దయచేసాడని అర్థం.

కీర్తనకారుడి శత్రువులు కూడ అతనితోపాటు దేవళానికి వచ్చారు. అతడు దేవళంలో నైవేద్యం భుజిస్తుంటే చూచారు. కాని ప్రభువే స్వయంగా తన భక్తునికి భోజనం వడ్డిస్తుంటే, ఇక వాళ్ళేమి చేయగలరు?

6. ఈ చరణంలో “కరుణ” అంటే తల్లి తాను కన్న బిడ్డలపట్ల చూపే భావం. అనగా దేవుడు భక్తుణ్ణి కన్నబిడ్డలా ఆదరిస్తాడని భావం. “ఉపకారం” అంటే కుటుంబ సభ్యులు ఒకరికొకరు చేసికొనే మేలు. అనగా దేవుడు భక్తుణ్ణి తన కుటుంబ సభ్యుణ్ణిగా, తన బంధువునిగా ఎంచుతాడని భావం. ఇంతవరకు శత్రువులు కీర్తనకారుడి వెంటబడుతూవచ్చారు. కాని యికమీదట దేవుని కరుణా ఉపకారమూ బంటుల్లా, దేవదూతల్లా అతనివెంట నడచి వస్తాయి. అతన్ని భద్రంగా దేవళానికి తీసికొని వస్తాయి.

ఇంతవరకు అతడు పాస్కోత్సవం మొదలైన పండుగల్లో దేవళానికి వస్తున్నాడు. ఓ వారంపాటు దేవళంలో అతిథిగా గడిపి మళ్లా యింటికి పోతున్నాడు. ఇకమీదట

అతడు నిత్యం దేవళంలోనే వసిస్తాడు. దేవునికి అతిథి మాత్రమేకాక, కుటుంబ సభ్యుడుకూడా ఔతాడు. అనగా దేవుని ఆదరాభిమానాలను చూరగొంటాడు. ఈలా యెల్లకాలమూ దేవుని మందిరంలో వసించడం మహాభాగ్యంకదా!

మనం కూడ దేవునిచే నడిపింపబడే గొర్రెల మందలమూ, అతని యింటి అతిథులమూ, అతని కుటుంబ సభ్యులమూ ఐతే యెంత బాగుంటుంది!

## 4. ప్రార్థనాభావాలు

1. పూర్వవేదం దేవునికి ప్రధానంగా ఐదుపమానాలు వాడుతుంది.

   దేవుడు కాపరి, ప్రజలు అతడు మేపే మంద. దేవుడు తోటకాపు, ప్రజలు అతడు పెంచే తోట. దేవుడు గృహనిర్మాత, ప్రజలు అతడు కట్టిన గృహం. దేవుడు వరుడు, జనులు అతడు వరించిన వధువు. దేవుడు తండ్రి, ప్రజలు అతని బిడ్డలు.

   ఈ యైదుపమానాలూ గొప్ప భగవదనుభూతిని కలిగించేవి. ప్రస్తుత కీర్తనం వీటిల్లో మొదటిదాన్ని వర్ణిస్తుంది. ఈ పోలికలన్నీ మళ్లా నూత్నవేదంలోకికూడ వచ్చాయి. మనం కూడ నిత్యజీవితంలో వీటిని వాడుకొని భగవదనుభూతిని పొందవచ్చు.

2. "ప్రభువే నాకు కాపరి" అన్నాడు భక్తుడు. దేవుడు కాపరియై తన్ను గొర్రెనులాగ నడిపిస్తాడని యెంచాడు. గొర్రె అన్నా, గొల్లవాడన్నా మన భాషలో మంచిభావాలు స్ఫురింపవు. కాని యూదులకు ఇవి పవిత్రమైన భావాలు. ఇక్కడ కాపరిచేసే పనిని పరిశీలించి చూడ్డం మంచిది. అతడు ప్రతిరోజూ, దినమంతా, గొర్రెలకోసం శ్రమిస్తాడు. తాను ముందుగా బోతూ వాటిని నడిపిస్తూంటాడు. వాటినిదూర ప్రాంతాలకు తోలుకొనిపోయి మేత మేపుతాడు, నీళ్ళు త్రాగిస్తాడు. చెట్ల నీడన పండుకోబెడతాడు. గొర్రెవట్టి పిచ్చి జంతువు. తన్నుతాను రక్షించుకోలేదు. సులభంగా క్రూరమృగాలవాత బడుతుంది. కనుక కాపరి దాన్ని జాగ్రత్తగా కాపాడుతుంటాడు. నిత్యజీవితంలో ప్రభువు తన్నింతగా పరామర్శిస్తుంటాడని భక్తుని భావం. ఆ ప్రభువు నేడు మనలను గూడ గొర్రెల మందనులాగ నడిపిస్తుంటాడు. మన భక్తిమంతమైన జీవితమంతా అతడు మనలను నడిపించడమే. మన తరుపున మనం ఆ ప్రభువు మేపే మందకు చెంది ఉండాలని ఉవ్విల్లూరుతూండాలి.

3. "నీవు నాకు విందుచేస్తావు" అన్నాడు. ఆ భక్తుడు దేవళంలో బలిభోజ్యాన్ని ఆరగించడమే ఈవిందని చెప్పాం. మన తరపున మనంకూడ రోజూ ఆ ప్రభువు

విందులో పాల్గొనవచ్చు. అదే దివ్యసత్ప్రసాదం. కీర్తనకారునిలాగే మనంకూడ దేవునినుండి అన్నపానీయాలు స్వీకరింస్తాం. దీనికి మన మెంతైనా కృతజ్ఞులమై యుండాలి.

4. "నేను కలకాలం ప్రభుమందిరంలో వసిస్తాను" అన్నాడు రచయిత. యూదులకు దేవాలయంపట్ల అపారమైన భక్తి ఉండేది. దేవాలయాన్ని గూర్చి కీర్తనల్లో వచ్చే కొన్ని వాక్యాలను చూడండి :

ప్రభూ! నీ మందిరం ఎంత సుందరంగా ఉంటుంది!
ప్రభుమందిరానికి వెళ్లాలని నా హృదయం
ఆరాటపడుతుంది - 84, 1-2.

అన్యుల యిండ్లల్లో వేయిదినాలు గడిపిందానికంటె నీ మందిరంలో ఒక్కరోజు గడిపింది మేలు, దుష్టుల యిండ్లల్లో వసించే దానికంటె నీ మందిర ద్వారంవద్ద పడివుండడం మేలు - 84, 10.

మనకుకూడ ఈ దేవాలయభక్తి అలవడితే ఎంత బాగుంటుంది! దేవళానికి వెళ్ళడం, దేవుని సన్నిధిలో నిలబడ్డం, ఆ ప్రభువు ముఖకాంతి మనమీద ప్రసరించడం, అతని దయకు నోచుకోవడం మహాభాగ్యాలు కదా!

5. పూర్వవేదంలోని భక్తులకు యావే ప్రభువు కాపరి. నూత్న వేదంలో క్రీస్తే మనకు మంచి కాపరి - యోహాను 10, 11. తన గొర్రెలు అతనికి తెలుసు. ఆ గొర్రెలకూ అతడు తెలుసు. అతడు ఆ గొర్రెల కోసం తన ప్రాణాలనే అర్పిస్తాడు - 10,15. మనం నిరంతరం ఆ క్రీస్తు మందుకు చెందివుంటే, ఎల్ల వేళలా అతడు నడిపిస్తుంటే, ఎంత ధన్యంగా ఉంటుంది!

# కీర్తన - 51

## పాపక్షమకై ప్రార్థన

1. ప్రభూ! నీవు కరుణాళుడవు కనుక నన్నునుగ్రహింపుము
మిక్కిలి నెనరుకలవాడవు కనుక
నా పాపములను తుడిచివేయుము

2 నా దోషములనుండి నన్ను కడిగివేయుము
నా తప్పిదములనుండి నన్ను శుద్ధిచేయుము

3. నా యపరాధములు నాకు తెలియును
నే నెల్లప్పుడు నా తప్పులను జ్ఞప్తికి తెచ్చుకొనుచుందును

4. నీకే, నీకే ద్రోహముగా నేను పాపము చేసితిని
నీవు దుష్కార్యములుగా గణించు పనులను చేసితిని
నీవు నాకు తీర్పు విధించుట న్యాయమే
నన్ను దోషినిగా నిర్ణయించుట సబబే

5. నేను పుట్టినప్పటినుండియు పాపాత్ముడనే
మా యమ్మ కడుపున పడినప్పటినుండియు కిల్బిషాత్ముడనే

6 నీవు చిత్తశుద్ధిని కోరువాడవు
నా మనస్సును నీ జ్ఞానముతో నింపుము

7 నా దురితములను తొలగింపుము, నేను శుద్ధుడ నగుదును
నన్ను కడుగుము, నేను మంచుకంటె తెల్లనగుదును

8 నన్ను నీ సంతోషోల్లాసములతో నింపుము
అప్పుడు నీ శిక్షవలన నలిగిపోయిన నేను మరల హర్షింతును

9 నా దోసగులనుండి నీ మోమును ప్రక్కకు త్రిప్పుకొనుము
నా పాతకముల నెల్ల తుడిచివేయుము

10 దేవా! నాలో నిర్మల హృదయమును సృజింపుము
నూతనమును స్థిరమునైన మనస్సును నాలో నెలకొల్పుము

11 నన్ను నీ సన్నిధినుండి గెంటివేయకుము
నీ పరిశుద్ధాత్మను నాలోనుండి తీసివేయకుము

12 నీ రక్షణానందమును నాకు మరల దయచేయుము
విధేయాత్మకమైన హృదయమును నాకు ప్రసాదింపుము

13 నేను పాపులకు నీ మార్గమును తెలియజేయుదును
వారు నీ యొద్దకు తిరిగి వత్తురు

14 నా రక్షకుడవైన దేవా! నన్ను మృత్యువునుండి కాపాడుము
నేను నీ న్యాయబుద్ధిని సన్నుతించెదను

15 ప్రభూ! నీవు నా పెదవులను విప్పుము
నేను నీ స్తుతుల నుగ్గడించెదను

16 నీవు బలుల వలన సంతృప్తి చెందవు
నేను దహనబలి నర్పించినవో నీవు ప్రీతి జెందవు

17 దేవా! నే నర్పించు బలి పశ్చాత్తాప పూరితమైన హృదయమే
పశ్చాత్తాప పూరితమును విషయాన్వితమునైన హృదయమును నీ వనాదరము చేయవు

18. నీవు నెనరుతో సియోను నాదుకొనుము
యెరూషలేము ప్రాకారములను పునర్నిర్మింపుము

19. అప్పుడు నీవు దహనబలులు సంపూర్ణ హోమములు
మొదలుగాగల ఉచితములైన బలులవలన సంతృప్తి చెందుదువు
అప్పుడు జనులు నీ బలిపీఠము మీద కోడెల నర్పింతురు.

## 1. పరిచయం

ఇది విలాప కీర్తనల వర్గానికి చెందింది. ఈ వర్గం కీర్తనల్లో శోకభావాలూ పశ్చాత్తాపభావాలూ విరివిగా కన్పిస్తాయి. ఈ కీర్తనల్లో భక్తులు తమ పాపాలకు పశ్చాత్తాప పడ్డారు. తమకు కలిగిన ఆపదలకుగాను, అనగా వ్యాధులు మృత్యువు పరపీడనం యుద్ధం క్షామం మొదలైన వాటికిగాను, దేవునికి మొరపెట్టారు. తమ్ము రక్షించమని దేవునికి మనవి చేసారు. ఈ కీర్తనల్లో చాల లోతైన భావాలు తగులుతాయి.

ప్రాచీనకాలం నుండీ శ్రీసభ ఏడింటిని పశ్చాత్తాప కీర్తనలుగా భావించి ఆరాధనలో జపిస్తూ వచ్చింది. అవి 6, 32, 38, 51, 102, 130, 143. ఈ యేడింటిలో 51వ కీర్తన అతి శ్రేష్ఠమైంది. ఎవడో భక్తుడు పాపంచేసి చిత్తశుద్ధితో పశ్చాత్తాప పడ్డాడు. ఆ ఉదంతమే ఈ గీతం. దీన్ని యూదులు కిప్పూర్ అనే ప్రాయశ్చిత్త దినాన ఆరాధనలో జపించేవాళ్లు. ఇది నూత్నవేదం బోధించే నైతిక బోధలకూ హృదయశుద్ధికి చేరువలోకి వస్తుంది. కీర్తనకారుడు ఈ గేయాన్ని తన వ్యక్తిగత పశ్చాత్తాపాన్ని వెలిబుచ్చడానికే వ్రాసికొన్నా, డొక్కశుద్ధి కలవాళ్ళందరూ తమ పశ్చాత్తాపాన్ని వ్యక్తం చేసికోడానికి గూడ దీన్ని వాడుకోవచ్చు, విశేషంగా పాపసంకీర్తనం చేసేప్పుడు దీన్ని భక్తితో జపించవచ్చు. దీని భావాలు చాల లోతైనవి, విశ్వవ్యాప్తమైనవి కూడ.

బత్షెబాతో పాపంచేసాక దావీదురాజే దీన్ని వ్రాసాడని పూర్వవ్యాఖ్యాతలు వాకొన్నారు. కాని ఈ కీర్తనలోని ఆంతరంగిక భావాలనుబట్టి యిది ప్రవాసానంతరం, దేవాలయ పునర్నిర్మాణానికి ముందు పుట్టివుండవచ్చు. బహుశః 5వ శతాబ్దానికి చెందింది.

## 2. విభజనం

1-3 దేవుణ్ణి సంబోధించడం

4-6 పాపి తన పాపాలను ఒప్పుకొనడం

7-9 తన పాపాలు మన్నించమని దేవుణ్ణి అడుగుకోవడం

10-13 ఆంతరంగికమైన నూత్నత్వం కొరకు ప్రార్థనం

14-17 వందన సమర్పణం, బల్యర్పణం

18-19 రెండవ కీర్తనకారుడు చేర్చిన చరణాలు.

## 3. వివరణం

1-2 భక్తుడు కరుణా నెనరుగల దేవుడు తన పాపాలను మన్నించాలని అడుగుకొంటున్నాడు. తనకూ దేవునికి మధ్య తెగిపోయిన సంబంధాన్ని ఆ ప్రభువు పునరుద్ధరించాలని కోరుకుంటున్నాడు.

ఇక్కడ తుడిచివేయడం, కడగడం, శుద్ధిచేయడం అనే క్రియల విశేషార్థాన్ని గమనించాలి. భగవంతుడు నరుని పాపాలను తన శిక్షాగ్రంథంలో లిఖిస్తాడు - నిర్గ 32, 32. ఆ గ్రంథం నుండి తన పాపాలను తుడిచివేయమని భక్తుడు మనవి చేస్తున్నాడు. పాపం వలన అతడు మురికిబట్టలాంటివా డయ్యాడు. కనుక తన్ను కడగమని వేడుకొంటున్నాడు. పాపం కుష్ఠ రోగం లాంటిది. ఈ కుష్ఠ నుండి తన్ను శుద్ధి చేయమని అర్థిస్తున్నాడు.

3. భక్తుడు చిత్తశుద్ధితో తన తప్పులను ఒప్పుకొంటున్నాడు. తనకు తానే శిక్ష విధించుకొంటున్నాడు.

4. పాపం చేసినపుడు మనకు మనమే ద్రోహం చేసికొంటాం. ఇతరులకుగూడ ద్రోహం చేస్తాం. కాని ఇంతకంటె అదనంగా దేవునికి ద్రోహం చేస్తాం. కనుకనే "నీకే ద్రోహంగా నేను పాపం చేసాను" అంటున్నాడు. పాపంలోని ముఖ్యాంశం ఈ దైవద్రోహమే. పాపం దేవుని దృష్టిలో దుష్కార్యం. అది దేవునిమీద తిరుగుబాటు. అది మనలను దేవుని నుండి వేరుపరుస్తుంది. దేవుడు పాపికి తీర్పు విధిస్తాడు, అతన్ని దోషినిగా నిర్ణయిస్తాడు.

5. మనం పుట్టినప్పుడే పాపంతో పుడతాం. పాపపు పరిసరాల్లో పెరుగుతాం. యోబు గ్రంథం ప్రకారం నరుడు అశుద్ధుడు - 14,4. దీన్నే నేడు జన్మపాపం అంటాం. కీర్తనకారునికి ఈ పేరు తెలియకపోయినా, దీని దుష్ప్రభావం తెలుసు.

6. భగవంతుడు నరుల్లో ప్రధానంగా చిత్తశుద్ధిని కోరతాడు. మనం పాపం చేసినపుడు ఈ గుణం లోపిస్తుంది. పశ్చాత్తాపపడినపుడు దీన్ని తిరిగి పొందుతాం. ఇక్కడ భక్తుడు తన్ను జ్ఞానంతో నింపమని మనవి చేస్తున్నాడు. ఈ జ్ఞానం వివేకమనే వరం. ఈ వరంద్వారామనం తెలియక చేసిన పాపాలను గుర్తిస్తాం - కీర్త 19,12.

7. భక్తుడు 4-6 పాదాల్లో తన పాపాలను ఒప్పుకొన్నాడు. ఇక వాటిని క్షమించమని దేవుణ్ణి వేడుకొంటున్నాడు. ఇక్కడ కడగడం, శుద్ధిచేయడం అనే పదాల ద్వారా తాను పాపపు కుష్ఠ సోకినవాడనని వ్యక్తం చేస్తున్నాడు. పాపాలు మనకు మాలిన్యాన్ని తెచ్చిపెడతాయి. దేవుడు వాటిని కడిగితే మనం మంచులా తెల్లనౌతాం - యెష 1, 18.

8. దేవుడు మన పాపాలను మన్నించడంవల్ల మనకు సంతోషోల్లాసాలు కలుగుతాయి. నరుడు పాపంచేసి దేవుని శిక్షకు గురై నలిగిపోతాడు. అనగా పాపఫలితంగా మానసిక సంతాపం, ఒకోసారి శారీరక వ్యాధులుకూడ మనలను క్రుంగదీస్తాయి. కాని పాపక్షమాపణం పొందినపుడు ఈ బెడదలన్నీ తొలగిపోయి హర్షం చెందుతాం.

9. దేవుడు తన పాపాలవైపు చూడకుండా మొగం ప్రక్కకు త్రిప్పుకోవాలని వేడుకొంటున్నాడు. అనగా అతడు తన్ను మన్నించాలని భావం. పూర్వభావాలనే ఈ చరణంలో సంగ్రహంగా పునశ్చరణం చేసాడు.

10. పాపక్షమను అర్థించిన పిదప తనకు ఆంతరంగికమైన నూత్నత్వాన్ని దయచేయమని దేవుణ్ణి అడుగుకొంటున్నాడు. పూర్వం తనది అపవిత్రమైన హృదయం. ఇప్పుడు దాన్ని నిర్మలం చేయమని వేడుకొంటున్నాడు. ఈ పాదంలో "సృజించు" అనే మాట గమనింపదగ్గది. దేవుడు మొదట శూన్యంనుండి సృష్టి చేసాడు - ఆది 1,1. ఆ కార్యం దేవుడు మాత్రమే చేయగలడు. పాపపరిహారంకూడ దేవుడుమాత్రమే దయచేయగలడు. అది నూత్నసృష్టి లాంటిది.

అతడు నూత్నమూ స్థిరమూ ఐన మనస్సు కొరకు ప్రార్థిస్తున్నాడు. ఇంతవరకు అతనిది పాత మనసు, పాపపు మనసు. ఇక మీదట నూత్నస్వభావం కలగాలని కోరుకొంటున్నాడు. స్థిరమైన మనస్సు అంటే అచంచల బుద్ధితో దేవుణ్ణి సేవించే మనసు. ఎల్లకాలం పవిత్రంగా ఉండిపోయే మనస్సు. అనగా యెహెజ్కేలు ప్రవక్త అడుగుకొన్న మాంసపు గుండె - 36, 26.

11. గెంటివేయడమంటే నిరాకరించడం. తన పాపాలకు తన్ను నిరాకరించవద్దని ప్రభువుకి మనవి చేస్తున్నాడు. ఈ చరణంలో పరిశుద్ధాత్మ అంటే మూడవ దైవవ్యక్తికాదు. అతన్ని గూర్చి పూర్వవేద ప్రజలకు తెలియదు. కనుక ఇక్కడ పవిత్రాత్మ అంటే మన హృదయంలో ఉండే నైతిక దృక్పథం. పవిత్ర జీవితంమీద కోర్కె. అనగా దేవుడు తన్ను నిరాకరించి భ్రష్టుణ్ణి చేయరాదని మనవి చేసికొంటున్నాడు. పూర్వం ప్రభువు సౌలు రాజులో నుండి తన పరిశుద్ధాత్మను తీసివేసాడని వింటున్నాం - 1 సమూ 16,14.

12. ఇక్కడ రక్షణం అంటే పాపపరిహారం. ఈ పాపక్షమవల్ల అతనికి ఆనందం కలుగుతుంది. ఈ భావాన్ని 8వ పాదంలో కూడ చెప్పాడు. విధేయాత్మకమైన హృదయం అంటే దేవునికి లొంగివుండే మనస్సు. పాపమంటే దేవుని మీద తిరగబడ్డం. పశ్చాత్తాపమంటే దేవునికి లొంగడం. ఈ విధేయాత్మకమైన హృదయాన్నే 10వ చరణంలో "నూతనమూ స్థిరమూ ఐన మనస్సు" అని కూడ చెప్పాడు.

13. అతడు తన పశ్చాత్తాపాన్ని గూర్చీ, దేవుడు తన్ను మన్నించడాన్ని గూర్చీ పాపులకు తెలియజేస్తాడు. వాళ్ళను గూడ దేవుని చెంతకు తీసికొని వస్తాడు. అనగా తాను ప్రభువు సేవకుడై ఇతరులకు గూడ దేవుణ్ణిగూర్చి బోధిస్తాడని భావం. తన పాపాలకు పశ్చాత్తాపపడిన పేత్రుకూడ ఈలాంటివాడే అయ్యాడు - లూకా 22, 32.

14. పాపపరిహారం పొందినందుకు ప్రభువుకి వందనాలు చెప్పుకొని బలిని అర్పించుకోగోరుతున్నాడు 14-17 చరణాల్లో. పాపం చేసినవాళ్లు అకాల మృత్యువువాత బడతారని యిస్రాయేలీయుల నమ్మకం. ఈ మరణంనుండి కాపాడమని భక్తుని ప్రార్థనం. ఇక్కడ దేవుని న్యాయబుద్ధి అంటే అతడు దయచేసే పాపపరిహారం, రక్షణం. తనకు రక్షణాన్ని దయచేసినందుకు భక్తుడు దేవుణ్ణి స్తుతిస్తాడు.

15. దేవుడు తనకు ప్రార్థన చేసికొనే శక్తిని దయచేస్తాడు. ఆశక్తితో తాను దేవళంలో, భక్త సమాజం ముందట, ప్రభువుని స్తుతిస్తాడు.

16. పూర్వవేద కాలంలో చాలమంది దేవళంలో పొట్టేళ్లూ కోడెలూ బలిగా అర్పించారు. కాని యింటికి వచ్చి పేదలను పీడించడం మొదలైన దుష్కార్యాలు చేసారు. ఈలాంటి జంతుబలుల వలనా తంతులవలనా దేవునికి ప్రీతి కలుగదు. నరుడు ఆత్మతోను సత్యంతోను దేవుణ్ణి ఆరాధించాలి - యోహా 4, 23. న్యాయం కరుణ వినయం మొదలైన గుణాలతో అతన్ని పూజించాలి - మీకా 6, 6-8. కనుక వట్టి దహనబలి వలన ఫలితం లేదని చెప్తున్నాడు.

17. ఇది చాల గొప్ప వాక్యం. ప్రవాస కాలంలో యూదులు బాబిలోనియాలో వసించారు. అక్కడ జంతుబలులు అర్పించడానికి వీల్లేదు. కనుక ఆ కాలంలో ప్రవక్తలు

జంతు బలిని నిరసించారు. వాటికంటె హృదయారాధనం ముఖ్యమని చెప్పారు. ఆ భావాన్నే ఈ కీర్తనకారుడు కూడ వివరిస్తున్నాడు. జంతుబలు లర్పించేవాళ్లల్లో చిత్తశుద్ధి లేకపోవచ్చు. వాటితో దేవుని అనుగ్రహాన్ని కొనలేం. దేవుడు మన బలినికాక మన హృదయాన్ని చూస్తాడు. అసలు మన మర్పించే బలి ఏదో జంతువుకాకూడదు. మనమే కావాలి. పశుబలిని దేవు దంగీకరిస్తాడో లేదో తెలియదు. తన యెదుట వినయంతో పశ్చాత్తాపపడేవాణ్ణి మాత్రం అతడు తప్పక అంగీకరిస్తాడు. ఇది పూర్వవేదంలోని అతి ప్రశస్త భావాల్లో ఒకటి.

18-19 ఈ చరణాలు మొదటి కీర్తనకారునివి కావు. ప్రవాసానంతరం మరో కీర్తనకారుడు చేర్చాడు. మొదటి కీర్తనం 17వ చరణంతో ముగిసింది.

ప్రవాసానంతరం, నాశమైయున్న యెరూషలేమునూ దానిప్రాకారాలనూ పునర్నిర్మించమని భక్తుడు దేవునికి మనవి చేస్తున్నాడు. ఈ పునర్నిర్మాణం దేవుడు యిస్రాయేలీయులను మన్నించాడనడానికి నిదర్శనం.

మొదటి కీర్తనకారుడు 16-17 చరణాల్లో జంతు బలులను నిరసించాడు. ఇది రెండవ కీర్తనకారుడికి నచ్చలేదు. కనుకనే అతడు పూర్వకీర్తనకు ఈ రెండు చరణాలను చేర్చాడు. ప్రవాసం ముగిసాక యెరూషలేములో మరల బలులర్పించడం ప్రారంభించారు. కనుక జంతు బలులను అంగీకరించాలి. వట్టి తంతుగా అర్పించే బలులను అంగీకరించకపోయినా, కనీసం ఉచితమైన (భక్తిగల) బలులనైనా అంగీకరించాలి. కనుక అన్నిటిని గాకపోయినా భక్తిగల బలులనైనా దేవుడు మెచ్చుకొంటాడనీ, వాటిని అర్పింపవలసిందేననీ ఈ రెండవ కీర్తనకారుని ఉద్దేశం.

## 4. ప్రార్థనా భావాలు

1. ఈ కీర్తన గొప్ప పశ్చాత్తాప భావాలను సూచిస్తుంది. పాపం దేవునికి అప్రియం కలిగిస్తుంది. అది అన్నిటి కంటె ఎక్కువగా దేవునికే ద్రోహం చేస్తుంది. పవిత్రుడైన ప్రభువు పాపాన్ని సహించలేడు. మనం చిత్తశుద్ధితో మన పాపాన్ని ఒప్పుకోవాలి. కేవలం పశ్చాత్తాపపడితే చాలదు. మనకు నూత్నస్వభావంకూడ అవసరం. కావుననే భక్తుడు నాకు నూతనమైన మనసును ప్రసాదించు అని అర్థించాడు. దేవుడేగాని ఈ నూత్న స్వభావాన్ని దయచేయలేడు. మన పశ్చాత్తాపంలో ఈ యంశాలను గమనించాలి.

2. ఈ కీర్తనకారునికి తన పాపాల కొరకు దీర్ఘ కాలం పశ్చాత్తాపపడే గుణం ఉంది. ఇది గొప్ప భాగ్యం. మనంకూడ దేవునినుండి ఈ వరాన్ని అడుగుకోవాలి. ఆధునిక ప్రపంచంలో పాపభీతి బొత్తిగా లేదు. నరుని నిజాయితీ మంచి పశ్చాత్తాపంలో తెలుస్తుంది. కనుక మనం జీవితాంతమూ పశ్చాత్తాప పడుతూనే ఉండాలి. పౌలు ఈలాచేసాడు - 1 తిమో 1,15-16.

3. "నేనర్పించే బలి పశ్చాత్తాపపూరితమైన హృదయమే" అన్నాడు భక్తుడు. చాలమందికి మతమంటే వట్టి కర్మకాండ, తంతు. కాని పశ్చాత్తాపతప్తమైన హృదయాన్ని అర్పించుకోవడం నిజమైన బలి, నిజమైన మతం. క్రీస్తుకూడ హృదయ నైర్మల్యాన్ని కోరాడు. హృదయం నుండి దురాలోచనలు పుట్టి మనిషిని మలినపరుస్తాయి. కనుక హృదయాన్ని నిర్మలంగా ఉంచుకోవడం నిజమైన భక్తి - మత్త 15, 19-20. పశ్చాత్తాపపూరితమైన హృదయంతో దేవుని సన్నిధిలోనికి రావాలని చెప్పడంద్వారా కీర్తనకారుడు నూత్నవేదం బోధించే నైతిక బోధలకు చాల చేరువలోకి వచ్చాడు. ఐతే నేడు, మన హృదయాలు ఎంత నిర్మలంగా ఉంటాయి? మనం పశ్చాత్తాపానికి ఎంత విలువ నిస్తుంటాం?

4. పాపం వలన దేవునికీ మనకూ వుండే సంబంధం తెగిపోతుంది. పశ్చాత్తాపం ద్వారా ఈ సంబంధాన్ని పునరుద్ధరించుకొంటాం. శ్రీసభలో ప్రధానమైన పశ్చాత్తాపం పాపసంకీర్తనమే. ఈ కీర్తనకారునికి ఈ సంస్కారాన్ని గూర్చి తెలియదు. దీనిద్వారా మనం సృష్టివస్తువులనుండి వైదొలగి దేవుని దగ్గరికి వస్తాం. అతనితో ఐక్యమౌతాం. కనుక ఈ సంస్కారాన్ని మనం భక్తితో స్వీకరిస్తుండాలి. దాన్ని గూడ ఓ కర్మకాండను చేయకూడదు. పాపోచ్చారణ సందర్భంలో ఈ కీర్తనను భక్తితో జపిస్తే మన పశ్చాత్తాపం ఇంకా పునీతమౌతుంది.

5. ప్రభువు మన పాపాలను మన్నించినపుడు మనకు ఎంతో ఆనందం కలుగుతుంది. ఈ కీర్తనలో భక్తుడు రెండుసార్లు ఈ యానందాన్ని పేర్కొన్నాడు (8,12). ఉత్థాన క్రీస్తు మన పాపాలను మన్నించి మనకు ఆనందమూ శాంతీ దయ చేస్తాడు. కనుకనే అతడు శిష్యులకు దర్శనమిచ్చినపుడెల్లా మీకు శాంతి కలుగునుగాక అని చెప్తూండేవాడు - యోహా 20, 26.

6. దేవుడు చిత్తశుద్ధిని కోరేవాడు (6). ఈ కీర్తన కారునిలో ఈ గుణం సమృద్ధిగా ఉంది. అతని కీర్తనే దీనికి తార్కాణం. ఐతే, ఈ గుణం మనలో ఎంతవరకుంది?

# కీర్తన - 113

## మహోన్నతుడూ కరుణామయుడూ ఐన ప్రభువు

1. మీరు ప్రభువును స్తుతింపుడు
ప్రభువు సేవకులారా! ప్రభుని స్తుతింపుడు
అతని నామమును సన్నుతింపుడు

2. ప్రభుని నామము
ఇప్పుడును ఎప్పుడును స్తుతింపబడునుగాక

3. తూర్పు నుండి పడమర వరకును
ప్రభువు నామము వినుతింపబడునుగాక

4. ప్రభువు జాతులన్నింటిని మించినవాడు
అతని మహిమ ఆకాశమునకు పైని వెలుగొందుచుండును

5. మన దేవుడైన ప్రభువువంటివా డెవడు?
అతడు మహోన్నత స్థానమున వసించును

6. ఐనను క్రిందికి వంగి
ఆకాశమును భూమిని పరికించి చూచును

7. అతడు పేదలను దుమ్ములోనుండి పైకి లేపును
దీనులను బూడిదమీదినుండి లేవనెత్తును

8. వారిని రాజుల సరసన,
తన ప్రజలనేలు పాలకుల సరసన, కూర్చుండబెట్టును
అతడు గొడ్రాలు తన యింట మన్నన పొందునట్లు చేయును
ఆమెకు పుత్రుల నొసగి సంతుష్టి కలిగించును
మీరు ప్రభుని స్తుతింపుడు.

# 1. పరిచయం

ఈ కీర్తన స్తుతిగీతాల వర్గానికి చెందింది. ఈ గీతాలు భగవంతుణ్ణి కీర్తిస్తుంటాయి. భగవంతుని సృష్టినీ, అతని దయ మంచితనం ప్రాణిపోషణం మొదలైన కళ్యాణ గుణాలనూ వినుతిస్తాయి. వీటిల్లో సంతోషమూ ఉత్సాహమూ కన్పిస్తాయి. పాపం పశ్చాత్తాపం మొదలైన భావాలు ఎక్కడా తగలవు. కనుక ఇవి విలాపగీతాలను కేవలం భిన్నమైనవి. 8, 100, 103, 104 మొదలైనవి స్తుతిగీతాలు.

ఈ కీర్తన ప్రారంభంలోను అంతంలోను "ప్రభుని స్తుతించండి" అనే పదాలు వస్తాయి. యూదుల సంప్రదాయంలో 113-118 కీర్తనలు ప్రత్యేకమైన స్తుతి కీర్తనలు. వీటిని ఉత్సవ దినాల్లో దేవుణ్ణి కొండాడ్డానికి వాడేవాళ్లు. ఈ వర్గంలో శ్రేష్ఠమైంది 113వ కీర్తన.

కరుణామయుడైన దేవుడు యిస్రాయేలును దీనావస్థ నుండి ఉన్నత స్థితికి తీసికొనివచ్చాడు. అలాంటి దేవుణ్ణి స్తుతించమంటుంది ఈ కీర్తన. ప్రభువు నేడు మనలను

కూడ దీన దశనుండి ఉన్నత దశకు తీసికొని వస్తుంటాడు. కనుక ఈ గేయం నేడు మనకుకూడ అక్షరాల వర్తిస్తుంది.

## 2. విభజనం

1-3 దేవునికి స్తుతి

4-6 దేవుడు ఉన్నత స్థలంలో వసించేవాడు
ఐనా నేలమీది నరులను కూడ పట్టించుకొనేవాడు.

7-8 దేవుని కరుణ.

## 3. వివరణం

1. ప్రభువు సేవకులంటే దేవాలయంలో ప్రభుని పూజించే యాజకులు భక్తులూ. బైబులు ఆరాధనను సేవగా ఎంచుతుంది. వీళ్లందరూ దేవుణ్ణి స్తుతించాలని కీర్తనకారుడు హెచ్చరిస్తున్నాడు.

2-3. రెండవ చరణం అన్ని కాలాల్లోను, మూడవ చరణం అన్ని తావుల్లోను దేవునికి స్తుతి కలగాలని చెప్తాయి.

4. ప్రభువు జాతులన్నిటికీ అధిపతి. సృష్టికి అధిపతి. హీబ్రూ ప్రజల భావం ప్రకారం దేవుడు ఆకాశానికిపైన, మహోన్నత స్థలంలో వసిస్తూంటాడు. అక్కడ అతనిమహిమలేక తేజస్సు వెలుగొందుతూంటుంది.

5. ప్రభువు లాంటివాడు లేడు. అతనికి సాటివాడు లేడు. మహోన్నత స్థానమంటే ఆకాశానికి పైభాగం. మన భాషలో స్వర్గం. దేవుడు ఆ స్థలంలో నివసిస్తూంటాడు. అది అతని ఔన్నత్యాన్ని తెలియజేస్తుంది.

6. అతడు స్వర్గసీమలో వసించేవాడైనా భూమినీ దానిమీది నరులనూ పట్టించుకొంటాడు. దేవుడు ఎంత గొప్పవాడో అంత నెనరు కలవాడు. కావున అతడు మహోన్నతుడైనా అల్పనరుణ్ణి ఆదరిస్తాడు.

7. ప్రభువు ఔన్నత్యాన్నీ నరులమీద అతనికుండే ఆదర భావాన్నీ వర్ణించాక, అతని కరుణను వివరిస్తున్నాడు. అతడు చరిత్రలో చాలమంది దీనులకు దయజూపాడు. ఈ కీర్తన అలాంటి భక్తులను ముగ్గురిని పేర్కొంటుంది.

ప్రభువు పేదలనూ దీనులనూ ఆదరిస్తాడు. యిస్రాయేలు ప్రజలు కుష్ఠరోగులను ఊరిలోనుండి వెళ్ళగొట్టేవాళ్లు. ఆ దీనులు వూరి వెలుపల చెత్తచెదారం బూడిద పెంటదిబ్బలు మొదలైన వాటిమీద వసించేవాళ్లు. యోబు అలాంటివాడు - 2, 8. 1సమూ 2,8 కూడ

ఈ దీనులను పేర్కొంటుంది. ఈ యాలోకనాన్ని మనసులో పెట్టుకొనే కీర్తనకారుడు ఈ యేడవ చరణాన్ని చెప్పాడు.

8. ప్రభువు దీనులను ఆదరిస్తాడు. వాళ్ళను ఉన్నత స్థితికి తీసికొని వస్తాడు. ఐగుప్తులో బానిసగా ఉన్న యోసేపును మంత్రినిచేసి ఫరోరాజు సరసన కూర్చోబెట్టాడు.

ప్రభువు ఎంత కరుణగలవాడంటే, గొడ్రాలు కూడ గౌరవం పొందేలా చేస్తాడు. యిస్రాయేలు సమాజంలో గొడ్రాలు మిక్కిలి దీనురాలు. శాపగ్రస్త. ఆమెకు సొంత యింటిలోగూడ స్థానం ఉండదు. బిడ్డలను కనలేదు కనుక పెనిమిటి ఆమెకు విడాకులిచ్చి వెళ్ళగొట్టవచ్చు. ప్రభువు అలాంటి దీనురాలికి సంతానాన్ని దయచేసి ఆమె తన కుటుంబంలో మన్నన పొందేలా చేస్తాడు. ఎల్కనా భార్య అన్నా చాలనాళ్లు గొడ్రాలుగా ఉండిపోయింది. సవతియైన పెనిన్నా ఆమెను దెప్పిపొడిచింది. కాని ప్రభువు అన్నాకు సమూవేలు అనే బిడ్డణ్ణి ప్రసాదించి ఆ దీనురాలు గౌరవాన్ని పొందేలా చేసాడు -1 సమూ 2,5.

పై 7-8 చరణాల్లో పేర్కొన్న యోబు, యోసేపు అన్నా వంటి దీనులు యిస్రాయేలు ప్రజలకే చిహ్నంగా ఉంటారు. ఆ ప్రజలు మొదట ఐగుప్తులో బానిసలు. దిక్కూ మొక్కులేని దీనులు. ప్రభువు వాళ్ళ కోపు తీసికొని వాళ్లను శత్రువులనుండి కాపాడాడు. ఆ ప్రజలకు దావీదు సొలోమోనులాంటి రాజులను దయచేసి వాళ్లను ఉచ్ఛదశకు తీసికొని వచ్చాడు. అతని దయాగుణం అంతగొప్పది. అతడు ఈనాడు కూడ తన భక్తులైన దీనులను ఆదరిస్తుంటాడు.

## 4. ప్రార్థనా భావాలు

1. బైబులు భగవంతుడు కరుణామయుడు. అతడు మహోన్నత స్థానంలో వసించేవాడు. అది యతని గొప్పతనాన్ని సూచిస్తుంది. ఐనా అతడు దీనులనూ ఆర్తులనూ పట్టించుకొంటాడు. వాళ్ల బాధలను తీర్చడానికి స్వర్గంనుండి భూమి మీదికిదిగి వస్తుంటాడు. యెష 57, 15 ఈలా వాకొంటుంది.

   "మహోన్నతుడు శాశ్వతుడు పవిత్రుడూ ఐన ప్రభువు
   ఇలా నుడుపుతున్నాడు
   నేను ఉన్నతమైన పవిత్ర స్థలంలో వసించేవాణ్ణి
   ఐనా వినయాత్ములూ పశ్చాత్తాపమనస్కులూ
   ఐనవారితోను వసిస్తాను
   వారికి నూత్న బలాన్ని దయచేస్తాను".

అనగా పైన వసించే ప్రభువు క్రిందికి వచ్చి దీనులను ఆదరిస్తాడని భావం. అతడు విశ్వమంతటాను, మన హృదయంలో కూడాను ఉంటాడని భావం. పూర్వవేదంలో తండ్రిలాగే నూత్న వేదంలో క్రీస్తుకూడ స్వర్గంనుండి భూమిమీదికి దిగివచ్చాడు. అతడు తన్నుతాను శూన్యం చేసికొని, సేవకుని రూపంతాల్చి, నరుడుగా జన్మించాడు- ఫిలి 2,7. మనం ఆ దేవుని "క్రిందికి దిగివచ్చే గుణాన్ని" అర్థం చేసుకొని అతన్ని కీర్తించాలి. ఈ కీర్తనలో ప్రధానాంశం ఈ గుణమే. ఇంకా, మనం జీవితంలో విజయాలు వడసినప్పుడుకూడ కృతజ్ఞతా భావంతో ఈ కీర్తనను జపించవచ్చు. ఆలాంటి సందర్భాల్లో దేవుడు మన జీవితంలోకికూడ దిగివచ్చాడు అనుకోవాలి.

2. ప్రభువు యిస్రాయేలు ప్రజలను కరుణించి వాళ్ళను దీనదశనుండి ఉన్నత దశకు కొనివచ్చాడు. వాళ్ళబానిసాన్ని తొలగించి వాళ్ళకు రాజులను దయచేసాడు. ఈనాడు అతడు దీనులమైన మనలనుకూడ ఎంతో ఉద్ధరిస్తుంటాడు. సాంఘికంగాను, ఆర్థికంగాను భక్తిరీత్యానుగూడ మనం గొప్పవాళ్ళంకాదు. ఐనా అతడు మనలను ఆదరించి వృద్ధిలోకి తీసుకవచ్చాడు. ప్రభువుచలవవల్ల నేడు మనం ఒక స్థాయిని అందుకొన్నాం. దీనికిగాను అతన్ని స్తుతించి కీర్తించాలి. "నా హృదయం ప్రభువుని స్తుతిస్తుంది, అతడు తన దాసురాలి దీనావస్థను కటాక్షించాడు" అంది మరియమాత తన మహిమ గీతంలో. ఈ వాక్యాలు మనంకూడ కృతజ్ఞతాపూర్వకంగా చెప్పుకోదగ్గవి. మనకు డాబూ దర్పమూ పనికిరావు. వినయమూ కృతజ్ఞతాభావమూ తగుతుంది. ప్రభువుని వినుతించి కీర్తించడం మన బాధ్యత. మనం దేవుని అద్భుత కార్యాలను ప్రకటించవలసినవాళ్ళం. జ్ఞానస్నానం ద్వారా అతడు మనలను చీకటిలోనుండి అద్భుతమైన వెలుగులోనికి తీసికొని వచ్చాడు. ఆ ప్రభువు మంచితనాన్ని మనం లోకానికి చాటిచెప్పాలి. - 1 పేత్రు 2, 9

# కీర్తన - 32

## పాపాన్ని వొప్పుకొని మన్నింపు పొందడం

1. ప్రభు వెవని పాపములను మన్నించునో
ఎవని తప్పిదములను తుడిచివేయునో ఆ నరుడు ధన్యుడు

2. ప్రభు వెవనిని దోషినిగా గణింపడో
ఎవడు కపటాత్ముడు కాడో, ఆ జనుడు భాగ్యవంతుడు

3. నేను నా తప్పు నొప్పుకొనక మౌనముగా నున్నపుడు
దినమంతయు నిట్టూర్పులు విడచుచు క్రుంగి కృశించితిని

4. ప్రభూ! రేయింబవళ్ళు నీవు నన్ను కఠినముగా దండించితివి
వేసవి వేడిమికి చెమ్మవలె
నా సత్తువ యెండిపోయెను

5. అప్పుడు నేను నా పాపము నొప్పుకొంటిని
నా యపరాధమును దాచనైతిని
నేను ప్రభువు నెదుట నా తప్పిదము నొప్పుకొందు ననుకొంటిని
నీవు నా దోషమును మన్నించితివి

6. కనుక నీ భక్తులెల్లరు ఆపదలో నీకు ప్రార్థన చేయవలయును
అప్పుడు జలప్రవాహములు పొంగివచ్చినను వారిని తాకజాలవు

7. నేను తలదాచుకొను చోటు నీవే
నన్నాపదనుండి కాపాడువాడవు నీవే
నీవు నన్ను రక్షింతువుకనుక నేను నిన్ను కీర్తినలతో స్తుతింతును

8. నేను నీ కుపదేశము చేయుదును
నీవు నడువవలసిన మార్గమును చూపింతును
నీ మీద దృష్టి నిల్పి నీకు సలహా నిత్తును

9. నీవు జ్ఞానములేని గుఱ్ఱమువలెను గాడిదవలెను ప్రవర్తింపవలదు
అవి వారును కళ్ళెమును వేసిననేగాని అదుపులోనికి రావు

10. దుష్టులు పెక్కు వేదనల ననుభవింతురు
కాని ప్రభుని నమ్మినవారిని యతనికృప యావరించి యుండును

11. పుణ్యపురుషులు ప్రభువునం దానందించి సంతసింతురుగాక
నీతిమంతులు సంతోషనాదము చేయుదురు గాక.

## 1. పరిచయం

ఇది కృతజ్ఞతా కీర్తనల వర్గానికి చెందింది. ఈ వర్గం గీతాల్లో భక్తుడు దేవునినుండి ఏదో ప్రత్యేక ఉపకారాన్ని పొందినందులకు అతనికి వందనాలర్పిస్తాడు. దేవుడతన్ని వ్యాధి, మృతువు, శత్రుపీడనం మొదలైన వాటినుండి కాపాడి ఉండవచ్చు. లేదా అతని పాపాన్ని

మన్నించి అతనికి శాంతి సంతోషాలు దయచేసి ఉండవచ్చు. ఈ భాగ్యాలకు అతడు ప్రభువుకి వందనాలు చెప్తాడు. కనుక వందన సమర్పణం వీటిల్లో ముఖ్యాంశం. ఈ వర్గం కీర్తనలు 30, 65,107 మొదలైనవి.

స్తుతి కీర్తనలు కూడ ఇంచుమించు కృతజ్ఞతా కీర్తనల్లాగే ఉంటాయి. రెండు వర్గాలూ దేవుణ్ణిస్తుతించి ధన్యవాదాలు చెప్తాయి. ఆ రెండింటికి వ్యత్యాసం ఇది. స్తుతి కీర్తనలు భగవంతుడు సర్వసాధారణంగా నరులందరికి చేసే ఉపకారాలను పేర్కొని అతనికి వందనాలు చెప్తాయి. కృతజ్ఞతా కీర్తనలు అతడు ఓ ప్రత్యేక వ్యక్తికి చేసిన ఓ ప్రత్యేక ఉపకారాన్ని పేర్కొని వందనా లర్పిస్తాయి.

ఈ 32వ కీర్తన యథార్థంగా మూడు వర్గాలకు చెందుతుంది. ఇది విలాప కీర్తనం, కృతజ్ఞతా కీర్తనం, జ్ఞాన కీర్తనం కూడ. ఐనా మనం ఇక్కడ దీన్ని ప్రధానంగా కృతజ్ఞతా కీర్తనంగా గ్రహిద్దాం.

ఈ కీర్తన వ్రాసిన భక్తుడు ఏదో పెద్ద పాపం చేసాడు. ఐతే అతడు దేవుని యెదుట తన తప్పును ఒప్పుకోలేదు. దాన్ని కప్పిపెట్టుకొన్నాడు. దీనికి శిక్షగా దేవుడతనికి తీవ్రమైన మానసిక క్షోభను తెచ్చిపెట్టాడు. అతని అంతరాత్మ అతన్ని తీవ్రంగా చీవాట్లు పెట్టడం మొదలెట్టింది. ఎక్కడికి వెళ్ళినా, ఏమి చేసినా అతనికి మనశ్శాంతి కలుగలేదు. అప్పుడతడు తన అవివేకాన్ని గుర్తించి దేవుని యెదుట తన పాపాన్ని వొప్పుకొన్నాడు. దానితో అతనికి పాపపరిహారమూ చిత్త శాంతీ లభించాయి. ఈ యనుభవాన్ని ఆధారంగా తీసికొని అతడు భావితరాలవాళ్లకు గొప్ప సలహాయిచ్చాడు. నరుడు పాపం చేసినపుడు తనంతట తానే దేవుని ముందట తన దోషాన్ని వొప్పుకోవడం మంచిది. లేకపోతే దేవుడు నరుణ్ణి నిర్బంధంచేసి ఆ దోషాన్ని వొప్పిస్తాడు. ఈలా యీ కీర్తనం పశ్చాత్తాపం వలని ప్రయోజనం, అంతరాత్మ పీడనం, చిత్తశుద్ధి మొదలైన గొప్ప విలువలకు అద్దం పడుతుంది. ఇది యేడు పశ్చాత్తాప కీర్తనల్లో ఒకటి కూడ.

## 2. విభజనం

దీనిలో రెండు భాగాలున్నాయి. మొదటిది, రచయిత పాపానుభవం. రెండవది, భావితరాలవాళ్లకు అతడు చేసిన ఉపదేశం.

1-7 పాపాన్నీ పాపపరిహారాన్నీ గూర్చిన రచయిత వ్యక్తిగతానుభవం

8-11 నరులు తమంతటతామే పశ్చాత్తాపపడాలని ఉపదేశం.

# 3. వివరణం

## 1) పాపానుభవం

1-2 చరణాలు. 1-7 చరణాల్లో రచయిత తన వ్యక్తిగతమైన పాపానుభవాన్ని చెప్తున్నాడు. ఇది ఆత్మకథలాంటిది.

దేవునినుండి పాపపరిహారం పొందిన నరుడు ధన్యుడు. అతని ధన్యత్వం అతడు పొందే సంతోషంలోనే ఉంటుంది.

ఈ చరణాల్లో దేవుడు ఎవని పాపాలను మన్నిస్తాడో, ఎవని తప్పిదాలను తుడిచివేస్తాడో, ఎవనిని దోషిగా గడింపడో - అని ఒకే భావాన్ని మూడుసార్లు చెప్పాడు. కనుక కీర్తనకారుడు పాపపరిహారాన్ని గూర్చి నిశితంగా తలపోస్తున్నాడనుకోవాలి. అది యతనికి చాల ముఖ్యమైన అంశంగా తోచిందనుకోవాలి. ఇక్కడ కపటాత్ముడు అంటే పాపంచేసి దేవునిపట్ల వంచనతో ప్రవర్తించేవాడని భావం.

3-4. స్వీయ చరిత్రను చెప్పుకొంటున్నాడు. కొంతకాలం అతడు తన తప్పులను కప్పిపెట్టుకొన్నాడు. దేవుణ్ణి తప్పించుకొందామనుకొన్నాడు. కాని ప్రభువు అతన్ని దండించాడు. అతని అంతరాత్మద్వారా అతన్ని పీడించడం మొదలెట్టాడు. రేయింబవళ్ళు, దినమంతా, మానసికమైన ఆందోళనం అతన్ని తొలిచివేసింది. ఎండ వేడిమికి తేమలాగ అతని సత్తువ యెండిపోయింది. అతడు చిక్కి శల్యమయ్యాడు. ఇదంతా గూడ దైవశిక్షగా భావించాడు భక్తుడు.

5. అతడు కండ్లు తెరచాడు. ప్రభువు దయచేసిన ఆంతరంగికమైన ప్రబోధం వలన తన పాపాలను ఒప్పుకొన్నాడు. ప్రభువు అతని దోషాన్ని పరిహరించాడు. అతనికి లభించిన చిత్తశాంతియే యిందుకు తార్కాణం.

6. దేవుడు పవిత్రుడైన న్యాయాధిపతి. అతడు పాపులను వదలడు. అతనిముందు మన పప్పులు ఉడకవు. కనుక ద్రోహులమైన మనం మొదట మన పాపాలను చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడి, అటుపిమ్మట మనకష్టాల్లో, అతనికి మొరపెట్టుకోవాలి. అప్పుడు జలప్రవాహాలు పొంగివచ్చినా, అనగా పెద్ద శ్రమలు ఎదురైనా, దేవుని దయవలన గట్టెక్కుతాం:

7. తలదాచుకొనే తావంటే రక్షణదుర్గం. భగవంతుడు తన్నాశ్రయించిన భక్తుణ్ణి రక్షణ దుర్గంలా కాపాడతాడని భావం.

## 2) ఉపదేశం

కీర్తనకారుడు స్వీయచరిత్రను చెప్పుకొన్నాక ఓ జ్ఞానిలాగ భావితరాలవాళ్ళకు ఉపదేశం చేస్తున్నాడు. స్వీయానుభవమే అతనికి ఈ ఉపదేశ సామర్థ్యాన్ని దయచేసింది. ఈ రెండవ భాగానికి దేవుడుగూడ కర్తగావచ్చు. కాని కీర్తనకారుడే కర్త అనుకోవడం ఇంకా ఉచితం.

8. అతడు భక్తజనులకు ఉపదేశం చేస్తున్నాడు. సన్మార్గం చూపిస్తున్నాడు.

9. గుర్రాలూ, గాడిదలూ మొండిగా, మూర్ఖంగా ప్రవర్తిస్తాయి. మెడకు వారూ, నోట్లో కళ్ళెమూవేసి శిక్షిస్తేనేగాని అవి మాట వినవు. కాని జ్ఞానంకల నరులు ఈ మృగాల్లా ప్రవర్తించకూడదు. దేవునితో సహకరించి స్వయంగానే తమపాపాలకు పశ్చాత్తాపపడాలి. లేకపోతే దేవుడు వాళ్లను పై మృగాలనులాగ శిక్షించి పశ్చాత్తాపం పుట్టిస్తాడు. వివేకం గల నరుడు అంతటి దురదృష్టాన్ని తెచ్చుకోగూడదు.

10. పాపకార్యాలు చేసే దుష్టులకు మానసిక క్షోభం కలుగుతుంది. కాని ప్రభువుని నమ్మి తమ పాపాలను ఒప్పుకొనే భక్తులకు అతని ప్రేమ లభిస్తుంది. కీర్తనకారునికి ఈ రెండనుభవాలు ఉన్నాయి. కాని వీటిల్లో రెండవది మెరుగని అతడు ఇక్కడ మనకు ఉపదేశం చేస్తున్నాడు.

11. పుణ్యపురుషులు సంతోషించేదీ, సంతోషనాదం చేసేదీ, దేవళంలో భక్తసమాజం ముందు. ప్రభువు తన పాపాలను మన్నించి ఆనందం దయచేసాడుకనుక వాళ్ళు భక్తబృందం ముందట అతనికి సాక్ష్యం పలుకుతారు. అతన్ని స్తుతిస్తారు.

# 4. ప్రార్థనా భావాలు

1. 51వ కీర్తన ఇంకా పాపంలోనేవున్న పాపి పశ్చాత్తాపాన్ని వర్ణిస్తుంది. 32వ కీర్తన తన పాపాలకు మన్నింపు పొందిన భక్తుని ఆనందాన్ని వర్ణిస్తుంది. ఈ రెండు కీర్తనల దృక్పథాలు వేరువేరు. ఐనా రెండూ రత్నాల్లాంటివే. రెండూ మన ప్రార్థనలకు ఉపకరించేవే.

2. మూడు, నాల్గు చరణాలు అంతరాత్మ పీడనాన్ని వర్ణిస్తాయి. మనస్సాక్షి మనహృదయంలో విన్పించే దేవుని స్వరం. దానికి మనం లొంగుతుండాలి. మామూలుగా మనం పాపంలో పడినప్పుడు అంతరాత్మ చీవాట్లు పెడుతుంది. పశ్చాత్తాపపడినప్పుడు ఆనందం కలిగిస్తుంది. ఈ యనుభవాలు మనకు కూడ

ఉంటాయి. ఈ యనుభవాలనే కీర్తనకారుడు ఇక్కడ కళాత్మకంగా వివరించాడు. మనకు కూడా కలిగే అనుభూతులు కనుకనే, ఈ భక్తుని భావాలు మనకు ప్రీతిని పుట్టిస్తాయి.

3. దేవుని యెదుట మన పాపాలను అంగీకరిస్తే ఆ ప్రభువు మనకు గొప్ప చిత్తశాంతిని దయచేస్తాడు. ఈ సందర్భంతో సామెతల గ్రంథం ఈలా వాకొంటుంది.

"తన పాపాలు కప్పిపెట్టుకొనేవాడు బాగుపడడు
ఆ పాపాలను వొప్పుకొని వాటిని పరిత్యజించేవాడు
దేవుని దయను సంపాదిస్తాడు
దేవునిపట్ల భయభక్తులు కలవాడు సుఖాన్ని పొందుతాడు
గుండెరాయిచేసికొనేవాడు నాశమౌతాడు" - 28, 13,14.

ఇంకా యోహాను మొదటి లేఖ ఈలా అంటుంది. "దేవుని యెదుట మనపాపాలను ఒప్పుకొంటే అతడు వాటిని క్షమిస్తాడు. మన అవినీతినుండి మనలను శుద్ధిచేసి నీతిని చేకూరుస్తాడు" - 1,9. పశ్చాత్తాపాన్ని గూర్చిన ఈ వాక్యాలు చక్కగా ఆలోచింపదగ్గవి. ఇక, నూత్నవేదంలో క్రీస్తు మనకు దయచేసే ప్రధాన పాపక్షమా సాధనం పాపోచ్చారణమే. కనుక భక్తులు దీన్ని చక్కగా వినియోగించుకొని హృదయశాంతిని పొందుతూండాలి.

4. పాపోచ్చారణం తర్వాత ఈ కీర్తనను భక్తితో, ధ్యానాత్మకంగా జపిస్తే గొప్ప ఆనందానుభూతి కలుగుతుంది. మనశ్శాంతి ఏర్పడుతుంది.

# కీర్తన - 139

# సర్వజ్ఞుడైన ప్రభువు

## 1

1. ప్రభూ! నీవు నన్ను పరిశీలించి తెలిసికొనియున్నావు

2. నేను కూర్చుండుటయు లేచుటయు నీకు తెలియును
నీవు దూరమునుండియే నా యాలోచనలను గుర్తుపట్టుదువు

3. నేను నడచుచున్నను పరుండియున్నను నీవు గమనింతువు
నా కార్యములెల్ల నీకు తెలియును

4. నా నోట మాట రాకమునుపే
నేనేమి చెప్పుదునో నీవెరుగుదువు

5. ముందువెనుకల నీవు నన్ను చుట్టుముట్టియుందువు
నీచేతిని నామీద నిల్పియుంతువు

6. నన్నుగూర్చిన నీ తెలివిడి అత్యద్భుతమైనది
అది చాల యున్నతమైనది, నా బుద్ధి కందనిది

## 2

7. నేను నిన్ను తప్పించుకొని యెక్కడికి పోగలను?
నీ సమక్షమునుండి యెచ్చటికి పారిపోగలను?

8. నేను గగనమున కెక్కిపోయినచో నీవచట నుందువు
పాతాళమున పరుండియున్నచో నచట నుందువు

9. నేను రెక్కలు కట్టుకొని తూర్పున కెగిరిపోయినను
పడమరన చాల దూరమున వసించినను

10. నీ వచటను నీ చేతితో నన్ను నడిపింతువు
నీ కుడిచేతిలో నన్నాదుకొందువు

11. నేను చీకటి నన్ను కప్పివేయవలెననియు
నా చుట్టునున్న వెలుతురు చీకటిగా మారవలెననియు కోరుకొన్నను

12. చీకటి నీకు చీకటి కాజాలదు
నీ ముందట చీకటి పగటివలె ప్రకాశించును
రేయింబవళ్ళు నీకు సరిసమానము

## 3

13. నాలోని ప్రత్యణువును నీవే సృజించితివి
మాతృగర్భమున నన్ను రూపొందించితివి

14. నీవు భీకరుడవు కనుక నేను నీకు వందనము లర్పింతును
నీ కార్యములు ఆశ్చర్యకరమైనవి
ఈ యంశము నాకు బాగుగా తెలియును

15. నేను రహస్య స్థలమున రూపము దాల్చినపుడు,
మాతృగర్భమున విచిత్రముగా నిర్మితుడవైనపుడు
నీ కంటికి మరుగై యుండలేదు

16. నేను పిండముగా నున్నపుడే నీవు నన్ను చూచితివి
నాకు నిర్ణయింపబడిన దినములన్నియు-
అవి యింకను ప్రారంభము కాకమునుపే
నీ గ్రంథమున లిఖింపబడియున్నవి

17. దేవా! నీ యాలోచనలను గ్రహించుట యెంత కష్టము!
వాని సంఖ్య అపారమైనది కదా!

18. నేను నీ యాలోచనలను లెక్కింప బూనినచో
అవి యిసుకరేణువులకంటె నెక్కువగా నుండును
నేను మేల్కొనినపుడు ఇంకను నీ చెంతనే యుందును

**4**

19. దేవా! నీవు దుష్టులను సంహరించిన నెంతబాగుండును!
దౌర్జన్యపరులు నా జోలికి రాకున్న నెంతబాగుండును!

20. వారు నిన్నుగూర్చి చెడ్డగా మాటలాడుచున్నారు
నీ నామమును దూషించుచున్నారు

21. ప్రభూ! నిన్ను ద్వేషించువారిని నేను ద్వేషించుటలేదా!
నీ మీద తిరుగుబడువారిని నే నసహ్యించుకొనుటలేదా?

22. నేను వారిని పూర్ణముగా ద్వేషింతును
వారిని నా సొంత శత్రువులనుగా భావింతును

23. దేవా నన్ను పరిశీలించి నా హృదయమును తెలిసికొనుము
నన్ను పరీక్షించి నా యాలోచనలను గుర్తింపుము

24. నాలో చెడ్డ యేమైన నున్నదేమో చూడుము
శాశ్వత మార్గమున నన్ను నడిపింపుము.

## 1. పరిచయం

ఈ గీతం జ్ఞానకీర్తనల వర్గానికి చెందింది. ఇది దైవసాన్నిధ్యాన్ని కన్నులకు గట్టినట్లుగా వర్ణిస్తుంది. మనం నిరంతరం దేవుని సన్నిధిలోనే ఉంటామని చెప్తుంది. ఈ గీతం మన జ్ఞానోపదేశ గ్రంథాల్లాగ దేవుడు అలాంటివాడు ఈలాంటివాడు అని చెప్పదు.

పరోక్షంగా అతని గుణగణాలను పేర్కొనదు. నీవూ నేను అన్న పక్కిలో దేవునితో ప్రత్యక్షంగా సంభాషిస్తున్నట్లుగా ఉంటుంది. ఈ గేయంలో కీర్తనకారుడు భగవంతునిసాన్నిధ్యంపట్ల తనకున్న వ్యక్తిగతానుభవాలను వర్ణించాడు. అతనిమీద ఏవో నేరాలు వచ్చాయి. బహుశః అతడు విగ్రహారాధకుడని శత్రువులు అతనిమీద నిందలు మోపి ఉంటారు. కనుక అతడు నేను నిజంగా దోషినేమో పరిశీలించి చూడమని దేవునికి మొరపెట్టుకొన్నాడు.

ఈ రచయితకు గొప్ప దైవానుభూతి ఉంది. దేవుని లక్షణాలను అర్థం జేసికొనేశక్తి ఉంది. ఈ లక్షణాలను భావితరాలవారి కొరకు స్పష్టంగా వివరించి చెప్పగలిగే శక్తికూడ ఉంది. ఇవి అరుదైన వరాలు.

ఇది బైబుల్లోని గొప్ప కీర్తనల్లో వొకటి. కనుక భక్తులు దీనితో బాగా పరిచయం కలిగించుకొని దీన్ని తరచుగా ప్రార్థనలో వాడుకొంటూండాలి. దైవసాన్నిధ్యాన్ని గుర్తించడం మన భక్తిలో ఉన్నత శిఖరంలాంటిది.

## 2. విభజనం

1-6 భగవంతుడు సర్వజ్ఞాని
7-12 అతడు అంతటా ఉంటాడు
13-16 అతడు అన్నీ చేయగలడు
17-18 మనం అతన్ని అర్థం చేసికోలేం
19-22 దుష్టులు నాశమైపోవాలని ప్రార్థన
23-24 తన్ను పరీక్షించి చూడమని దేవునికి ప్రార్థన.

## 3. వివరణం

ఈ కీర్తనలో ఆరేసి చరణాలతో గూడిన నాల్గు భాగాలున్నాయి. మొదటి భాగంలో దేవుడు సర్వజ్ఞాని అని చెప్తున్నాడు.

1. దేవునికి భక్తుని మాటలూ తలపులూ చేతలూ అన్నీ తెలుసు.

2. కూర్చుండడమంటే రాత్రి పనిని విరమించడం. లేవడం అంటే ఉదయం పని ప్రారంభించడం. అనగా నా కార్యాలన్నీ నీకు తెలుసు అని భావం. దూరం నుండి అంటే స్వర్గం నుండే దేవుడు అతని ఆలోచనలను గుర్తిస్తాడని అర్థం.

3. నడవడం, పరుండడం అన్నాకూడ నాపనులన్నీయని అర్థం

5. శత్రుసైన్యం కోటనులాగ, ప్రభువు కీర్తనకారుని అన్నివైపుల నుండి చుట్టుముట్టి ఉంటాడు.

6. మనలనుగూర్చి దేవునికున్న జ్ఞానం ఆశ్చర్యకరమైనది. అది మనకు సరిగా అర్థంకాదుగూడ.

7. మొదటి భాగంలో దేవుడు సర్వజ్ఞాని అని చెప్పాడు. ఈ రెండవ భాగంలో అతడు అంతటా ఉంటాడని చెప్తున్నాడు. కీర్తనకారుడు కవికి సహజమైన భావనాశక్తితో భగవంతుని నుండి మూడు పలాయన మార్గాలను ఊహించాడు. అవి దేవుని నుండి పైకిక్రిందికి పారిపోవడం, ప్రక్కలకు పారిపోవడం, చీకట్లో దాగుకోవడం. కాని యీ మూడు ప్రయత్నాలుకూడ వమ్మయిపోయాయి. భక్తుడు ఎక్కడికి వెళ్ళినా దేవుణ్ణి తప్పించుకోలేడు.

8. దేవుని నుండి తప్పించుకొని ఆకాశానికెక్కి పోయినా, పాతాళానికి దిగిపోయినా ఆ తావుల్లోకూడ దేవుడుంటాడు. ఇది మొదటి పలాయనం.

9-10. దూరంగా తూర్పు పడమరలకు పోయినా లాభంలేదు. అక్కడా దేవుడుంటాడు. ఇది రెండవపలాయనం.

11-12. అతడు చీకట్లో దాగుకొన్నా లాభం లేక పోయింది. చీకటి మనకు చీకటిగాని, దేవునికి ప్రకాశమే ఔతుంది. అతడే దానిని చేసాడు. కనుక చీకటిలోగూడ దేవుడు భక్తుణ్ణి చూస్తాడు. ఇది మూడవ పలాయనం. ఈ విధంగా అతడు ఎక్కడికి వెళ్ళినా దేవుణ్ణి తప్పించుకోలేక పోయాడు. ఆ ప్రభువు సర్వత్ర ఉండేవాడు.

13-14. మొదటి రెండు భాగాలు ముగిసాక, ఈ మూడవ భాగంలో దేవుడు అన్నీ చేయగలడని చెప్తున్నాడు. ఇక్కడ ప్రత్యేకంగా భగవంతుడు మాతృగర్భంలో శిశువును రూపొందించే తీరును వర్ణిస్తున్నాడు. ఈ యంశాన్ని పేర్కొన్న బైబులు రచయిత ఇతడొక్కడే.

దేవుడు నరుణ్ణి మాతృగర్భంలో రూపొందిస్తాడు. సాలీడు నూలుతో బట్టలు నేసినట్లుగా దేవుడు పిండాన్ని అమర్చుతాడు - యోబు 10, 8-12. అతని చేతలు ఆశ్చర్యకరమైనవి, భయంకరమైనవి.

15. కీర్తనకారుడు మాతృగర్భంలో పిండంగా ఉన్నపుడు అతన్ని ఎవరు చూచారు? సొంత తల్లికూడ అతన్ని చూడలేదు. కాని ఆ దశలోనే దేవుడు అనురాగంతో అతన్ని వీక్షించాడు. ఇక్కడ మాతృగర్భమే రహస్యస్థలం.

16. భక్తుడు ఇంకా పుట్టకమునుపే దేవుడు అతనికి నిర్ణయించిన దినాలన్నీ తన గ్రంథంలో లిఖించి ఉంచుకొన్నాడు. అనగా మనం జీవించే ప్రతిరోజూ దేవునికి బాగా తెలుసునని భావం. బైబులు చాలతావుల్లో దేవుని గ్రంథాన్ని పేర్కొంటుంది - నిర్గ 32,22. కీర్త 56,8. దర్శ 20,12. ఈ "గ్రంథం" దేవుని జ్ఞాపకశక్తేనని చెప్పాలి. మనలను గూర్చిన విషయాలన్నీ అతడు జ్ఞాపకముంచుకొంటాడని భావం.

17-18. దేవునికి మనపట్ల ప్రేమతో గూడిన ఆలోచనలుంటాయి. ఆ గారాబు తలపులు అనంతమైనవి. ఇసుక రేణువుల్లాగ లెక్కల కందనివి. అతని ప్రేమాలోచనలకు మనం సరిగా అర్థం చేసికోలేంగూడ.

"నేను మేల్కొనినపుడు" అనే వాక్యం హిబ్రూమూలంలో భ్రష్టమైపోయింది. దాని అర్థమేమిటో ఇప్పుడు ఎవరికీ తెలియదు. ఈ వాక్యాన్ని "నేను మేల్కొనినపుడు గూడ నిన్నర్థం జేసికోలేను" అని కూడ అనువదించవచ్చు.

19-20. ఈ చివరి భాగంలో తనమీద నేరాలు మోపిన శత్రువులు నాశమైపోవాలని ప్రార్థిస్తున్నాడు.

దుష్టులూ దౌర్జన్యపరులూ ఐన శత్రువులు భక్తుని మీద నేరాలు మోపారు. దేవుణ్ణి దూషించారు. కనుక వాళ్ళు నాశమైపోతే బాగుంటుందని రచయిత ప్రార్థన.

21-22. ఈ శత్రువులు దేవుణ్ణి ద్వేషించేవాళ్ళు. అతనికి ఎదురు తిరిగేవాళ్లు. కీర్తనకారుడు దేవుణ్ణి నమ్మినవాడు. కనుక అతడు దేవుని శత్రువులనుగా భావించి అసహ్యించుకొన్నాడు.

23. భక్తుడు విగ్రహారాధనంలాంటి పాపమేదో చేసాడని శత్రువులు అతనిమీద నిందలు మోపారు. కాని అతడు నిర్దోషి. కనుక అతడు తన హృదయాన్ని పరిశీలించి చూడమనీ, తనలో దుష్టాలోచన లేమైనా ఉన్నాయేమో పరీక్షించి చూడమనీ, భగవంతుణ్ణి వేడికొంటున్నాడు. ఈలాంటి ప్రార్థన చేయాలంటే గొప్ప చిత్తశుద్ధి ఉండాలి.

24. వినాశ మార్గం, జీవనమార్గం అని రెండు త్రోవలున్నాయి. కీర్తనకారుడు, అతని శత్రువులు శంకించినట్లుగా వినాశ మార్గంలో నడువలేదు. అతడు సజ్జనుడు. కనుక తన్ను జీవనమార్గంలో నడిపించమని దేవుణ్ణి అడుగుకొంటున్నాడు. ఈ జీవనమార్గమే శాశ్వత మార్గం. అదే ధర్మశాస్త్ర మార్గంకూడ - మత్త 7,13.

## 4. ప్రార్థనా భావాలు

1. చాలమందికి దేవుడు అనుభవానికి రానేరాడు. అతడెక్కడో మోక్షంలో ఉన్నాడనుకొంటారు. కాని భక్తులు అతన్ని వ్యక్తిగతంగా అనుభవానికి తెచ్చుకొన్నారు. ఎల్లవేళలా అతని సాన్నిధ్యాన్ని గుర్తిస్తూ వచ్చారు. ఈ కీర్తనకారుడే అందుకు సాక్షి. ఇతడు భగవంతుని గూర్చి పరోక్షంగా మాట్లాడడు. అతని గుణగణాలను పేర్కొనడు. ఓ స్నేహితుల్లాగా అతనితో ముఖాముఖి సంభాషిస్తుంటాడు. ఇతని గీతాన్ని చూచి మనం దేవునిపట్ల వ్యక్తిగతమైన అనుభవం కలిగించుకోవడం నేర్చుకోవాలి. అతనితో సంభాషించడం అలవాటు చేసికోవాలి.
2. ఈ కీర్తనకారునిలాగే మనంకూడ దైవసాన్నిధ్యాన్ని అనుభవానికి తెచ్చుకొంటే భక్తితో జీవిస్తాం. పాపం చేయడానికి జంకుతాం. ఈ సాన్నిధ్యబలంవల్లనే పూర్వం

ఐగుప్తులో యోసేపు పోతీఫరు భార్య శోధనలనుండి తప్పించుకొన్నాడు - ఆది 39,9. బాబిలోనియాలో సూసన్న వృద్ధులశోధనలనుండి తప్పించుకొంది - దాని 13, 23. అబ్రాహాం దేవుని సన్నిధిలో నడచాడు - ఆది 17,1. మరో కీర్తనకారుడు ప్రభువుని నిత్యం తన కన్నులముందట నిల్పుకొన్నాడు - కీర్త 16,8. ఈలాగే దైవసాన్నిధ్యం మనలనుగూడ శోధనలనుండి కాపాడుతుంది.

3. ఈ కీర్తనలోని భావాల ప్రకారం ప్రభువు మనలను నిత్యం గమనిస్తుంటాడు. కాని అతడు నిత్యం మనలను చూస్తుంటాడు అనుకొంటే మనకు భయం పుట్టదా? పోలీసువాడు రోడ్డుమీద నిలబడి జనాన్ని గమనిస్తుంటాడు. నేరం చేసినవాళ్ళను పట్టుకొని జరిమాన విధిస్తాడు. దేవుడు మనలను ఓ పోలీసువాడిలాగ గమనించడు, మనకు శిక్ష విధించడు. అమ్మా నాన్న గూడ పసిబిడ్డను నిత్యం గమనిస్తుంటారు. ఆ బిడ్డను నీళ్ళూ నిప్పూలాంటి అపాయాలనుండి కాపాడుతూంటారు. దేవుడు మనలను ఈయమ్మ నాన్నలాగ గమనిస్తుంటాడు. అతడు మనలను గమనించేది మనలను శిక్షించడానికిగాదు, రక్షించడానికి. ఆ ప్రభువు మూతపడని కన్నులాగ నిరంతరం మనలను చూస్తుంటాడు. కర్మసాక్షిలాగ మన పనులన్నిటినీ పరిశీలిస్తుంటాడు. ఐనా అతనిపట్ల మనకు భయంకాదు, నమ్మకముండాలి. ఎందుకంటే అతడు అమ్మా నాన్నలాంటివాడు.

4. "నాకు నిర్ణయింపబడిన దినాలన్నీ నీగ్రంథంలో లిఖింపబడే ఉన్నాయి" అన్నాడు కీర్తనకారుడు (16). ఈ గ్రంథం దేవుని జ్ఞాపకశక్తేనని చెప్పాం. భూతభవిష్యద్వర్త మానాల్లోని జనులందరూ, వాళ్ళ పనులన్నీ దేవునికి తెలుసు. అతడు మనలనూ మన కార్యాలనూ నిరంతరం జ్ఞప్తియందుంచుకొంటాడు. కనుక మనం అతన్ని నమ్మాలి. అతని సహాయం అడుగుకోవాలి. అతనిమీద ఆధారపడి జీవించాలి. ఆపదలూ కష్టాలూ వచ్చినపుడు అతన్ని మరీ అధికంగా నమ్మాలి.

5. "రేయింబవళ్ళు నీకు సరిసమానం" అన్నాడు భక్తుడు (12). మూర్ఖ మానవులు చీకట్లో దొంగతనం, హత్య, వ్యభిచారం మొదలైన నేరాలు చేసి ఎవరూ చూడలేదులే అనుకొంటారు. కాని వాళ్ళు నరుల కన్ను గప్పినా దేవుని కన్ను గప్పలేరు. దేవుని శిక్షను తప్పించుకోలేరు. ఇంకా నరులు చాటుమాటున ఎన్నో పాడుపనులు చేస్తారు. దేవుడు మన పాపకార్యాలనూ దురాలోచనలనూ గూడ గుర్తిస్తుంటాడు. కనుక జీవితంలో నిజాయితీని అలవర్చుకోవాలి. ఈ కీర్తన మనకు ఈ నిజాయితీని నేర్పుతుంది.

6. మనం తరచుగా నరులను మెప్పించడానికి తాపత్రయ పడతాం. హృదయంలో కపటం ఉన్నా బయటికి మంచివాళ్ళలా నటన చేస్తాం. కాని ఆ దేవునికి మన కార్యాలూ ఆలోచనలూ అన్నీ తెలుసు (34). కనుక మనం అతన్ని మెప్పించడానికి పూనుకోవాలి . ఐతే, ఆ ప్రభువుని మెప్పించాలంటే చిత్తశుద్ధితో జీవించాలి. ఈ భాగ్యాన్ని కూడ దేవుడే మనకు దయచేస్తాడు.

# కీర్తన - 90

## హ్రస్వకాలికమైన నరజీవితం

1. ప్రభూ! అనాదికాలము నుండియు
నీవే మా కాశ్రయముగా నుంటివి

2. పర్వతములు పుట్టక మునుపే
భూమియు లోకమును ఏర్పడక పూర్వమే
అనాదికాలము నుండియు నీవు దేవుడవుగా నుంటివి
ఎల్లకాలము నీవు వేల్పువుగా నుందువు

3. నీవు నరులను మట్టిగా మార్చెదవు
నరులారా! మీరు మరల మన్నయి పొండని పల్కెదవు

4. నీకు వెయ్యేండ్లు ఒక్క రోజుతో సమానము,
అవి గతించిపోయిన నిన్నటి దినముతోను
రేయియందలి యొక్క జాముతోను సరిసమానము

5. నీవు నరులను వరదవలె ఈడ్చుకొని పోయెదవు
వారు కలవంటివారు
ఉదయమున మొలకెత్తు గడ్డివంటివారు

6. అది వేకువన నెదిగి పూలు పూయును
సాయంకాలమున వాడి యెండిపోవును

7 మేము నీ కోపాగ్ని వలన మాడిపోవుచున్నాము
నీ క్రోధమువలన గడగడ వణకుచున్నాము

8 నీవు మా పాపములను నీ ముందట నుంచుకొందువు
మా రహస్య పాపములను నీ ముఖకాంతితో పరిశీలించిచూతువు

9 నీ కోపమువలన మా యాయుస్సు క్షీణించి పోవును
మా యాయువు శ్వాసమువలె గతించును

10 మే మొక డెబ్బది యేండ్లు జీవింతుము
దృఢకాయుల మైనచో ఎనుబది యేండ్లు బ్రతుకుదుము
కాని ఆ యేండ్లన్నియు బాధావిచారములతో నిండియుండును
మా జీవితము క్షణములో ముగియగా మేము దాటిపోవుదుము

11 కాని నీ కోపప్రభావము నర్థము చేసుకొన్నవా డెవడు?
నీ క్రోధమువలన నెట్టిభయము పుట్టునో గ్రహించినవాడెవడు?

12 మా యాయుష్కాల మెంత స్వల్పమైనదో
మేము గ్రహించునట్లు చేయుము
దానివలన మేము విజ్ఞులు మగుదము

13 ప్రభూ! నీ క్రోధము నణచుకొనుము
నీ వింకను ఎంతకాలము కోపింతువు
నీ దాసుల మీద దయ జూపుము

14 వేకువన మమ్ము నీ ప్రేమతో నింపుము
మా జీవితకాలమందెల్ల
మేము సంబరముతో కేరింతలు కొట్టుదుము

15 పూర్వము మమ్మెంతగా శ్రమలుపాలు చేసి దుఃఖపెట్టితివో
అంతగా నేడు మమ్ము సంతోషపెట్టుము

16 నీ దాసులమైన మేము నీ రక్షణమును జూతుముగాక
మా బిడ్డలు నీ మాహాత్మ్యమును గాంతురుగాక

17 మా దేవుడైన ప్రభూ!
మాకు నీ యనుగ్రహమును దయచేయుము
మా కార్యములు నెల్ల సఫలము చేయుము.

## 1. పరిచయం

ఇది విలాపకీర్తనల వర్గానికి చెందినది. వృద్ధుడైన కీర్తనకారుడు ఓసారి వెనక్కు తిరిగి తన జీవితాన్ని పరిశీలించి చూచుకొన్నాడు. ఈ జీవితకాలాన్ని గూర్చిన అతని

యాలోచనలు మనకుగూడ ఆసక్తిని కలిగిస్తాయి. దేవుడు శాశ్వతుడు. నరుడు అల్పాయుష్కుడు. పైగా పాపంవలన అతని ఆయుస్సు ఇంకా తగ్గిపోతుంది. తన స్వల్పకాల జీవితాన్ని జూచి నరుడు జ్ఞానం తెచ్చుకోవాలి. తాను జీవించే కొద్ది కాలాన్ని సద్వినియోగం జేసికోవాలి.

## 2. విభజనం

1-6 దేవుడు శాశ్వతుడు, నరుడు అల్పాయుష్కుడు

7-12 నరుని పాపాలకు విలాపగీతం

13-17 తన కృపనూ వరప్రసాదాన్నీ దయచేయమని దేవునికి ప్రార్థన.

## 3 వివరణం

ఈ మొదటి భాగంలో దేవుడు నిత్యుడనీ నరుడు అనిత్యుడనీ చెప్తున్నాడు.

1. మా పితరులు కూడ నీన్నే నమ్మారు. పూర్వం నుండి మేము నిన్నే ఆశ్రయిస్తూ వచ్చాం.

2. సృష్టికిముందే సృష్టికర్త ఉన్నాడు. అతడు ఎల్లకాలము దేవుడుగానే ఉంటాడు.

3. ఆదాము పాపంద్వారా నరుడు చావు దెచ్చుకొని మన్నయిపోతున్నాడు. "నీవు మట్టినుండి పుట్టావు, చివరకు మట్టిలోనే కలిసిపోతావు" అని దేవుడు ఆదాముని శపించాడు - ఆది 3, 19. ఆ శాపం మనలందరినీ వెన్నాడుతూంటుంది. కనుక ప్రతి నరుడూ చచ్చి మన్నయి పోవలసిందే.

4. దేవుడు శాశ్వతుడు. అతనికి మన వెయ్యేండ్లు ఒక్క రోజుతో సమానం. ఒక్క జాముతో సమానం. హీబ్రూ ప్రజల లెక్క ప్రకారం జామంటే నాల్గు గంటల కాలం రాత్రికి మూడు జాములూ, 12 గంటలూ ఉంటాయి.

5-6 నరుని హ్రస్వకాలిక జీవితానికి మూడుపమానాలు చెప్తున్నాడు. 1. ఆది వరద దిడీలున ఈడ్చుకొనిపోయే వస్తువులాంటిది. 2. కలలాంటిది. 3 ఒక్కరోజు మాత్రమే ఉండియెండిపోయే గడ్డిలాంటిది. ఈ రచయిత నిరాశావాదికాదు, సత్యవాది. అతడు చెప్పినట్లుగా మన జీవితం క్షణికమైంది. నీటి బుడగలాంటిది. చాలమంది భక్తులు మోక్షానికి చెందిన శాశ్వత జీవితాన్ని మనసులో పెట్టుకొని, ఇహలోకానికి చెందిన హ్రస్వకాలిక జీవితాన్ని తృణీకరించారు. ఆ యనంత జీవితాన్ని పొందడానికి చిత్తశుద్ధితో కృషిచేసారు.

7. ఈ రెండవ భాగంలో నరుల పాపాన్ని గూర్చి విలాపగీతం విన్పిస్తున్నాడు. నరుల పాపంవల్ల దేవునికి కోపం వస్తుంది. అతని కోపాగ్నికి మనం తట్టుకోలేం.

8. పరిశుద్ధుడైన దేవుడు మన పాపాలన్నీ తనముందు బెట్టుకొని జాగ్రత్తగా పరిశీలిస్తాడు. మన రహస్య పాపాలు కూడా అతని ముఖకాంతిలో స్పష్టంగా కన్పిస్తాయి. న్యాయాధిపతియైన దేవుడు మన దోషాలకు తీర్పు విధిస్తాడు.

9. దేవుడు నరుని పాపాలకు అతనిపై కోపిస్తాడు. ఆ కోపంవల్ల అతని ఆయుస్సు ఇంకా తగ్గిపోతుంది. నరుని ఆయువు అతడు విడిచే శ్వాసంలాగ క్షణమాత్రమైంది.

10. నీతిమంతుడుకూడ 70-80 ఏండ్లు మాత్రమే జీవిస్తాడు. పాపాత్ములు ఇంకా లేతవయసులోనే చస్తారు. పాపంవల్ల మన హ్రస్వకాలిక జీవితం ఇంకా హ్రస్వమౌతుంది.

11. నరులు తమ పాపాలనూ అల్పాయువునూ తలంచుకొని దేవుని ముందట భయపడాలి. కాని ఆ జ్ఞానం నరులకు లేదు. వాళ్లు మూర్ఖులై దేవుని కోపప్రభావాన్ని అర్థం చేసికోవడం లేదు.

12. మన ఆయుష్కాలమెంత స్వల్పమైందో అర్థం జేసికొంటే మనకు బుద్ధి వస్తుంది. విజ్ఞత అలవడుతుంది. ఈ విజ్ఞతవల్ల పాపాన్ని విడనాడి పుణ్యకార్యాలు చేస్తాం. మనకున్న కొద్దిపాటి కాలాన్ని సద్వినియోగం చేసికొంటాం. ఈ పండ్రెండవ చరణం ఈ కీర్తనలో కెల్ల ముఖ్యమైన వాక్యం.

13. ఈ చివరి భాగంలో దేవుని కృపావరప్రసాదాల కొరకు ప్రార్థిస్తున్నాడు. అల్పమానవులమీద దయ జూపమని దేవుణ్ణి వేడుకొంటున్నాడు.

14. యిస్రాయేలు భక్తులు రాత్రి దేవళంలో గడిపి వేకువనే ఆరాధనం ప్రారంభించుకొనేవాళ్లు. ఆ ప్రభాతారాధనలో దేవుడు భక్తులకు తన చిత్తాన్ని తెలియజేసేవాడు. వాళ్ళకు దయజూపేవాడు. కనుక ప్రత్యుదయం దేవళంలో మమ్ము నీ ప్రేమతో నింపమని దేవుణ్ణి అడుగుకొంటున్నాడు. ప్రభువు ప్రేమ గొప్పవరం.

15. పూర్వం మా పాపాలకు మమ్ము శిక్షించావు. ఇప్పుడు మా కానందం దయచేయమని భావం.

16. ఐగుప్తు నిర్గమనం కాలంలోని రక్షణాన్ని ఇప్పుడు మళ్ళా దయచేయమని అడుగుకొంటున్నాడు. ఈ పాపపు పరిస్థితుల్లో మాకూ మా బిడ్డలకూ రక్షణాన్ని ప్రసాదించమని మనవి చేస్తున్నాడు.

17. దేవుని దయవల్లనే మన కార్యాలు విజయవంతమౌతాయి. అతడు మన స్వల్పకాలిక జీవితాన్ని దీవిస్తే, అది ఫలవంతమూ విజయవంతమూ ఔతుంది.

# 4. ప్రార్థనా భావాలు

1. ఈ కీర్తనకారుడు నిరాశావాది కాదు. దేవుని యందు గొప్ప నమ్మకం గలవాడు. దేవుని శాశ్వతత్వంతో పోలిస్తే మన జీవితం క్షణికమైంది. పాపం వలన మన ఆయుస్సు ఇంకా క్షీణించిపోతుంది. ఇది మన దౌర్భాగ్యం. కాని మనం పశ్చాత్తాపపడితే దేవుడు మన పాపాలను మన్నించి మనకు తన కృపను దయచేస్తాడు. ఆ కృపతోమనం పుణ్యకార్యాలు చేస్తాం. దానివలన మన స్వల్పకాలిక జీవితంగూడ ఫలభరిత మౌతుంది. మనకు అది చాలు.

2. మన జీవితాన్ని లాగే మన కాలాన్ని గూడ దేవుని నుండి అరువు తెచ్చుకొంటాం. అది దేవుడు మనకిచ్చే విలువైన కానుక. మనం దాన్ని సద్వినియోగం జేసికోవాలి. కొందరు అవివేకంతో కాలాన్ని దుర్వినియోగంజేస్తుంటారు. పాపకార్యాలతో భ్రష్టం జేస్తారు. ఇది తప్పు. ఈ కీర్తన దేవుడు మనకు దయచేసిన ఆయుస్సూ కాలమూ ఎంతో విలువైనవని నొక్కి చెప్తుంది.

3. పుణ్యకార్యాలతో మన స్వల్పకాల జీవితాన్ని ఫలభరితం చేసికోవాలి. భక్తిగల జీవితం అన్నిటికంటె ముఖ్యమైంది. స్టనిస్లాస్ భక్తుడు బాల్యంలోనే చనిపోయాడు. కాని అతడు భక్తితో రోజులు గడిపి, స్వల్పకాలంలోనే దీర్ఘకాలం జీవించాడు. పౌలు కాలాన్ని సద్వినియోగం చేసికొమ్మన్నాడు - ఎఫె 5,16. సొలోమోను జ్ఞానగ్రంథం

"సజ్జనుడు స్వల్పకాలంలోనే సిద్ధిని పొంది
దీర్ఘకాలం జీవించినవా డయ్యాడు"

అని చెప్తుంది - 4, 13. ఈ యాశయాన్ని పాటిస్తే మన జీవితం ధన్యమౌతుంది.

4. ఈ కీర్తనలో ముఖ్యమైది 12వ చరణం. మన బ్రతుకు స్వల్పకాలికమైనదని గ్రహించి దాన్ని జాగ్రత్తగా వాడుకోవాలి. మనజీవితానికి ఒక పథకమంటూ ఉండాలి. మామూలుగా మనం 65 ఏండ్లు బాగా పనిచేస్తాం. ఆ మీదట మరికొన్నేళ్లు బ్రతికినా ఆ కాలంలో ముఖ్యమైన పనులేమీ చేయలేం. ఇక, నా జీవితంలో ఈ 65 ఏండ్లల్లో యిప్పటికే యెన్నేళ్ళు గడిచిపోయాయి? ఈ కడచిపోయిన కాలంలో నేను ఎన్ని పుణ్యకార్యాలు సాధించాను? ఇంకా నాకు ఎన్నేళ్లు మిగిలివున్నాయి? ఆ మిగిలివున్న కాలంలో ఏమి సత్కార్యాలు చేయాలనుకొంటున్నాను? నేను దేవుడు నా కిచ్చిన కాలాన్ని అమూల్యమైన వరంగా గణిస్తున్నానా? దాన్ని సద్వినియోగం జేసుకొంటున్నానా? నాకు వట్టి ప్రాపంచిక దృష్టేనా లేక ఆధ్యాత్మిక దృష్టికూడ ఉందా?

# కీర్తన - 103
# దేవుడు కరుణామయుడు

1 నా యాత్మమా! ప్రభుని స్తుతింపుము
నాలోని సమస్త శక్తులారా!
అతని పవిత్ర నామమును సన్నుతింపుడు

2 నా యాత్మమా! ప్రభుని స్తుతింపుము
అతని యుపకారములను వేనిని మరువకుము

3 అతడు నీ పాపములనెల్ల మన్నించును
నీ వ్యాధులనెల్ల కుదుర్చును

4 సమాధినుండి నిన్ను కాపాడును
ప్రేమ నెనరులనెడు దీవెనలను నీ కొసగును

5 నీ జీవితమును శుభములతో నింపును
నీవు గరుడపక్షివలె యువకుడవుగాను శక్తిసంపన్నుడవుగాను
మనునట్లు చేయును

6 ప్రభువు నీతిని పాటించును
పీడితులకు న్యాయము చేకూర్చి పెట్టును

7 అతడు మోషేకు తన ప్రణాళిక నెరిగించెను
యిస్రాయేలీయులకు తన మహాకార్యములను విశదము చేసెను

8 ప్రభువు కరుణామయుడు, దయాపూరితుడు
దీర్ఘశాంతుడు, ప్రేమనిధి

9 అతడు మనలను నిత్యము చీవాట్లు పెట్టడు
మనమీద కలకాలము కోపపడడు

10 మన పాపములకు తగినట్లుగా మనలను శిక్షింపడు
మనదోషములకు తగినట్లుగా మనలను దండింపడు

11 భూమికి ఆకాశమెంత యెత్తుగా నున్నదో
ప్రభువుపట్ల భయభక్తులు చూపువారి యెడల
అతని ప్రేమ అంత మిక్కుటముగా నుండును

12 పడమరకు తూర్పు ఎంత దూరమో
అంత దూరముగా అతడు మన పాపాలను పారద్రోలును

13 తండ్రి తన కుమారులమీద జాలి జూపినట్లే
ప్రభువు తనపట్ల భయభక్తులు కలవారిమీద నెనరు జూపును

14 మనమెట్లు రూపొందితిమో అతనికి తెలియును
మనము మట్టిమానుసులమని యతడు జ్ఞప్తియందుంచుకొనును

15 నరుల జీవితము గడ్డిపరకవంటిది
పిచ్చి మొక్కలు పూయు పూవు వంటిది

16 ఆ పూవు మీద గాలి తోలగా అది రాలిపోవును
అది ఇక యెవరి కంటను బడదు

17 కాని ప్రభువుపట్ల భయభక్తులు జూపువారియెడల
అతని ప్రేమ అనాదినుండి అనంతము వరకు నుండును

18 ప్రభువు నిబంధనమును పాటించి
అతని కట్టడల ననుసరించువారికి
అతని రక్షణము తరతరముల వరకు లభించుచుండును

19 ప్రభువు తన సింహాసనమును ఆకసమున నెలకొల్పెను
అతడు ఎల్లరిమీద పరిపాలనము చేయును

20 బలాఢ్యులైన ప్రభువు దూతలారా!
అతని యాజ్ఞ పాటించి యతనిమాట వినువారలారా!
మీరతనిని స్తుతింపుడు

21 ప్రభువు సైన్యములారా!
అతనికి పరిచారకులై యతని చిత్తమును పాటించువారలారా!
మీరతనిని స్తుతింపుడు

22 ప్రభువు సామ్రాజ్యము నందలి సమస్త సృష్టివస్తువులారా!
మీరతనిని స్తుతింపుడు
నా యాత్మమా! ప్రభుని స్తుతింపుము.

# 1. పరిచయం

ఈ కీర్తనం స్తుతిగీతాల వర్గానికి చెందింది. ఇది ప్రధానంగా భగవంతుని కరుణను వర్ణిస్తుంది. కంటికి కన్పించని ఆ దేవుణ్ణి కంటికి కన్పించేలా చిత్రిస్తుంది. ఈ కీర్తనను చెప్పిన భక్తుడు దేవుని దయను బాగా అనుభవానికి తెచ్చుకొన్నాడు. అతని అనుభవం ఎంత విలువయిందంటే, అది యీనాడు మనం కూడ ఆ ప్రభువు దయను అర్థం చేసికొనేలా చేస్తుంది. ఈ గీతంలోని చాల వాక్యాలు బైబుల్లోని ఇతర గ్రంథాల నుండి గ్రహింపబడినవే. ఐనా అవి చాల ప్రశస్తమైనవి. భక్తుల హృదయాంతరాళం నుండి వెలువడినవి. దీనిలోని చాల చరణాలను మనం సంగ్రహ ప్రార్థనలుగా, సుకృత జపాలుగా వాడుకోవచ్చు.

# 2. విభజనం

1-2 కీర్తనకారుడు దేవుణ్ణి స్తుతించడానికి తన్నుతాను ఆహ్వానించుకొంటున్నాడు.

3-5 అతడు ప్రభువు కరుణను స్వయంగా అనుభవానికి తెచ్చుకొన్నాడు.

6-14 యూదులకు దేవుడు కరుణజూపిన తీరు

15-18 నరుడు అనిత్యుడు, దేవుడు నిత్యుడు

19-22 దేవుడు రాజు

# 3 వివరణం

1-2. కీర్తనకారుడు తన యాత్మను, అనగా తన్నుతానే దేవుణ్ణి స్తుతించడానికి ఆహ్వానించుకొంటున్నాడు. ఆ ప్రభువు తనకు చేసిన ఉపకారాలను వేటినీ తాను మరువరాదని అనుకొంటున్నాడు.

3-4. ఆ భక్తుడు తన జీవితంలో ప్రభువు కరుణను స్వయంగా అనుభవానికి తెచ్చుకొన్నాడు. ఏలాగనగా, ప్రభువు అతని పాపాలు మన్నించాడు. అతని వ్యాధులు కుదిర్చాడు. అకాల మృత్యువాతబడకుండా అతన్ని కాపాడాడు.

5. గరుడపక్షిలో రెండు లక్షణాలు ఉంటాయి. 1. ఏటేట ఈకలు రాల్చగానే దానికి నూత్నబలం వస్తుంది. 2. అది దీర్ఘకాలం జీవిస్తుంది. కనుక కీర్తనకారుడు ప్రభువు తనకుకూడ యువకుల బలమూ, దీర్ఘాయువూ దయచేస్తాడని నమ్మాడు.

6. ఇక యూదుల చరిత్రలో ప్రభువు కృపజూపిన తీరును వర్ణిస్తున్నాడు. ఈ కీర్తనలో ఇదే ముఖ్యాంశము.

ఐగుప్తులో ఫరో యిస్రాలీయులను పీడించాడు. ప్రభువు దయతో వాళ్ళకోపు తీసికొని వాళ్ళకు న్యాయం చేకూర్చి పెట్టాడు.

7. అతడు మోషేకు ధర్మశాస్త్రంలోని ఆజ్ఞలను తెలియజేసాడు. ఐగుప్తునుండి వెడలి వచ్చేప్పుడు యిస్రాయేలీయులకు ఎన్నో అద్భుత కార్యాలు చేసిపెట్టాడు.

8. దేవుని నిర్వచనం కరుణే. అతడు నరులమీద సులభంగా కోపపడడు. వారిని ప్రీతితో ఆదరిస్తాడు. ఈ యెన్మిదవ చరణం నిర్గమకాండం 34, 6-7 నుండి గ్రహింపబడింది. అక్కడ ప్రభువు తన కరుణాగుణాన్ని స్వయంగా మోషేకు వెల్లడి చేసికొన్నాడు. ఈ నిర్గమకాండంలోని వాక్యాలు అతి ప్రశస్తమైనవి. కనుక పూర్వవేదం చాల తావుల్లో వీటిని పేర్కొంటుంది. ఇక్కడ మనకీర్తనకారుడు కూడ వీటిని ఉదాహరించాడు.

9. ఆ ప్రభువు పాపులను శాశ్వతంగా నిరాకరించదు. అతని కోపం ఎంతో కాలం ఉండదు.

10. దేవుడు మన పాపాలకు తగినట్లుగా మనలను శిక్షిస్తే మనమంతా ఈ పాటికి నరకలో కూరుకొనివుండే వాళ్ళమే. అతడు మనలను చూచీచూడనట్లుగా పోనిస్తాడు. కనుకనే మనం బ్రతికి బట్టకట్టి తిరుగుతున్నాం.

11-12. భూమికి ఆకాశం ఎంత యెత్తో ప్రభువుకి తన భక్తులపట్ల ఉండే ప్రేమ అంత ఉన్నతమైంది. పడమరకు తూర్పు ఎంత దూరమో అతడు మన పాపాలను అంత దూరంగా విసరివేస్తాడు. అనగా మన పాపాలను పూర్తిగా మన్నిస్తాడు. వాటినిక గుర్తుంచుకోడు. భూమికి ఆకాశం, పడమరకు తూర్పు - ఇవి రెండు పూర్వులకు తెలిసిన మహా దూరాలు. భగవంతుని కరుణగూడ ఇంత గొప్పదని భావం. ఇవి రెండు గొప్ప ఉపమానాలు. కవితా హృదయంతో అర్థం చేసికోదగ్గవి, నిత్యం గుర్తుంచుకోదగ్గవి - యెష 55, 8-9. కీర్త 36,5.

13. దేవుడు ఓ నాన్నలా, ఓ అమ్మలా మనకు నెనరుజూపుతాడు. అన్ని ప్రేమలకంటె తల్లిదండ్రులకు బిడ్డలపట్ల ఉండే ప్రేమ శ్రేష్ఠమైంది. భగవంతుళ్లో ఈ శ్రేష్ఠమైన ప్రేమ ఉందని చెప్తున్నాడు. అతన్ని గూర్చి యింతకంటె యెక్కువగా ఏమీ చెప్పలేం.

14. మన తండ్రియైన ఆదాము పిడికెడు మట్టిముద్ద - ఆది 2,7. అతని సంతానానిమైన మనం మట్టి మానుసులం. అనగా దుర్బల ప్రాణులం. చావుకి గురయ్యేవాళ్ళం. సులభంగా పాపానికి వొడిగట్టే వాళ్ళంగూడ. మన స్వభావం తెలిసినవాడు కనుకనే ప్రభువు మనమీద సులభంగా కోపింపడు. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమా అన్నట్లు మనలను చూచీచూడనట్లుగా పోనిస్తుంటాడు.

15-16. గడ్డి పొలంలోని పిచ్చిమొక్కలూ, అవిపూసే పూలూ క్షణమాత్రాలు. ఎడారినుండి వేడిగాలి తోలగానే అవి వాడిపోతాయి. నరులుకూడ ఈలాగే అల్పాయుష్కులు - యెష 40, 6-8.

17. కాని ప్రభువు తన భక్తులపట్ల చూపే ప్రేమ శాశ్వతమైంది. ఆ దేవుడుకూడ తన ప్రేమలాగే నిత్యుడు.

18. మనం ఆ ప్రభువు శాశ్వత ప్రేమను పొందాలంటే ఒక్క షరతును పాటించాలి. అతని నిబంధననూ కట్టడలనూ పాటించాలి.

19. దేవుడు ఆకసంనుండి రాజుగా పరిపాలనం చేస్తుంటాడు.

20-21. కీర్తనకారుడు దేవుని బంటులైన దేవదూతలను ఆ ప్రభువును స్తుతించమని అడుగుతున్నాడు.

22. వాన, గాలి, మెరుపులు మొదలైన సృష్టివస్తువులను కూడ ఆ ప్రభువుని స్తుతించమని అడుగుతున్నాడు. కడన, కీర్తన ప్రారంభంలోలాగే అంతంలోగూడ, దేవుణ్ణి స్తుతించడానికి తన్నుతాను ఆహ్వానించుకొంటున్నాడు. స్తుతి కీర్తనల్లో ఈ దైవస్తుతి ప్రచురంగా కన్పిస్తుంది.

## 4. ప్రార్థనా భావాలు

1. ఈ కీర్తనలోని 8వ చరణం నిర్గమకాండం 34, 6-7 నుండి గ్రహించబడిందని చెప్పాం. ఇది పూర్వవేదంలోని గొప్ప వాక్యాల్లో ఒకటి. మనం సుకృత జపంగా వాడుకో దగ్గది.

2. 13వ చరణం దేవుణ్ణి నెనరుగల తండ్రిగా వర్ణిస్తుంది. అతడు ప్రధానంగా శిక్షకుడుకాదు, రక్షకుడు. మనం అతన్ని చూచి భయపడకూడదు. అతనిపట్ల మనకు చనువు ఉండాలి. దుడుకు చిన్నవాడి తండ్రి ఆ పిల్లవాడు తిరిగిరావడం జూచి అతన్ని కలుసుకోడానికి ఎదురు బోయాడు - లూకా 15,20. ఈ కీర్తన పేర్కొనే తండ్రి జాలి కూడ అలాంటిదే.

3. కీర్తనకారుడు ప్రభువు తనకు యువకుల బలమూ దీర్ఘాయువూ దయచేస్తాడని నమ్మాడు. నేడు మనం కూడ జ్ఞానస్నానంలో ఈ భాగ్యాన్ని పొందుతాం. రోజువారి జీవితంలో మన మార్జించే వరప్రసాదాలు గూడ ఈ వరాలను పెంచుకొంటూ బోతాయి.

4. ఈ కీర్తన విశేషంగా దేవుని కరుణాగుణాన్ని వర్ణిస్తుందని చెప్పాం. భగవంతునిలో అపరిమితంగా ఉండేదీ మనలో లేనిదీ దయాగుణమే. కాని దేవునికి పోలికగా కలిగింపబడిన మనం ఈ దయాగుణాన్ని వృద్ధి చేసికోవాలి. మనం ఇతరులతో మెలిగేప్పుడు వాళ్ళపట్ల దయజూపుతామా? లేక ఖండితంగా ప్రవర్తిస్తామా? మన క్రిందివాళ్లు తప్పుజేసినపుడు వాళ్ళను వెంటనే దండించడానికి పూనుకొంటామా లేక వాళ్ళపట్ల జాలి జూపుతామా?

# కీర్తన - 73

# న్యాయమే గెలుస్తుంది

1 దేవుడు యిస్రాయేలీయులకు మేలు చేసెను
అతడు విశుద్ధ హృదయులకు మేలు చేసెను

2-3 గర్వాత్ములను గాంచి యసూయ చెందుట వలనను
దుర్మార్గులు వృద్ధిలోనికి వచ్చుచున్నారని గ్రహించుట వలనను
నేను ప్రలోభమున జిక్కుకొంటిని
జారి పడిపోవుటకు సంసిద్ధుడనై తిని

4 ఆ దుష్టుల కెట్టి బాధలును లేవయ్యెను
వారు ఆరోగ్యముతో సుష్ఠుగ నున్నారు

5 ఇతర నరులవలె శ్రమ లనుభవింపరైరి
ఇరుగుపొరుగువారివలె ఇక్కట్టులకు గురికారైరి

6 కావున వారు అహంకారమను హారమును ధరించిరి
హింసయను వస్త్రమును తాల్చిరి

7 బలిసిపోయి చెడుగును వెళ్ళగ్రక్కిరి
హృదయమును కుతంత్రములతో నింపుకొనిరి

8 ఇతరుల నెగతాళి చేయుచు చెడ్డగా మాటలాడారి
అహంకారముతో అన్యులను పీడింప నెంచిరి

9 స్వర్గములోని దేవుని దూషించుచు మాటలాడిరి
ఇరుగుపొరుగువారికి ఆజ్ఞలు జారీచేసిరి

10 యిస్రాయేలు ప్రజలు వారి దగ్గరికి వచ్చి
వారు చెప్పిన మాటలెల్ల నమ్మిరి

11 దేవునికి మన సంగతు లెట్లు తెలియును?
మహోన్నతునికి జ్ఞానమెట్లలవడును అని యా దుష్టుల వాదము

12 వీరుగో! దుష్టు లిట్టివారు
వారు సంపన్నులైయున్నారు
రోజురోజున కింకను సంపన్ను లగుచున్నారు

13 మరి నేను విశుద్ధుడనుగా జీవించుటవలన ఫలితమేమి?
దుష్కార్యములు విడనాడుట వలన లాభమేమి?

14 నేను దినమెల్ల శ్రమలతో వెతజెందితిని
ప్రత్యుదయము శిక్ష ననుభవించితిని

15 నేనును ఆ దుష్టులవలె మాటలాడియున్నచో
నీ ప్రజలకు తప్పక ద్రోహము చేసియుండెడివాడను

16 కాని నే నీ సమస్య నర్థము జేసికోజూచితిని
అది నాకు దుర్గ్రహమయ్యెను

17 అంతలో నొకనాడు నేను దైవరహస్యమును గ్రహించితిని
దుష్టుల కెట్టిగతి పట్టునో తెలిసికొంటిని

18 నీవు వారిని కాలుజారి పడిపోవు తావులలో నిల్పితివి
వారికి వినాశము దాపురించునట్లు చేసితివి

19 ఆ దుష్టులు క్షణములో నాశమయ్యెదరు
ఘోర వినాశమునగూలి కంటికి గన్పింపకుండ బోయెదరు

20 నిద్రమేల్కొన్నవాడు తాను కన్న కలను పట్టించుకోనట్లే
ప్రభూ! నీవు నిద్రలేచినపుడు వారి నేమాత్రము లక్ష్యముచేయవు

21 నా హృదయము వ్యధతో నిండిపోయెను
నా అంతరంగము మిగుల నొచ్చుకొనెను

22 నేను మందమతినై విషయమును గ్రహింపనైతిని
నీ పట్ల పశువువలె ప్రవర్తించితిని

23 ఐనను నేను నిరంతరము నీ కంటిపెట్టుకొని యుంటిని
నీవు నా కుడిచేతిని పట్టుకొని నన్ను నడిపింతువు

24 నీ యుపదేశముతో నీవు నన్ను నడిపింతువు
కడన నన్ను నీ మహిమలోనికి గొనిపోయెదవు

25 స్వర్గమున నీవుదప్ప నా కింకెవరున్నారు?
ఈ భూమిమీద నీవుదప్ప మరియొకటి నాకు రుచింపదు

26 నా దేహమును నా హృదయమును
ప్రేమ వలన కృశించిపోవుచున్నవి
దేవుడే సదా నా కాశ్రయము, నాకు వారసభూమి

27 కావున నీ నుండి దూరముగా వైదొలగువారు చత్తురు
నిన్ను త్యజించువారిని నీవు నాశము చేయుదువు

28 దేవుని చెంతనుండుటే నాకు క్షేమకరము
నేను ప్రభువైన దేవుని ఆశ్రయించితిని
అతడు చేసిన కార్యములెల్ల ప్రకటన చేయుదును.

## 1. పరిచయం

లోకంలో దుష్టులు అపమార్గంలో సుఖాలూ సంపదలూ విజయాలూ గణిస్తుంటారు. కీర్తనకారునికి నేనుమాత్రం అలా యెందుకు చేయకూడదు అని ప్రలోభం కలిగింది. అతడు తనలో తాను ఘర్షణపడ్డాడు. కడకు అతడు దైవప్రబోధంవల్ల దుష్టులు నాశమైపోతారని గ్రహించాడు. తన ప్రలోభాన్ని అణచుకొన్నాడు. అతడు యోబులాంటివాడు. ఈనాడు మన జీవితంలోగూడ ప్రలోభాలు వస్తుంటాయి. మనంకూడ తోడి నరుల్లాగ చెడ్డకు పాల్పడబోతాం. లోకపు విలువలు మనలను మభ్యపెడతాయి. అప్పుడు ఈ కీర్తనం మనకు కనువిప్పు కలిగిస్తుంది. ఇది 2500 ఏండ్లకు పూర్వం పుట్టినా, నేటికీ దీని విలువ తగ్గిపోలేదు. ఇది జ్ఞానకీర్తనలవర్గానికి చెందింది.

## 2. విభజనం

1-2 పరిచయం
3-12 దుష్టుల వృద్ధినిజూచి భక్తుడు ప్రలోభం చెందడం

13-16 అతనిలో ఘర్షణ పుట్టడం
17 అతనికి జ్ఞానోదయం కలగడం
18-22 అతనికి దుష్టుల దుర్గతి అర్థంకావడం
23-28 తనకున్న దైవభక్తి వలన లాభమేమిటో అర్థంకావడం

# 3. వివరణం

1. విశుద్ధ హృదయులంటే దేవునిపట్ల భక్తిగలవాళ్ళు. దేవుడు విశుద్ధహృదయులకు మేలు చేసాడు అని చెప్పడం ద్వారా, కీర్తనలోని భావాన్నంతటినీ ఈ మొదటి చరణంలో సూచించాడు.

2-3. దుర్మార్గుల వృద్ధిని చూడగా కీర్తనకారునికి ప్రలోభం పుట్టింది. తానూ వాళ్ళలాగే పాపకార్యాలు చేయాలని ఆశించాడు.

4-5 దుష్టులకు ఏ బాధలూ లేవు, ఏ శ్రమలూ లేవు.

6. అహంకారమూ హింసా వాళ్ళకు నిత్యకృత్యాలయ్యాయి.

7-9. వాళ్ళ దుష్కార్యాలకు అంతమే లేదు.

10. దేవుని ప్రజలుకూడ వాళ్ళమాట నమ్మారు.

11. దేవుడున్నాడుకాని అతడు మన సంగతిని పట్టించుకోడు. కనుక మనం ఏమైనా చేయవచ్చు - ఇది ఆ దుష్టుల నమ్మకం.

12. దుష్టులు ఈలా రోజురోజుకీ వృద్ధిలోకి వస్తూంటే, ఇక దేవుడుండి మాత్రం ఒరిగిందేమిటి?

13. దుష్టులకు సంపద లబ్బుతున్నాయి. నేను నిజాయితీతో జీవించినా నా కేలాభం కలగడంలేదు.

14. ప్రభువు కీర్తనకారునికి ఏదో వ్యాధి కలిగించాడు. దానివలన అతడు ప్రతిరోజూ వేదనలు అనుభవించాడు.

15. 11వ చరణంలో ఆ దుష్టులు మాట్లాడినట్లుగానే కీర్తనకారుడూ మాట్లాడి ఉన్నట్లయితే అతడు దేవుని ప్రజలకు ద్రోహం చేసివుండేవాడు. తనతోపాటు దేవళంలో దేవుణ్ణి పూజించే తోడి యిస్రాయేలు భక్తులే ఈ దేవుని ప్రజలు. ఈ భక్తసమాజం అతని భక్తిని నిలబెట్టింది. కనుక తాను దేవునికి ద్రోహంచేస్తే ఈ భక్త సమాజానికి ద్రోహం చేసినట్లే.

16. అతడు ఎంత ప్రయత్నించినా దుష్టులు ఎందుకు వృద్ధిలోకి వస్తున్నారు అనే సమస్య అతనికి అర్థంకాలేదు.

17. ఈలా ఘర్షణపడుతూండగా ఒకనాడు అతనికి దైవరహస్యం బోధపడింది. దుష్టులు తాత్కాలికంగా లాభం పొందినా తర్వాత దుర్గతికి గురౌతారని గ్రహించాడు. ఇక్కడ "నేను దైవరహస్యమును గ్రహించితిని" అనే దానికి బదులుగా హీబ్రూ మూలంలో "నేను దేవళము ప్రవేశించితిని" అని ఉంది. కనుక దేవాలయములోనికి వెళ్ళడంవల్లనైనా లేక ధర్మశాస్త్ర పఠనం వల్లనైనా అతనికి జ్ఞానోదయం కలిగి ఉండవచ్చు. దుష్టుల దుర్గతిని దేవుడే అతనికి తెలియజేసాడు. అతడు తనంతటతాను ఆ విషయాన్ని గ్రహించలేదు. ఈ 17వ చరణం నుండి అతని ఆలోచన క్రొత్తదారి పట్టింది. అతనికి దుష్టులంటే మోజుపోయి అసహ్యం కలిగింది.

18-19. కాలుజారి పడిపోయే తావు అంటే పాతాళానికి పోయేదారి. దుర్మార్గులు కొద్దికాలంలోనే చస్తారు, పాతాళానికి పోతారు అని భావం.

20. దుష్టుల జీవితమూ, వారు కూడబెట్టిన సంపదా కూడ క్షణకాలం మాత్రమే నిలుస్తాయి.

21. దుష్టుల వృద్ధిని జూచి అతడు పూర్వం ఎంతో బాధపడ్డాడు. అప్పటికి అతనికి సత్యం అర్థంకాలేదు.

22. పశువుకి జ్ఞానం ఉండదు. కీర్తనకారుడు కూడ పూర్వం దేవుని మార్గాలను అర్థం చేసికోలేకపోయాడు. అప్పటిలో అతడు దుర్మార్గుల సంపదలు శాశ్వతంకాదు అని గ్రహించలేని మందమతి.

23. ఈ చరణంనుండి అతడు తనదైవభక్తి యొక్క విలువను పరిశీలించి చూచుకొంటున్నాడు. ఈ కీర్తనలో ఈ చివరిభాగం చాల భక్తిమంతమైంది. ఇంతకాలమూ ఆ భక్తుడు దేవుని మార్గాలను అర్థంజేసికోలేకపోయినా, నమ్మకంతో ఆ ప్రభువునకు అంటిపెట్టుకొని ఉన్నాడు. ప్రభువు అతన్ని ధర్మమార్గాన నడిపిస్తూ వచ్చాడు.

24. ప్రభువు ఈ లోకంలో కీర్తనకారుణ్ణి తన ధర్మశాస్త్రోపదేశంతో నడిపిస్తాడు. జీవితాంతాన అతన్ని మహిమలోనికి, అనగా మోక్షానికి కొనిపోతాడు. తాను ధర్మబద్ధంగా జీవించినందులకు అది బహుమతి. దుష్టులకు ఈ బహుమతి లేదు.

ఐతే ఇక్కడ చాలమంది పూర్వవ్యాఖ్యాతలూ అనువాదకులూ గూడ కీర్తనకారునికి ఈ "మహిమ" పరలోకంలో గాక ఈ లోకంలోనే సిద్ధిస్తుందని అభిప్రాయపడ్డారు. కనుక ఈ చరణంలో మోక్షమహిమ ప్రస్తావన లేనేలేదనీ, ధర్మబద్ధంగా జీవించినందులకు కీర్తనకారునికి ఈ లోకంలోనే బహుమతి లభిస్తుందనీ వీళ్ళ అభిప్రాయం. ఈ భావమే వొప్పయితే కావచ్చు.

25. పరలోకంలోగాని ఈ లోకంలోగాని భక్తునికి దేవుడే ముఖ్యం. ఇది చాల గొప్ప వాక్యం. నరుని భక్తికి కొలతబద్ద లాంటిది.

26. ఈ కీర్తనకర్త లేవీయుడైయుండవచ్చు. లేవీయులకు వాగ్దత్త భూమిలో భాగంలేదు. వాళ్లు దేవాలయంలో పరిచర్యచేస్తూ అక్కడ భక్తులర్పించే అర్పణలతో జీవించాలి. కనుక వాళ్ళభాగం నేలకాదు, ప్రభువే. అతడే వాళ్ళకు వారస భూమి - సంఖ్యా 18, 20. ఇది చాల భక్తికలభావం. ఈ భక్తునికి దేవునిమీద ఎంతో నమ్మకముండి ఉండాలి.

27. ప్రభువునుండి దూరంగా వైదొలగేవాళ్ళంటే, ప్రలోభాలకు లొంగి ధర్మశాస్త్ర నియమాలను మీరేవాళ్లు. ప్రభువుని త్యజించేవాళ్ళంటే, అతన్ని పూజించని వాళ్ళు. ఈలాంటి వాళ్ళు నాశమైపోతారు.

28. దేవునిచెంత ఉండడమంటే ధర్మశాస్త్ర నియమాలను పాటించడం. దేవుణ్ణి ఆశ్రయించడమంటే దేవళంలో అతన్ని పూజించడం. ఈ రెండు పనులూ చేసాడు కనుక కీర్తనకారునికి క్షేమం కలుగుతుంది. ఇక అతడు ఆనందంతో ప్రభువు రక్షణ కార్యాలను ఎల్లరి యెదుట ప్రకటిస్తాడు.

ఇక్కడ 27-28 చరణాల్లో దుష్టులకీ కీర్తనకారునికీ ఉన్న వ్యత్యాసాన్ని బాగా గమనించాలి. వాళ్ళు దేవునికి దూరంగా వైదొలగేవాళ్లు, అతడు ఆ ప్రభువు చెంతనుండేవాడు. వాళ్లు దేవుణ్ణి త్యజించేవాళ్లు, అతడు ఆ ప్రభువుని ఆశ్రయించేవాడు. వాళ్లు చచ్చి నాశమౌతారు, అతనికి క్షేమం కలుగుతుంది. కనుక మనం ఆ దుష్టుల్లాకాక, ఈ కీర్తనకారునిలా ప్రవర్తించాలి.

13వ చరణంలో కీర్తనకారుడు "నేను విశుద్ధ జీవితం జీవించడం వలన లాభమేమిటి?" అని ప్రశ్నించుకొని నిరాశ చెందాడు. ఈ 28వ చరణంలో "దేవుని చెంత నుండడమే నాకు క్షేమకరం, అతన్ని ఆశ్రయించడమే మంచి పని" అనుకుని ఉత్సాహం చెందుతున్నాడు. దైవరహస్యాన్ని గ్రహించడం వలన అతనిలో ఈ మార్పు కలిగింది (17).

## 4. ప్రార్థనా భావాలు

1. ఈ కీర్తనకారునికి కలిగిన ప్రలోభం ఇది. దుష్టులకు ఆరోగ్యం, ధనం, అధికారం, సౌఖ్యం, పరపీడనం అన్నీ లభిస్తున్నాయి. కనుక అతనికిగూడ పాపకార్యాల మీద మోజు పుట్టింది. తానూ పాపాలుజేసి పై లాభాలు గణించవచ్చు గదా అనుకొన్నాడు. పాపకార్యాలు ఎప్పుడూ ఆకర్షణీయంగా ఉంటాయి. కాని దేవుడు కోరేది ధర్మవర్తనం. మనం ప్రధానంగా దాన్ని పాటించాలి. ఈ లోకంలో మనకు

ప్రలోభాలు కలిగినప్పుడు మనంకూడ ఆ భక్తునిలాగే ప్రభువు గ్రంథం చదువుకోవాలి. దేవళంలో అతనికి ప్రార్థన చేసికోవాలి. అప్పుడు దేవుడు మనకు జ్ఞానోదయం కలిగిస్తాడు. మన కర్తవ్యం బోధపడుతుంది. ప్రలోభాలు తొలగిపోతాయి.

2. ఈ కీర్తనలోని 25 చరణం మన భక్తికి కొలత బద్దగా ఉంటుందని చెప్పాం. ప్రాపంచిక మానవులకు దేవుడొక్కడు రుచింపడు. లోకవస్తువులన్నీ రుచిస్తాయి. ఆధ్యాత్మిక మానవునికి లోకవస్తువులేవీ రుచించవు. దేవుడొక్కడు రుచిస్తాడు. ఈ సూత్రాన్ని బట్టే మనమేలాంటి నరులేమో తెలిసికోవచ్చు. ఈ సందర్భంలో మహాభక్తుడైన పౌలు కూడ "నాకు జీవించడమంటే క్రీస్తే" అని నుడివాడు – పిలి 1, 21.

3. ఈ కీర్తనకారునికి భక్తసమాజంతో ఉన్న సంబంధం వలన అతడు వారికీ దేవునికీ ద్రోహం చేయలేకపోయాడు. తోడి ఆరాధకుల భక్తి అతని భక్తిని నిలబెట్టింది. అలాగే యీనాడు తోడి క్రైస్తవుల భక్తి మన భక్తిని నిలబెడుతుంది. కనుక మనం భక్తసాంగత్యాన్ని పెంపొందించుకోవాలి.

4. ఈ భక్తుడు దేవునిచెంత ఉండడమే తనకు క్షేమకరం అని భావించాడు (28). విశ్వాసం ద్వారా దేవుణ్ణి గాఢంగా అనుభవానికి తెచ్చుకొన్నాడు. కావుననే ప్రలోభాలకూ శోధనలకూ తట్టుకొని నిలువగలిగాడు. మోక్షం అతనికి ఈ భూమి మీదనే ప్రారంభమైంది. మన భక్తి విశ్వాసాలు కూడా ఈలా ఉండాలి. ఈ 23వ చరణం అగస్టీను భక్తునికి మిక్కిలి ప్రీతిపాత్రమైంది. అతని మాటల్లో, దేవుని చెంతవుంటే మనకు జీవం లభిస్తుంది. అతనినుండి వైదొలగితే మరణం తప్పదు.

5. ఈ కీర్తనకారునికి, ఆ మాటకొస్తే పూర్వవేదభక్తుల కెవరికిగూడ, మోక్షాన్నిగూర్చి స్పష్టంగా తెలియదు. వాళ్ళంతా తాము చనిపోయాక పాతాళానికి పోతామని తలంచారు. కాని మనకు మోక్షాన్ని గూర్చి రూఢిగా తెలుసు. పుణ్యకార్యాలు చేసినవాళ్ళు మోక్షానికీ పాపకార్యాలు చేసినవాళ్ళు నరకానికీ పోతారని మనం చిన్ననాడే నేర్చుకొంటాం. కనుక పాప కార్యాలు చేద్దామనే ప్రలోభం కలిగినప్పుడు దానినుండి జాగ్రత్తగా తప్పుకోవాలి. మనం లోకపు విలువలను లొంగకూడదు. సంసార జీవితంలోగాని మఠ జీవితంలోగాని మన తోడివాళ్ళు కొందరు లోకపు విలువలను ఆదరిస్తుంటారు. వాళ్ళు మనలను కూడ మభ్యపెడతారు. కాని మనం ఆ దుష్ట విలువలకు లొంగకూడదు. ఆ ప్రలోభాలకు తలొగ్గకూడదు. ఈ కీర్తనలోని ప్రధానాంశం ఇదే.

# కీర్తన - 100
# దేవుణ్ణి స్తుతించడానికి రండి

1. విశ్వధాత్రీ! ప్రభుని కీర్తింపుము
2. సంతోషముతో ప్రభుని పూజింపుము
ఆనందగీతములతో అతని యెదుటికి రమ్ము
3. ప్రభువే దేవుడని తెలిసికొనుడు
అతడు మనలను చేసెను, మన మతనివారలము
అతని ప్రజలము, అతడు మేపు మందలము
4. కృతజ్ఞతాస్తుతులతో అతని మందిరద్వారము ప్రవేశింపుడు
స్తుతిగీతములతో దేవాలయావరణమున నడుగిడుడు
అతనికి వందనములర్పింపుడు, అతని నామమును కొండాడుడు
5. ప్రభువు మంచివాడు
అతని ప్రేమ శాశ్వతమైనది
అతని విశ్వసనీయత కలకాలము నిల్చును.

## 1. పరిచయం

ఇది చిన్న స్తుతిగీతం. ప్రభుని సంతోషంతో స్తుతిద్దామని చెప్తుంది. భక్తులు ఉత్సవాల్లో యెరూషలేం దేవళం ప్రవేశించేపుడు ఈ గీతాన్ని పాడేవాళ్ళు. దేవుణ్ణి ఆనందంతో పూజించాలనేది దీనిలోని ముఖ్యాంశం. ఈనాడు మనంకూడ దేవళంలోనికి వెళ్ళినపుడు ఈ ప్రార్థనాగీతాన్ని జపించవచ్చు.

## 2. విభజనం

ఈ కీర్తనలో రెండు భాగాలున్నాయి. రచయిత ఈ రెండు భాగాలనూ సమతూకంగా రచించాడు.

| | | |
|---|---|---|
| మొదటిభాగం | 1-2 | దేవుణ్ణిస్తుతించడానికి రమ్మని ఆహ్వానం |
| | 3. | దైవస్తుతికి కారణాలు |
| | 4. | దేవళంలో ప్రవేశించిన దేవుణ్ణి స్తుతించడానికి రమ్మని ఆహ్వానం |
| రెండవ భాగం | 5. | దైవస్తుతికి కారణాలు |

## 3. వివరణం

1. కీర్తనకారుడు యూదులను అన్యజాతి వాళ్ళనూ కూడ (విశ్వధాత్రి) ప్రభుని స్తుతించడానికి రమ్మని ఆహ్వానిస్తున్నాడు.

2. భక్తులు సంతోషంతో ఆనందగీతాలతో దేవళంలోనికి రావాలి. ఈ యానందభావం ఈ కీర్తనలో ఓ ముఖ్యాంశం. దేవళంలో దేవుని మందసం ఉంది. దానిపై దేవుని సాన్నిధ్యం ఉంటుంది. కనుకనే "దేవుని యెదుటికి రమ్ము" అంటున్నాడు.

3. స్తుతిగీతాలు దేవుణ్ణి స్తుతించమని చెప్తాయి. ఆ స్తుతికికారణాలేమిటివో గూడ చెప్తాయి. కనుక ఈ చరణంలో దైవస్తుతికి కారణాలైన దైవలక్షణాలను మూడింటిని పేర్కొంటున్నాడు. అవి 1) ఆ ప్రభువు వొక్కడే దేవుడు. అన్య దైవాలను కొలువరాదు. 2) అతడు మనలను చేసాడు. అనగా మనకు సృష్టికర్త. మనం అతనికి చెందుతాం. 3) ఎన్నిక ద్వారా మనం దేవుని ప్రజలమయ్యాం. అతడు మంచి కాపరిలా గొర్రెలమైన మనలను మేపుతాడు.

4. దేవళంలోనికి ప్రవేశించి ప్రభువుని స్తుతించమనీ అతనికి కృతజ్ఞతాస్తుతులు అర్పించమనీ భక్తులను ఆహ్వానిస్తున్నాడు.

5. దైవస్తుతికి కారణాలైన దైవ లక్షణాలను మరో మూడింటిని పేర్కొంటున్నాడు 4) ప్రభువు మంచివాడు. ఎన్నో సార్లు మనకు మేలు చేసాడు. 5) అతడు తన ప్రజలమీద ప్రేమా కరుణా చూపుతాడు. 6) అతడు ఎల్లకాలము నమ్మదగినవాడుగానే ఉంటాడు. కనుక మనం ఎల్లపుడూ అతన్ని ఆశ్రయించవచ్చు.

## 4. ప్రార్థనా భావాలు

1. ఈ చిన్న కీర్తనలో యూదులకు దేవునిపట్ల ఉండే నమ్మకాలన్నిటినీ సంగ్రహంగా చెప్పాడు. కనుక యూదుల భక్తంతా ఈగీతంలో ఇమిడివుంది. 3,5 చరణాలు పేర్కొనే దైవలక్షణాలు ఆరు ఇవి. ప్రభువు ఒక్కడే దేవుడు, అతడు సృష్టికర్త, అతడు మనలను ఎన్నుకొన్నాడు. అతడు మంచివాడు, ప్రేమగలాడు, నమ్మదగినవాడు. మనం కూడ దేవళంలోనికి వెళ్ళినపుడు ఈ దైవ లక్షణాలను స్మరించుకొని ప్రభువు స్తుతించవచ్చు. ఇంకా, ఈ గీతం దేవుణ్ణి సంతోషంతో కీర్తించాలనిచెప్తుంది. కనుక మనం దేవళంలో ఆనందంతో, ఉత్సాహంతో జపించాలి. దేవుణ్ణి స్తుతించి ఆరాధించాలి.

# కీర్త - 91
## దేవుని రక్షణం

1. మహోన్నతుని మరుగున వసించువాడు
సర్వశక్తిమంతుని రెక్కల నీడలో నివసించువాడు

2. ప్రభువుతో నీవు నా కాశ్రయమవు, నాకు రక్షణ దుర్గమవు
నేను నమ్మిన దేవుడవు అని చెప్పుకొనును

3. వేటకాని యురుల నుండియు
ఘోరవ్యాధుల నుండియు అతడు నిన్ను కాపాడును

4 అతడు తన రెక్కలతో నిన్ను కప్పును
అతని రెక్కల క్రింద నీవు తలదాచుకొందువు
అతని విశ్వసనీయత నీకు డాలుగాను
రక్షణాయుధముగాను ఉండును

5 నీవు రేయి కలుగు అపాయములకును
పగటిపూట తగులు బాణములకును నెరవనక్కరలేదు

6 చీకటిలో సోకు అంటురోగములకును
మట్టమధ్యాహ్నము హానిచేయువారికిని నీవు భయపడనక్కరలేదు

7 నీ దాపున వేయిమంది కూలినను
నీ కుడి ప్రక్కన పదివేలమంది పడినను
నీ కే అపాయము కలుగదు

8 నీ కన్నులతో నీవు
దుష్టులు శిక్ష అనుభవించుటను జూతువు

9 నీవు ప్రభువును నీ కాశ్రయముగాను
మహోన్నతుని నీకు సదనముగాను జేసికొంటివి

10 నీ కెట్టి కీడును సంభవింపదు
నీ యింటి చెంత కెట్టి యంటురోగమును రాదు

11 ప్రభువు నిన్ను తన దూతల యధీనమున నుంచును
నీ వెచటికి వెళ్ళినను వారు నిన్ను కాపాడుచుందురు

12 నీ కాళ్ళు రాతికి తగిలి నొవ్వకుండునట్లు
వారు నిన్ను తమ చేతులతో ఎత్తి పట్టుకొందురు

13 నీవు సింహమును నాగుబామును కాలితో మట్టెదవు
కొదమ సింగమును కాలసర్పమును పాదములతో త్రొక్కెదవు

14 "నన్ను ప్రేమించువారిని నేను రక్షించెదను
నా ప్రాభవము నంగీకరించువారిని నేను కాపాడెదను

15 వారు నాకు మొరపెట్టినపుడు నేను వారికి ప్రత్యుత్తర మిత్తును
వారి యాపదలలో వారి నాదుకొందును
వారిని విపత్తులనుండి కాపాడి వారికి కీర్తిని దయచేయుదును

16 వారిని దీర్ఘాయువుతో సంతృప్తి పరచెదను
వారికి నా రక్షణము ననుగ్రహించెదను"
అని ప్రభువు పల్కుచున్నాడు.

## 1. పరిచయం

ఇది జ్ఞాన కీర్తనల వర్గానికి చెందింది. దేవుడు నీతిమంతులను అన్ని యాపదలనుండి కాపాడతాడు. కనుక సజ్జనుడు భగవంతుణ్ణి నమ్మి జీవించాలి. ఈ కీర్తనలో చాల పదచిత్రాలు తగులుతాయి. ఈ గీతం ఉరులు, అంటురోగం, చీకట్లు, రాళ్లు, పాములు, సింహాలు మొదలైన సకలాపదల నుండీ ప్రభువు భక్తులను కాపాడతాడని చెప్తుంది. మనం అపాయాల్లో కష్టాల్లో బాధల్లో చీకట్లలో ఉన్నప్పుడు ఈ గీతాన్ని వాడుకోవచ్చు. ఏవేవో భయాలతో బాధపడేవాళ్ళకు ఇది బలం మందులా ఉపయోగపడుతుంది. గొప్ప ఉత్సాహాన్ని కలిగిస్తుంది. ఈ గీతం మన నమ్మకాన్ని పెంచుతుంది.

## 2. విభజనం

1-13 దేవుణ్ణి నమ్మినవాళ్ళను దేవుడే కాపాడతాడు.
1-3 మరణం నుండి
4-6 అంటురోగాల నుండి

7-8 యుద్ధంనుండి

9-13 విశ్వాసం గలవాళ్ళు ఆపదలనుండి తప్పించుకొంటారు.

14-16 దేవుణ్ణి నమ్మినవాళ్ళను ఆ దేవుడే కాపాడతాడనే దైవోక్తి.

## 3. వివరణం

1-2. యిస్రాయేలు యాత్రికులు రాత్రి దేవళంలో వసించేవాళ్లు. వేకువనే లేచి ప్రభువును ఆరాధించుకొనేవాళ్లు దేవుడే భక్తులను రక్షిస్తాడు. ప్రభువు తన భక్తులను కాపాడతాడనేది ఈ కీర్తనలోని ముఖ్యాంశం. ఈ యంశాన్ని ఈ మొదటి చరణంలోనే చెప్పాడు.

భక్తుడు దేవాలయంలో దేవుని రెక్కల నీడలో వసిస్తాడు. దేవళంలోని మందసం మీద దేవదూతల బొమ్మలకు రెక్కలుండేవి. యిస్రాయేలు ప్రజలు ఆ రెక్కలను జూచి తమ దేవుడు తల్లిపక్షిలాంటివాడని యెంచారు. దేవాలయంలో ఈలాంటి దేవుని మరుగున వసించేవాళ్లు అతనితో ప్రభూ! నీవు నాకాశ్రయానివని చెప్పుకొంటారు. అనగా అతన్ని పూర్తిగా నమ్ముతారని భావం.

3. వేటకాడు ఉరులు పన్ని మృగాలను పట్టుకొంటాడు. ఆలాగే శత్రువులు భక్తునిమీద దాడి చేయవచ్చు. ఆలాగే ఘోరవ్యాధులుకూడ వచ్చిపడి అతని ప్రాణాలు తీయవచ్చు. ఈ మరణ భయాలనుండి ప్రభువు తన దాసుణ్ణి రక్షిస్తాడు.

4. మందసంమీది దేవదూతల బొమ్మలకు రెక్కలుండేవి అని చెప్పాం. ఆ రెక్కలను చూచి యిస్రాయేలు ప్రజలు తమ దేవుడు ఓ తల్లి పక్షిలాంటివాడనీ, తాము ఆ పక్షి పిల్లలమని ఊహించుకొన్నారని చెప్పాం. దేవుడు నమ్మదగినవాడు. ఆ నమ్మదగినతనం నరుణ్ణి ఓ డాలులాగ, రక్షణాయుధం లాగ కాపాడుతుంది. డాలు ఆత్మరక్షణకోసం యుద్ధంలో వాడుకొనే పళ్ళెంలాంటి ఆయుధం.

5. రాత్రిలో పిశాచాలు తిరుగుతూ నరులకు హాని చేస్తాయి. ఇవే "రేయి కలిగే అపాయాలు". పిశాచం మధ్యాహ్నపు ఎండ వేడిమిద్వారా నరులకు హాని చేయవచ్చు. ఇవే "పగటిపూట" తగిలే బాణాలు.

6. చీకటిలో సోకే అంటురోగాలు అంటే పిశాచం రాత్రిలో తిరుగుతూ కలిగించే వ్యాధులు. ఐగుప్తీయులు రాత్రిలో చచ్చారు - నిర్గ 11,4. అస్సిరియను సైన్యంకూడ రాత్రిలోనే చచ్చింది - యెష 37, 36. మట్ట మధ్యాహ్నపు మారి అంటే మధ్యాహ్నం తిరిగే పిశాచం. 5-6 చరణాలు పిశాచం తెచ్చిపెట్టే వ్యాధిబాధలనూ చేతబళ్లూ మొదలైన వాటినీ పేర్కొంటాయి. పూర్వులు అన్ని రోగాలకూ పిశాచాలే కర్తలని నమ్మారు. దుష్టులైన నరులుకూడ ఈ 5-6 చరణాల్లో పేర్కొన్న కార్యాలను చేయవచ్చు.

7. యుద్ధరంగంలో నీ చుట్టూ వందలూ వేలూ సైనికులు కూలవచ్చు. నీకు మాత్రం ఏ ప్రమాదమూ కలుగదు. ఈ చరణం చెప్పిన కీర్తనకారునికి దేవునిపట్ల కొండంత విశ్వాసం వుండి వుండాలి.

8. నీతిమంతులు యుద్ధంలో దుష్టులు చావడాన్ని చూస్తారు. కాని ఆ నీతిమంతులకు ఏ యపాయమూ కలగదు.

9. ఈ చరణంలో ఆశ్రయం, సదనం అంటే యిల్లు. అనగా భక్తునికి దేవుడు ఇల్లులాంటివాడౌతాడు. అతడు ప్రభువులో వసిస్తాడు. ఆ ప్రభువు అతన్ని కాపాడతాడు.

10. ప్రభువు తన దాసుణ్ణీ అతని కుటుంబాన్నీ కూడ కాచి కాపాడతాడు. అతడు కాని అతని బంధువులు కాని అంటురోగాల వాతబడరు.

11-12 ఈ చరణాల్లో ప్రభువు పంపే దేవదూతలు భక్తులను కాపాడతారని చెప్తున్నాడు. పాలస్తీనా దేశంలోని రహదారులు రాళ్ళతో నిండివుంటాయి. కనుక దేవదూతలు భక్తుడు తన ప్రయాణంలో రాళ్ళకు తట్టుకొని పడిపోకుండా కాపాడతారు. ఇక్కడ రాతికి తట్టుకొని పడిపోవడమంటే ప్రమాదానికి గురికావడమని అర్థం. కనుక సన్మనస్కులు భక్తులను అపాయాలనుండి రక్షిస్తారని భావం. ఇంకా, యూదుల భావాల ప్రకారం ప్రయాణమంటే జీవిత యాత్రకూడ. కనుక ఈ జీవితయాత్రలో దేవదూతలు భక్తుని సకలాపదలనుండీ కాపాడతారని ఫలితార్థం.

దేవదూతలు భక్తుణ్ణి తమ చేతుల్లో ఎత్తిపట్టుకొంటారు. అనగా తల్లి తన బిడ్డను సురక్షితంగా చేతుల్లో మోసికొనిపోయినట్లుగా మోసికొని పోతారని భావం.

13. ఈ చరణంలో సింహం, కొదమ సింగం ఒకటే ప్రాణి. హీబ్రూ కవిత్వంలో ఒకే భావాన్ని రెండుసార్లు చెప్పడం పరిపాటి. ఈ సింహం అపాయానికి చిహ్నం. అనగా అపాయాల్లో దేవుడు భక్తుణ్ణి రక్షిస్తాడు. అలాగే నాగుబాము, కాలసర్పం ఒకటే ప్రాణి. ఈ సర్పం ప్రమాదానికి చిహ్నం. అనగా ప్రమాదాల్లో దేవుడు తన దాసుణ్ణి కాపాడతాడని భావం. కాలసర్పాన్ని చంపి దాని తలమీద కాలు మోపినట్లుగా ఉన్న దేవునిబొమ్మగల తాయెతులను ఐగుప్తీయులు ధరించేవాళ్ళు. మొత్తంమీద, ఘోరప్రమాదాల్లో కూడ దేవుడు తన సేవకుణ్ణి ఆదుకొంటాడని ఈ చరణం భావం.

14-16. దేవుని తరపున దేవళంలోని యాజకుడో లేక ప్రవక్తో భక్తులకు దైవోక్తిని చెప్తున్నాడు. దైవోక్తి అంటే దేవుడు ప్రజలతో చెప్పే ప్రవచనం.

దేవుణ్ణి ప్రేమించేవాళ్ళనీ, అతన్ని ప్రభువునిగా అంగీకరించి పూజించేవాళ్ళనీ, ఆ దేవుడు కాపాడతాడు.

దేవుడు తన భక్తుల మొర వింటాడు. ఆపదల్లో, విపత్తుల్లో వాళ్ళని కాపాడతాడు. భక్తుల దేవుని రక్షణను పొంది కీర్తని గడిస్తారు.

ప్రభువు తన దాసులకు దీర్ఘాయువు దయచేస్తాడు. వాళ్ళు పండు ముసలితనందాకా జీవిస్తారు. దేవాలయారాధనలో ప్రభువు భక్తులకు తన అనుగ్రహాన్ని దయ చేస్తాడు. ఈలా సజ్జనులు దేవునినుండి భౌతికమైన దీవెనలూ, ఆధ్యాత్మిక దీవెనలూ కూడ పొందుతారు. 14-16 చరణాల్లో మొత్తం మీద ఏడు దీవెనలు చెప్పాడు.

## 4. ప్రార్థనా భావాలు

1. భక్తుడు దేవుణ్ణి నమ్మాలి అనేదీ, అలా నమ్మినవాణ్ణి దేవుడు తప్పకుండా కాపాడతాడు అనేదీ, ఈ కీర్తనలోని ముఖ్యాంశం. దేవుణ్ణి ప్రేమించేవాళ్ళకు అన్నీ మంచికే సమకూరుతాయి - రోమా 8, 28. దేవుడు తన దాసులను గూర్చి శ్రద్ధ వహిస్తాడు. కనుక మనం మన చింతలన్నీ అతనిపై మోపవచ్చు - 1 పేత్రు 5,7.

2. దేవుడు మన పాలబడే ఆపదలనూ శోధనలనూ తొలగింపడు. వాటిల్లో తాను మనకు అండగా ఉంటాడు. మనకు బలాన్ని దయచేస్తాడు. ప్రభువు మన శక్తికిమించి మనలను శోధింపడు. అతడు మన శోధనల్లో మనకు కావలసిన శక్తిని దయచేస్తాడు. ఆ శోధనలనుండి బయటపడే మార్గాన్ని కూడ మనకు చూపిస్తాడు - 1కొ 10, 13. పౌలు నేను ఎప్పుడు బలహీనుణ్ణో అప్పుడే బలవంతుణ్ణి అని చెప్పుకొన్నాడు. అనగా మన బలహీనతల్లో దేవుని వరప్రసాదం మనమీద ఎక్కువగా పనిచేస్తుంది - 2కొ 12, 9-10

3. పిశాచం మనలను శోధిస్తుంది. మన శత్రువైన పిశాచం గర్జించే సింహంలాగ తిరుగుతూ ఎవరిని కబళిద్దామా అని చూస్తూంటుంది - 1 పేత్రు 5,8. కాని దేవదూతలు నిరంతరమూ మనలను కాపాడుతుంటారు. ప్రభువుకి భయపడే వాళ్ళచుట్టూ అతని దూత శిబిరం పన్ని వాళ్ళని సకలాపదల నుండీ కాపాడుతుంటాడు - కీర్త 34,7. త్రోవలో మిమ్ము కాపాడ్డానికి, నేను సిద్ధంచేసిన చోటికి మిమ్ము చేర్చడానికీ నా దూతను మీకు ముందుగా పంపుతున్నాను - నిర్గ 23, 20-22. ఈ దేవదూతలపట్ల మనకు గాఢమైన భక్తి ఉండాలి. వాళ్ళ సేవలను మనం వినియోగించుకోవాలి.

4. ఈ కీర్తనలోని 11-12 చరణాలను పిశాచం ఎడారిలో తపస్సు చేసికొనే క్రీస్తుకి విన్పించింది. దేవుణ్ణి పరీక్షకు గురిచేయమని క్రీస్తుని కోరింది - లూకా 4, 10-11. దేవుడు ఆపదల్లో మనలను తప్పక కాపాడతాడు. కాని మన తరుపున మనం అతన్ని పరీక్షకు గురిచేయకూడదు.

5. ఈ కీర్తనలోని 16వ చరణం పేర్కొనేరక్షణం క్రీస్తే. యేసు అనే పేరుకి రక్షకుడని అర్థం. తండ్రి యేసు క్రీస్తు ద్వారా నేడు మనలను నిరంతరం రక్షిస్తూంటాడు.

6. ప్రభువు తన రెక్కలతో భక్తుణ్ణి కప్పుతాడు (4). ఇది తల్లిపక్షిని గూర్చిన పదచిత్రం. తల్లిపక్షి రెక్కలువిప్పి తన పిల్లలను శత్రుపక్షులనుండి కాపాడుకొంటుంది. అలాగే భగవంతుడు తన భక్తులను కాపాడతాడు. నూత్నవేదంలో క్రీస్తుకూడ ఈ ఉపమానాన్ని వాడాడు. "యెరూషలేమూ! కోడి రెక్కలనుచాచి తన పిల్లలను కాపాడినట్లే నేనూ నీ బిడ్డలను కాపాడగోరానుగాని నీవు అంగీకరింపలేదు - మత్త 23,37. ఈలాంటి దేవుణ్ణి మనం తప్పక నమ్మాలికదా!

7. ఈ కీర్తనలోని 14-16 చరణాలను ప్రభువు ఈనాడు వ్యక్తిగతంగా నీతో చెప్తున్నాడనుకో. ఆ ప్రభువును పూర్ణహృదయంతో విశ్వసించి అతనికి ఆత్మార్పణం చేసికో.

# కీర్తన - 8

# దేవుని మహిమ, నరుని ఘనత

1-2 మా దేవుడవైన ప్రభూ!
నీ మహత్త్వము భూమియందంతట చూపట్టుచున్నది
చంటిబిడ్డలు పసికందులు నిన్ను స్తుతింతురు
నీ మాహాత్మ్యము ఆకాశము వరకును కీర్తింపబడుచున్నది
విరోధుల నెదిరించుటకు నీవొక దుర్గమును నిర్మించితివి
దాని నుండి నీవు నీ శత్రువులను,
నీ మీద తిరుగుబాటు చేయువారిని, అణచివేయుదువు

3 నీవు కలిగించిన ఆకాశమును
నీవు సృజించిన చంద్రతారకలను గాంచి
నేను విస్మయమొందితిని

4 నీవు నరుని జ్ఞప్తికి తెచ్చుకొనుట కత డేపాటివాడు?
అల్పమానవుని పరామర్శించుట కత డెంతటివాడు?

5 ఐనను నీవు నరుని
నీ కంటెను కొంచెము తక్కువవానినిగా మాత్రమే చేసితివి
కీర్తిమహిమలను కిరీటముతో నతని నలంకరించితివి

6–7 గొఱ్ఱెలు ఎడ్లు వన్యమృగములు
ఆకాశమునందలి పక్షులు సముద్రమునందలి చేపలు
సాగరమునందలి జలజంతువులు మొదలుకొని
నీవు చేసిన సృష్టికంతటికిని అతనిని అధిపతిని గావించితివి
సమస్తము అతని పాదములక్రింద నుంచితివి

8 మా దేవుడవైన ప్రభూ!
నీ మహత్త్వము భూమియందంతట చూపట్టుచున్నది.

# 1. పరిచయం

ఇది స్తుతికీర్తనల వర్గానికి చెందింది. ఈ వర్గం కీర్తనలు భగవంతుణ్ణి స్తుతించి కీర్తిస్తాయి. ఈ గేయం విశేషంగా దేవుని సృష్టిమహిమనూ, నరుని ఘనతనూ ప్రశంసిస్తుంది. దేవుడు నరుణ్ణి సృష్టికంతటికీ రాజునీ, నేలమీద తన ప్రతినిధినీ చేసాడని చెప్తుంది. ఈ కీర్తనంద్వారా మన గొప్పతనాన్ని మనమే గుర్తించవచ్చు. రేయి ఆకాశంవైపుజూచి పులకించిపోయిన కీర్తనకారుల్లాగ, మనంకూడ ప్రకృతిని ధ్యానించుకోవడం నేర్చుకోవచ్చు.

# 2. విభజనం

1–2 సృష్టికర్తయైన దేవుడు
3–8 నరుని ఘనత
9 ప్రారంభవాక్యాలు పునశ్చరణం

# 3. వివరణం

1–2. ఈ తొలి రెండుచరణాల్లో కీర్తనకారుడు ప్రభువు సృజనశక్తిని కొనియాడుతూన్నాడు. ఇక్కడ ప్రభువు మహత్త్వమంటే అతనిసృజనశక్తి. అతని సృజనశక్తి భూమి యందంతటా, అనగా లోకమందంతటా గోచరిస్తుంది. లోకంలో ప్రతి వస్తువూ భగవంతుడు చేసిందేగదా! "నీ మాహాత్మ్యం ఆకాశం వరకూ కీర్తింపబడుతుంది" అంటే సూర్యచంద్ర నక్షత్రాదులు ఆకాశంలో దేవుణ్ణి స్తుతిస్తాయని భావం.

ఇక్కడ, రెండవచరణం హీబ్రూ మూలంలో భ్రష్టమైపోయింది. కనుక దాని యర్థమేమిటో ఎవరికీ రూఢిగా తెలియదు. అనువాదకులు దాన్ని భిన్నభిన్నంగా అనువదిస్తూంటారు. మనం దాన్ని వదలివేయడం మేలు.

3. ఈ చరణంలో కీర్తనకారుడు సూర్యుణ్ణి పేర్కొనలేదు. చంద్రతారకలను మాత్రమే ప్రస్తావించాడు. కనుక అతడు రేయి ఆకాశంవైపు చూచాడు అనుకోవాలి. ఆకాశంలో తళతళా మెరిసే చందమామా చుక్కలూ అతని దృష్టి నాకర్షించాయి. అవి చాల పెద్దవి. వాటివైపు చూస్తుంటే ఆహ్లాదంగా ఉంటుంది. వాటితో పోలిస్తే నరుడేపాటివాడు? ఓ కొండయెదుటో, సముద్రం ఎదుటో, మహారణ్యం ఎదుటో నిలబడితే నరుడు చిన్న చీమలా కన్పిస్తాడుకదా!

4. మహాగోళాలైన చంద్రుణ్ణీ, నక్షత్రాలనూ చేసిన దేవుడు, నలుసువంటివాడైన నరుణ్ణి జ్ఞప్తికితెచ్చుకొంటాడు. ఆ నరుడు అల్పుడు. అనగా అతడు దేవుళ్ళాగ అమరుడు కాదు. మృత్యువు వాతబడే దుర్బల ప్రాణి. అలాంటి నరుణ్ణి దేవుడు పట్టించుకొంటాడు అంటే అతనిలో యేదో విలువ ఉండి ఉండాలి.

5. నరుడు స్వయంగా అల్పుడైకూడ, దేవుని తర్వాత దేవుడంతటివాడు. దేవుడు అతన్ని తనకు పోలికగా, తనలాంటి వాణ్ణిగా చేసాడు - ఆది 1,27. కనుక అతడు సృష్టిలోని ప్రాణులన్నిటికంటె గొప్పవాడు. దేవుడతనికి కీర్తిమహిమలను దయచేసాడు. ఇవి రెండూ దేవుని రాజలక్షణాలు. కనుక అతడు తన రాజలక్షణాలను నరుని కిచ్చాడు అనుకోవాలి. అతడు స్వర్గంలో రాజైతే, నరుడు భూమిమీద రాజు. ఈ నేలమీద అతడు దేవుని ప్రతినిధి, అది అతని గొప్పతనం.

6-7. భూమిమీద, ఆకాశంలో, సముద్రంలోవసించే ప్రాణులన్నిటికీ నరుడు అధిపతి. దేవుడు ప్రాణికోటినంతటినీ నరుని పాదాలక్రింద ఉంచాడు. అనగా వాటికన్నిటికీ అతన్ని అధిపతిని చేసాడు. ఏనుగులు, తిమింగిలాలు మొదలైనవి నరునికంటె పెద్ద ప్రాణులే కావచ్చు. ఐనా అవి మానవునికి లొంగి ఉండక తప్పదు. ఈ విధంగా అతడు సృష్టినంతటినీ ఏలుతాడు. దాని కంతటికీ రాజు.

# 4. ప్రార్థనా భావాలు

1. ఈ కీర్తన నరుని గొప్పతనాన్ని వర్ణిస్తుంది. గ్రీకు తాత్వికులు నరుని కొరకే నరుణ్ణి మెచ్చుకొన్నారు. "భూమిమీద వింతలు చాలా ఉన్నాయి. కాని నరుణ్ణి మించిన వింత లేనేలేదు" అన్నాడు గ్రీకు నాటకకర్త సోఫోక్లీస్. కాని హీబ్రూ ప్రజల దృష్టిలో నరుని ఘనత దేవుణ్ణి బట్టి వచ్చింది. నరుడేమో గొప్పవాడే, సందేహంలేదు. కాని అతని ఘనతకు కారణం అతడుకాదు, దేవుడు. మానవుడు తనంతట తాను

భూమిని ఏలదు, దేవుని ఆజ్ఞవలన ఏలుతాడు. అతడు కేవలం దేవుడు చేసిన ప్రాణి.

2. నరుళ్ళోని గొప్పతనం అతనిలోవున్న దేవుని పోలికను బట్టి వచ్చింది- ఆది 1,27. కాని నరుళ్లో దేవుని పోలిక ఉంది అంటే యేమిటి? అతనిలో ఆత్మవుంది. విజ్ఞానంవుంది. ఆలోచన వుంది. ఈ గుణాలవల్ల అతడు జంతువులకంటె గొప్పవాడయ్యాడు. వాటికి అధిపతి అయ్యాడు. అంతేకాదు, భగవంతుడు అతనికి ఆధ్యాత్మిక జీవనాన్ని గూడ యిచ్చాడు. అతన్ని తన కుమారుణ్ణి చేసికొన్నాడు. ఇది దేవుని పోలికవల్ల నరునికి సిద్ధించిన ఘనత.

3. నరుళ్ళో దేవుని పోలికవున్నా దేవునికి పరిపూర్ణమైన ప్రతిబింబం నరుడుకాదు, క్రీస్తు. ఆ క్రీస్తు అదృశ్యుడైన దేవునికి ప్రతిబింబం - కొలొ 1,15. మనం అతని రూపాన్ని పొందాలి. అతని పోలిక కలిగిన నరులంగా తయారుకావాలి. క్రీస్తు అడుగుజాడల్లో నడవడం ద్వారా ఈ కార్యాన్ని సాధిస్తాం.

4. ఈ లోకంలో నరజన్మ చాల వుత్కృష్టమైంది. ఉనికిలో ఉన్న వస్తువులు మెట్లుమెట్లుగా ఉంటాయి. మొదటి మెట్టులో జడపదార్థాలైన రాయిరప్పలున్నాయి. వీటికంటె పై మెట్టులో ప్రాణం కలిగిన చెట్టుచేమలున్నాయి. వీటికంటె పై మెట్టులో ప్రాణంతోపాటు, సుఖదుఃఖాది అనుభూతులు కూడ కలిగిన జంతువులున్నాయి. వీటికంటె పై మెట్టులో విజ్ఞానం కలిగిన నరుడున్నాడు. శరీరధారుల్లో నరునికి మించిన ప్రాణిలేదు. ఈలా భగవంతుడు మనలను ఈ లోకంలో అత్యంత శ్రేష్ఠమైన ప్రాణులనుగా సృజించాడు. ఇంత వుత్కృష్ట వర్గంలో చేర్చినందులకు, మనం భగవంతునికి కృతజ్ఞులమై యుండాలి. నరులంగా మనం నిస్సందేహంగా గొప్పవాళ్ళం. కాని మన గొప్పతానికి కారణం. ఆ భగవంతుడు. కనుక మనకు వినయం ఒక్కటి తగుతుంది.

5. కీర్తనకారుడు రాత్రి ఆకాశం వైపుజూచి అక్కడ మిలమిలా మెరసే చంద్రతారకలనుగాంచి తన్మయుడయ్యాడు. అతనిలాగే మనంకూడ దేవుడుచేసిన సృష్టిని పరిశీలించి చూస్తుండాలి. ఈ యనంత విశ్వంలో మనకు ఎన్నో అందాలూ సొగసులూ గోచరిస్తాయి. అద్దంలో ప్రతిబింబంలాగ ఈ సృష్టిలో దేవుడు కన్పిస్తాడు. ప్రకృతిలో భగవంతుణ్ణి ధ్యానించుకోవడమంటే యిదే - రోమా 1,20.

# కీర్తన -22

## పుణ్యపురుషుని శ్రమలు, అతని నమ్మకము

1 నా దేవా! నా దేవా! నన్నేల చేయి విడచితివి?
నేను నీకు మొరపెట్టితినిగాని నీవు నన్నింకను ఆదుకోవైతివి

2 ప్రభూ! నేను పగలెల్ల మొరపెట్టినను నీవాలింపవు
రేయెల్ల నీకు మనవిచేసినను ఉపశాంతి లేదు

3 నీవు పరమపవిత్రుడవు
యిస్రాయేలీయుల స్తుతులను సింహాసనము మీద
ఆసీనుడవై యుండువాడవు

4 మా పితరులు నిన్ను నమ్మిరి
నిన్ను నమ్మగా నీవు వారిని రక్షించితివి

5 వారు నిన్ను శరణువేడి ఆపదనుండి తప్పించుకొనిరి
నిన్ను నమ్మి నిరాశ చెందరైరి

6 నామట్టుకు నేనిపుడు పురుగునుగాని నరుడనుగాను
ఎల్లరును నన్ను చిన్నచూపు చూచి ఎగతాళి చేయుచున్నారు

7 నా వైపు చూచినవారెల్ల నన్ను గేలిచేయుచున్నారు
నాలుక వెళ్ళబెట్టి తల యూపుచున్నారు

8 ఇతడు ప్రభుని నమ్మెను
అతడితనిని రక్షించునేమో చూతము,
ఇతడు ప్రభువున కిష్టుడైనచో
అత డితనిని కాపాడునేమో చూతము అని యనుచున్నారు

9 తల్లి కడుపునుండి నన్ను సురక్షితముగా
బయటికి కొనివచ్చినది నీవే
నేను మాతృస్తన్యము గ్రోలి భద్రముగా మనునట్లు చేసినది నీవే

10 మాతృగర్భము నుండి వెలువడినప్పటి నుండియు
నేను నీ మీదనే ఆధారపడితిని
నేను జన్మించినప్పటినుండియు నీవే నాకు దేవుడవు
11 నే నాపదలో నున్నాను, నీవు నాకు దవ్వుగా నుండవలదు
నీవు తప్ప నన్నాదుకొనువా డెవ్వడును లేడు

12 వృషభము లనేకములు నన్ను చుట్టుముట్టినవి
భాషాను మండల బలిష్ఠ వృషభములు నాచుట్టు క్రమ్ముకొనినవి

13 అవి సింహములవలె నోళ్ళు తెరచి రంకెలు వేయుచు
నన్ను పీకుకొని తినబోవుచున్నవి

14 నా బలము నేలమీద చల్లిన నీటివలె ఇంకిపోయినది
నా యెముకలన్నియు పట్టుదప్పినవి
నా గుండె నా లోనే మైనమువలె కరిగిపోయినది

15 నా గొంతు పెంకువలె నెండిపోయినది
నా నాలుక అంగిటి కంటుకొనుచున్నది
నీవు నేను చచ్చి దుమ్ములో పడియుండునట్లు చేసితివి

16 శునకములు నన్ను చుట్టుముట్టినవి
దుష్టబృందము నా చుట్టు క్రమ్ముకొనినది
వారు నా కాలుసేతులను చీల్చుచున్నారు

17 నా యెముకలన్నిటిని లెక్కపెట్టవచ్చును
శత్రువులు సంతసముతో నా వైపు చూచుచున్నారు

18 వారు నా బట్టలను తమలో తాము పంచుకొనుచున్నారు
నా దుస్తుల కొరకు చీట్లు వేసికొనుచున్నారు

19 ప్రభూ! నీవు నాకు దవ్వుగా నుండవలదు
నా బలమైన నీవు నన్నాదుకొనుటకు శీఘ్రమే రమ్ము

20 ఖడ్గమునుండి నన్ను కాపాడుము
శునకములనుండి నా ప్రాణములను రక్షింపుము

21 సింగము నోటినుండి నన్ను తప్పింపుము
అడవియెద్దు కొమ్ములనుండి నన్ను కావుము

22 నేను మా ప్రజలకు నీ మహిమను వెల్లడింతును
భక్తసమాజమున నిన్ను కీర్తింతును

23 ప్రభువు భక్తులారా! మీ రతనిని స్తుతింపుడు
యాకోబు వంశజులారా! మీ రతనిని మహిమపరపుడు
యిస్రాయేలు ప్రజలారా! మీ రతనిని భజింపుడు

24 అతడు దీనులను చిన్నచూపు చూడడు
వారి శ్రమల ననాదరము చేయడు
వారి నుండి తన మొగమును దాచుకొనడు
వారు తనకు మొరపెట్టినపుడు వారి వేడికోలు నాలించును

25 మహాభక్త సమాజమున నేను నిన్ను కీర్తింతును
నీ భక్తబృందము నెదుట నా మ్రొక్కుబడులు చెల్లింతును

26 పేదలు తనివిదీర భుజింతురు
ప్రభువు నభిలషించువారు అతనిని స్తుతింతురు
ఆ జను లెల్లవేళల శుభములు బడయుదురుగాక

27 లోకములోని జాతులెల్ల ప్రభువును జ్ఞప్తికి దెచ్చుకొని
అతని యొద్దకు మరలివచ్చును
సకల జాతులును అతనిని పూజించును

28 ప్రభువు రాజ్యము చేయును
జాతులనెల్ల పరిపాలించును

29 గర్వాత్ము లెల్లరు అతనికి దండము పెట్టుదురు
మృత్యువు వాతబడు నరమాత్రులెల్లరు అతనికి తలయొగ్గుదురు

30 భావితరములవారు అతనిని సేవింతురు
ప్రజలు రాబోవు తరములవారికి ప్రభుని గూర్చి చెప్పుదురు

31 ఇక పుట్టుబోవు జనులకును
ప్రభువు తన ప్రజకు దయచేసిన రక్షణమునుగూర్చి వివరింతురు.

# 1. పరిచయం

ఇది విలాప కీర్తనల వర్గానికి చెందింది. బైబుల్లోని గొప్ప విలాప కీర్తనల్లో ఇదికూడ ఒకటి. ఈ గీతంలో కీర్తనకారుడు తన బాధలను వర్ణించాడు. అతడు తన శారీరక శ్రమలను మానసిక శ్రమలను శత్రుపీడనాన్ని గూర్చి చెప్పుకొన్నాడు. నూత్నవేదం ఈ కీర్తనకారుని బాధలను క్రీస్తు బాధలకు అన్వయింపజేస్తుంది. కనుక ఇది మెస్సియాను సూచించే కీర్తన.

ఈ గీతం చెప్పిన భక్తుడు రాజైవుండవచ్చు. ఈ గేయంలో అతడు తన్నూ తన ప్రజలనూ కలుపుకొని మాట్లాడాడు. రాజు పౌరులతో గూడిన యిస్రాయేలుప్రజ అంతా ఘోరశ్రమల ననుభవించి పవిత్రమైంది. ఈ ప్రజ అనుభవించిన శ్రమల ఫలితంగా అన్యజాతి జనులు పరివర్తనం చెందుతారు. వాళ్లుకూడ దేవళానికివచ్చి ప్రభుని ఆరాధిస్తారు. ఈ యిస్రాయేలు ప్రజ యెషయా పేర్కొన్న బాధామయ సేవకుణ్ణీ, క్రీస్తునీ సూచిస్తుంది.

ఈ పాట నేటి మన శ్రమలకుకూడ చిహ్నంగా ఉంటుంది. మెస్సియాలాగే అతని శిష్యులు కూడ తమ సిలువను చేకొని బాధామయమార్గంలో నడవాలి.

# 2. విభజనం

ఈ గేయంలో రెండు భాగాలున్నాయి. 1-21 చరణాలు విలాపగీతం. ఇది మొదటిభాగం. దీనిలో భక్తుడు తన శ్రమను చెప్పుకొన్నాడు. రెండవభాగం - 22-31 చరణాలు. ఇది కృతజ్ఞతా వందనం. ప్రభువు తన మొర నాలించి తన బాధలను తొలగించినందులకు భక్తుడు ఈ రెండవ భాగంలో దేవునికి వందనాలర్పించాడు. ఈ రెండిటినీ అతడు మొదట వేరువేరు భాగాలుగా రచించి ఉండవచ్చు. తర్వాత అవి ఏకకీర్తనంగా కలిసిపోయి ఉండవచ్చు.

# 3. వివరణం

## మొదటి భాగం

1-2. కీర్తనకారుని బాధలు రెండు. ప్రభువు తన్నుచేయి విడచాడు. అతడు తన మొర వినడంలేదు. ఈ చరణాల్లోని మొదటి వాక్యాన్ని ప్రభువు సిలువమీద ప్రార్థించాడు.

3-5. దేవుడు దేవళంలో మందసం మీద ఆసీనుడై యుంటాడు. ఆలాగే అతడు దేవళంలో భక్తుల స్తుతులమీద గూడ ఆసీనుడై యుంటాడు. అతడు పరమపవిత్రుడు. పాపపు నరులు అతన్ని సమీపించలేరు.

పూర్వం ఈ కీర్తనకారుని పితరులు ఈ దేవుణ్ణి నమ్మి రక్షణం పొందారు. కాని అతడు ఇప్పుడు కీర్తనకారుణ్ణి పట్టించుకోవడంలేదు. అతని మొర వినడంలేదు.

6-8. ఈ భక్తుడు తన బాధల్లో కాసేపు తన్నుతాను తలంచుకొంటాడు. కాసేపు దేవుణ్ణి తలంచుకొంటాడు. కాసేపు తన్ను బాధించే శత్రువులను తలంచుకొంటాడు. ఈ మూడు రకాల తలంపులూ ఈ గేయంలో కలగలుపులుగా కన్పిస్తాయి. 3వ చరణంలో అతడు దేవుణ్ణి తలంచుకొని ఆ ప్రభువు పవిత్రుడని వాకొన్నాడు. 6వ చరణంలో దిగులుతో తన్నుతాను తలంచుకొంటున్నాడు. తాను పురుగులాంటివాడిననీ, అందరూ తన్ను కాలిక్రింద బడవేసి తొక్కుతున్నారనీ భావించి బాధపడుతున్నాడు. ఎల్లరూ తన్ను వేళాకోళం జేస్తున్నారనుకొని మనసు నొచ్చుకుంటున్నాడు.

8వ చరణం భావం యిది. కీర్తనకారుని శత్రువులు దేవుడతన్ని విడనాడాడు అని అంటున్నారు. ఇది అతనికి భరింపరాని బాధ అయింది. దుష్టులు నీతిమంతుని అపహాసం చేసే తీరును సొలోమోను జ్ఞానగ్రంథం 2, 18-20 ఈలా వర్ణిస్తుంది.

"నీతిమంతుడు దేవుని కుమారుడేని
దేవుడతని కోపు తీసికొనును
శత్రువుల బారినుండి యతనిని కాపాడును
కనుక అతనిని క్రూరముగా హింసించి
పరీక్షకు గురిచేయుదము
అతని శాంతభావ మేపాటిదో,
సహనభావ మెంత గొప్పదో, పరీక్షించిచూతము
అతనిని నీచమైన చావునకు గురిచేయుదము
దేవుడే తన్ను రక్షించునని
యతడు చెప్పుకొనుచున్నాడుకదా"!

ఈ భావాలనే యిక్కడ ఈ రచయిత గూడ పేర్కొన్నాడు.

9-11 రచయిత యిక్కడ మళ్ళా దేవుణ్ణి స్మరించుకొంటున్నాడు. దేవుని కృపవల్ల అతడు సురక్షితంగా పుట్టాడు. తానుచంటిబిడ్డడుగా ఉన్నపుడుకూడ దేవుడతన్ని కాపాడాడు. అతడు చిన్ననాటినుండి గూడ ఆ దేవుణ్ణి తప్ప మరొక వేల్పుని కొలవలేదు. ఇప్పుడు తా నాపదలో ఉంటే దేవుడతన్ని ఆదుకోడేం?

ఇక్కడ రచయిత చెప్పిన 11వ చరణం చాల భక్తిమంతమైన వాక్యం. అది ఆ భక్తుని హృదయాంతరాళం నుండి వెలువడింది. మన గుండెల్లోకి గూడ దూసుకొని పోతుంది.

12-13. రచయిత మళ్లా శత్రువులను తలంచుకొంటున్నాడు. అతని శత్రువులు బలమైన పోట్లగిత్తల్లాంటివాళ్ళు. క్రూరసింహాల్లాంటివాళ్ళు. తాను వాళ్ళను జూచి భయపడుతున్నాడు. ఇది అతియోక్తి వర్ణనంతో గూడిన కవిభాష. ఐనా ఈ భక్తుడు శత్రుపీడనానికి జంకుతున్నాడని మాత్రం మనం అంగీకరించాలి.

14-15. మళ్ళా తన్నుగూర్చి తాను తలంచుకొని తనమీద తాను జాలిజెందుతున్నాడు. తన బాధలను చెప్పుకొంటున్నాడు. అతని బలం నేలమీద చల్లిన నీళ్ళలాగ యింకిపోయింది. అనగా అతడు మిక్కిలి దుర్బలుడయ్యాడు. అతని యెముకలు పట్టుదప్పాయి. గుండె అవిసిపోయింది. గొంతు ఎండిపోయింది. నాలుక అంగిటికి అంటుకొంది. ఈ రెండు లక్షణాలు జ్వరం వేడిమినీ, నిస్సత్తువనూ సూచిస్తాయి. దేవుడతన్ని చావగొట్టి దుమ్ములో పడవేసాడు. అతనికి అంత దీనస్థితి ప్రాప్తించింది.

16-18. ఈ చరణాల్లో తన్ను చచ్చినవాణ్ణిగా భావించుకొని మాట్లాడుతున్నాడు. శత్రువులు కుక్కల్లాగ వచ్చి అతనిమీద పడి అతని కాలుసేతులు చీల్చివేస్తున్నారు. ("చీల్చుతున్నారు" అనే పదానికి హీబ్రూ మూలంలో "తొలుస్తున్నారు" అని కూడ పాఠాంతరం వుంది) వాళ్లు దొంగల్లాగ తన శవంమీదబడి తన బట్టలు లాగుకొని వాటిని తమలో తాము పంచుకొంటున్నారు.

14-18. చరణాలు చాల దుఃఖకరమైన వర్ణన.

19-21. ఈ చరణాల్లోని ఖడ్గం, శునకాలు, సింగం, అడవియెద్దు కీర్తనకారుని శత్రువులే. పూర్వం 12,13,16 చరణాల్లో శత్రువులను గూర్చి చెప్పిన ఉపమానాలనే ఇక్కడ మళ్ళా పునశ్చరణం చేసాడు. శత్రువర్గంనుండి తన్ను కాపాడమని ప్రభువుని వేడుకొన్నాడు.

## రెండవ భాగం

భగవంతుడు కీర్తనకారుని మొరలను ఆలించి అతని బాధలను తొలగించాడు. కనుక అతనికి కృతజ్ఞతావందనాలు అర్పిస్తున్నాడు. కనుక ఈ రెండవభాగం కృతజ్ఞతా సమర్పణంతో నిండివుంటుంది. చాల విలాపకీర్తనల్లో రచయితలు దేవుడు తమ మొర ఆలించి తమ యిక్కట్టులను తొలగించినట్లుగా అంతంలో చెప్పుకొన్నారు. అతన్ని కొనియాడారు. ఇక్కడ ఈ రచయిత కూడ యిదేపద్ధతిని అవలంబించాడు.

22-24. ప్రభువు తన వేడికోలు నాలించి తన శ్రమలను తొలగించాడు కనుక తాను దేవళంలో భక్తసమాజం ముందు అతన్ని కీర్తిస్తాడు. 23 చరణంలో తోడి భక్తులను ప్రభువుని స్తుతించమని ఆహ్వానిస్తున్నాడు. 24వ చరణం పేర్కొనే "దీనుడు" ఈ కీర్తనకారుడే.

25-26. రచయిత మొక్కుబడి దేవళంలో కృతజ్ఞతా బలిని అర్పించడమే. ఈ బలిలో పొట్టేలునో కోడెనో వధిస్తారు. యాజకులూ, బలినర్పించే భక్తుడూ అతని బంధుమిత్రులూ ఆ బలిపశువు మాంసాన్ని భుజిస్తారు. కీర్తనకారుడు పేదలను గూడ ఈ బలికి ఆహ్వానిస్తాడు. ఆ పేద భక్తులు బలిలో పాల్గొని కడుపునిండ భుజిస్తారు. వాళ్ళు ప్రభువు నుండి శుభాలు పొందుతారు.

27-28. ఒక్క యిస్రయేలీయులేకాక, అన్యజాతి జనులుకూడ ప్రభువు దగ్గరికి మరలివస్తారు. దేవళంలో అతన్ని పూజిస్తారు. ఎందుకు? ఈ కీర్తనకారుడు రాజు అని చెప్పాం. అతడూ అతని పౌరులుగా కలసి ఏదో ఘోరశ్రమలు అనుభవించి పవిత్రులయ్యారు. వాళ్ళు ఆర్జించిన పావిత్ర్యం వలన అన్యజాతి జనులుకూడ పరివర్తనం చెంది యావే ప్రభువు దగ్గరికి వస్తారు. అతన్ని కొలుస్తారు. ఆ ప్రభువు రాజుగా వాళ్ళను పరిపాలిస్తాడు.

ఈ కీర్తనను చెప్పిన రాజు యెషయా ప్రవక్త వర్ణించిన బాధామయ సేవకుణ్ణీ, క్రీస్తునీ సూచిస్తాడు. లేకపోతే అతని బాధలు అన్యజాతులకు ఉపయోగపడవు, వారికి పరివర్తనం కలిగించవు.

29-31. బహుశః ఈ మూడు చరణాలు మొదటి కీర్తనకారుడు చెప్పినవికావు. కడపటి దినాల్లో నరులందరూ యావే ప్రభువును పూజిస్తారని చెప్పడానికి, తర్వాత ఇంకో కీర్తనకారుడు వీటిని చేర్చివుంటాడు. కడపటిరోజుల్లో బ్రతికివున్న వాళ్ళూ చచ్చినవాళ్ళూ అంతా ప్రభువుకి దండం పెడతారు. భావితరాలవాళ్ళు ప్రభువుని కొలుస్తారు. వాళ్ళు తమ తర్వాత రాబోయే తరాలవాళ్ళకుగూడ ప్రభువు రక్షణ కార్యాలను వివరిస్తారు. అప్పుడు ఎల్లరూ ప్రభుని పూజిస్తారు.

## 4. ప్రార్థనా భావాలు

1. అందరంకూడ అప్పుడప్పుడూ వ్యాధి బాధలకూ కష్టాలకూ అపజయాలకూ నిరుత్సాహ భావాలకూ గురౌతూంటాం. ఈ కీర్తనను విశేషంగా ఈలాంటి సందర్భాల్లోనే వాడుకోవాలి. ఇంకా మనం ముసలివాళ్ళమైనప్పుడు, దీర్ఘకాలవ్యాధికి గురై మంచాన బడినప్పుడు, మన అశక్తత వెల్లడౌతుంది. చాలమందిమనలను పరిత్యజిస్తారు. మనకుకూడ ఇక విజయాలను సాధించలేం, ఇక బ్రతికి ప్రయోజనం లేదు అనే నిరుత్సాహ భావాలు కలుగుతాయి. ఈ కీర్తన వ్రాసిన భక్తుని అనుభవంకూడ యిదే. లేకపోతే అతడు "నా బలం నేలమీద చల్లిన నీళ్ళలాగ యింకిపోయింది" అని యెందుకంటాడు? ఈలా నిరాశ అనే మబ్బులు ఆవరించినపుడు ఈ కీర్తన బాగా ఉపయోగపడుతుంది. దీనిని భక్తితో మననంజేసికోవడంవల్ల మళ్లా ఆశా దేవునిమీద నమ్మకమూ కలుగుతాయి. ఈ

భక్తుడు చెప్పిన 11వ చరణాన్ని స్మరించుకొన్నపుడు మన కష్టాల్లోను బాధల్లోను తప్పకుండా నమ్మకమూ ఆశాభావమూ చిగురిస్తాయి.

2. నూత్నవేద రచయితలు ఈ కీర్తనకారుని శ్రమలను క్రీస్తుకి అన్వయింపజేసారు. "నా దేవా నా దేవా నన్నేల చేయి విడచితివి" అనే వాక్యాన్ని (1) క్రీస్తు సిలువమీద వ్రేలాడుతూ జపించాడు – మత్త 27,40. ఇతడు ప్రభువునకు ఇష్టుడైనచో అతడు ఇతనిని కాపాడునేమో చూతము" అనే వాక్యాన్ని (8) సిలువమీద వ్రేలాడే క్రీస్తుని దూషిస్తూ ప్రధానాచార్యులు పలికారు – మత్త 27,40. "వాళ్లు నా బట్టలను తమలోతాము పంచుకొన్నారు, నా దుస్తులకొరకు చీట్లు వేసికొన్నారు" అనే వాక్యాన్ని (18) యోహాను సువిశేషం మృతక్రీస్తు బట్టలను పంచుకొనిన సైనికులకు అన్వయింపజేస్తుంది – 19,24. ఈ విధంగా ఈ గీతం క్రీస్తు శ్రమలను తలపునకు తెస్తుంది. కనుకనే యిది మెస్సియా కీర్తనల్లో ఒకటైంది. అన్ని కీర్తనలూ క్రీస్తునందే సార్థక్యం పొందుతాయి. వాటి పరమార్థం క్రీస్తే. కాని మెస్సియా కీర్తనలు ప్రభువు జీవితానికి యింకా యెక్కువగా అన్వయిస్తాయి. కనుక ఈ గీతంద్వారా మనం క్రీస్తు శ్రమలను ధ్యానించుకోవచ్చు. పద్నాలుగు స్థలాల ప్రార్థన చేసికొనేప్పుడూ, తపస్సు కాలంలోను ఈ గేయాన్ని భక్తితో జపించవచ్చు.

ఇక, క్రీస్తు శ్రమలను జ్ఞప్తికి తెచ్చే ఈ కీర్తనలోని శ్రమలు, నేడు మనమీద కూడ సోకుతాయి. ప్రభువు సిలువ చాలసారుల మనమీద భారంగా వాలుతుంది. అలాంటి సందర్భాల్లో ఈ గీతాన్ని భక్తితో జపిస్తే ఎంతో వూరట కలుగుతుంది.

## కీర్తన - 95
## దైనందిన ప్రార్థన

1 రండు, ప్రభువును సంతసముతో స్తుతింతము
మన రక్షణ దుర్గమైన దేవుని ఆనందముతో కీర్తింతము

2 కృతజ్ఞతా స్తుతులతో అతని సన్నిధిలోనికి వత్తము
సంతోషముతో కీర్తనలు పాడుచు అతనిని వినుతింతము

3 ప్రభువు మహాదేవుడు
దైవములందరికిని మహారాజు

4 భూగర్భము మొదలుకొని పర్వత శిఖరముల వరకును
అన్నిటిని అతడే పాలించును

5 సముద్ర మతినిది, అతడే దానిని చేసెను
ధరణి యతనిది, అతడే దానిని కలిగించెను

6 రండు, శిరమువంచి యతని నారాధింతము
మనలను సృజించిన ప్రభువు ముందు మోకరిల్లుదము

7ఎ అతడు మన దేవుడు
మనము అతడు కాచికాపాడు ప్రజలము
అతడు మేపు మందలము

7బి నేడు మీరతని మాట వినిన నెంత బాగుండును!

8 "మెరీబా చెంత మీ పితరులవలె,
నాడు ఎడారిలో మస్సా చెంత మీ పితరులవలె,
మీరును హృదయమును కఠినము చేసికోవలదు

9 నేను చేసిన కార్యములను చూచిన పిదపగూడ
మీ పితరులు నన్నుచట శోధించి పరీక్షకు గురిచేసిరి

10 నలబదియేండ్లపాటు ఆ ప్రజలు నన్ను విసిగింపగా
ఈ జనులకు నాపట్ల నమ్మకములేదు
వీరు నా మార్గములను గుర్తింపరు అని నేను పల్కితిని

11 కనుక నేను వారిమీద ఆగ్రహము చెంది
మీరు నేను నిర్ణయించిన విశ్రామ స్థానమును చేరజాలరని
ప్రతిజ్ఞ చేసితిని".

# 1. పరిచయం

ఇది ప్రవచనాత్మక కీర్తనల వర్గానికి చెందింది. ఈ వర్గం కీర్తనల్లోని భావాలు ప్రవక్త ప్రవచనంద్వారా భక్తులను హెచ్చరించినట్లుగా ఉంటాయి. ప్రస్తుతగీతంలో ప్రవక్తయైన కీర్తనకారుడు, యెరూషలేం దేవాలయంలో ఆరాధనకు గుమిగూడిన భక్తులకు సందేశం చెప్తున్నాడు. సృష్టికర్తా, నిబంధనకారుడూ ఐన దేవునికి విధేయులు కండని వాళ్ళను హెచ్చరిస్తున్నాడు. పూర్వం ఐగుప్తునుండి వెడలివచ్చి యెడారిలో ప్రయాణం చేసిన పితరులు దేవుని యాజ్ఞ మీరినందున వాగ్దత్త భూమిని చేరుకోలేకపోయారు. ఆ యెడారిలోనే కన్నుమూసారు. అది వాళ్ళనుభవించిన శిక్ష. కనుక మీరు దేవునికిలొంగి అతని యాజ్ఞలు

పాటించండి బ్రతికిపోతారు, లేకపోతే చెడతారు అని అతడు భక్తబృందాన్ని హెచ్చరిస్తున్నాడు. ఇప్పుడు తిరుసభ అంతటా గురువులూ మఠకన్యలూ రోజూ జపించే "డివైన్ ఆఫీస్" అనే ప్రార్థన ఈ కీర్తనతోనే ప్రారంభమౌతుంది. ఈ గీతం మనం దేవుణ్ణి భక్తితో ఆరాధించాలని చెప్తుంది. ప్రభువుని విశ్వసించి భయభక్తులతో అతని ఆజ్ఞలను పాటించాలని హెచ్చరిస్తుంది. "రండి యుత్సాహించి పాడుదము" అనే పాట ఈ 95వ కీర్తనే.

## 2. విభజనం

1-7ఎ. సృష్టికర్తా నిబంధన కారుడూ ఐన దేవునికి స్తుతులు

7బి-11 దేవునికి విధేయులై యుండండని భక్తులకు హెచ్చరిక

## 3. వివరణం

1. కీర్తనకారుడు దేవళంలోనికి వచ్చిన భక్తులను ఆరాధనలో పాల్గొనడానికిరండని ఆహ్వానిస్తున్నాడు. ప్రభువు మనకు రక్షణ దుర్గం, లేక రక్షణ శిల. అనగా రాతికోటలాగ మనలను రక్షిస్తాడని భావం.

2. స్తుతి గానాలతో దేవళంలో ప్రభువుని ఆరాధిద్దాం రండని భక్తులను పిలుస్తున్నాడు.

3. యావే ప్రభువు ఇతర దైవల్లాంటివాడుకాడు. అతడు దేవాధిదేవుడు. దేవతల నందరినీ ఏలేవాడు.

4. భూగర్భాలు యావేకు ప్రత్యర్థులైన దేవుళ్ళు వసించే తావులు. అలాగే అన్యజాతి ప్రజలు పర్వత శిఖరాల మీద పరదైవాలను కొలుస్తున్నారు. యావేప్రభువు ఈ భూగర్భాలనూ పర్వతశిఖరాలనూ పరిపాలిస్తూ అచటి చిల్లరమల్లర దైవాలన్నిటిని తన చెప్పుచేతల్లో ఉంచుకొంటాడు.

5. హీబ్రూ కవుల సంప్రదాయం ప్రకారం నీళ్ళూ సముద్రమూ దేవునికి శత్రువులు. కాని ప్రభువు ఈ సాగరాన్నీ నేలనూ తన వశంలో ఉంచుకొంటాడు. అతడు వాటిని సృజించినవాడూ, ఏలేవాడూను. ప్రభువు అన్నిటికీ అధినాథుడని అర్థం.

6. దేవళంలో సృష్టికర్తయైన దేవుని ముందట మోకరిల్లి వంగి నమస్కారంచేసి మన భక్తిప్రపత్తులను వెల్లడి చేసికొందామని చెప్తున్నాడు.

7ఎ. ప్రభువు మన దేవుడు. మనం అతని ప్రజలం. ఇవి సీనాయి నిబంధనను సూచించే వాక్యాలు. అనగా ఆ ప్రభువు సృష్టికర్త మాత్రమేకాదు ; నిబంధనకారుడు కూడ.

ఆ నిబంధనదేవుడు కాపరిలాంటివాడు, మనం అతని మందలం. అతడు మనలను కాపాడతాడు. పచ్చికయబయళ్ళలో మేపుతాడు. అనగా మనలను కరుణతో ఆదరిస్తాడని భావం.

7బి. ఇంతవరకు ఈ కీర్తన సంతోషకరంగా సాగిపోయింది. కాని యికమీదట గంభీరంగా నడుస్తుంది. వళ్ళు దగ్గరబెట్టుకొని జీవించమని భక్తులను హెచ్చరిస్తుంది.

"నేడు" అనేమాట ద్వితీయోపదేశ కాండంలో మాటిమాటికి తగిలేపదం. నేడు, ఇప్పుడు, ఈ యారాధనంలోనే, మీరు దేవునిమాట వింటామని నిర్ణయం చేసికొండని కీర్తనకారుడు భక్తులను హెచ్చరిస్తున్నాడు. దేవునిమాట వినడమంటే అతని యాజ్ఞలు పాటించడం.

8. ప్రవక్త ప్రభువు మాటలు చెప్తున్నాడు. పూర్వం యిస్రాయేలు ప్రజలు ఎడారిలో ప్రయాణం చేస్తూ మస్సా మెరీబా అనే తావుకి వచ్చారు. అక్కడ నీళ్లు దొరక్కపోయేప్పటికల్లా మోషేమీద తిరగబడ్డారు. మోషేమీదతిరగబడ్డమంటే దేవునిమీద తిరగబడ్డమే. ఐనా దేవుడు వాళ్ళను కరుణించి అద్భుతంగా రాతిబండ నుండి నీళ్లు ప్రసాదించాడు. తర్వాత మోషే ఆ ప్రజలను మందలించి మీరు ప్రభువుతో జగడమాడకూడదు, అతన్ని పరీక్షకు గురిచేయకూడదు అని ప్రజలను హెచ్చరించాడు. "మెరీబా" అంటే జగడం. "మస్సా" అంటే పరీక్ష - నిర్గ 17,1-7. ఆ పితరుల్లాగే నేడు మీరు కూడ దుష్టబుద్ధితో దేవుని ఆజ్ఞలు మీరవద్దని కీర్తనకారుడు భక్తులను దేవునిపేరుమీదిగా హెచ్చరిస్తున్నాడు.

9. ప్రభువు చేసిన కార్యాలు అంటే ఐగుప్తు నిర్గమన సమయంలో అతడు చేసిన అద్భుతాలు. ప్రజలను రెల్లుసముద్రం దాటించడం మొదలైన సూచక క్రియలు. ప్రభువు మహాకార్యాలను చూచిన పిదప గూడ పితరులు ఎడారిలో అతనిమీద తిరగబడ్డారు. వాళ్ళకు విశ్వాసం లేదు.

10. ప్రజలు ఎడారి ప్రయాణం పొడగునా దేవునికి ఎదురు తిరుగుతూనే వచ్చారు. ప్రభువుమార్గాలుఅంటే అతని ధర్మశాస్త్రంలోని ఆజ్ఞలు. దేవుడు మోషేద్వారా ప్రసాదించిన ధర్మశాస్త్రాన్ని ఆ ప్రజలు పాటించలేదు. కనుక అతడు వారితో విసిగిపోయాడు.

11. విశ్రామ స్థానం అంటే వాగ్దాత్తభూమి. ఆప్రజలు ప్రభువు శాసనాలు మీరి అతనిమీద తిరగబడుతూ వచ్చారు. కనుక అతడు వాళ్ళను వాగ్దత్తభూమికి తీసికొనిపోలేదు. ఆ తొలితరం జనమంతా ఎడారిలోనే చనిపోయారు. కనుక నేడు మీరుకూడ వాళ్లలా ప్రవర్తించవద్దని కీర్తనకారుడు దేవళంలోని ఆరాధన సమాజాన్ని ప్రభువు పేరిట మందలిస్తున్నాడు. మీరు దేవునికి విధేయులైతే విశ్రాంతి ననుభవిస్తారు, దేవుని ఆజ్ఞలు మీరితే అతడు మిమ్ము శిక్షిస్తాడు అని చెప్తున్నాడు. ఈ హెచ్చరిక నేడు మనకు కూడ అక్షరాల వర్తిస్తుంది.

# 4. ప్రార్థనా భావాలు

1. ఈ కీర్తనలోని మొదటి భాగం సృష్టికర్తను వర్ణిస్తుంది. మనం సృష్టికర్తయైన దేవుణ్ణి స్తుతించాలి. సూర్యచంద్రులు సముద్రం ఋతువులు మొదలైన సృష్టివస్తువులు దేవుని ఆజ్ఞలకు లొంగివుండడంద్వారానే అతన్ని స్తుతిస్తాయి. కానినరులమైన మనం బుద్ధిని చిత్తశక్తులతో అతన్ని వందించాలి.

2. హెబ్రేయుల జాబు 3,7–15 వచనాలు ఈకీర్తనలోని 7బి–11 చరణాలను పేర్కొని వాటిమీద వ్యాఖ్యచెప్తాయి. ఈ వాక్యాలు కష్టాల్లో విశ్వాసాన్ని నిలబెట్టుకొమ్మని భక్తులను హెచ్చరిస్తాయి. నేడు మనందేవునికి లొంగివుంటామని ప్రమాణంచేస్తే అతని రక్షణం పొందుతాం. ఈరోజు అవిశ్వాసం ద్వారా మన హృదయాలను కఠినం చేసికోకూడదు. ఈ రోజంటే ప్రతిరోజుకూడ. కనుక మనజీవితంలో ప్రతిదినమూ దేవునికి విధేయులమై యుండాలి.

3. ఈ కీర్తనలోని మొదటిచరణం దేవుణ్ణి రక్షణదుర్గం, లేక రక్షణశిల అని పిలుస్తుంది. మన రక్షణశిల క్రీస్తే. ఆనాడు మస్సా మెరీబా చెంత ప్రజలు రాతిబండ నుండి అద్భుతంగా వెలువడిన నీళ్ళు త్రాగారని చెప్పాం. తర్వాత ఆ బండ యెడారిలో ఆ ప్రజలతోగూడ ప్రయాణంచేసిందని యూద రబ్బయిలు వాకొన్నారు. పౌలుకి ఈసంప్రదాయం తెలుసు. కనుక అతడు ఆశిల యేమోకాదు, క్రీస్తు అనివ్రాసాడు– 1కొ 10,4. సిలువమీద క్రీస్తునే శిలప్రక్కనుండి నీళ్ళు స్రవించాయి. నేడు మనం ఆనీళ్ళతోనే జ్ఞానస్నానం పొందుతాం. యూదులు నిబంధనం ద్వారా దేవుని బిడ్డలయ్యారు. మనం క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందడంద్వారా దేవుని బిడ్డల మౌతాం. కనుక ఆ ప్రభువుని విశ్వసించడం మన బాధ్యత.

4. ఈ కీర్తన దేవునిపట్ల విశ్వాసం కలిగి ఉండమనీ, భయభక్తులతో అతని యాజ్ఞలు పాటించమనీ చెప్తుంది. ఇదే ఈ గీతంలోని ప్రధాన సందేశం. మనకు దేవునిపట్ల భయభక్తులు ఎల్లప్పుడూ అవసరమే. మనం అవిశ్వాసంవల్ల ఎప్పుడైనా దేవుని ఆజ్ఞలు మీరవచ్చు. ప్రభువు శిక్షకు గురికావచ్చు. కనుక ఈగీతం ఓ ప్రవక్తలా, ఓ మతాచార్యుళ్లా నిరంతరం మనలను హెచ్చరిస్తూ మీరు దేవునిపట్ల విశ్వాసం నెలబెట్టుకొండని చెప్తూంటుంది. మనం పదేపదే ఈ కీర్తనను జపించి మన విశ్వాసాన్ని దృఢతరం చేసికొంటూండాలి. విశ్వాసజ్యోతిని ఆరిపోకుండా నిలబెట్టుకొనేవాడే భక్తుడు.

# కీర్తన - 30

## ఆపద నుండి తప్పించుకొన్నందులకు కృతజ్ఞతాస్తుతి

1 ప్రభూ! నీవు నన్ను విపత్తునుండి తప్పించితివి
శత్రువులు నా పతనమును జూచి
సంతసింపకుండునట్లు జేసితివి
కనుక నేను నిన్ను స్తుతింతును

2 నా దేవుడవైన ప్రభూ! నేను నీకు మొరపెట్టగా
నీవు నాకు ఆరోగ్యమును దయచేసితివి

3 ప్రభూ! నీవు నన్ను పాతాళలోకము నుండి
వెలుపలికి గొనివచ్చితివి
మృతలోకమున కేగువారినుండి నన్ను తప్పించి
నాకు జీవమును ప్రసాదించితివి

4 ప్రభు భక్తులారా! అతనిని స్తుతించి కీర్తింపుడు
పవిత్రుడైన ప్రభువును స్మరించుకొని వందనము లర్పింపుడు

5 అతడు క్షణకాలము కోపించును
అతని యనుగ్రహము మాత్రము జీవితాంతము నుండును
రేయి దుఃఖము వలన కన్నీళ్ళు కారునుగాక
వేకువనే ఆనందము కలుగును

6 నేను సురక్షితముగా నున్నపుడు
నాకెన్నడు కీడు వాటిల్లదని తలంచితిని

7 ప్రభూ! నీవు నన్ను కరుణతో
అభేద్యమైన పర్వత దుర్గమువలె కాపాడితివి
కాని నీవు నీ ముఖమును నా నుండి దాచుకొనగానే
నేను కలత జెందితిని

8 ప్రభూ! నేను నీకు మనవి చేసితిని
నీ సహాయము నర్థించితిని

9 “నేను పాతాళమును చేరుకొనిన యెడల
నీకేమి లాభము కలుగును?
మృతులు నిన్ను స్తుతింతురా?
మేరలేని నీ మంచితనమును కీర్తింతురా?

10 ప్రభూ! నీవు నా మొర నాలించి నా మీద దయజూపుము
దేవా నన్నాదుకొనుము” అని వేడుకొంటిని

11 నీవు నా శోకమును నాట్యముగా మార్చితివి
సంతాపసూచకముగా నేను తాల్చియున్న గోనెను తొలగించి
నాకు ఆనందకరమైన బట్టలను కట్టబెట్టితివి

12 కనుక నేను మౌనముగా నుండక నీ స్తుతులను పాడెదను
నా ప్రభువవైన దేవా! నేను నీకు సదా వందనము లర్పింతును.

# 1. పరిచయం

ఇది కృతజ్ఞతా కీర్తనల వర్గానికి చెందింది. ఈకీర్తన వ్రాసిన భక్తునికి మొదట అన్ని కార్యాలు సవ్యంగానే జరిగిపోతుండేవి. కనుక అతనికి విపరీతమైన ఆత్మవిశ్వాసం కలిగింది. అహంభావం పెరిగింది. అతడు తన శక్తివల్లనే తాను విజయాలు సాధించాననుకొని దేవుణ్ణి విస్మరించాడు. దేవుడు ఆ భక్తునికి పాఠం నేర్పగోరి అతన్ని పెద్దవ్యాధికి గురిచేసాడు. కీర్తనకారుడు తాను చనిపోతానేమోనని భయపడ్డాడు. తన అవివేకాన్ని మన్నించి తన్ను బ్రతికించమని ప్రభువుకి మనవి చేసాడు. దేవుడు కరుణతో అతని రోగాన్ని తొలగించాడు. భక్తుడు దేవళంలో ప్రభువుకి కృతజ్ఞతాస్తుతులుచెల్లించాడు. కనుక అహంభావాన్ని విడనాడి వినయాన్ని అలవర్చుకోవడం ఈ కీర్తనలోని ఇతివృత్తం. జీవితంలో మనంకూడ చాలసారులు అచ్చంగా ఈరచయితలాగే ప్రవర్తించివుంటాం. కనుక అతని గేయం నేడు మనకు కూడ ఆదర్శంగా వుంటుంది.

# 2. విభజనం

1-3 దేవుడు కీర్తనకారుని వ్యాధిని తొలగించడం
4-5 కృతజ్ఞతాస్తుతి
6-10 రచయిత పొగరూ, వ్యాధీ, ప్రార్థనా
11-12 దేవుడు అతని వ్యాధినితొలగించడం, వందనసమర్పణం

# 3. వివరణం

1. ప్రభువు కీర్తనకారుణ్ణి పెద్ద జబ్బునుండి కాపాడాడు. అతడు చనిపోయినట్లయితే అతని శత్రువులు సంతోషించేవాళ్ళే. కాని ప్రభువు అనుగ్రహం వలన మరణం నుండి తప్పించుకొన్నాడు.

2. అతడు వ్యాధిలో దేవునికి మొరపెట్టగా ప్రభువు అతని జబ్బును నయంచేసాడు.

3. పాతాళలోకం, మృతలోకం, అంటే చచ్చినవాళ్ళు చేరుకొనే స్థలం. యూదులు దీన్ని "షెయోల్" అన్నారు. ఇది సముద్రం క్రింద భూగర్భంలో ఉంటుందనీ, అంధకారమయంగా నిరాశాపూరితంగా ఉంటుందనీ భావించారు. అక్కడికి వెళ్ళినవాళ్లు ప్రేతాల్లాగ ఉండిపోతారనీ, నిద్రావస్థలో ఉంటారనీ, దేవుణ్ణిస్మరించుకోలేరనీ, దేవుడు కూడ వాళ్ళను పట్టించుకోడనీ అనుకొన్నారు. పూర్వవేద యూదులకు ఈ పాతాళ లోకమంటే మాలావు భయం. తాము అక్కడికి పోకూడదనీ, దీర్ఘకాలం ఈభూమిమీదనే బ్రతికిఉండాలనీ వాళ్ళ కోరిక. ఈ భూమి జీవవంతుల లోకం, షెయోల్ మృతలోకం. మన కీర్తనకారుడు చనిపోయినట్లయితే ఈ మృతలోకానికి వెళ్ళేవాడే. దేవుని అనుగ్రహంవల్ల బ్రతికి ఈ భూమిమీద సంచరిస్తున్నాడు.

4. కీర్తనకారుడు తన్ను మరణంనుండీ మృతలోకం నుండీ కాపాడినందులకు దేవుణ్ణి స్తుతించమని దేవళంలోని భక్తబృందాన్ని అర్థిస్తున్నాడు. దేవాలయారాధనలో భక్తులు తమ కష్టసుఖాలను తోడి భక్తులముందు వెల్లడిచేసికొనేవాళ్ళు. ఆ తోడిభక్తులు కష్టంలోవున్న వారికొరకు ప్రార్థన చేసేవాళ్ళు. దేవునినుండి యేదైన ఉపకారం పొందినవారి తరపున కృతజ్ఞతా స్తుతి అర్పించేవాళ్లు.

5. దేవుని కోపమంటే అతని శిక్ష. దేవుడు నరుల్లాగ దీర్ఘకాలం కోపించడు. అసలు అతడు మనమీద కోపపడేది మనకు కీడు చేయటానికిగాదు. మేలుచేయడానికే. దేవుని శిక్ష వలన మనకు మంచి బుద్ధి అలవడుతుంది. జీవితంలో మనకు దుఃఖాలు కలుగవచ్చు. కాని అవి దాటిపోయాక అతడు మనకు ఆనందాన్ని దయచేస్తాడు.

6. రచయిత తన ఆత్మకథను చెప్పుకొంటున్నాడు. తానేలా అహంకారాన్ని విడనాడి వినయాన్ని అలవర్చుకొన్నాడో వివరిస్తున్నాడు. భక్తుడికి అన్నీ సవ్యంగానే జరిగిపోతున్నాయి. కనుక అతనికి తల తిరిగింది. అతడు తన సామర్థ్యం వలననే విజయాలు సాధించాననుకొన్నాడు. ఇక తనకు ఏ లోటూ లేదు, ఏ కీడూ కలగదు అనుకొన్నాడు. అహంభావంతో దేవుణ్ణి అనాదరం చేసాడు. ఇది పెద్దతప్పు.

7. కొన్నాళ్ళపాటు ప్రభువు అతన్ని పర్వతదుర్గంలా కాపాడాడు. ఐనా కీర్తనకారుడు దాన్ని స్వీయశక్తినిగా భావించాడేగాని భగవంతుని కరుణనుగా అర్థంజేసికోలేదు. అతనికి పొగరు పెరిగింది. కనుక దేవుడతనికి పాఠం నేర్పగోరి అతనినుండి తన ముఖాన్ని

మరుగుజేసికొన్నాడు. అనగా రచయిత నుండి తన అనుగ్రహాన్ని తొలగించాడు. అతన్ని చేయివిడిచాడు. ఫలితంగా అతనికి పెద్ద వ్యాధి చుట్టుకొంది. ఆ జబ్బు అతడు తన పొగరువలన తెచ్చుకొందే. ఆ వ్యాధివల్ల అతడు కలతజెందాడు. అనగా గాబరాపడ్డాడు. అతని ఆత్మవిశ్వాసమూ అహంభావమూ కుప్పకూలాయి.

8. అతడు తన పొరపాటును గ్రహించి తన్ను మన్నించమని దేవునికి మనవిచేసాడు. తనరోగాన్ని కుదర్చమని వేడుకొన్నాడు.

9-10. పాతాళానికి పోయినవాళ్లు దేవుణ్ణి స్తుతించలేరు. అక్కడివాళ్లు నిత్యం నిద్రావస్థలో ఉండిపోతారు. కనుక తన్ను చంపి పాతాళానికి పంపవద్దని ప్రభువుని వేడుకొన్నాడు. తాను అక్కడికిపోతే దేవుణ్ణి స్తుతించేవాళ్ళల్లో ఒకడు తక్కువౌతాడని విన్నవించుకొన్నాడు. కనుక తనకు ఆరోగ్యం దయచేసి తన్ను భూమిమీదనే ఉండనీయమని అర్థించాడు.

11. ప్రభువు దయగలవాడు కనుక భక్తుని మొరవిని వ్యాధిని నయంచేసాడు. అతని శోకం నాట్యంగా మారింది. అతడు దుఃఖకాలంలో తొడిగే దుస్తులను విడచి సంతోష కాలంలో తొడిగే బట్టలు తాల్చాడు.

12. ఇంత దొడ్డ ఉపకారం పొందాక అతడు దేవుణ్ణి స్తుతించకుండా ఉండగలడా? దేవళంలో భక్త సమాజం ముందు ఆ ప్రభువుని ఎలుగెత్తి కీర్తించాడు. ఆప్రభువు మంచితనానికీ, అతడు దయచేసిన రక్షణానికీ సాక్ష్యం పలికాడు. అప్పటినుండి అతడు పొగరును విడనాడి దేవునిమీద ఆధారపడి జీవించడం మొదలెట్టాడు. నేడు అతని పాటను చదువుకొనే మనంకూడ అతని గుణపాఠాన్ని నేర్చుకోవాలి.

## 4. ప్రార్థనా భావాలు

1. ఈ కీర్తనకారుని తప్పేమిటి? అతడు అహంభావంతో తన్నుతాను గొప్పజేసికొన్నాడు. తన సామర్థ్యంవల్లనే తాను విజయంసాధించాననుకొన్నాడు. దేవునిమీద ఆధారపడ్డం మానివేసాడు. దానికి తగినశాస్తి అనుభవించాడు. బుద్ధితెచ్చుకొన్నాడు. మన జీవితంలో మనంకూడ నిరంతరం దేవునిమీద ఆధారపడాలి. మామూలుగా నరులు తమ ధనం, డిగ్రీలు, పలుకుబడి, ఉద్యోగం, కులం, బంధువర్గం మొదలైన వాటిమీద ఆధారపడతారు. కాని యివి యేవీ మనలను కాపాడలేవు. మనకునిజంగా బలాన్నిచ్చేది ఆ భగవంతుడొక్కడే. కీర్తనకారుడు శిక్షద్వారా గుణపాఠం నేర్చుకొన్నాడు. అతన్ని చూచి మనం శిక్ష రాకముందే పాఠం నేర్చుకొంటేమంచిది. మనపొగరును అణచుకొని వినయాన్ని అలవర్చుకొని దేవునిమాద ఆధారపడి జీవిస్తే బాగుపడతాం.

2. ఈ కీర్తనలోని 9వ చరణంలో కీర్తనకారుడు ప్రార్థనచేసినతీరు గమనించదగ్గది. పొగరువల్ల కొంచెం తల తిరిగినా, అతనిది పసిబిడ్డ మనస్తత్వం. ఓ ప్రభూ! నేను చనిపోయి పాతాళానికిబోతే నిన్ను స్తుతించేవాళ్ళల్లో ఒకడు తక్కువైపోతాడు కదా! - ఇది అతని ప్రార్థనా ధోరణి. మన ప్రార్థనంలోకూడ ఈలాంటి సరళగుణమూ, దేవుని పట్ల నమ్మకమూ ఉండాలి. మనం ఓ పసిబిడ్డలాగ నిష్కల్మషంగా ఆ ప్రభువుతో మాట్లాడగలిగి ఉండాలి. ఈలాంటి మనవిని దేవుడు తప్పక వింటాడు.

3. ఈ కీర్తనాకారుని అనుభవమే మనకుకూడ చాలసారులు కలిగివుండవచ్చు. మిడిసిపాటువల్ల మనం ఆపదలు తెచ్చుకొని ఉండవచ్చు. ఇందువల్లనే అతని గీతం నేడు మన హృదయానికి హత్తుకొంటుంది. మనం ఈ గేయాన్ని భక్తితో జపించి వినయమనే విలువైన పాఠాన్ని నేర్చుకోవచ్చు. తన్నుతాను హెచ్చించుకొనేవాడు తగ్గింపబడతాడు అనే సూక్తి భావాన్ని బాగా అర్థంచేసికోవచ్చు - మత్త 23,12.

# కీర్తన - 121

## యిస్రాయేలును కాపాడువాడు

1 నేను కొండలవైపు పారజూచుచున్నాను
నా కెచటినుండి సహాయము లభించును?

2 భూమ్యాకాశములను సృజించిన ప్రభువునుండి
నాకు సాయము లభించును

3 అతడు నిన్ను కాలుజారి పడనీడు
నిన్ను కాపాడువాడు నిద్రపోడు

4 యిస్రాయేలును కాపాడువాడు
కునికిపాట్లు పడడు, నిద్రపోడు

5 ప్రభువు నిన్ను కాపాడును, నీకు నీడగా నుండును
అతడు నీ కుడిప్రక్కన నిల్చి నిన్ను రక్షించును

6 పగలు నీకు సూర్యుని వలన హాని కలుగదు
రేయి చంద్రుని వలన కీడు కలుగదు

7 ప్రభువు నిన్ను సకలాపదలనుండి కాపాడును
నిన్ను సురక్షితముగా నుంచును

8 అతడు నీ రాకపోకలన్నింటను
ఇప్పుడును ఎప్పుడును నిన్ను కాపాడును.

# 1. పరిచయం

120-134 కీర్తనలకు "యాత్రిక కీర్తనలు" అని పేరు. భక్తులు యెరూషలేమునకు యాత్రచేసేపుడు ఈ గీతాలను పాడుకొనేవాళ్ళు. ఈ పాటల్లో కన్పించే అంశాలు ఇవి. భక్తులు దేవుణ్ణి గాఢంగా నమ్మేవాళ్ళు. అతన్ని తలంచుకొని ఆనందించేవాళ్ళు. తమకోర్కెలు తీర్చినందులకు ప్రభువుకి వందనాలు చెప్పేవాళ్ళు. తమకు ప్రభువు దీవెనలు లభించాలని కోరుకొనేవాళ్ళు. కొన్ని మారులు విజ్ఞానసూక్తులు కూడ కన్పిస్తాయి. మొత్తంమీద ప్రజల భక్తిజీవితం ఈ గీతాల్లో ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. మనం ఈ వర్గంనుండి ఐదు కీర్తనలు పరిశీలిద్దాం.

121వ కీర్తనలోని ముఖ్యాంశం దేవుణ్ణి నమ్మడం. యెరూషలేము యాత్రకు బయలుదేరిన భక్తుడు ప్రభువు తన్ను సురక్షితంగా ఆ నగరానికీ, అక్కడినుండి మళ్ళా యింటికి చేర్చుతాడని నమ్మాడు. ఆ దేవుడు గొర్రెల కాపరిలా తన్ను కాపాడతాడనీ, కావలివానిలాగా నిద్రపోకుండా తన్ను సంరక్షిస్తుంటాడనీ విశ్వసించాడు. మన జీవితయాత్రలో ప్రభువు మనలను కూడ కాపాడుతూంటాడు. నేడు ఈ కీర్తనను భక్తితో జపించినపుడు గొప్పశాంతిభావం కలుగుతుంది. యాత్రికునికి చేతికర్రలా జీవితయాత్రలో మనకుకూడ ఈపాట ఉపయోగపడుతుంది. దీనిలో దేవళంలోని ఆరాధన వాతావరణంకూడ కన్పిస్తుంది.

# 2. వివరణం

1. కీర్తనకారుడు పారజూచింది యెరూషలేములోని సియోను కొండవైపు కాదు. ఆ నగరానికివెళ్ళే త్రోవలో తగిలే చాల కొండలవైపు. యెరూషలేము దారి చాల కొండలగుండా మెలికలు మెలికలుగా సాగిపోతుంది. ఆరోజుల్లో ఆ కొండలగుండా ప్రయాణం చేయడం కష్టం. ఎన్నో అపాయాలు ఎదురయ్యేవి. ఈ ప్రమాదంనుండి తప్పించుకోడానికి సహాయం ఎక్కడినుండి వస్తుంది? యెరూషలేములోని దేవునినుండే. ఇక్కడ భక్తుడు తన ప్రయాణారంభంలో, త్రోవలో ఎదురయ్యే ప్రమాదాలను తలంచుకొని, దేవునినుండి సహాయం అడుగుకొంటున్నాడు.

2. యిస్రాయేలు ప్రజల ఆరాధనలో కన్పించే ముఖ్యాంశాలు ప్రభువుసృష్టి, అతని రక్షణం. ఇక్కడ భక్తుడు భూమ్యాకాశాలను చేసిన సృష్టికర్తయైన దేవుణ్ణి తలంచుకొంటున్నాడు. ఆ సృష్టికర్త తాను స్వయంగా చేసిన సృష్టి ప్రాణినైన నన్ను తప్పకకాపాడతాడని అతని భావం. సృష్టి ఒకనాటితో ముగిసేదికాదు. నిరంతరం కొనసాగిపోయేది. కనుక ప్రభువు తన భక్తుణ్ణి నిరంతరం ఆదుకొంటాడని అర్థం.

3. ఈ మూడవ చరణంనుండి కీర్తనకారుడు తననుతానే హెచ్చరించు కొంటున్నాడు. "కాపాడువాడు" అంటే గొర్రెలకాపరి. మనలను సృజించిన దేవుడు సజీవుడు. కాపరి గొర్రెలనులా అతడు మనలను ఎల్లవేళలా ఆదుకొంటాడు. అతడు నిద్రపోయేవాడూ ప్రమత్తుడూ కాదు, అప్రమత్తుడు.

4. ఈ చరణంలో ప్రభుని గొర్రెల కాపరితోపాటు కావలి కాసేవానితోగూడ పోలుస్తున్నాడు. యిస్రాయేలుకు కావలికాసి సేవలుచేసే ప్రభువు నిద్రపోయేవాడూ, కునికిపాట్లు పడేవాడూ కాదు. కావలికాసే నరులైనా కునికిపాట్లు పడి ప్రమత్తులౌతారు కాని, దేవుడు ప్రమత్తుడుకాడు. అతడు నిత్యము మేల్కొనిఉండి తనప్రజలను సామూహికంగానూ వ్యక్తిగతంగానుగూడ కాపాడతాడు.

5. ప్రభువు కీర్తనకారుణ్ణి యుద్ధ ప్రమాదాలనుండిగూడ కాపాడతాడు. తల్లిపక్షిలా రెక్కలు విప్పి అతనికి నీడగా ఉంటాడు. యుద్ధంలోగాని న్యాయస్థానంలోగాని ఓవ్యక్తికి సహాయం చేసేవాడు అతనికి కుడిప్రక్కన నిలబడేవాడు (కీర్త 16,8. 109,31). ఇక్కడ ప్రభువు ఓ యుద్ధవీరుల్లా వచ్చి కీర్తనకారుని కుడిప్రక్కన నిల్చి రణాపాయం నుండీ మృత్యువునుండీ అతన్ని కాపాడతాడని భావం.

6. ప్రభువు అతన్ని వ్యాధులనుండీ అంటురోగాల నుండీ కూడ రక్షిస్తాడు. మధ్యాహ్నపు సూర్యునివలనా, చంద్రుని వలనా రోగాలు సోకుతాయని పూర్వులు నమ్మారు.

7. సమస్తాపదలనుండీ ప్రభువు అతన్ని కాపాడతాడు.

8. హీబ్రూ ప్రజలు ఈ జీవితాన్ని రాకపోకలుగా, యాత్రగా, ప్రయాణంగా భావించారు. (కీర్త 91,11) కనుక ప్రభువు భక్తుణ్ణి అతని జీవితయాత్ర ముగిసిందాక సంరక్షిస్తాడని భావం. దేవుడు అతన్ని సురక్షితంగా యెరూషలేముకు తీసికొని వెళ్ళి మళ్ళా భద్రంగా యింటికి తీసికొని వస్తాడని అర్థం.

"ఇప్పుడు ఎప్పుడు" అనేది దేవాలయారాధనలో వాడే ఆశీర్వచనం. ఇప్పటినుండి ఎల్లకాలం వరకు ప్రభువు భక్తుణ్ణి ఆదరిస్తుంటాడని భావం. ఈ దీవెన సూచించినట్లుగానే ఈ కీర్తన మనకు కూడ ఇప్పుడూ యెప్పుడూ ఊరట కలిగిస్తూనే ఉంటుంది. ఇది యాత్రికుని చేతిలోని ఊతకర్రలాంటిది. ఈ కీర్తనంలో దేవళంలోని ఆరాధన వాతావరణం కనిపిస్తుందని చెప్పాం. అందుకు ఈ "ఇప్పుడు ఎప్పుడు" అనే ప్రయోగమే సాక్షి.

## 3. ప్రార్థనా భావాలు

1. ఈ కీర్తనకారుడు యెరూషలేమునకు యాత్రచేసాడు. మన జీవితంకూడ స్వర్గానికి యాత్ర చేయడం లాంటిది. ఈ యాత్రలో దేవుడు మనలను నిరంతరం కాచికాపాడుతూంటాడు. అతడు మనకు కాపరిలాంటివాడు. కునికిపాట్లు పడని కావలివాని లాంటివాడు (4). అలాంటి దేవుణ్ణి మనం తప్పక నమ్మాలి.

2. మనం నిరంతరం దేవుని సన్నిధిలోనే ఉంటాం. కాని ఆ సాన్నిధ్యాన్ని మర్చిపోతాం. ఈలాంటి కీర్తనలు ఆ సాన్నిధ్యాన్ని మళ్ళా మనకు గుర్తుకు తెచ్చి మన భక్తిని మేల్కొలుపుతాయి. ఆ ప్రభువు మన కుడిప్రక్కన నిల్చి మనలను ఆదుకొంటాడని తెలియజేసి మనలను ప్రోత్సహిస్తాయి (5).

3. హీబ్రూ ప్రజలు ఈ జీవితాన్ని స్వర్గానికి యాత్రగా, ప్రయాణంగా భావించారని చెప్పాం. ఐతే, మనలను స్వర్గానికి తీసుకుపోయే త్రోవ క్రీస్తే. కనుకనే అతడు నేనే మార్గాన్ని అన్నాడు - యోహా 14,6. అతని సాన్నిధ్యం అనవరతం మనకు తోడుగా ఉంటుంది - మత్త 28,20. అతనితో కలసే మనం మోక్షానికి యాత్ర చేస్తాం. నాడు ఎమ్మావు శిష్యులకు లాగే నేడు మనకు కూడ అతడు తోడి బాటసారిగా ఉంటాడు - లూకా 24,15.

4. సామాన్యంగా నరులు తమ శక్తిసామర్థ్యాల మీదా, ఉద్యోగాలమీదా, డబ్బుమీదా, స్నేహితులమీదా ఆధారపడతారు. కాని మనం నిజంగా ఆధారపడవలసింది దేవునిమీదనే. భూమ్యాకాశాలను చేసిన దేవునినుండి కాని మనకు యథార్థమైన సహాయం లభించదు (2).

5. ఈ కీర్తనను నమ్మకంతో జపించడంవల్ల శాంతిభావం కలుగుతుందని చెప్పాం. ప్రభువు మనలను సకలాపదలనుండి కాపాడి సురక్షితంగా ఉంచుతాడని తెలిసికొన్నపుడు మన హృదయం ఎంతో నెమ్మదిని పొందుతుంది (7).

## కీర్తన - 127
## దేవునిమీద నమ్మకం

1 ప్రభువు ఇల్లు కట్టనియెడల బేలుదారుల శ్రమ వ్యర్థమగును
ప్రభువు నగరమును కాపాడని యెడల
గస్తీలు మేల్కొని యుండియు లాభములేదు

2 వేకువనే నిద్రలేచి, రేయి ప్రొద్దుపోయినదాక మేల్కొనియుండి
కష్టపడి పనిచేసి పొట్టకూడు సంపాదించుకొనుట వ్యర్థము
ప్రభువు తాను ప్రేమించు ప్రజలకు
వారు నిద్రించునపుడును సంపద లొసగును

3 పుత్రులు ప్రభువిచ్చు వరము
తనయులు దేవుని బహుమానము

4 యౌవనమున బుట్టిన కుమారులు
వీరుని చేతిలోని బాణముల వంటివారు

5 అట్టి బాణములతో
తన యమ్ముల పొదిని నింపుకొనువాడు ధన్యుడు
నగర ద్వారము నొద్ద శత్రువులు తారసిల్లినపుడు
అతడు పరాజయము నొందడు.

# 1. పరిచయం

ఈ కీర్తనం దేవునిమీద నమ్మకముంచాలని నొక్కిచెప్తుంది. దీనిలో రెండు భాగాలున్నాయి. మొదటిభాగం (1-2 చరణాలు) దైవసహాయం ముఖ్యమని చెప్తుంది. రెండవభాగం (3-5 చరణాలు) సంతానం దేవుని వరమని చెప్తుంది. ఈ రెండంశాలకు పరస్పర సంబంధం లేదు. ఐనా ఈ రెండంశాలు జ్ఞానవాఙ్మయంలో కన్పిస్తాయి. కీర్తనకారుడు ఇక్కడ ఈ రెండు భావాలను కలిపి చెప్పాడు. ఇది చిన్న కీర్తన అయినా చక్కని ఉపమానాలతో నిండివుంటుంది.

# 2. వివరణం

1. దైవబలంలేందే మన పనులు ఫలింపవు అనడానికి రెండుపమానాలు ఎత్తుకొన్నాడు. దేవుడు దీవించందే తాపీపనివారు ఇల్లుకట్టలేరు, కావలి కాసేవాళ్లు నగరాన్ని కాపాడలేరు. ప్రభువు యిస్రాయేలుజాతినీ, యెరూషలేము నగరాన్నీ ఓ యిల్లులా కట్టాడు, కాచికాపాడాడు కూడ.

తొలి రెండు చరణాల్లో "వ్యర్థం" అనేమాట మూడుసార్లొస్తుంది. కనుక దైవం తోడ్పడని పని అనుకూలించదని భావం. నరుడుకూడ పనిచేయాలి. కాని దైవబలమూ వుండాలి. ఈ పట్టున సామెతల గ్రంథం

"దేవుని నీ కార్యాలను దీవింపమని వేడుకొంటే
నీకు తప్పక విజయం కలుగుతుంది"

అని చెప్తుంది - 16,3.

2. వేకువనుండి నడిరేయిదాకా ఎముకలువిరగగొట్టుకొని పనిచేసినా ప్రయోజనంలేదు. దేవుని అనుగ్రహముంటే మనపనులు తప్పకసార్థకమౌతాయి. ప్రభువుతాను ప్రేమించేవాళ్ళకు వాళ్ళు నిద్రపోతున్నప్పుడుకూడ సంపదలిస్తాడనే వాక్యం, గిబ్యోను పుణ్యక్షేత్రలో సొలోమోను కాంచినకలను జ్ఞప్తికితెస్తుంది -1రాజు 3,5. ఈ సందర్భంలో ప్రభువు సహాయంలేందే మనకృషి ఫలించదని చెప్తూ సామెతల గ్రంథం

"దేవుని దీవెన వలన సిరు లబ్బుతాయి
స్వయంకృషి వలననే సంపదలు కలగవు"

అని వాకొంటుంది-10,22. నూత్నవేదం కూడ దైవసహాయం అవసరమని నొక్కిచెప్తుంది- మత్త 6,25-30.

3. మొదటిభాగంలో దైవబలాన్ని గూర్చి చెప్పాక, ఈ రెండవభాగంలో సంతానాన్ని దేవునిదీవెనగా భావించమని చెప్తున్నాడు. సంతానంవల్ల స్వల్ప సంఖ్యాకులైన యిస్రాయేలీయుల సంఖ్య పెరుగుతుంది. కనుక బిడ్డలు ఆశింపదగినవాళ్లు. దేవుడు పాలస్తీనా దేశాన్ని యూదులకు బహుమతిగా యిచ్చాడు. అలాగే సంతానాన్ని కూడ వాళ్ళకు బహుమతిగా యిచ్చాడని భావం.

4. యౌవనంలో బుట్టిన కుమారులు ఆరోగ్యంగా, బలంగా ఉంటారు. బాణాలు వీరుని కాపాడినట్లే వాళ్ళు తండ్రిని కాపాడతారు.

5. చాలమంది కుమారులున్న తండ్రికి, చాల బాణాలున్న వీరునికిలాగే, చీకూచింతా ఉండదు.

యిస్రాయేలు జీవనంలో నగరద్వారం ప్రజలు గుమిగూడేతావు. ప్రజల తగాదాలకు పంచాయితీ జరిగేతావుకూడ. ఇది మనదేశంలో "రచ్చబండ" లాంటిది. ఈనగర ద్వారంవద్ద ఎవనిమీదికైనా తోడి యిస్రాయేలీయులు వ్యాజ్యానికి వస్తే అతని కుమారులు అతన్ని ఆదుకొంటారు. కుమారులుగల తండ్రికి ముప్పులేదని భావం.

## 3. ప్రార్థనా భావాలు

1. దేవుని దీవెన లేందే మనకు విజయం సిద్ధింపదు. "నేను విత్తనం నాటాను. అపొల్లో నీళ్లు పోసాడు. కాని దానికి పెరుగుదలను ఇచ్చింది దేవుడే" అన్నాడు పౌలు - 1కొ 3,6. కనుక మనం దైవబలాన్ని నమ్ముకోవాలి.

2. సంసార జీవితం జీవించేవాళ్ళు దేవుడు తమకు దయచేసినబిడ్డలకుగాను సంతోషించాలి. నిత్యవ్యవహారంలో పిల్లలు ఎదిగొచ్చారు, పిల్లలు అక్కరకొచ్చారు అంటాం. మన జీవితం మన పిల్లల్లో కొనసాగుతుంది. ఆస్తిపాస్తులకంటె గూడ ముఖ్యమైన సంపద సంతానం. అట్టి సంతానానికి మనం దేవునికి వందనాలర్పించాలి.

3. ఈ కీర్తనలోని ప్రధానాంశం దేవునిమీద నమ్మకం. చాలమంది స్వీయకృషిని మాత్రమే ఘనంగా యెంచుతారు. ఇది పొరపాటు. పురషకారమూ దైవమూ రెండూ కలిస్తేనేగాని మనకు విజయం లభింపదు.

## కీర్తన - 128

### సంసార జీవితం

1 ప్రభువుపట్ల భయభక్తులు చూపుచు
అతని మార్గములలో నడచు నరులు ధన్యులు

2 నీ కష్టార్జితమును నీ వనుభవింతువు
నీవు ఆనందమును అభ్యుదయమును బడయుదువు

3 నీ లోగిట నీ భార్య
ఫలించిన ద్రాక్షతీగవలె నుండును
నీ భోజనపు బల్ల చుట్టు నీ తనయులు
ఓలివు పిలకలవలె నొప్పుదురు

4 దేవునిపట్ల భయభక్తులు కల నరుడు
ఇట్టి దీవెనలు బడయును

5 నీ జీవితకాలమందెల్ల
ప్రభువు సియోనునుండి నిన్ను దీవించునుగాక
నీవు యెరూషలేము అభ్యుదయమును గాంతువుగాక

6 నీ బిడ్డల బిడ్డలను కనులార జూతువుగాక
యిస్రాయేలీయులకు శాంతి కలుగునుగాక.

# 1. పరిచయం

యిస్రాయేలీయులు పెద్ద కుటుంబాన్ని దేవుని దీవెనగా భావించేవాళ్లు. ఈ కీర్తనలో రచయిత కుటుంబ జీవితాన్నీ దానివల్ల కలిగే ఆనందాన్నీ వర్ణించాడు. భక్తిమంతుడైన గృహస్థు దేవుణ్ణి పూజించుకొంటూ భార్యాసుతులతో సంతోషంగా కాలం గడుపుతాడు. అతడు పండు ముసలితనం దాకా జీవిస్తాడు. మనుమలను మునిమనుమలనుగూడ చూస్తాడు. యెరూషలేము మూడుపూవులు ఆరుకాయలుగా వృద్ధిజెందడం గూడ చూచి సంతృప్తి చెందుతాడు. యాతనలతోగూడిన సంసార జీవితం గడిపేవాళ్ళకు ఈ కీర్తన ఎంతో ఆనందాన్నీ ఓదార్పునీ కలిగిస్తుంది.

# 2. వివరణం

1. భక్తిగల యిస్రాయేలీయుడు దేవునికి భయపడతాడు. అతనిపట్ల వినయవిధేయతలు ప్రదర్శిస్తాడు. ఇంకా దేవుని మార్గాలలో నడుస్తాడు. అనగా దేవుని ఆజ్ఞలను పాటిస్తాడు.

2. దుర్మార్గులు అకాలమృత్యువు వాతబడతారు. వాళ్ల కష్టార్జితాన్ని మరొకరు అనుభవిస్తారు. కాని పుణ్యపురుషుడు తన కష్టార్జితాన్ని తానే అనుభవిస్తాడు. అతనికి ఆనందమూ, విజయమూ, సంతానలాభమూ కలుగుతాయి. ఈ సంతానాన్నిగూర్చి తర్వాతి చరణంలో విపులంగా జెప్తున్నాడు.

3. పుణ్యపురుషుని ఇల్లాలిని ద్రాక్షతీగతో పోల్చాడు. ఆ తీగ ఏటేట చాల పండ్లు కాస్తుంది. అలాగే ఆయిల్లాలు చాలమంది బిడ్డలను కంటుంది.

అతని బిడ్డలను ఓలివు మొక్కలతో పోల్చాడు. ఓలివు చెట్టు చాల పిలకలు వేస్తుంది – మన అరటిచెట్టులాగ. కొన్నియేండ్లయ్యాక మొదటిచెట్టు నశిస్తుంది. అప్పుడుదాని పిలకలు చెట్లవుతాయి. అలాగే తండ్రి గతించాక బిడ్డలు అతని జీవితాన్ని కొనసాగిస్తారు. ఇక్కడ తండ్రిచుట్టూ, భోజనపు బల్లచుట్టూ గుమిగూడిన పిల్లలు ఓలివు చెట్టుచుట్టూ మొల్చిన పిలకలాగున్నారని ఉపమానం. ద్రాక్షలూ, ఓలివులూ ప్రభువు యిస్రాయేలీయుల కిచ్చినవరాలు. ఇక్కడ భార్యనూ బిడ్డలనూ ఈ చెట్లతో పోల్చడం ఎంతో హృద్యంగా ఉంది.

4. పుణ్యాత్మునికి సిద్ధించే దీవెనలు ఆనందం, విజయం, భార్యాసుతులూ. అతనికి ఇంకేమి కావాలి?

5-6. యెరూషలేం దేవళంలో నుండి ప్రభువు తన భక్తులను దీవిస్తాడు.

యిస్రాయేలీయులు మూడు దీవెనలను ఘనంగా యెంచేవాళ్ళు. ఆ మూడింటినీ యిక్కడ పేర్కొంటున్నాడు. 1. భక్తుడు యెరూషలేము పెంపును గాంచి సంతోషిస్తాడు. 2. అతడు పండు ముసలితనందాకా జీవిస్తాడు. 3. రెండుమూడు తరాలదాక గూడ బిడ్డలను జూచి ఆనందిస్తాడు.

## 3. ప్రార్థనా భావాలు

1. ఈ కీర్తన కుటుంబ జీవితాన్నీ, కుటుంబ భక్తినీ కొండాడుతుంది. దేవుని దీవెనలవల్ల కుటుంబంలో తండ్రీ, తల్లీ, బిడ్డలూ కలకలలాడుతూంటారు. వాళ్ళను చూస్తే కన్నుల పండువుగా ఉంటుంది. నూత్నవేదంలో క్రైస్తవులకులాగ పూర్వవేదంలో యూదులకు బ్రహ్మచర్యంలేదు. వాళ్ళది సంసారజీవితం, సంసారభక్తి. మనం నేటి మన క్రైస్తవ కుటుంబాల్లో కూడ దేవుని దీవెనలు నెలకొనాలని ప్రార్థిద్దాం.

2. ఈ కీర్తనలో పేర్కొనిన గృహస్థు దైవభీతి కలవాడు. నూత్నవేదంలో మనకు దైవప్రేమలాగే పూర్వవేదంలో దైవభీతి గొప్పపుణ్యం. ఇది బానిసయజమానునిపట్ల జూపే భయంకాదు. బిడ్డడు తండ్రిపట్ల జూపే భయం. కుమారుడు తండ్రిపట్లగల ఆదరంచేత అతని ఆజ్ఞలు మీరడానికి జంకుతాడు. దేవునిపట్ల మనంకూడ ఈలాగే ప్రవర్తించాలి. ఈ దైవభీతి నూత్నవేదంలో మనకు గూడ అవసరమే.

3. భార్యభర్తలు కలసి జీవించటం, బిడ్డలను కనిపెంచటం, శ్రమతో గూడినపని. సాగరమైనా ఈదవచ్చుగాని సంసారాన్ని ఈదలేమని మన తెలుగుసామెత. కనుక సంసారజీవితం గడిపేవాళ్ళు ఆ జీవితాన్ని యోగ్యంగాను ధర్మబద్ధంగాను జీవించేభాగ్యాన్ని ప్రసాదించమని దేవుణ్ణి అడుగుకోవాలి. తమ కుటుంబాలను దీవించమని కరుణామయుడైన ప్రభువును వేడుకోవాలి.

## కీర్తన - 131

### పసిబిడ్డ వాలకం

1 ప్రభూ! గర్వముతో నా హృదయము ఉప్పొంగుటలేదు
నా కన్నులకు పొరలు కమ్మలేదు
మహత్తర విషయములతోగాని
నా కంతుబట్టని సంగతులతోగాని
నేను సతమత మగుటలేదు

2 నా హృదయము నిమ్మళముగను ప్రశాంతముగను నున్నది
పాలు మాన్పించిన శిశువు
తల్లి రొమ్ముమీద ప్రశాంతముగా పరుండియున్నట్లే
నా హృదయము నాలో నిమ్మళముగా నున్నది

3 యిస్రాయేలీయులారా!
మీరు ఇప్పుడును ఎప్పుడును ప్రభువును నమ్మడు.

# 1. పరిచయం

ఈ కీర్తనను చెప్పిన భక్తుడు దేవుణ్ణి నమ్మి చిత్తశాంతిని పొందాడు. తాను మహత్తర కార్యాలను సాధించి ప్రసిద్ధిలోకి రావాలనే కోర్కెలను పరిత్యజించాడు. తన గర్వాన్ని అణచుకొన్నాడు. చిన్ననాడతనికి చాల గొప్ప కోర్కెలు ఉండేవి. అతడు పేరు తెచ్చుకోవడానికి చాల ప్రయత్నాలు కూడ చేసాడు. కాని ఆ యత్నాలన్నీ విఫలమయ్యాయి. ఇప్పుడు వృద్ధుడయ్యాక తన కోరికలన్నీ విడనాడి దేవుణ్ణి నమ్మి జీవిస్తున్నాడు. చిత్తశాంతిని అనుభవిస్తున్నాడు. ఈ కీర్తన గర్వాన్ని అణచుకొని వినయాన్ని అలవర్చుకోవాలని చెప్తుంది. దేవుణ్ణి నమ్మి అతనిమీద భారంవేసి జీవిస్తే హృదయశాంతి లభిస్తుందని చెప్తుంది.

# 2. వివరణం

1. నా హృదయం గర్వంతో పొంగిపోవడం లేదు, నా కన్నులకు పొరలుకమ్మలేదు అంటే, నేను అహంకారాన్ని వదలుకొన్నానని భావం. కీర్తనకారునికి పూర్వం మహత్తరకార్యాలు సాధించి పేరుతెచ్చుకోవాలనే కోరికలుండేవి. ఆ కోరికలను తీర్చడానికి చాల ప్రయత్నాలు కూడ చేసాడు. తనకు అర్థంగాని సంగతులతో సతమతమయ్యాడు. అతని హృదయం గర్వంతో నిండివుండేది. కాని యిప్పుడు ఆ కోరికలూ ఆశలూ వదలుకొన్నాడు. తన గర్వాన్ని అణచుకొన్నాడు. ఫలితంగా ఇప్పుడతని హృదయంలో పూర్వంలేని చిత్తశాంతి చోటుచేసికొంది.

2. భక్తుడు తన హృదయం నిమ్మళంగా ఉందని చెప్పుకొంటున్నాడు. మొదట అతని హృదయం అతనికి లొంగేది కాదు. తానేవో ఘనకార్యాలు సాధించాలనుకొనేవాడు. హృదయంలో ఏవో ఆశలు అలల్లా చెలరేగుతుండేవి. కాని అతడు ప్రయత్నంచేసి తన ఆశలను అణచుకొన్నాడు. ఇప్పుడు అతని యెదలో శాంతి నెలకొంది.

పాలు మానని శిశువు పాలకొరకు అల్లరిచేస్తుంది. కాని పాలు మానిన శిశువు ప్రశాంతంగా తల్లి రొమ్ముమీద పండుకొని నిద్రిస్తుంది. అలాగే కీర్తనకారుడుకూడ ఓ పసిబిడ్డలాగ భగవంతుడనే తల్లి రొమ్ముమీద పండుకొన్నాడు. అతినికి నెమ్మదిని

కలిగించింది అతని యెదలోని కోరికలుకాదు, భగవంతునిమీద నమ్మకం. ఇది చాల గొప్ప భక్తిభావం.

3. రచయిత తాననుభవించే మనశ్శాంతిని ఆధారంగా తీసికొని తోడి యిస్రాయేలీయులకు హెచ్చరిక చేస్తున్నాడు. మీరుకూడ నాలాగే ప్రభుని నమ్మి మనశ్శాంతిని పొందండని హెచ్చరిస్తున్నాడు.

## 3. ప్రార్థనా భావాలు

1. యూదుల్లో "హనవిం" లేక దీనులు అనే వర్గంవాళ్ళు ఉండేవాళ్ళు. వినయంతో దేవునిమీద ఆధారపడి జీవించడం వీళ్ళ ప్రధానలక్షణం. ఈ కీర్తనకారుడుకూడ ఈ దీనులవర్గానికి చెందినవాడే. కనుకనే అతడు నేను చిన్నబిడ్డలాగ దేవుడనే తల్లి రొమ్ముమీద పండుకొని నిద్రపోతానని చెప్పుకొన్నాడు. యెషయా ప్రవక్త ఆనాటి ఆహాసురాజునూ ప్రజలనూ మందలిస్తూ "దేవుణ్ణి నమ్ముకొని నెమ్మదిగా ఉండడంలోనే మీ శక్తి యిమిడి ఉంది" అనిచెప్పాడు - 30,15. మన కీర్తనకారుడు చెప్పిందికూడ యిదే. కనుక మనం కూడ పొగరు తగ్గించుకొని దేవునిపై ఆధారపడి జీవించేభాగ్యం కొరకు ప్రార్థిద్దాం.

2. మీరు చిన్నబిడ్డల్లా తయారైతేనేగాని పరలోకరాజ్యంలో ప్రవేశింపరని క్రీస్తు తన శిష్యులకు చెప్పాడు - మత్త 18,3. ఇక్కడ చిన్నబిడ్డల్లా తయారుకావడమంటే దేవుణ్ణి నమ్మి అతనిమీద ఆధారపడిజీవించడమే. క్రీస్తు తండ్రిమీద ఆధారపడి జీవించాడు. అలాగే మనమూ క్రీస్తుమీదా పరలోకపు తండ్రిమీదా ఆధారపడి జీవించాలి. ఈ కీర్తనకారుని సందేశంకూడ యిదే. నరుడు అహంకారంకొద్దీ నాకు నేను చాలుదుననుకొంటాడు. దేవుణ్ణి పట్టించుకోడు. ఈ యహంభావం వద్దనే ఈ కీర్తన చెప్పేది. ఈ భాగ్యం కొరకు కూడ ప్రార్థిద్దాం.

3. చిన్న తెరేసమ్మ చిన్నిమార్గమూ ఈ కీర్తన బోధా ఒకటే. మనం దేవుణ్ణి నమ్మి చిన్నబిడ్డల్లా జీవించాలనే ఆమె కూడ బోధించింది.

"యెరూషలేమనే తల్లి మీకు
చంటిబిడ్డలకు వలె పాలిస్తుంది
మిమ్ము తన చేతులలోని కెత్తుకొంటుంది
తన వొడిలో కూర్చుండబెట్టుకొని లాలిస్తుంది
తల్లి కుమారునివలె నేను మిమ్ము నోదారుస్తాను
యెరూషలేమున మిమ్ము నోదారుస్తాను"

అనే యెషయా ప్రవచనంలోని ప్రభువు పలుకులు ఆమెకు స్ఫూర్తినిచ్చాయి. ఆమె దేవుడు తన్ను చిన్నబిడ్డనులాఆదరిస్తాడని నమ్మింది–66,12–13. ఆ భక్తురాలిలాగాను ఈ కీర్తనకారునిలాగాను మనంకూడ చిన్నిమార్గంలో, వినయమార్గంలో, పయనించే భాగ్యంకొరకు ప్రభువుని మనవి చేసికొందాం.

# కీర్తన - 133

## సోదరప్రేమ

1 సోదరు లెల్లరును గూడి ఐకమత్యముతో జీవించుట
చాల మంచిది, చాల రమ్యమైనది

2 అట్టి జీవితము అహరోను తలమీదినుండియు
గడ్డమునుండియు కారి
అతని యంగీ మెడపట్టీమీద పడు
విలువగల యభ్యంజన తైలము వంటిది

3 అట్టి జీవితము సియోను కొండమీద కురియు
హెర్మోను మంచువంటిది
ఆ సియోనున ప్రభువు తన దీవెన లొసగును
శాశ్వత జీవమును దయచేయును.

## 1. పరిచయం

ఈ కీర్తన ఐక్యతాభావాన్ని వర్ణిస్తుంది. తోడిజనంతో కలసిమెలసి జీవిస్తే ఎంతో ఆనందం కలుగుతుందని చెప్తుంది. జ్ఞానగ్రంథాలు బోధించే అంశాల్లో ఐక్యత వొకటి. ఇక్కడ కీర్తనకారుడు ఈ యంశాన్నెత్తుకొని చక్కని పాట వ్రాసాడు. నాడు యూదులకుమల్లె నేడు మనకుకూడ ఐక్యత, సోదరప్రేమ అత్యవసరం.

## 2. వివరణం

1. పాస్కోత్సవం మొదలైన సందర్భాల్లో యూదులు దేశదేశాలనుండి యెరూషలేముకువచ్చి తన బంధువర్గంతో ఐక్యమయ్యేవాళ్లు. అలా ఒకరితోవొకరు ఐక్యమై ఆప్యాయంగా కాలంగడుపుతూంటే చూడ్డానికి ఎంతో ముచ్చటగా ఉండేది.

2. తోడిజనంతో కలసి జీవిస్తూంటే ఎంతోఆనందంగా ఉంటుంది. ఈ యానందాన్ని వివరించడానికి కీర్తనకారుడు రెండుపమానాలు ఎత్తుకొన్నాడు. రెండూ సంతోషాన్ని సూచించేవే. అవి 1) అభ్యంగం, 2) మంచు కురియడం.

మొదటి ఉపమానంలో ఐక్యతతోకూడిన జీవితాన్ని అభ్యంగంతో పోల్చాడు. ప్రధాన యాజకుణ్ణి అభిషేకించేపుడు అతని తలమీద పరిమళతైలం పోసేవాళ్ళు - నిర్గ 29,7. అది బొట్లుబొట్లుగా కారి అతని యంగీ మెడపట్టీ మీద పడేది. అలా కారుతుంటే ఆ పరిమళతైలం సువాసనలు గుబాళిస్తూ ఆనందం కలిగించేది. జనులు కలసిమెలసి జీవించడంకూడ ఈ తైలంలాగే ఆనందాన్ని కలిగిస్తుందని భావం.

3. రెండవ ఉపమానంలో ఐక్యతతోకూడిన జీవితాన్ని మంచుకురవడంతో పోల్చాడు. హెర్మోను మంచంటే దట్టమైన మంచు. సియోను కొండమీద దాని చుట్టుపట్లా మంచు బాగా కురుస్తుంది. అది పంటలను పండిస్తుంది. వేడిమిని తగ్గించి ఆనందాన్నిస్తుంది. ప్రజలు ఒక్కటిగా ఒనగూడి సోదరప్రేమతో జీవించడంకూడ ఈమంచులాగే ఆనందాన్ని కలిగిస్తుందని భావం.

ప్రభువు సియోనులోని దేవళంలోనుండి తన ప్రజలను దీవించేవాడు. యాజకుని తలమీదినుండి తైలంకారినట్లుగా ఆకాశంనుండి మంచు దిగివచ్చినట్లుగా, ఐకమత్యంతో యెరూషలేములో జీవించే ప్రజలమీదికి దేవుని దీవెనలు దిగివస్తాయని భావం.

## 3. ప్రార్థనా భావాలు

1. ఈ కీర్తనంలో భక్తుడు యెరూషలేమునందలి యూద సమాజంలోని ఐక్యతనుగూర్చి చెప్పాడు. ఆ ఐక్యత చాల రమ్యంగా, సొగసుగా ఉందని కీర్తించాడు. కాని ఈఐక్యత, సోదరప్రేమ వొక్క యూదులకేగాదు మనకుకూడ అవసరం. విశేషంగా ఆధునిక ప్రపంచంలో దేశాలమధ్య జాతులమధ్య వర్గాలమధ్య ఎన్నో ఘర్షణలను చూస్తున్నాం. ప్రజలు ఒకరితో ఒకరు ఐక్యం గావడానికి బదులుగా ఒకరినుండి ఒకరు విడిపోతున్నారు. నరుడు తోడినరునిపట్ల సోదరుల్లాకాదు, తోడేలులా ప్రవర్తిస్తున్నాడు. ఎక్కడచూచినా ప్రేమకాదు ద్వేషం కనిపిస్తుంది. ఈలాంటి పరిస్థితుల్లో మానవజాతికి ప్రేమను ప్రసాదించమని మనం ప్రభువుని తప్పక వేడుకోవాలి.

2. ఎక్కడెక్కడ నా పేరుమీదిగా ఇద్దరు ముగ్గురు సమావేశమౌతారో వాళ్ళమధ్యలో నేనూ నెలకొని ఉంటానని ప్రభువు వచించాడు-మత్త 18,20. కనుక మనం ప్రభువు పేరుమీదిగా కలసిమెలసి జీవించాలి. మన జీవితం ఆ ప్రభువు ప్రేమకు సాక్ష్యంగా ఉండాలి. కావున మనం కలహాలతోగాక పరస్పర స్నేహంతో జీవించాలి.

3. ఈ కీర్తన విశేషంగా మఠజీవితం జీవించేవాళ్ళకు వర్తిస్తుంది. మూడు వ్రతాలూ సామూహిక జీవనమూ మఠజీవితంలో ముఖ్యమైన అంశాలు. సోదరప్రేమ లేందే ఎవరుకూడ సామూహిక జీవనం గడపలేరు. ఒకరినొకరు అంగీకరించనివాళ్ళు ఏలా కలసిమెలసి జీవిస్తారు? కనుక మఠజీవితం గడిపే వాళ్ళల్లో పరస్పరప్రేమ, అవగాహనం పెరగాలని ప్రార్థిద్దాం.

# కీర్తన - 104
## సృష్టిలోని వింతలు

1 ఆత్మమా! దేవుని స్తుతింపుము
ప్రభూ! నీవు మిక్కిలి ఘనుడవు
నీవు ప్రాభవ వైభవములను బట్టలవలె ధరించితివి

2 వెలుగును పుట్టమువలె తాల్చితివి
ఆకాశమును గుడారమువలె వ్యాపింపజేసితివి

3 మీది జలముల మీద నీ ప్రాసాదమును నిర్మించుకొంటివి
మేఘములు నీకు రథములు
నీవు వాయుపక్షములమీద స్వారి చేయుదువు

4 గాలులు నీకు దూతలు
తళతళలాడు మెరపులు నీకు బంటులు

5 నీవు నేలను దాని పునాదులమీద నెలకొల్పితివి
అది యేనాటికిని కదలదు

6 ఆ నేలను సముద్రమను బట్టతో కప్పితివి
సాగర జలము కొండలను ముంచివేసెను

7 నీవు గద్దింపగా ఆ జలములు భయపడి పారిపోయెను
మేఘగర్జనము వంటి నీ యాజ్ఞకు వెరచి అవి పరుగిడెను

8 ఆ నీళ్ళు కొండలనుండి జారి క్రింది లోయలోనికి పారెను
అచటినుండి యవి నీవు నిర్ణయించిన స్థలమును చేరుకొనెను

9 నీవు ఆ నీళ్ళకు దాటరాని హద్దును నెలకొల్పితివి
అవి యా మేరను దాటివచ్చి మరల నేలను ముంచివేయవు

10 నీవు లోయలలో ఊటలను పుట్టించితివి
వాని నీళ్ళు కొండల నడుమ పారును

11 వన్యమృగములెల్ల ఆ బుగ్గల నీళ్ళు త్రాగును
అడవి గాడిదలు ఆ నీటితో దప్పిక తీర్చుకొనును

12 ఆ చేరువలో పక్షులు గూళ్ళు కట్టుకొని
చెట్ల కొమ్మలలోనుండి కూయును

13 నీ ప్రాసాదమునుండి నీవు కొండలమీద వాన కురిపింతువు
నీ యాకాశమునుండి పడిన వానతో నేల సంతృప్తి చెందును

14 నీవు పశువుల కొరకు గడ్డిని మొలపింతువు
నరుని యుపయోగము కొరకు మొక్కలు మెలపింతువు
అతడు నేలనుండి పంటలు పండించును

15 నీవు నరుని సంతోషపెట్టుటకు ద్రాక్ష సారాయమును
అతని కానందము కలిగించుటకు ఓలివు తైలమును
అతనిని బలాఢ్యుని జేయుటకు ఆహారమును దయచేయుదువు

16 నీవు నాటిన లెబానోను దేవదారు వృక్షములు
పుష్కలమైన వర్షముతో సంతృప్తి చెందును

17 వానిలో పక్షులు గూళ్ళు కట్టుకొనును
సారస పక్షులు దేవదారులలో గూళ్ళు కట్టుకొనును

18 ఎత్తయిన కొండలలో అడవిమేకలు వసించును
పర్వత శిఖరములలో కుందేళ్ళు దాగుకొనును

19 ఋతువుల నెరిగించుటకు నీవు చంద్రుని జేసితివి
సూర్యునికి తానెప్పుడు అస్తమింపవలయునో తెలియును

20 నీవు రేయిని కొనిరాగా చిమ్మచీకట్లు క్రమ్మును
అపుడు వ్యనమృగములెల్ల వెలుపల తిరుగాడును

21 కొదమ సింగములు ఎరకొరకు గర్జించును
అవి దేవుని నుండి తమ ఆహారమును వెదకుకొనును

22 ప్రొద్దు పొడువగనే యవి మరలిపోయి
తమ గుహలలో పండుకొనును

23 అప్పుడు నరుడు పనికి బయలుదేరును
అతడు సాయంకాలము వరకు పాటుపడును

24 ప్రభూ! నీ కార్యము లెన్నివిధములుగా నున్నవి!
నీ చెయిదములన్నిటిని విజ్ఞానముతో చేసితివి
ఈ భూమి నీ ప్రాణులతో నిండియున్నది

25 అదిగో! విశాలమైన మహా సముద్రము
ఆ సాగరములో చిన్నవియు పెద్దవియునైన ప్రాణులు
లెక్కకు మించి జీవించుచుండును

26 దానిలో ఓడలు సంచరించుచుండును
నీ వాడుకొనుటకు చేసిన మకరమును దానిలో నున్నది

27 ఈ ప్రాణులన్నియు నీమీద ఆధారపడి జీవించును
అవి తమ కవసరమైనపుడు నీనుండి యాహారమును బడయును

28 నీవు వానికి తిండి పెట్టగా అవి తినును
వాని కాహారమీయగా అవి సంతృప్తిగా భుజించును

29 నీవు మొగము ప్రక్కకు త్రిప్పుకొనినచో అవి తల్లడిల్లును
వాని యూపిరి తీసినచో అవి చచ్చును
తాము పుట్టిన మట్టిలోనే కలసిపోవును

30 కాని నీవు ఊపిరి పోసినచో ప్రాణిసృష్టి జరుగును
నీవు భూమికి నూత్నజీవము నొసగుదువు

31 ప్రభువు కీర్తి ఏనాటికిని మాసిపోకుండునుగాక
అతడు తన సృష్టిని గాంచి యానందించును గాక

32 ప్రభువు భూమివైపు పారజూడగా అది కంపించును
కొండలను తాకగా అవి పొగలు వెళ్ళగ్రక్కును

33 నా జీవితకాలమెల్ల ప్రభువుపై కీర్తనలు పాడెదను
నేను బ్రతికి యున్నంతకాలము అతని స్తుతులు పాడెదను

34 నా యీ యాలోచనలు ప్రభువునకు ప్రియమగును గాక
నేను ప్రభువునం దానందించెదను

35 దుష్టులు భూమిమీదినుండి తొలగిపోవుదురుగాక
దుర్మార్గులు కంటికి కన్పింపకుండ బోవుదురుగాక
ఆత్మమా! ప్రభువును సన్నుతింపుము
మీరెల్లరును ప్రభువును స్తుతింపుడు.

# 1. పరిచయం

ఇది స్తుతి కీర్తనల వర్గానికి చెందింది. ఈ గేయం ప్రకృతి సౌందర్యంలో గోచరించే దేవుని మహిమలను వర్ణిస్తుంది. రచయిత ఆదికాండం తొలి రెండధ్యాయాల్లో కన్పించే సృష్టిక్రమాన్ని కొంతవరకు అనుసరించాడు. అతని భావాల ప్రకారం, భూమిమీదా సముద్రంలోను ఉన్న ప్రాణులన్నిటినీ దేవుడే చేసాడు. ప్రతి ప్రాణీ అతనిమీద ఆధారపడి జీవిస్తుంది. ప్రకృతి దేవుని మహిమనూ అతని ప్రాణిపోషణ చాతుర్యాన్నీ వెల్లడిస్తుంది. ఈ రచయితకు ప్రకృతితో సన్నిహితమైన పరిచయం ఉంది. అతడు గూళ్లు కట్టే పక్షులు, కొండల్లో దాగివుండే కుందేళ్ళు మొదలైన అల్పప్రాణులను గూడ జాగ్రత్తగా పరిశీలించి చూచాడు. ప్రకృతి అంటే అతనికి యెంతో యిష్టం. ప్రాచీన మానవులు ప్రకృతియందంతటా దేవుణ్ణి దర్శించారు. ఈకీర్తనకారుడూ ఈలాంటివాడే. ఇతడు మంచికవి. పసిబిడ్డ హృదయంలాంటి యెడద కలవాడు. ఈగీతం మనం ప్రకృతి సౌందర్యంలో దేవుణ్ణి దర్శించి అతన్ని స్తుతించి కీర్తించడానికి ఎంతో ఉపయోగపడుతుంది. విశేషంగా ప్రకృతి ప్రియులు దీన్ని శ్రద్ధతో మననం చేసికోవాలి.

# 2. విభజనం

| | |
|---|---|
| 1 | కీర్తన ఉద్దేశం దేవుణ్ణి స్తుతించడం |
| 2-4 | ఆకాశ వర్ణనం |
| 5-9 | భూమి వర్ణనం |
| 10-18 | నేలమీది ప్రాణులు |
| 19-24 | సూర్యచంద్రులు |
| 25-26 | సముద్రం |
| 27-30 | దేవుడు తిండిపెట్టి జీవకోటి ప్రాణాలు నిల్పుతాడు. |
| 31-35 | సృష్టికర్తకు స్తుతి. |

# 3. వివరణం

1. రచయిత తన్నుతానే దేవుణ్ణి స్తుతించడానికి ఆహ్వానించుకొంటున్నాడు. ప్రాభవ వైభవాలు రాజలక్షణాలు. దేవుడు వీటిని బట్టల్లా ధరిస్తాడు. అనగా దేవుడు ప్రకృతి సౌందర్యంలో రాజఠీవితో దర్శనమిస్తాడు. ప్రకృతిలో గోచరించే దేవుని మహిమను వర్ణించడం తన ఉద్దేశమని రచయిత ఈ మొదటి చరణంలోనే సూచిస్తున్నాడు.

2. దేవుడు వెలుగునే బట్టలలాగ తొడుగుకొంటాడు. అనగా అతడు జ్యోతిర్మయుడని భావం. అతడు ఆకాశాన్ని అర్ధచంద్రాకృతిలో, గుడారంలాగా నిర్మించాడు.

3. హీబ్రూ ప్రజల భావాలప్రకారం ఆకాశానికి పైన జలరాసులుంటాయి. అవి ఉపరిజలాలు. భూమికి క్రిందా జలాలుంటాయి. అవి అంతర్జాలాలు. మొదట ఆకాశముంది. దాని మీద ఉపరిజలాలున్నాయి. ఆ జలరాశికిపైన దేవుడు తన నివాస స్థానాన్ని నిర్మించుకొన్నాడు. అతడు మేఘరథాల నెక్కుతాడు. వాయువులనే రెక్కల గుర్రాలమీద స్వారి చేస్తాడు.

4. తుఫానులూ మెరపులూ అతనికి సేవలు చేసే బంటులు.

5. ప్రభువు క్రింది అంతర్జాలాలోనికి స్తంభాలు పాతి వాటిమీద భూమిని నిర్మించాడు. ఆ నేల గట్టి పునాదుల మీద నిల్చిన యిల్లులాగ కదలకుండా ఉంటుంది.

6. ప్రాచీనకాలం నుండి నేల ఉంది. ఆదిమ జలాలు దాన్ని బట్టలా కప్పివున్నాయి.

7. దేవుడు నేలనుండి నీటిని వేరుపరచాడు. అదే సృష్టి. జలాలు దేవుని ఆజ్ఞకు భయపడి తామూవరించియున్న నేలను వదలి దూరంగా పారిపోయాయి.

8. ప్రభువు నీళ్ళకు నిర్ణయించిన స్థలం సముద్రం. కనుక భూమిని ముంచివున్న నీళ్ళు సాగరంలోకి చేరుకొన్నాయి.

9. ప్రభువు నీళ్ళకు చెలియలికట్టను పెట్టాడు. అవి ఆ హద్దు దాటిరావు. మళ్లా నేలను ముంచివేయవు.

2-9 చరణాలు దేవుడు భూమిని శాసించేవాడని చెప్తాయి. మనమూ దేవుణ్ణి చూచి విస్తుపోవాలని భావం.

10. భూమ్యాకాశాలను వర్ణించాక, నేలమీది ప్రాణులను గూర్చి చెప్తున్నాడు. ఈ పదవ చరణం పేర్కొనే ఊటలు అంతర్జలాలనుండి ఏర్పడినవి.

11. పాలస్తీనా దేశంలోని ప్రధాన నదియైన యోర్దాను లోయల్లోను దట్టమైన అడవుల్లోను పారుతుంది. దాని తీరంలో వన్యమృగాలు వసిస్తుంటాయి.

12. ఈ రచయిత ప్రకృతితో సన్నిహితమైన పరిచయం కలవాడని చెప్పాం అతడు పక్షుల గూళ్ళను జాగ్రత్తగా పరిశీలించాడు. వాటి పాటలను శ్రద్ధగా విన్నాడు. 17వ చరణంలో కూడ ఈ భావాన్ని మళ్ళా చెప్పాడు.

13. ఈ చరణం పేర్కొనే వాన ఉపరిజలాలనుండి వచ్చింది. కొండలమీద వూటలు ఉండవు. పైనుండి పడిన నీరే వాటికి శరణ్యం.

14. ఉపరిజలాలనుండి పడిన వానవలన గడ్డీ, పైరులూ మొక్కలూ ఎదుగుతాయి. గడ్డి దానంతటదే మొలుస్తుంది. కాని మొక్కలు, పైరులు నరుని కృషివలన ఎదుగుతాయి.

15. ద్రాక్షతోటలు, ఓలివుతోటలు, గోదుమ పైరు పాలస్తీనా దేశంలోని ప్రధానపంటలు. వీటినుండి యిస్రాయేలీయులకు ద్రాక్షరసం, ఓలివుతైలం, గోదుమరొట్టె, లభించేది. ఇవన్నీ నరులకు దేవుడు దయచేసే కానుకలు. ఈ చరణం చాల సొగసైంది.

16. లెబానోను కొండలు దేవదారు వృక్షాలకు ప్రసిద్ధిచెందాయి. అవి ఎత్తుగావుండి దేవుడే తమ్ము నాటాడో అన్నట్లుగా వొప్పుతున్నాయి.

17. సారస పక్షి పెద్దగూడు కడుతుంది. కనుక అది సులువుగా నరుల కంటబడుతుంది. పక్షి గూళ్ళను గూర్చి 12వ చరణంలో గూడ చెప్పాడు.

18. ఎత్తయిన కొండ శిఖరాల్లో గడ్డీ మొక్కలు అట్టే ఉండవు. కానీ అక్కడకూడ అడవిమేకల్లాంటి ప్రాణులు సంచరిస్తుంటాయి. కొండబండల్లో కుందేళ్ళలాంటి చిన్నప్రాణులు వసిస్తూంటాయి. కనుక దేవుని హస్తం అంతటా కన్పిస్తుంది. రచయిత కొండల్లోని కుందేళ్ళలాంటి చిన్నప్రాణులనుగూడ పరీక్షించి చూచాడు. అతని ప్రకృతిప్రేమ మిక్కుటమైంది.

19. నేలమీది ప్రాణులనుగూర్చి చెప్పాక, ఆకాశం లోని చంద్రుణ్ణీ సూర్యుణ్ణీ వర్ణిస్తున్నాడు.

ప్రాచీన మానవులకు సూర్యచంద్రులే గడియారాలు, పంచాంగాలు. సూర్యుడు రేయింబవళ్ళను సూచిస్తూ నరుని పనివేళలను నిర్ణయిస్తాడు. చంద్రుడు ఋతువులనూ పండుగలనూ నిర్ణయిస్తాడు.

20. దేవుడు పగటిని నరులకూ, రేయిని మృగాలకూ కేటాయించాడు. ఆ ఉభయ వర్గాల ప్రాణులు ఒక వర్గానికొకటి అడ్డుపడవు. ఇదే దేవుని తెలివి. చీకట్లోను, వన్యమృగాల్లోను గూడ దేవుని హస్తం కన్పిస్తుంది.

21. సింహాల గర్జనను అవి ఆహారం కొరకు దేవునికి పెట్టే మొరలనుగా ఉత్ప్రేక్షించాడు.

22-23. మృగాలు తిరిగేప్పుడు నరులు నిద్రపోతారు. నరులు తిరిగేప్పుడు మృగాలు గుహల్లో నిద్రపోతాయి. ఇది సృష్టిలోని రహస్యం.

24. ఈ చరణంలో "కార్యాలు" "చెయిదాలు" దేవుడు సృజించిన ప్రాణులే. ఈ నేల అంతాకూడ దేవుడు చేసిన జీవులతో క్రిక్కిరిసి ఉంది.

25. సూర్యచంద్రులనూ రేయింబవల్లనూ గూర్చి చెప్పాక, సముద్రాన్ని వర్ణిస్తున్నాడు. సాగరం అనంతమైంది. దానిలోగూడ ఎన్నో ప్రాణులు జీవిస్తుంటాయి.

26. ఇక్కడ మకరమంటే సముద్రంలో జీవించే ఏదో పెద్ద జంతువు. దేవుడు అలసిపోయినప్పుడు ఈ జంతువు దగ్గరికి వచ్చి దానితో కాసేపు ఆడుకొంటాడట! ఈ కవి హృదయం పసిబిడ్డ హృదయంలాంటిది అనడానికి ఈ చరణమే తార్కాణం.

27. సాగరాన్ని వర్ణించాక, ప్రభువు ప్రాణికోటిని పోషించేతీరును వివరిస్తున్నాడు. ఈ కీర్తనలోకెల్ల ఈ 27-30 చరణాలు ఎక్కువ విలువైనవి.

దేవుడు ప్రాణులను పుట్టించడం మాత్రమేకాదు, తిండిపెట్టి వాటి ప్రాణాలు నిల్పుతూంటాడు కూడ.

28. దేవుడు ఓ తల్లిలా, తండ్రిలా, యజమానుళ్ళా తాను చేసిన ప్రాణులకు తిండి పెడతాడు. అతని దయ అంత గొప్పది.

29-30. ఇక్కడ మొగం ప్రక్కకు త్రిప్పుకోవడమంటే తిండి పెట్టకపోవడం. దేవుడు ఆహారం పెట్టకపోతే మృగాలు వ్యాకులపడతాయి.

దేవుడు ఊపిరితీస్తే ప్రాణులు చస్తాయి. ఊపిరిపోస్తే క్రొత్తజీవులు పుడతాయి. అతడు కొన్ని ప్రాణులు చస్తుంటే మరికొన్నిటిని పుట్టిస్తుంటాడు. ఎప్పటికప్పుడు క్రొత్తప్రాణులను సృజించి చావును జయిస్తుంటాడు. ఈలా జనన మరణాల్లో కూడ అతని హస్తాన్ని చూడవచ్చు.

ప్రభువు భూమికి నూత్నజీవనాన్ని ఒసగుతాడు. రచయిత దృష్టిలో ఈ “నూత్నజీవం” భౌతికమైందే. కాని ఈ పాదంలో వరప్రసాద జీవంకూడ ధ్వనిస్తుంది. కనుకనే తిరుసభ ఈ వాక్యాన్ని పెంతెకోస్తు ఉత్సవంనాడు వచ్చే పవిత్రాత్మ ప్రార్థనకు కూడ వాడింది.

31. ప్రాణి పోషణాన్ని గూర్చి చెప్పాక, ఈ చివరి భాగంలో సృష్టికర్తను స్తుతిస్తున్నాడు.

సృష్టి దేవుని మహిమనూ కీర్తినీ వెల్లడిచేస్తుంది. కనుక దేవుడు తన సృష్టిని చూచి ఆనందిస్తాడు.

32. ప్రభువు నేలవైపు చూస్తే భూకంపం కలుగుతుంది. కొండలను తాకితే అగ్నిజ్వాలలు వెలువడతాయి. అతడు అంత శక్తికలవాడు. పూర్వం ప్రభువు సీనాయి కొండమీద మోషేకు ధర్మశాస్త్రం ప్రసాదించినపుడు భూకంపమూ పొగలూ మంటలూ ఉరుములూ ఉప్పతిల్లాయి. ఇక్కడ ఆ సంఘటనను జ్ఞప్తికి తెస్తున్నాడు.

33. రచయిత దేవునికి తనవంతు స్తుతిని తాను చెల్లిస్తానని చెప్తున్నాడు.

34. ఈ చరణంలో “నా యాలోచలు” అంటే కీర్తనకారుడు చెప్పిన ఈ కీర్తనే. తాను కట్టిన ఈ పాట భక్తులు దేవళంలో అర్పించే ధాన్యబలిలాగ దేవునికి ప్రీతి కలిగించాలని అతని కోరిక.

35. దుష్టులు దేవుణ్ణి స్తుతించరు. కనుక వాళ్ళు నాశం కావాలని కోరుకొంటున్నాడు.

కడన కీర్తన ప్రారంభాన్ని మళ్ళా యెత్తుకొని ఆత్మమా దేవుణ్ణి సన్నుతింపమని చెప్తున్నాడు. అనగా దైవసన్నుతికి తన్నుతాను ఆహ్వానించుకొంటున్నాడు. మనం కూడ ప్రకృతిలో దర్శనమిచ్చే దేవుణ్ణి స్తుతించి కీర్తించాలి.

# 4. ప్రార్థనా భావాలు

1. భక్తులు ప్రకృతి సౌందర్యంలో దేవుణ్ణి గుర్తించడం నేర్చుకోవాలి. ప్రకృతి పరమేశ్వరాకృతి. సౌందర్యంభగవంతుని చేవ్రాలు. అద్దంలో మన ముఖంలాగే ప్రకృతిలో దేవుని ముఖం కన్పిస్తుంది. సృష్టివస్తువులన్నీ ఆ ప్రభువు కళ్యాణ గుణాలను తెలియజేస్తాయి - రోమా 1,20. మనం బస్సుల్లో రైళ్ళల్లో ప్రయాణం చేసేపుడు ఈ కీర్తనను ధ్యానించుకోవచ్చు. మన ఆంధ్ర రాష్ట్రంలో కోస్తా జిల్లాల్లో అందమైన ప్రకృతే కన్పిస్తుంది. కనుక మన ప్రయాణాల్లో ఆయా సుందరదృశ్యాలను చూచినపుడెల్లా భగవంతుణ్ణి స్మరించుకోవచ్చు. ఇంకా, మనం అలసిపోయివుండి చక్కగా ప్రార్థనం చేసికోలేనపుడుగూడ ఈ కీర్తన సహాయంతో సులువుగా జపించవచ్చు.

2. క్రీస్తుకి ప్రకృతి అంటే ఎంతో యిష్టం. అతడు ఏకాంతంగా సర స్తీరానా కొండల్లోను కాలం గడిపేవాడు. తన బోధల్లో ఆకాశ పక్షులనూ, చక్కని పూలుపూసే లిల్లీ మొక్కలనూ పేర్కొన్నాడు - మత్త 6,26-29. చాలమంది పునీతులు కూడ ప్రకృతిపట్ల ఎంతో యిష్టం చూపారు. అసిస్సీఫ్రాన్సిస్ దీనికి మంచి ఉదాహరణ. అతడు సూర్యగీతంలో సూర్యుణ్ణి సోదరుడనీ చంద్రుణ్ణి సోదరి అనీ సంబోధించాడు. మనంకూడ ప్రకృతిపట్ల ప్రీతిని పెంపొందించుకోవాలి. అది మనకు దేవుణ్ణి చూపిస్తుంది, మనలను దేవుని చెంతకు చేరుస్తుంది.

3. మనం మాతృగర్భంలో పిండంగా ఉన్నపుడే ఓదినం ప్రభువు కరుణతో మనకు ఊపిరి పోసాడు. ఆనాటినుండి మనం బ్రతుకుతూవచ్చాం. అరవై డెబ్బై యేండ్లు జీవించాక మళ్లా ఓనాడు అతడు మన ఊపిరి తీస్తాడు. అప్పుడు మనం చనిపోతాం. జీవానికీ మరణానికీ అతడే అధిపతి. మన బ్రతుకూ చావూకూడ అతనిచేతుల్లోనే వున్నాయి (29-30).

4. కీర్తనకారుడు 30వ చరణంలో "నీవు భూమికి నూత్నజీవము నొసగెదవు" అన్నాడు. ఇప్పుడీ వాక్యం పవిత్రాత్మ ప్రార్థనలో వస్తుంది. పెంతెకోస్తు పండుగనాడు పవిత్రాత్మ

పేరిట చెప్పే జపంలోకూడ వస్తుంది. దేవుడు మనకు భౌతిక జీవాన్నేగాక, పవిత్రాత్మద్వారా ఆధ్యాత్మికమైన నూత్నజీవాన్ని కూడ యిచ్చాడు. ఈ జీవం జ్ఞానస్నానంతో ప్రారంభమౌతుంది. ఈలా ఆత్మద్వారా మనం పొందిన నూత్నజీవాన్ని - వరప్రసాద జీవాన్ని - మనం రోజురోజుకీ పెంపొందించుకొంటూ పోవాలి.

5. రచయిత ప్రకృతిలోని వింతలకు విస్తుపోయి దేవుణ్ణి స్తుతించాడు. అతనిమీద కీర్తన రచించాడు. దేవుడు తన కీర్తనను భక్తులు దేవళంలో అర్పించే ధాన్యబలిగా అంగీకరిస్తాడని ఆశించాడు (34). మనంకూడ ప్రకృతిలో దేవుణ్ణి ధ్యానించుకొని స్తుతించవచ్చు. ఆ స్తుతిని ఓ ధాన్యబలిలాగ ప్రభువుకి అర్పించవచ్చు. ఈ కీర్తననే భక్తితో జపించి ఓ చిన్న పూవులాగ ప్రభువు పాదాలచెంత అర్పించవచ్చు.

# ప్రశ్నలు

1. ఒకటవ కీర్తన వర్ణించే రెండు త్రోవలను విశదీకరించండి.
2. 23వ కీర్తన వ్రాసిన భక్తుడు భగవంతుణ్ణి కాపరిగాను, ఆతిథ్యకారుణ్ణిగాను వర్ణించడంద్వారా వెల్లడిచేసిన దైవానుభూతిని వివరించండి.
3. 51వ కీర్తనలోని పశ్చాత్తాప భావాలను తెలియజేయండి.
4. "నేనర్పించే బలి పశ్చాత్తాప పూరితమైన హృదయమే" - 51,17. ఈ పలుకుల భావమేమిటి?
5. జ్ఞానకీర్తనలు, విశ్వాసకీర్తనలు, విలాప కీర్తనలు - వీటి లక్షణాలను తెలియజేయండి.
6. స్తుతిగీతాలు, కృతజ్ఞతా కీర్తనలు - వీటి లక్షణాలను తెలియజేయండి. ఈ రెండు వర్గాలకు వ్యత్యాసమేమిటి?
7. 113వ కీర్తనం ప్రకారం ప్రభువు దీనులను ఆదరించే తీరును తెలియజేయండి.
8. 32వ కీర్తన చెప్పిన భక్తుని పాపానుభవాన్నీ, అతడు భావితరాల వాళ్ళకు చేసిన ఉపదేశాన్నీ పేర్కొనండి.
9. 139వ కీర్తన చెప్పిన భక్తుడు దైవసాన్నిధ్యాన్ని వర్ణించిన తీరును వివరించండి. దైవసాన్నిధ్యాన్ని పాటించడంవల్ల మన ఆధ్యాత్మిక జీవితం ఏలా పెంపుజెందుతుందో తెలియజేయండి.

10. 90వ కీర్తనను ఆధారంగా తీసికొని నరుడు తన హ్రస్వకాలిక జీవితాన్ని జూచి జ్ఞానం తెచ్చుకోవాలి అనే సూత్రాన్ని విశదీకరించండి.
11. "దేవుని నిర్వచనం కరుణే" - 103వ కీర్తనం నుండి ఈ సత్యాన్ని నిరూపించండి.
12. నేడు మనం ఈ లోకప్రలోభాల నుండి తప్పుకోవడానికి 73వ కీర్తన ఏలా తోడ్పడుతుంది?
13. నూరవ కీర్తన పేర్కొనే దైవలక్షణాలను ఆరింటిని తెలియజేయండి.
14. 91వ కీర్తనం మనం దేవునిపట్ల నమ్మకం పెంపొందించుకోవడానికి ఏలా ఉపయోగపడుతుంది?
15. 8వ కీర్తన వర్ణించే నరుని గొప్పతనాన్ని తెలియజేయండి.
16. 22వ కీర్తనలో రచయిత తన్ను గూర్చి చెప్పుకొనిన శ్రమలు క్రీస్తుకేలా అన్వయిస్తాయో వివరించండి.
17. 95వ కీర్తన దేవుని ఆజ్ఞలను పాటిస్తూ అతనిపట్ల విశ్వాసం కలిగివుండండని హెచ్చరించే తీరును వివరించండి.
18. 30వ కీర్తనను ఆధారంగా తీసికొని నరుడు అహంకారాన్ని విడనాడి వినయాన్ని అలవర్చుకోవాలి అనే నీతిని వివరించండి.
19. యాత్రిక కీర్తనల లక్షణాలను పేర్కొనండి. యాత్రికునికి చేతికర్ర ఉపయోగపడినట్లే ఈ జీవితయాత్రలో 121వ కీర్తన మనకు ఏలా ఉపయోగపడుతుందో తెలియజేయండి.
20. దైవసహాయాన్ని గూర్చీ, సంతాన భాగ్యాన్నీ గూర్చీ 127వ కీర్తన పేర్కొనిన సంగతులను తెలియజేయండి.
21. 128వ కీర్తన వర్ణించే సంసార జీవితాన్నీ, సంసారభక్తినీ విశదీకరించండి.
22. 131వ కీర్తన గర్వాన్ని అణచుకొని వినయాన్ని అలవర్చుకోవాలని ఏలా బోధిస్తుందో తెలియజేయండి.
23. 133వ కీర్తన పేర్కొనే ఐక్యతాభావాన్ని వివరించండి.
24. 104వ కీర్తన చెప్పిన భక్తుడు ప్రకృతిలో దేవుణ్ణి దర్శించిన తీరును వివరించండి. ఈ కీర్తన సహాయంతో నేడు మనం ప్రకృతిలో దేవుణ్ణి ఏలా ధ్యానించుకోగలమో తెలియజేయండి.
25. ఏ కీర్తననైనాసరే తీసికొని దానిని నీవేలా ప్రార్థనకు వాడుకొన్నావో, దానివలన భగవంతుడు నీకేలా అనుభవానికి వచ్చాడో వివరించి చెప్పు.





**ఫాదర్ పూదోట జోజయ్య, S.J.** గారు, పూదోట మరయ్య, చిన్నమ్మ దంపతులకు 1931వ సం॥ ఫిబ్రవరి 15న, గుంటూరు జిల్లాలోని కనపర్రు గ్రామంలో జన్మించారు. ఈయన ప్రాథమిక విద్యను కనపర్రులో, ఉన్నతవిద్యను ఫిరంగిపురంలో అభ్యసించారు. మద్రాసు లొయోలాలో కళాశాల విద్యను పూర్తిచేసి, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో **M.A.** (సాహిత్యం) లో పట్టా పుచ్చుకున్నారు.

1955లో తమిళనాడులోని దిండిగల్ నందు యేసుసభలో చేరిన జోజయ్యగారు, అటుపిమ్మట కొడైకెనాల్‌లో తత్వశాస్త్రాన్ని, కర్సియాంగ్‌లో వేదాంతశాస్త్రాన్ని నిశిత పరిశీలనా దృష్టితో క్షుణ్ణంగా అధ్యయనం గావించారు. 1965, మార్చి 27న బిషప్ ముమ్మడి ఇగ్నేషియస్ గారి చేతుల మీదుగా ఫిరంగిపురంలో గురుపట్టం పొందారు.

రోమునగరంలోని బిబ్లికల్ ఇన్‌స్టిట్యూట్‌లో బైబులు విద్యనభ్యసించిన జోజయ్యగారు ఆ తర్వాత తనదైన విశిష్టశైలిలో బైబులు సాహిత్యానికి ఎనలేని సేవ చేసారు. లొయోలా కళాశాలలో 2 సంవత్సరములు ఉపన్యాసకునిగా విద్యార్థులకు చక్కని శిక్షణను అందించారు. పుస్తకరచన, బైబులుబోధ, విద్యార్థులకు నాయకత్వ శిక్షణ వీరి ముఖ్య కార్యక్రమాలు.

**సాహిత్యరంగంలో వీరు నిర్వహించిన కొన్ని బృహత్తర కార్యక్రమాల వివరాలు :**

1. అనువాదకునిగా : అకుంఠిత దీక్షతో 17 సం॥లు అవిరళకృషిసల్పి క్యాథలిక్ బైబులులోని పూర్వవేదాన్ని జనరంజకంగా తెలుగులోనికి అనువదించారు.
2. ఆధ్యాత్మికవేత్తగా : ఆధ్యాత్మిక చింతనకు పెద్దపీట వేస్తూ ఆయన నడిపే బైబులు భాష్యం పత్రిక, బైబులు గ్రంథమాల ఆయన ఆధ్యాత్మికరంగంలో నిత్యకృషీవలుడని చెప్పకనే చెబుతాయి.
3. విద్యార్థి బాంధవునిగా : విద్యార్థిలోకాన్ని ఉత్తేజపరచడానికి, వారిలో నవచైతన్యం నింపడానికి ఆయన నడిపే చైతన్యవాణి పత్రిక, విద్యార్థిహిత గ్రంథమాల, విద్యార్థిలోకానికే నిర్దేశకాలు.
4. వక్తగా : ఆంధ్రరాష్ట్రమంతటా తిరిగి విద్యార్థులకు,ఉపాధ్యాయులకు, ఉపదేశకులకు సామాన్యప్రజానీకానికి వందలకొలది సదస్సులు నిర్వహించి, వారిలో నవ్యోత్సాహాలను నింపారు.